# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

## (రెండవ ముద్రణము)

## మొదటి సంపుటము

ఇందు 'అ' నుండి 'అద్వైతము' వఱకు గల నాలుగువందల పదములకు సంబంధించిన విషయములు చక్కగా వివరింపబడినవి. అందముగ ముద్రితములయిన రంగుల బొమ్మలు ఎనిమిది. సాదాబొమ్మలు ౧౨౫ ఉన్నవి.

డెమ్మి నాలుగుపుటలసైజున ౬౦౦ పుటలు, మేలైనకాగితము, బంగారురేకు చెక్కడపు అచ్చుకట్టు, పేరు మొదలయినవి కల చక్కని స్వదేశపు తోలుబైండు.

వెల. పది రూపాయలు మాత్రము

తపాలు లేక, రైలు కర్చులు ప్రత్యేకము

తపాలు వ్యయము ఒకటిన్నర రూపాయ. రైలుద్వారా అయిన, ఖర్చు దూరమునుబట్టి ఎచ్చును, తగ్గనువచ్చును. ౧౧-౮-౦ మణిఆర్డరుద్వారా పంపినవారికి పుస్తకము రిజష్టరు తపాలుద్వారా పంపబడును. వి. పి. గా పంపగోరువారు అయిదు రూపాయిలు అడ్వాన్సు పంపవలెను. చిరునామా (అడ్రెసు) స్పష్టముగా వ్రాయవలెను. రైలుద్వారా పంపగోరువారు తమగ్రామమునకు దగ్గరనుండు స్టేషన్ పేరు తెలుపవలెను.

మేనేజరు,

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెంబరు 7, తంబు శెట్టివీథి, మదరాసు.

# దానిని మీకొరకే వినియోగింపుడు

ఉదారులైన అభిమానులకు

మీరు నిలువచేయగలిగిన స్త్రీధనము—
మీ తండ్రి—సోదరుడు—భర్త—పుత్రుడు—
వీరిలో నెవరివద్ద మీ రుంచినను సరే, దానిని
మీకొరకే వినియోగింపుడు.



ఆధనముతో నగలుకొని వానిని మీరు ధరింపుడు.

పురుషు లెల్లపుడును......... ఈసంగతి మీకు బాగుగా తెలిసియే యున్నది. కావున మీకు హక్కుగల స్త్రీధనము బాంకిలోను నమ్మకములేని వాటాలక్రిందను నిలువబడి యుండకూడదు.

ఆధనము యెల్లపుడును మీకంటి యెదుటనే మీ వంటిమీదనే యుండ వీలగునట్లు, దానితో మీ కొరకు సొగసైన నగలను కొనుడు.

మేముతయారుచేయించిన నగల విలువ యెన్నటికిని తగ్గిపోదు. నగలను అందముగా చేయించుటయే ప్రత్యేకాభిమతము. ఈవిషయమున మేమే అగ్రగణ్యుల మనికూడ సవినయముగ తెలుపుచున్నాము.

మీరు మొదట మావద్ద కొనునట్టి అలంకారము మీకు మిక్కిలి సంతృప్తికరముగా నుండుటకే మేము ప్రయత్నించెదము. అటు పిమ్మట మీ రెల్లప్పుడును మావద్దనే కొనుచుందురు. మీ మిత్రులకు గూడ సిఫార్సు చేయుచుందురు.

## ఉమ్మిడి రామయ్యశెట్టి గురుస్వామిశెట్టి కంపెని,

బంగారు వెండి నగలను తయారుచేయువారు,

25, చైనాబజారు రోడ్డు — చెన్నపురి. — 62, గోవిందప్పనాయక వీధి

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౧౦. సంచిక ౧.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౩

# విషయసూచిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు—దారిద్ర్యము; రాధ అలంకరణము; కార్తిక పూర్ణిమ.

సాధారణ చిత్రములు—"భరతమాత"; వాత్సల్యము; మధురభావన; ఉజ్జీవనము; క్రొత్తదుస్తులు; బౌద్ధదేవాలయము, సారనాథ్; భద్రాద్రి రామదేవాలయములు; డోలా విహారము; దేవాలయ గోపురము (దాక్షారామము); "మాతా శిశువులు"; మదనమోహన మాలవీయుని బంగాళా; అడవిబ్రదుకు; మకరతోరణము; బొమ్మలకొలువు; మంగళగిరి, నృసింహస్వామివారి ఆలయపు తూర్పువైపు గాలిగోపురము; వ్యంగ్యచిత్రములు; ఇతరచిత్రములును.




“ కార్తిక పూర్ణిమ ”

చిత్రకారుడు : శ్రీ దుగ్గిరాల సర్వేశ్వరరావుగారు, ద్రాక్షారామము.




చెన్నపట్టణము, జనవరి ౧౯33

సంపుటము ౧౦ ఆంగీరస సంవత్సరము, పుష్యమాసము సంఖ్య ౧


# స్వవిషయము

తెలివి యొకింత లేనియెడ దృప్తుఁడనై కరిభంగి సర్వముం, దెలిసితి నంచు గర్వితమతి న్విహరించితిఁ దొల్లి ; యిప్పు డు జ్జ్వలమతులైన పండితులసన్నిధి నించుక బోధశాలినై, తెలియనివాఁడనై మెలఁగితిం గతమయ్యె నితాంతగర్వముం.

మహాసంకల్పము, సామాన్యఫలము ప్రకృతి లీలావిలాసములందు సహజదృశ్యములు. స్వవిషయానుభవ మీదృశ్యముల నవగతము చేయుచున్నది. సాహిత్యోపాసకులందు ప్రాజ్ఞులీపరమార్థమును గ్రహింపనోపుదురు. సిద్ధార్థుడైన భర్తృహరి తన నీతిశతకమునందు అల్పజ్ఞుల ప్రగల్భములను, ప్రాజ్ఞుల మానమును స్వానుభవరూపమునను, మనోహరముగను బోధించెను. మహాపండితుడు న్యూటను తన జ్ఞానమంతయును మహాసముద్రమునం దొక నీటిబిందువు వలె నున్నదని పరితపించెను. భారతి స్వవిషయవిమర్శనము నిట్టి మహానుభావులసంతాపమునుసంస్మరింపజేయుచున్నది.

భారతియొక్క మొదటిసంచిక రుధిరోద్గారి సంవత్సర పుష్యమాసారంభమునందు (౧౯౨౪ జనవరి) వెలువడినది. ఈసంచిక ఆంగీరస సంవత్సర పుష్యమాసమునందు (౧౯33 జనవరి) వెలువడుచున్నది. భారతికి తొమ్మిదేండ్లు నిండి పదవయే డారంభమైనది. గతించిన తొమ్మిదేండ్లయందును సంభవించిన భారతిస్వవిషయావలోకనము సంకల్పమునకును ఆచరణమునకు నుగల యంతరమును విశదము చేయుచున్నది. పోతరాజుభాగవతకృతిసమర్పణవిషయమునను బొందినవిషాదము భారతీనిర్వహణమునందును గలుగుచున్నది. ఆరంభమునందు జేసిన స్వవిషయాలాపనమే యిపుడును శరణ్యముగనున్నది. ప్రథమ సంచికయందలి సంకల్పము వర్తమాన సమయమునందు ప్రపంచావృతమైన మహా

ప్రబోధసమయమునందును క్రియారూపమును బడయకను సంకల్పమాత్రముగనే యున్నది.

"భారతీదేవి ఆరాధకులకు వారివారి సంస్కారానురూపముగను ప్రత్యక్షమగుచు కామితార్థములను ప్రసాదించుచున్నది. ఆంధ్రయువజనహృదయ ముత్సాహపూరితమై వర్తమానసమయమునందు భావకర్మరంగములందు నిర్మాణమార్గము నవలంబించుటకు పరితపించుచున్నది. ......ఆంధ్రహృదయమునందు స్వకీయమైన స్వరూపస్వభావములను నిర్ణయించి స్వధర్మము నారాధింపవలయు నను సంకల్పము గలిగినది. ఆసంకల్పమును సఫలముచేయుటకు చరిత్రకారులు పండితులు పరిశోధకులు కళాప్రవీణులు ప్రచారకులు చేయుచున్న పరిశ్రమ దేశవ్యాప్తమై ప్రజాపోషణమును బడయుచున్నది.... ...ఆంధ్రప్రవృత్తిని పరిశీలించునపు డీ విషయము సువ్యక్తమగుచున్నది."

మొదటిసంచికయందలి పై భావములు గతకాలమునందు వలెను వర్తమానసమయమునందును పంచాంగ శ్రవణమును జేయుటకు గల యవకాశములు కార్యకలాపమును జేయుటకు గలుగకున్నవి. ఆంధ్రహృదయము నధిష్ఠించిన ఇచ్ఛాశక్తి జ్ఞానయోగ విలసితమై క్రియారూపమును బడయవలసినయవసరమును సాహిత్యకళారచనలు విశదము చేయుచున్నవి.

పరాధీనమయిన హృదయక్షేత్రము రసవిరహితమై నిర్మాణప్రయోజనములకు నిరుపయోగముగ నున్నది. సాహిత్యోపాసకులకు, కళారాధకులకు, కర్మయోగులకు, మతావలంబులకు, ధర్మపరులకు ప్రాణరహితమైన సనాతనసంస్కారము, స్వానుభవరహితమైన పరసంస్కారము ఆత్మయోగానుభవసిద్ధమైన నిర్మాణశక్తిని దుర్ఘటము చేసినవి. నిర్మాణము దుర్ఘటమై అనుకరణము శరణ్యామైనది. జీవయాత్రయందు సంయోగమునకు బదులు సంఘర్షణము, ప్రేమకు బదులు ద్వేషము, సుశ్రుతికి బదు లపశ్రుతి, విశ్వాసమునకుబదులు అవిశ్వాసము, జ్ఞానమునకు బదులు ప్రజ్ఞావాదము, ప్రబలి మహాసంక్షోభమును గలుగజేయుచున్నవి. హృదయము రసానందము నభిలషించుచున్నది. చిత్తము సంక్షోభావరణములను నిర్మించుచున్నది. అజ్ఞానావృతంబైన ఆచారాభిమానములు సత్యస్వరూపారాధనమును దుర్ఘటము చేయుచున్నవి. ఈపరిస్థితులందు భారతికి పదవపడు ప్రారంభమైనను ప్రత్యభిజ్ఞానము దుర్లభమైనది. గతించిన తొమ్మిదియేండ్లయందును భారతి నలంకరించిన వివిధవిషయక వ్యాసములు, చిత్రాదులు ప్రజాహృదయమునందు ప్రవర్ధమానం బగుచున్న ప్రత్యభిజ్ఞానమునకు ప్రమాణములుగ నున్నవి. ఆత్మోపలబ్ధి కాధారమైన నిర్మాణావసరమును గతించిన తొమ్మిది సంపుటముల పరిశోధనమును విశదము చేయుచున్నది. ఆత్మోపలబ్ధి విరహితమైన స్వవిషయ విమర్శన మభిమానావృతమై రసహీనమగుచున్నది.

సంకల్పాచరణములకు గల ప్రబలాంతరముల నతిక్రమించుచు సాహిత్యోపాసకులు, కళాభిజ్ఞులు, పరిశోధకులు, తత్త్వజ్ఞులు మొదలగు మహనీయులు చేయుచున్న సేవ నిర్మాణవిధానమున కాధారముగ నున్నది. వ్యాసములను, విమర్శలను, పద్యములను వ్రాసియును, చిత్రములను రచించియును, నితర విధములను సహాయము చేసియును భారతీ నిర్వహణమునకు దోడ్పడిన మహిళలకును, మహాజనులకును కృతజ్ఞతను తెలుపుచు ముందను తన్నిర్వహణమునకు సకలవిధములను దోడ్పడుటకు వారిని వేడుచున్నాము. ఆంధ్రలోక మాత్మారాధనపరాయణమై విశ్వభారతీ కల్యాణమున కాత్మార్పణమును జేయుటకు భగవదనుగ్రహము బడయుగాత!

# ప్రభాదేవి

## ( కుసుమోత్సవనాటిక )

కుందుర్తి నరసింహారావుగారు

[ సహజమ నన సరోవరోపాంతభూమి ]

౧

నటి:

ముసుగునందెల సెలయేటి యిసుక తెరల
కలిసి వెన్నెల కుప్పలాటలకు బోయి——
నేడు పుట్టినరోజు పండినది మాకు:
చెలికి పుట్టినరోజు వచ్చినది మరల!——

పోయి చూచిన వింతలేమోయి, నీవు
చెప్పుకోవోయి తమ్ముడా, చిలుకతేడ!
నాయెడదలోని చెల్లెలున్నది యొకర్తు
భారతీదేవి కీనాడు పదవయేడు——

ఉత్సవవిధాన సందర్శనోత్సుకులయి
వచ్చి పాటలు పాడి పోవలెను మీరు:
జిలుగు హాంబట్టుహాయలు పచ్చికలతిన్నె
సిద్ధపడినది యిటు దయసేయవచ్చు!——

ఏచిరంతన పుణ్యసాహిత్యశక్తి
చెలికనులు రెండు మేళవించినవో నేడు,
మఱపురాని మహాపుణ్య మధురవేళ
కనుల గట్టెను నాడు చూచినది వింత!

౨

రాయంచదొరసాని:

కర్మ మిట్లు కాలినది: సంధ్యారాగమే
నాకు శత్రువైపోయినదా! ఈమాత్రపు చలి

కేనా, తెలిమబ్బుదుప్పటి తనపై గప్పుకొన్నది
......ఎంతవగలమ్మా!

తమ్మితల్లి:

ప్రత్యూషస్సమయవిభ్రాజితామృతమూర్తి!
నిత్యసాంధ్యప్రణయినీ రాగనుతకీర్తి!
రాలేవుత్రా మంచు
రాళ్లగుట్టలు దాటి,
నీలేమరా కంట
నీరు గ్రుక్కినదిరా!

తోగరాణి:

సాయం సంధ్యా
చంచల మధుకర
జారుని యొడిలో జారిపోయితివి:
జాణవైతివే నీవు;

పతి:

చనుదెంచిన సూ
చనలకు మురిసిన
జాడ నటించెదవా నీవు?
ని
శ్చల జలగతి విడనే లేవు?

రాయంచదొరసాని:

క్షుధాతురనైనపుడు గదా నా కీతమ్మి
తోడి పని? తన తూండ్లు నాకంటికి రాకుం

అనంతపతగర్భమున దాచుకొన్నది. ఎంత జాగరూకత! ఈమబ్బువాసనచే నా హృదయము పాచివట్టినది: ఈశైవలినీ మందిరమున నిదియు గలిపివేసినచో?

తమ్మి తల్లి:

ఓ కలువకన్నే!

నీనాథసందర్శనేచ్ఛావిరోధివై
ప్రాణానిలామోదపాథోధిమగ్నవై
యీనాడు నానోటి
కేల చేదులు గఱప
నిచ్చగించెదవే?
పీనవశో వీధి
భీతి గగ్గురు వొడువ
బిచ్చ మిచ్చెదవే?
నానాథకిరణతే
జోనామమే నిన్ను
జోకొట్టి పోవు; నో
నీ, కలువకన్నె!
ఛీ! కలువకన్నే!

నేపథ్య రాణి:

తెలుగు తల్లికి వాద మేలా?
కలువ కింత వినోద మేలా?
పులుగురాయడు నాకు వశమై
పోయినా డమ్మా;
కాదా,
వెలుగురాయడు గూడ నాకడ
వెట్టియే నమ్మా!

రాయంచదొరసాని:

వెలుగురాయని పేరు విన్నాను గాని,
ఘోరమేఘునికి సంకులసమర మిపుడు
రానున్న శుభవార్త రక్షించె గాని,
యువదినేశుని మోహనోజ్జ్వలవిధంబు
ఈకన్నుగవ చూడ గ్రాంచినది గాని,
అంతయు శుభారంభమై వచ్చె గాని,
సంతతజయాంత విశ్వాసమే లేని
వీ డిందు గెల్చునో ఓడునో గాని—

తో గ రా ణి:

నవవిధ మోహిత
నాగస్వరమున
భవశిక్షిత పరి
పక్వ దినంబున
ప్రత్యూషస్సమయ
భాగ్యవీచికల
సత్యారాగనిజ
శాసన గర్భిత
గాథలోన నా నాథుని విడిచితి;
ఱెక్క విడి, గ
ట్టెక్కి వచ్చితిని:
ఈ పద్మప్రణ
యేచ్ఛా మధురా
హ్లాదరహస్యము
లరయలేనురా!
ఈర్ష్యావారిధి
నింత లోన నె
ట్లీదగలనురా?

ఈ సౌఖ్యము గను
ే, శక్యము గా
దే, నాకన్నులు
రానురాను నిజ
మౌన ముద్రలో
మూతలు పడియెను;
రాతిరి గడచెను.........

త మ్మి త ల్లి:

దివ్యప్రభాకాంత
నవ్యనీర ప్రాంత
భూమి, నాథుని జూడ
బోవు, నిది యెవ్వరో!
ఎవ్వరో, యెవ్వరో,
నవ్వుచున్నది, కంట
నాకు నిప్పులు జల్లి,
యెవ్వరో, యెవ్వరో!

ప్ర త్య క్ష ప్ర భ:

ఓ కలువకూన! నిన్
జోకొట్ట వచ్చితిని;
ఓపద్మ విరహిణీ!
నీ పతిని దెచ్చితిని;
ఓ అంధకారాంగణ ప్రాణికోటీ!
సప్రాణ కోటీ!
ఓ దురంతతమోనిరోధితాలంకార!
బోధితాత్మ్యాచార!
ఓ మహాజ్ఞానసమ్మోహితాంతర్వీథి!
ద్రోహిగత దుర్విధీ!
నిన్ను మేల్కొలుప, నే
నే వచ్చితిని చూడు;
బరువైన కనుతెప్ప పైకెత్తి చూడూ!
నిరుపమాజ్ఞానవార్నిధి వీడి చూడూ!
ఘోరతిమిరాకాశకుడ్యములు కూలెరా!
వీరప్రభాదేవి వెలికి రాజాలెరా!

రాయంచదొరసాని:

మేఘములు మేఘములని కొట్టుకొంటిని: అది తిమిరాచ్ఛాదనము కాబోలు! నా భానునికే గెలుపా? పంటపండినట్లున్నదే! అనుభవించుటయే ఆలస్యమా? అందులకైన నే నందఁటికన్న ముందే!—

[పవనయవనిక— ]

# కేదారగౌళ

విశ్వనాథ సత్యనారాయణగారు

[[1] ఈ చిన్నికావ్యము—[2] పరమేశ్వరునుండి కలిగిన సర్వకళలతనియందే వినియోగమైనట్లు ఇందలి అన్నిభావములు ఆయననుండియే కలిగినవి—[3] అపరత్యాగరాజు వాగ్గేయకారక రత్నము బ్రహ్మశ్రీ హరి నాగభూషణముగారికి అంకితము. ]

నాదమహాఖిలాధ్వపరిణాహవివేకము తా శరీరమ
ర్యాదకు లొంగి వచ్చిన మహాత్ముఁడు తెల్గులకీర్తిపంట చే
నూఁదిన సర్వవేదకలశోదధిపున్నమ పొంగు, సత్కళా
వేదిక త్యాగరా జొరగఁబెట్టిన శ్రీమధుకుల్య పొల్చెడిన్.

పుడమికన్నియప్రేమ పొడిచినవెల్లువ అతనిభక్తికి వెనుకాడినట్లు,
ఎల్లమానుల మేలియుల్లంపునిలుకడ అతనిమాటకు కదలాడినట్లు,
పుట్టపుట్టుకతేనెపట్టువానట్టువ అతని కూర్పున లయయాడినట్లు,
[4] తనదు బ్రహ్మత్వలక్షణమైన యానంద మతనిగానమునఁ ద్రోపందినట్లు,
తల్లియెద వీడి మేనుల యుల్ల మురలి-ఆదికృతి జాతి తన్ను తానైన మఱచి
తండ్రి శ్రీరామదేవుఁ డంతంత వచ్చి-అల్ల త్యాగయ్య సర్వస్వ మాశ్రయించె.
[5] రాణ్మనిపొంగు తీరము ముట్ట మారీచు నబ్ధిలోఁ ద్రోచుచో నలకలాడి
[6] రఘువీర రణధీర రాజకుమారుఁడై విధురశబ్దమున నావిర్భవించి
[7] కర్ణకఠోర కర్కశచరిత్రులమొత్తు లాలించుకొనఁగ నేకాంత ముండి
[8] తనపరాత్పరత యందనిద యయ్యును చరాచరరూపుఁ డౌటచే మఱుఁగు విడిచి

---

౧. హద్దు. ౨. కాలువ. 3. వాక్కుయొక్క నృత్యము. ౪. ఆనందము బ్రహ్మలక్షణము—గుణము కాదు. ఇది తైత్తిరీయమున భగవత్పాదులచే విస్పష్టీకృతము.

౫. అలక లల్లలాడఁ గని రాణ్మని యెటు పొంగెనో
చెలువు మీరఁగను మారీచుని దునిమేసమయ మందు. —త్యాగయ్యగారి కృతి.

౬. ఒకసారి త్యాగయ్యగారి నడవిలో దొంగలు తాఁకిరఁట. అప్పుడు వా రీకృతి చెప్పిరి. అది హుసేన్ రాగము. ఆధ్వనియందు శౌర్యము తాండవించును. ఆధ్వనికి వాయువీథులు పగిలి దైవ ముద్భవిల్లెను.

౭. ఎటులఁ బ్రోతువో తెలియ నేకాంతరామయ్య
కటకట నాచరితము కర్ణకఠోర మయ్య. —త్యాగయ్యగారికృతి.

౮. మఱుఁ గేలరా! ఓరాఘవా!
మఱుఁ గేల చరాచలరూప పరాత్పర సూర్య సుధాకర లోచనా! —త్యాగయ్యగారి కృతి.

ఒక్కపుడు తత్త్వమై మఱియొక్కయపుడు - కోసలేశుకూఁతురు ముద్దుకొడుకును నగుచు
భక్తవశుఁడైన శ్రీరామభద్రమూర్తి - త్యాగరా జెట్టు లాడించె నల్లె యాడె.

[1] పావు నెఱుంగు బ్రహ్మ నగపాలును మాత్ర మెఱుంగు పార్వతీ
దేవి గిరీశుఁ డేమెఱుఁగు తెల్లము రామమహత్త్వ[2] కృత్స్న మీ
మూవురు గాక యింకెవరు పో త్రిజగమ్ముల లేరు, త్యాగరా
జావిషయమ్మునన్ శివునికన్నను మించినయట్లు మించినన్.

వికృతుల్ దూరము ద్రోపువెట్టి నెదతో విశ్వాత్ముఁడై రామనా
మకమంత్రంబు జపించు త్యాగయకు భ్రూమధ్యస్థదృగ్వీథి పెం
చుక యోంకారధనుస్సుపై నొరిగి యీశుం డుబ్బి నిండారఁగాన్
చకితుండై గళమందు వాక్కును పెగల్చన్ రాక స్తుత్యర్థమై.

భక్తి యానంద మావేశభయము లాత్మ-తనువు పట్టఁగరాని వ్రేఁగును ఘటిల్లి
ఒకవిలక్షణమా ధ్వని యుద్భవిల్లె-కంఠమున, నది కేదారగౌళ యయ్యె.

కలువపూలోని పచ్చనిదిమ్మచుట్టును ముసరి తుమ్మెదగమి మ్రోసినట్లు
మెత్తైన యిసుకలమీఁది సన్ననినీటిపార జాలు ముర్మర పుట్టినట్లు
తల్లిలో రెక్కలో దాఁగి వెచ్చగ నంచకూన క్రొమ్మెడ వంచి కూసినట్లు
లేవెదుళ్లపొద తాలించి పొలాలపైనుండి వచ్చిన గాలి యూఁదినట్లు
త్యాగరాజప్రభుని కంఠభాగమందు - ఆయ నెఱుఁగకయే సహస్రార్థములుగ
కదలి కేదారగౌళ జగమ్ములోని-సకలమధురస్వరమ్ముల జతనుపరచె.

ప్రస్తార మెప్పటప్పటి కాకసమున లీనమయి గుప్తమగు శబ్దమె ధ్వనించు
ఆరోహణావరోహణములు సర్వశబ్దమునందు భావమ్ము పట్టి యదుము
మోగి నోమ మది భావములనిండఁ బరవశత్వము సాఁగు మేలిమార్గములు తీయు
తాన మంతంత నంతంతలో గగనాదు లన్నింటి దాఁటి బ్రహ్మమునె తాఁకు
త్యాగరాజప్రభుని కంఠభాగమందు - ఆయ నెఱుఁగకయే సహస్రార్థములుగఁ
గదలి కేదారగౌళ సంపదలు ప్రిదులు - కొన్న రసమూర్తికి నపరిచ్ఛిన్న మయ్యె.

[3] సప్తస్వరమ్ములస్థానముల్ సప్తవిభక్తుల వైఖరి ప్రౌఢి మెఱసి
మెలఁచిన సంగతు ల్మేలపు స్తోభలవోలె నిఖిలాధిదైవతనియతి పొలసి

---

౧. నాల్గవవంతు. ౨ సమస్తము. 3. సామలు పాంచవిభక్తికములు, సాప్తవిభక్తికములు. నని, ఆయి, ఓయి మున్నగు దీర్ఘములకు స్తోభలని పేరు. వానికి వాయ్వాదులు దేవతలు.

దశవిధగమకముల్ తనరారి యగ్నిసాత్కృత పురోడాశ కీర్తికిని మొగ్గి
చిక్కఁబట్టిన స్థాయి చెలువారి చెలువారి సర్వసంపన్నత జతనుపరచి
త్యాగరాజప్రభుని కంఠభాగమందు-ఆయ నెఱుఁగకయే సహస్రాధ్వములుగ
కదలి కేదారగౌళ, యుద్గాతృసామ-తగిలియున్న జ్యోతిష్టోమముగ వెలింగె.

[1]ప్రస్తరించిన రాగశక్తిక మూలప్రకృతి నైదుగా విభజించినట్లు
ఆరోహణావరోహణము భూతమ్ము లైదింటిలో గుణములు తెచ్చినట్లు
మొగినోము పద్ధతి భూతముల్ గుణములు నింద్రియమ్ములతోడ నెనఁగినట్లు
తానమ్ము నడుపుచంద మ్మింద్రియావళి కడు సాగి రససిద్ధి గాంచినట్లు
త్యాగరాజప్రభుని కంఠభాగమందు-ఆయ నెఱుఁగకయే సహస్రాధ్వములుగఁ
గదలి కేదారగౌళ లోకముల నిత్య-సర్గధారణ లయవిధాసరణి తాల్చె.

ఆప్రభురాజకంఠ వివరాగ్ర వినిస్సుతమైన రాగ మా
శా ప్రణుతాఖిలాధ్వముల సాఁగి సమస్తము తన్ముఖంబుగా
నే ప్రచలించుఁ గాన, నటులే తను సైతము పోయి పోయి గౌ
రీప్రభు కంఠమందు నమరెఁ శివమైన [2]శివాక్షమట్లుగన్.

కదలిన సన్నగాలితరఁగల్ తరఁగల్ బడి కమ్మబాజ్జఁగుల్
మొదలినతావులై తరక మీఁగడ కట్టుచు నున్న క్షీరమై
చెదరని సుల్లుసుల్లుగ మషీకణమట్లు చివుళ్లు నల్లనై
కుదిరి జగత్త్రయీవిభుని కుత్తుక నత్తుకొనెన్ శివాక్షమై.

ఏతొలినాఁడు స్వామి బడి యెల్లమహాకళ లుద్భవిల్లెనో
శ్రీతరళంబులై యతనిచేరికలో వినియోగ మందెడిఁ
[3]నేతగఁ ద్యాగరాజముని నిండి వెలింగిన గానయోగవి
ద్యాతిజగద్విధారసమాధి, శివుండు పరుండుగాఁ జనెన్.

[4]నాఁటికి త్యాగరాజమునినాథుని గానమహత్త్వసంపదన్
పోటి గడించుకొన్నయది సామముతోడఁ ద్రిలింగదేశక
ర్ణాటకగానరీతి, మునిరాజులు పర్వతనారదుల్ త్రిలో
కాటనవేళ సామమున యందున తెచ్చిన క్రొత్త బాణిగఁ.

---

౧. ఇది సృష్టిక్రమము. భూతములయందున్న గుణములద్వారా ఇంద్రియములు బ్రహ్మను మరలి పొందుట. ఆధ్యాత్మికాధిదైవతములయుపాసనలకు ప్రధానమైన దీరహస్యమే. వీనిరెంటికిఁ గలయిక సామ్యము. ౨. శివాక్షము: రుద్రాక్షము. 3. త్యాగరాజు యోగి; ఆయనగానము—యోగము. అందలి రసమే సమాధి. ఆసమాధియందు పరుఁడు శివుఁడు. ౪. ఇప్పటికిని కొందఱుకర్ణాటక గాయకులు హిందూస్తానీకళలువేసి తమదిక్రొత్తబాణియనుట ప్రసిద్ధమేగదా!

# ద్రావిడభాషా లక్షణము—తొల్కాప్పియమ్

కోరాడ రామకృష్ణయ్యగారు, యమ్. ఏ.

## 3

తొల్కాప్పియమునందలి రెండవ ప్రకరణమగు 'మొழிమరవు' అనునది, యేయేవర్ణములు పదములలో నెచ్చటెచ్చట నిలుచునో యనువిషయమునుగూర్చి తెలుపుచున్నది. శబ్దములకు వెలుపల స్వతంత్ర ప్రయోగములేని కుట్రియలికారోకారములను, ఆయ్దమును గూర్చియు, పదాదియందును, పదాంతమునందును నిలువదగిన హల్లులనుగూర్చియు నిందు తెలుపబడినది. సంబుధ్యర్థమున నొక క్రియాపదముతో జేరునవ్యయంబగు 'మియా' యను దానిలో మకారము తరువాతను యకారమునకు బూర్వమునను కుట్రియలికారము నిలుచును. ఉదా. కేళ్ మ్ + యా, కేళ్ మ్ + ఇ + యా = కేళ్ మియా; మియా సంధిలో పూర్వపదాంతమున గూడ నిలువవచ్చును. ఉదా. నాకు + యాతు = నాకియాతు.

ఈ కుట్రియలికార మనునది యర్థమాత్రకమని యిదివఱకే గ్రహించియున్నాము. దీనికి ప్రత్యేక ప్రయోగము లేదు. మఱియు నిదిసామాన్యముగా హల్పరమై యకారమునకు బూర్వమున నిలుచుచున్నట్లగపడుచున్నది. ఈకారణముచే నిది యిచ్చటి హల్సంయోగమును విడగొట్టి యుచ్చారణసౌకర్యమును సంపాదించుటకుగా నడుమవచ్చిచేరిన సంధ్యక్షరముగా (Slide Sound) గ్రహింపదగియున్నది. మీదివర్ణము తాలవ్యయకారమగుటచే నీ సంధ్యక్షరము తాలవ్యేకారమగుట తటస్థించినది. తక్కినసందర్భములలో ననగా పదాంతమందు పరుషవర్ణము నిలిచినపుడును, దానికి మఱియొకహల్లు పరమైనపుడు నుచ్చారణసౌకర్యమునకుగా తొలి పరుషవర్ణముపై నొకకుట్రియలుకారము చేరుచున్నది. కుట్రియలుకారమనగా నర్థమాత్రోకారమని యిదివఱకు మనము గ్రహించియేయున్నాము. దీని నుచ్చరించుటకు ముట్టుకరము- అనగా సంపూర్ణోకారము నుచ్చరించుటకు వలయు ప్రయత్న మవసరములేదు. పెదవులంతవర్తులత్వమును జెందనక్కరలేదు. సంవృతాకారమునకు గొంత చేరికగలదగును. ఇది బహుశః ప్రాచీన ఇండోయూరపియన్ భాషలోని అవిస్పష్టస్వరమును (Indefinite Vowel ə) బోలియుండునని తలంపనగు. లేదా కొంత ఓష్ఠ్యత్వగుణ మెక్కువపాలుగలదై యుండెనని చెప్పవచ్చును. ఇది ప్రధానముగా పరుషవర్ణముల తుదినే వచ్చునని చెప్పుటనుబట్టి, యిదియు కేవల ముచ్చారణసౌకర్యమునకై చేర్పబడినదే యైయుండునని తలంచుట కవకాశము కలుగుచున్నది. ఏలయనగా, పదాంతమున పరుషవర్ణోచ్చారణము చేయవలసివచ్చినపుడు తాల్వాదిస్థానములందు స్పర్శప్రయత్నము పూలముగా నిశ్వాసవాయువడ్డగింపబడుచే, నేదోయొక స్వరసహాయమునగాని యాపరుషవర్ణము వ్యక్తమగుట కవకాశముండదు. ఆనిరోధము తొలగింపబడినవెంటనే యప్రయత్నపూర్వకముగనే యుచ్చరింపదగినస్వరము అర్థమాత్రోకారము. దీనితో జేర్చి యుచ్చరింపబడినపు డాపదాంత పరుషవర్ణోచ్చారణమున గొంతసౌకర్యమేర్పడుననుటకు సందేహము లేదు. మఱియు ప్రయత్నపూర్వకముగ నాపరుషము నుచ్చరింపదలచిననేమోకాని, లేనిచో నొకయవ్యక్త ఉకారధ్వని యాపరుషముతరువాత తనంతనేవచ్చి చేరును. కావుననే యీకుట్రియలుకారము హలంతశబ్దముల యుచ్చారణమందు సౌకర్యమునకై వచ్చిచేరు నొక సంధ్యక్షరముగా (Slide Sound) భావింపదగియున్నది. ఈఉకారము సంధిలో యకారాదిపదమునకు బూర్వమున నిలిచినపుడు, ఇకారముగ మాఱుచుండుటనుబట్టికూడ నీకుట్రియలికారోకారములు రెండు నుచ్చారణసౌకర్యమునకై భాషలోనేర్పడిన సంధ్యక్షరములే యనియు, కుట్రియలికార మనునది ఉకారముయొక్క మాఱురూపమే

యనియు నిశ్చయించుట కవకాశమేర్పడుచున్నది. (cf. నాకు + యాతు = నాకియాతు.) పదాంతపరుషముపై నుచ్చారణార్థముగ జేరిన యీ కుర్రియలుకారమునకు సంధిలో మఱియొకపరుష మాదియందుగలపదము పరమైనచో నీయర్ధమాత్రోకార మట్లే నిలిచియుండును—ఉదా. కొక్కుక్కటికు; నాకు + కాల్ = నాకుకాల్; వరకు + కతిర్ = వరకుకతిర్. కాని దీనిపై యజాదిపదము నిలిచినచో నీయర్ధమాత్రోకారము లోపించి, పరస్వరం బేకాదేశంబగును—ఉదా. తేక్కు + అమ్ + కోడు = తేక్కాణ్కోడు. వణ్డు + ఇన్ + కాల్ = వణ్డిన్కాల్. పత్తు + ఇరణ్డు = పన్నిరణ్డు. పదాంతమునందలి యర్ధమాత్రోకారమిట్లు సామాన్యముగా నచ్చుపరమైనపుడు జాఱిపోవుచుండ, ఏకమాత్రోకారంబగు, ముట్టుకరమీ భాషలో నట్లు సామాన్యముగా జాఱిపోవుటలేదు. అట్లది లోపింపనియపుడు వకారాగమంబు కలుగుచున్నది. ఉదా. చెరు + అక్ + కళమ్ = చెరు + వ్ + అక్ + కళం = చెరువక్కళం; చెరు + అచ్ + చేన్నై = చెరువచ్చేన్నై; ఎరు + అమ్ + కుటి = ఎరువఙ్కుటి. ఒకప్పుడనునాసికాగమంబు నగును—ఉదా. ఒడు + కోడు = ఒడుఙ్కోడు. మొత్తముమీద నీపూర్ణోకారము సామాన్యముగా లోపింపదు.

హలంతశబ్దములను-అందుముఖ్యముగా పరుషాంత శబ్దముల నీయర్ధమాత్రోకారముమూలముగా నుకారాంతములను, లేదా అజంతములను జేయు ప్రాచీన సంప్రదాయమునుబట్టియే, తెలుగున ననేకశబ్దము లుకారాంతములై యుండుటతటస్థించియుండును. హలంతసంస్కృతశబ్దములు తెలుగున తత్సమములై చేరునపుడు సామాన్యముగా తుదినుకారమును గ్రహించుటకుగూడ నీప్రాచీనసంప్రదాయమే కారణమైయుండును. ఉదా:—వాక్-వాక్కు, దిక్-దిక్కు, లిట్-లిట్టు, సత్-సత్తు, మనస్-మనసు-మనస్సు, etc. ఈభాషలోని పదాంతోకారములన్నియు నచ్చుపరమైనపుడు నిత్యముగా లోపించుటకు నివి యీప్రాచీనద్రావిడుల యుచ్చారణపరిపాటి ననుసరించి హలంతశబ్దములతుది నూతగా వచ్చిచేరినవేయగుటయు నొకముఖ్యకారణమైయుండును. ఈ యుకారమునిత్యముగా లోపించినను అర్థమున కేమియు భంగము కలుగుటలేదు. దీనినిబట్టి యాంధ్రమున 'నుత్తున కచ్చుపరమగునపుడు (నిత్య) సంధియగు'ట సోపపత్తికంబై గన్పట్టుచున్నది. హలంతములగు సంస్కృతశబ్దము లీభాషలో నుకారాంతములై వెలయుచు సంధిలో తుదియుకారమును గోలుపోవుచున్నను, ఉకారాంత శబ్దములు మాత్రమట్లు తమసహజోకారమును గోల్పోవక తత్సమములగు సందర్భమున నూతగా గైకొనిన మఱియొక ఉకారమును అనగా తుదియుకారమును మాత్రమే గోల్పోవుచున్నవి. తరు శంభు మొదలగుశబ్దములు తరు + ఉ = తరు + వ్ + ఉ = తరువు, శంభు + ఉ = శంభు + వ్ + ఉ = శంభువు అనురూపములను బొందినవి. దీనికచ్చుపరమైనపు డూతగా వచ్చిన తుదియుకారము మాత్రమే లోపించుచున్నది. తరువు + అది = తరువది, శంభువు + ఆతడు = శంభువాతడు. తమిళకన్నడములలోగూడ శబ్దగతసహజోకారమట్లనే నిలిచి సంధిలో వకారాగమమును గ్రహించుచున్నది. ఉదా. తమి: చెరు + అల్ + కలం = చెరువక్కలం. కన్న: కుడు + ఉదు = కుడువుదు; మను + ఇన = మనువిన; విధు + ఇల్ల = విధువిల్ల; మధు + ఇల్ల = మధువిల్ల. కన్నడమున దేశ్యశబ్దముల యికారోకారముపై సంధిబహుళంబగుటచే నొకప్పుడు యత్వవత్వములు వచ్చుట, మఱియొకప్పుడు లోపముగలుగుట సంభవించును. కాని సంస్కృతశబ్దముల యికారోకారములపై యకారవకారాగమము నిత్యముగావచ్చును. బహుళత్వములేదు. (cf "అవతరిసి కుఱము వర్ణద, ఋవర్ణదోత్వాత్వద గ్రదొళ్ స్వరమిరెవ-త్వవిధానంబహుళతె, య, త్వవత్వదొళ్ సంస్కృతక్కతాని ల్లెంబుం.")

ఉదా. కన్న: మాతు + ఎల్లం = మాతువెల్లం, మాతెల్లం; సావడు + ఒందు = సావడువొందు, సావడొందు; సంస్కృ: నది + ఎల్లం = నదియెల్లం; విధు + ఇల్లద = విధువిల్లద; మధువిల్లదపూ.

దీనినిబట్టి కన్నడమున ఉకారాంతములగు దేశ్యశబ్దములకును, ఉకారాంతరములగు సంస్కృతశబ్దములకును సంధివిషయమున గొంత భేదము పాటింపబడుచున్నట్లు

తెలియుచున్నది. తెలుగున నట్టి భేద మేమియు లేదు. ఉకారాంతశబ్దములకన్నిటికి నచ్చుపరమైనపుడుకార లోపముగలిగి సంధిజరుగవలసినదే. కారణ మేమనగా కన్నడమున సంస్కృతప్రాతిపదికమే ప్రాతిపదికముగా గ్రహింపబడుటచే నద్దానియందలిఉకారము లోపించిన నర్థభంగమగును గావున నది లోపింపదు. ఆ యుకారము శబ్దగతమేగాని యుచ్చారణసౌకర్యమునకై వచ్చిచేరినదికాదు. తెలుగులో నుకారాంత తత్సమశబ్దము లన్నియు నుకారాంతసంస్కృతప్రాతిపదికములు మాత్రమేగాక వానిపై జేరిన 'వు' వర్ణము-అనగా నొక యూతఉకారము, ఆరెండు కా:ములనడుమవచ్చిన వకారాగమము-తోగూడినవేయగుటచే, తత్సమశబ్దములతుదినున్న యుకారమునకు నచ్చుపరమగునపుడు సంధి-అనగా పరస్వరైకాదేశసంధిజరుగుచునేయున్నది. అనగా నూతగావచ్చిన పదాంతోకారమచ్చుపరమైనపుడు జాఱిపోవుచునేయున్న దన్నమాట. అట్లీభాషలోతత్సమశబ్దములతుది నేర్పడిన 'వు' వర్ణమువై యాకరణులచే ప్రథమావిభక్తిప్రత్యయముగగూడ గ్రహింపబడుట తటస్థించినది. దీనినిబట్టి యీభాషలలోని తత్సమశబ్దములతుదియుకారమునకును కొన్ని దేశ్యశబ్దములతుదియుకారమునకును గొంత భేదమున్నట్లు వ్యక్తమగుచున్నది.

ఈకుట్రియలుకారము ప్రాచీనములగు కొన్ని హలంతశబ్దములతుదినూతగా వచ్చిచేరినదిగనుకనే కాలక్రమమున భిన్నభాషలలో నిదిభిన్నరూపములను జెందినది. ఈయుకారమంతమందుగల తమిళశబ్దములుకొన్ని తెలుగున అకారాంతములై కనబడుచున్నవి.

త-కున్ఱు; తె-కొండ

త-పుట్టు్రి; తె-పుట్ట

త-కొంబు; తె-కొమ్మ

త-సురుట్టు; తె-చుట్ట

త-పాక్కు; తె-పోక

త-ఎన్ఱు; తె-ఎండ

త-ముదుక్కు; తె-ముదుక

త-పాట్టు; తె-పాట.

మఱికొన్ని ఇకారాంతములైనవి. ఉదా. పత్తు-పది; అదు-అది.

తమిళమున నర్ధమాత్రోకారముకాక, సంపూర్ణోకారముతుదినిగల మఱికొన్ని శబ్దములు తెలుగున నుకారాంతములుగనే కనబడుచున్నవి.

ఉదా. కొంబు : తె-(ఏనుగు)కొమ్ము.

మూన్ఱు : తె-మూడు.

నాన్ఱు : తె-నాడు.

౪

ఇక తమిళమునందలి 'ఆయ్దం' అనున దెల్లపుడును హ్రస్వపూర్వకంబై పరుషమునకుముందు నిలుచును. ఉదా. ఎఃకు, కఃచు. ఇది సంస్కృతమందలి జిహ్వామూలీయోపధ్మానీయములను బోలినవర్ణమే. ఇది హ్రస్వాచ్చుపై నిలుచునదై స్వతంత్రోచ్చారణము కలదికాకపోవుటచే, నచ్చులలో బరిగణింపదగదు. దీనిపై హల్లేగాని యచ్చునిలువకుండుటచే దీనినిహల్లుగను బరిగణింపవీలులేదు. సంస్కృతమునందలి జిహ్వామూలీయోపధ్మానీయములవలె కకారపకారములకు బూర్వముననే గాక, చ, ట, త, ఱ వర్ణములకు బూర్వమునగూడ నిది యుచ్చరింపబడుచున్నది. సంధిలో పూర్వపదాంత్యవర్ణము పరపదాదివర్ణముతోనెనయుసందర్భమున నొక్కొకచో నీ 'ఆయ్దం' నడుమవచ్చుటయు గలదు. ఉదా. కల్ + తీతు = కఃఱీతు ; ముళ్ + తీతు=ముఃఱీతు. అచ్చులలో దీర్ఘాచ్చు లేదుమాత్రమే యీభాషలో నేకాక్షరపదములుగా నుండగలవు. హ్రస్వాచ్చులైదింటిలో నేదియు స్వతంత్రపదముగానిలువలేదు. వాడుకనుబట్టి ఏకాక్షరశబ్దములు (ఓరెళుత్తొరుమొళి), ద్వ్యక్షరశబ్దములు (ఈరెళుత్తొరుమొళి), ద్వ్యధికాక్షరశబ్దములు (తొడర్మొళి) నని శబ్దములను మూడువిధములుగా విభాగింపవచ్చును. ఉదా. ఆ; మణి; వరకు, కొఱ్ఱన్. యకారరేఫఱకారములకు క, చ, త, ప, ఙ, ఞ, న, మ, లు పరమం దుండవచ్చును. ఉదా. వేయ్క్కై, వేయ్ఙ్కై; వేర్క్కై, వేర్ఙ్కై; వీఴ్క్కై, వీఴ్ఙ్కై. రేఫఱకారములు పదాంతమున హ్రస్వా

చ్చాపూర్వకములై నిలువవు. కాని ద్వ్యధికాక్షరశబ్దముల (తొడర్ మొళి) తుదినిమాత్రము హ్రస్వాచ్చాపూర్వకములై యును నిలుచును కావ్యభాషలో 'పోలుం' అనుశబ్దము 'పోన్మ్' అను రూపమును బొందును. ఇచ్చటి 'ల' కారము 'న'కారముగా మాఱుట యనునది యీదక్షిణ దేశభాషలలో సామాన్యవిషయమె. తెలుగులో— తోల-తోన; ములుగోరింట-మును (ని) గోరింట, మొదలగుశబ్దములలో లకారము నకారముగా మాఱుచున్నది. ఇంతేగాక పోలు - పోలిన, యనునది తెలుగునగూడ 'పోని' అనురూపమును బొందుచున్నది. "అనన్యసాధారణ రూపవిభిభవంబుల రెండవ మన్మథుండునుంబోని వానినలుం గని" (భార. ఆర. ౨ ఆ.) పదమధ్యమునందలి 'ఐ' కార మొక్కొకపు డేకమాత్రకలదిగా నుచ్చరింపబడును. ఉదా. ఇడైయర్, మడైయర్. ఈ కారణముచేతనే నిట్టిశబ్దములలోని 'ఐకార' మకారముగా నుచ్చరింపబడుటయు, నీశబ్దము లకారమధ్యస్థము లగుటయు తటస్థించును.

అచ్చులు పండ్రెండింటిలో ప్రతివర్ణమును పదాదిని నిలుచును. కాని యేహల్వర్ణమును అచ్చరకంబైన గాని పదాదిని నిలువలేదు. క, త, న, ప, మ, వర్ణములకే యచ్చుపరమం దున్నను పదాదిని నిలువగలవు. అ, ఐ, ఔ అనునవితప్ప తక్కినయేయచ్చుపరమం దున్నను చకారము పదాదిని నిలుచును. ఉ, ఊ, ఒ, ఓ,ల తోడం గూడిన వకారము పదాదిని నిలువదు. ఆకారము హ్రస్వైకారౌకారములతో గూడిన ఞకారము మాత్రమే పదాదిని నిలుచును. యకారము ఆకారముతో గూడినపుడుమాత్రమే పదాదిని వచ్చును. స్వార్థమున హల్లులన్నియు నేయచ్చుతో గూడినవైనను పదాదిని నిలువగలవు.

ఇవి తమిళమున పదాదినివచ్చువర్ణములనుగూర్చిన సామాన్యనియమములు. తక్కిన దక్షిణదేశభాషలలో నివి యెంతవఱకు పాటింపబడుచున్నవో, యను విషయము పరిశీలనార్హంబై యున్నది. కన్నడవైయాకరణు లాభాషలో పదాంతమున వచ్చు వర్ణములను గూర్చి కొన్ని నియమములను దెల్పిరి కాని, పదాదివర్ణములనుగూర్చి యేమియు జెప్పియుండలేదు. ఆంధ్ర వైయాకరణులు పదాంతవర్ణములనుగూర్చి యేమియు జెప్పియుండలేదు గాని పదాదివర్ణములవిషయమున నొక్క యకారవకారములనుగూర్చి మాత్రమే చెప్పియుండిరి. తమిళమువనొక్క దీర్ఘాకారముతో గూడిన యకారముమాత్రమే పదాదినినిలువవచ్చును. తెలుగులో నదియు నిలువగూడదు. వకారము విషయమున, తమిళమునందువలెనే, ఉ, ఊ, ఒ, ఓ, లం గూడినవకారము, అనగా వు, వూ, వొ, వోలు తెలుగుమాటల మొదట రావు అని వైయాకరణులు నియమమేర్పఱచియుండిరి. తమిళాంధ్రములకు రెంటికి నీవిషయమున సామ్యముగపడుచుండుటచే, నిది యీభాషలకు సహజమగు ప్రాచీన సంప్రదాయమై యుండుననియు, నీభాషలలో క్వాచిత్కముగా పైసూత్రములకు భిన్నమై గనబడు యకార వకారాదిశబ్దము లన్యదేశ్యములో, లేదా? ఆభాషలో ననుచితవిభాగాదికారణాంతరములచే నేర్పడినవో యైయుండుననియు దలంపదగును. తమిళమునందును 'య' కార మొక్క 'ఆ' కారముతో గూడినపుడే పదాదిని రావచ్చును. అట్టిశబ్దములను గొన్నిటిని గ్రహించి పరిశీలించినచో నవియు నీభాషకు సహజములేనా, లేదా వాస్తవముగా యకారముతో గూడినవేనా యనుసందేహము పొడమకమానదు. తమిళమునందలి 'యా' కారాది పదములు చాలవఱకు దెనుగున 'ఎ' కారాదులుగా గనబడుచున్నవి. మఱియు నా భాషలోనే, యిప్పుడు యకారరహితమగు కేవల ఆకారముతోనే యుచ్చరింపబడుటయు గలదు. చూడుడు—

తమిళమునందలి యావరు-యార్ అనునది తెలుగున 'ఎవరు' అనియు నిటీవల తమిళమున 'ఆరు' అనియు గూడ వ్యవహరింపబడుచున్నది. ఈ 'ఆ' కారము కేవల దీర్ఘాకారముగాక, ఇంగ్లీషు భాషలోని 'Man' అను శబ్దములోని యచ్చును బోలినదై యుండును. కావుననె యది 'ఎ' కారముగాగూడ మాఱుట, అట్లె మఱికొన్ని శబ్దములు.

త యాన్-(ఆన్)—తె: ఏను = నేను.
యాట్ (ఆట్)—తె: ఏఱు = నది.
యానై (ఆనై)—తె: ఏనుగు.
యాండు—తె: ఏఁడు. సంవత్సరము.
యాడు-ఆడు—తె: ఏఁట.

ఆంధ్రమున వూరు, వుంగరము, వొలుకుట మొదలగునవి ఉకారౌకారాదులగు ఊరు, ఉంగరము, ఒలుకు మొదలగువాని యపభ్రంశములుగా గ్రహింపబడుచున్నవి. కాని సుశబ్దములు కావు. కన్నడవైయాకరణులు వు, వూ, వొ, వోలను పదాదిని ప్రత్యేకముగా నిషేధించి చెప్పుచున్నను, ఆ భాషలో నిట్టిశబ్దములే కనబడవు. కోశమున 'వోల్' శబ్దమొకటి కలదు గాని అది 'పోల్' శబ్దమునందలి పకారమునకు వకారముకలుగుటచే నేర్పడినదే గాని సహజముగా వకారాది కాదు. ఈ కన్నడభాషలో నీవకారము సామాన్యముగా బకారముగా మాఱుచుండుటచే ఉ, ఊ, ఒ, ఓ ల కంటె భిన్నములైన యచ్చులతోఁగూడిన వకారమాదియందుగల శబ్దములుకూడ చాల తక్కువగనే యున్నవి. తమిళమునందు వకారాదులైయున్న శబ్దములు తెలుగున సామాన్యముగా వకారాదులైయేయున్నవి.

| త. | | తె. | క. |
|---|---|---|---|
| వర్ | = To Come | వచ్చు— | బర్ |
| వాయ్ | = To Swell | వాచు— | బాయు |
| వాంగు | = To Bend | వంగు— | బాగు |
| వాఴు | = To Live | బ్రదుకు— | బాళ్ |
| విడు | = To Let, Loose | విడు— | బిడు |
| వెన్ | = The Back | వెన్ను— | బెన్ etc. |

ఇక వెనుక జెప్పబడిన కకారాదు లేయచ్చుతోఁగూడినైనను పదాదియందునిలుచునుగాని, హల్లుతోఁగూడినపుడుమాత్రము, పదానినిలువవు. అనగా సంయుక్తాక్షరములుగా నిలువవన్నమాట. ఇట్టిశబ్దములు-అనగాసంయుక్తాక్షరమాదియందుగలశబ్దము లనేకములు తెలుగు కన్నడ కోశములందు కనబడుచున్నవి గాని యవియన్నియు చాలవఱకు తత్సమశబ్దములెగాని దేశ్యశబ్దములైయుండవు. శబ్దరత్నాకరమున దేశ్యశబ్దములుగా గ్రహింపబడిన సంయుక్తాక్షరము లాదియందుగలశబ్దములుకొన్ని లేకపోలేదు. అవియన్నియు వర్ణవ్యత్యయ మాదిగాగల (Metathesis) కారణములచే నేర్పడినవేయని వానిలో గొన్నిశబ్దములను మనము పరిశీలించినచోఁ దెలియగలదు. పదాదిని కకారరేఫసంయోగముగలశబ్దములు కొన్ని దేశ్యశబ్దములుగా శబ్దరత్నాకరమున గ్రహింపబడినవి. అందు క్రక్కు-అనునదొకటి. ఇటీవలివ్యవహారమున నిది 'కక్కు' (కక్కుట) అని కకారాదియేయైనది. ఇట్లే క్రిందు-కిందు; క్రుంకు-కుంకు; క్రుమ్ము-కుమ్ము; క్రుళ్లు-కుళ్లు; క్రొత్త-కొత్త; క్రొవ్వు-కొవ్వు మొదలగుశబ్దములలోని రేఫము వ్యవహారమున లోపించుచునేయున్నది.

ఇది యీభాషలను వ్యవహరించు జనులయుచ్చారణ పరిపాటినిబట్టియే యిట్లగుచున్నదని తలంపనగును. మఱియు నాంధ్రమునందలి యీపదాదిసంయుక్తాక్షరము మధ్య నేర్పడినదేగాని యాదినుండి కలిగినదికాదు. ఆంధ్రమున 'క్రక్కు' ధాతువుగా గ్రహింపబడుచుండినను ప్రాచీనధాతువు 'కాఱు' అనునదె. కన్నడమున దీని కీరూపమె యిప్పటికిని గలదు. (కాఱు=వమనె), దీనిపై అకు, అగు అను సహాయధాతువులు చేరినపుడు కాఱుకు-క్రక్కు-అనివర్ణవ్యత్యయముచే నీధాతువేర్పడినది. క్రిందు దీనికితమిళకన్నడముల 'కీట్' అనునది మూలరూపము-కీట్-వ్యతిపాతవిధిచే 'క్రి' అయినది. దీనితోఁగూడి యేర్పడిన సమాసములే క్రిందొడ, క్రిఁగాలు మొదలగునవి. 'క్రిక్కిఱియు' శబ్దములోని 'క్రిక్కు' అనునది 'కిఱుకు' శబ్దము రూపాంతరమే. కిఱుకు అనగా త్రిప్పు అని యర్థము. క్రుంకు-ధాతువునకు మునుగు, అస్తమించు, చచ్చు అనియర్థము. ఇదికన్నడమున కుర్గు, కుగ్గు, కుఱ్గు (To bend, to shrink) అనురూపములు గలదైయున్నది. కన్న-కుఱుగణి (The state of being diminished, grown short) తగ్గియుండుటయని యర్థము. కఱుదాళ్కి (ఆకుంచనె = To contort, to shrink) ముడుచుకొనిపోవుటయని యర్థము. ఇదియే వర్ణవ్యత్యయముచే 'క్రుంకు' అయియుండును. కుంగు-కుగ్గ

(to sink or become low, to be bent down; to be depressed) తగ్గిపోవుట, మునిగిపోవుట యనునర్థము. కన్నడమునను తమిళమునను, మళయాళమున 'కుంగు'—కుంజు అనిరూపాంతరములు కలవు. క్రుళ్లు—కన్న=కొళె (to wear out, to rot as fruit, become putrid) తమి - కన్న; తమి: కుళ్, కూళై = what is rotten, mire, pulp. తె. కుళ్ - కుళ్ళుమ్ము, కుళుమ్ము, కుసుమ్ము=to rot, decay. ఆనాడు తెలుగొక్కప్పుడు ప్రాచీనకాలమున 'ళ'కారముగ మాఱుటయు గలదు. కావున కుళ్లై-క్రుళ్ళుగానాటియందుండవచ్చుట కవకాశము కలదు. ఇతర సన్నిహితభాషలలో నీశబ్దములు సంయుక్తాక్షర మాదియందుగలవి కాక ద్వితీయస్థానమున రేఫగాని శకటరేఫము గాని, లకారము గాని గలవై యుండి నవుడు వ్యతిపాతవిధిచే రేఫముతో లిపర్ణముతో సంయోగము జెందుటవలన నీశబ్దములు సంయుక్తాక్షరమాదియందు గలవిగా తెనుగునగనబడుచున్నవని చూపుటయే నాయుద్దేశము. క్రొవ్వు—కన్న: కొవుర్, కొబుర్ = కొబ్బు, (=to increase, to grow fat) త: కొఴుప్పు (=fat), క్రోవి=గొట్టము—cf. తమి: కొలుల్; కన్న: కుటే=ఖనను (=to make a hole, to dig) త: కుడై = త్రవ్వుట, కన్నముచేయుట. ఇట్లే కకారరేఫసంయుక్తాక్షరమాదియందుగల దేశ్యతెలుగుపదములన్నియు సహజశబ్దములుగాక యుచ్చారణవశమున మధ్యకాలమున భాషలో వెలసినవని తలంపదగియున్నవి. భాషలోనిసహజసంప్రదాయము ననుసరించి యందలి రేఫము మరలజాఱిపోవుచునేయున్నది. దేశ్యపదములమొదట నీరేఫతో గూడినవికాక, తక్కినహల్లులతో గూడిన కకారమాదియందు గల పదములు లేనేలేవు. అనగా సంస్కృతమందువలె, క్రౌర్యము, క్లాంతి, క్లిన్నము, క్లీబము, క్లేదము, క్వణనము, క్షణము, క్షారము, క్షితి, క్షీరము, క్షుత్తు, క్షేత్రము, క్షోణి, క్షుతము, క్ష్మా, క్ష్వేడ, ఈమొదలగుశబ్దములవంటి వీభాషలో లేనే లేవు.



# యోగాశ్వము

కవిరాజహంస, బాలాంత్రపు వేంకటరావుగారు

( వేంకట పార్వతీశ్వర కవులలో నొకరు )

శ్రీలకు నతి, వర్ణకళా!-శ్రీలకుఁ గృతి, త్యాగయోగసిద్ధానుభవ
శ్రీలకు సుజ్ఞానస్థితి;-మూలముగాఁ గొన్న తత్త్వమూర్తులఁ దలఁతున్.

కవి :—

ఆశ్చర్యమాశ్చర్య మదె పట్టపగటనే కనఁబడె మింట బంగారు చుక్క,
చూడఁగాఁ జూడఁగాఁ జుక్కగాఁ దోఁపదు భూమికి దిగు చందమామ యేమొ!
చందమామా యది? జాళువా యిట్టిగా నగపడుచున్నది; దిగినకొలఁది
శుద్ధసువర్ణప్రశోభితమైన తురంగమువలె విచిత్రముగఁ గాన
వచ్చుచున్నది; యిది వేల్పువారువంబొ!-ప్రొద్దుదొర తేరిసప్తాశ్వముల నొకండు
చెదరి యిట్లేఁగుదెంచుచున్నదియొ యేమొ!-విభ్రమాద్భుతగతు లెందు విందుసేయ.

జాతిసువర్ణసంచయము చక్కనియచ్చునఁ బోసినట్లుగా
నే తలఁతున్ స్వరూప మట నిల్చిన హల్లన వచ్చు, భారతీ
జాతిహయంబు గాని పెఱజాతిది గాదని తోఁచుచుండె, నీ
భూతలమందు దీని సరిపోల్పఁగఁ జాలిన యశ్వ మున్నదే!

దీనివెనుక నొక్క మానితతేజందు-గూడ నుండె, రతుకుండొ యేమొ!
దివ్యమూర్తి నిందుఁ దిలకింపఁగాఁ గంటి-నొందఁ గంటిఁ గన్ను లున్న ఫలము.

భోగి నైయుండునా వక్రమూర్తి గాదు,-రాగి నైయుండునా వికారంబు లేదు
యోగి నైయుండునా మేనియొప్పు వోదు,-తెలియ నెవ్వరై యుండు నీదివ్యమూర్తి—

ఱెప్ప వేయవు ననుఁ జూచు టచ్చ నేమొ?-చరణముంపవు నేల నాచార మేమొ?
నిన్నుఁ గని యల వేల్పుగా నేఁ దలంతు-శుభగమూర్తీ! వచింపు నీచొప్పదేమొ?—

మూర్తి:—

ఎదిరి నెఱిఁగి పలుకు టెంతయు లెస్స, కా-దేని యూరకుంటయే నయంబు,
త్రోవఁ గంటఁ బడిన దొడ్డవాఁడవు, మంచి-యవుఁ గదన్న! చెప్పు మెవఁడ వన్న?—

కవి:—

ఎవఁడనో నన్ను నేనె వెలయించుకొనంజనదైనఁ, జెప్పవా
రెవరును లేనినాఁడు వచియించుట దోసము గాదు, ధాత్రిపైఁ
గవి నయి కొన్నినాళులు సుఖస్థితిఁ గాంచినవాఁడ నోట, నా
ర్యవర! నను గృపాపరత నడ్గె వచింతువు; తెల్పు నీకథల్.—

మూర్తి:—

విద్యాధరులకు బంధుఁడ-విద్యాధికులై మెసంగు విబుధులకెల్లన్
సద్యోభృత్యుఁడఁ, బెద్దలు-విద్యార్థి యటంద్రు నన్ను విబుధవరేణ్యా!

నలువకు శిష్యుఁడన్ గమలనాభుని దాసుఁడ రాజశేఖరా
మలపదచింతనారతుఁడ, మన్ననమై విబుధేంద్రుదూత నై
యెలమిఁ జరించువాఁడ నిటు లీసవనాశ్వము వెంట నంటి, ధీ
బలులును రాజయోగు లగు పార్థివచంద్రులఁ గాంచువేడుకన్.

కవి:—

విన వలతు దేవదూతా!-యనఘంబగు సవన మెచట నగు? దానికి నే
ఘనమూర్తి యజ్వ యగు? దా-న నగుపలముఁ, గ్రతువుపేరు నాకుఁ దెలుపవే?

దేవదూత:—

ఆంధ్రపీఠభూమి నది నెఱవేఱును,-అమలకీర్తి యజ్వ యాంధ్రమూర్తి,
యోగయాగ మిది, నియోగించి సురరాజు-యాగహయము వెంట నంపె నన్ను.

వింటివిగా కవీంద్ర! పృథివిం గల చంద్రునిపేరు మున్ను, తా
మింట మెలంగుచంద్రునకు మేలుగఁ బత్కృశత్వ మూడ్చి, య
న్నింటను మున్నుగా వెడలి నిర్మలకీర్తుల సర్వదిక్కులన్
గెంటి, సురేంద్రుఁ జూడ దివికిం జనియుండినయట్టి వార్తలన్.

కవి:—

వింటమె కా దాచంద్రునిఁ-గంటి నతనికరనిదాన ఘనదానసుధన్,
మంటి నన నేల కవిపే-రంటినవారెల్ల బ్రతుకరాత్మకృతుణన్.

అభినవాంధ్రకర్ణుఁ డతఁడు దానంబున,-నభినవాంధ్రభోజుఁ డతఁడు విద్య,
నభినవాంధ్రకృష్ణుఁ డతఁడు ప్రాభవమునఁ-జంద్రనామముఁ డతఁడు సాంద్రకీర్తి.

ప్రాంచదాంధ్రప్రచారిణీ గ్రంథనిలయ-సుస్థిరస్థాపకుండు, భాసురయశుండు
మాతృభాషాభిమాని యస్మత్ప్రియుండు-ఉన్నవాఁడ టె! యట సుఖమున్నవాఁడె?
లలితసద్గుణగుణాలంకృతుం డగువాఁడు కమనీయతరకీర్తిఁ గన్నవాఁడు,
సంతతానంద ప్రశాంతచిత్తమువాఁడు ధర్మానుకూల వర్తనమువాఁడు,
నిత్యసత్యవ్రతనియతిఁ గాంచినవాఁడు హితమితమధురభాషితమువాఁడు,
ప్రవిమలోదారస్వభావంబు గలవాఁడు భవ్యసౌభాగ్యవైభవమువాఁడు,
దీనజనముల మొఱ వినలేనివాఁడు,-లేనివారల వెతఁ జూడలేనివాఁడు,
సర్వజనరంజనము సేయఁజాలువాఁడు! - ఉన్నవాఁడ టె! యట సుఖమున్నవాఁడె?
ఆంధ్రదేశప్రభుత్వాప్తి యశఃకీర్తు లందిన దాతనియన్వయంబు,
బసివిరెడ్డి యనంగఁ బ్రథితాత్ముఁడగు భూరి విభవాఢ్యుఁ డాతని పెద్దతండ్రి,
దైవతాలయపురస్థాపకుఁడైన చిన్నయరెడ్డి యాతని యనుఁగుఁదండ్రి,
శ్రీసతీప్రతిభాఢ్య చినబుచ్చమాంబిక కడుపుచల్లఁగ వానిఁ గన్నతల్లి,
యతఁడు కోపూరివంశపయఃపయోధి-పూర్ణిమాచంద్రుఁడై పుట్టి ప్రోదిఁ గాంచి
యేఁగె నానాఁడు బృందారకేంద్రపురికి-నున్న వాఁడ టె! యట సుఖమున్నవాఁడె?

దేవదూత:—

ఉన్నాఁ డమరేంద్రుని పురి-నున్నాఁ డాతం డుపేంద్రుఁడో కో- యనఁగా
నున్నాఁడు నిత్యసుఖమై-యున్నాఁ డానందనందనోత్సుకలీలన్—
హరిహరహిరణ్యగర్భుల-పురవరముల కరిగి వారిఁ బూజించి, నిరం
తరగురుబోధల మెలఁగును,-నరసాంబాప్రియుఁ డతండు నాకపురమునన్.

అమరగురునియొద్ద నాత్మతత్త్వంబును,—నిర్జరేంద్రునొద్ద నిగ్రహంబు,
శచికుమారునొద్ద సౌహార్దభావంబు-తెలిసి మెచ్చి కలసి తిరుగు నతఁడు.—
స్వర్గమందుండి మఱవఁడు జన్మభూమి-మనుష్యు నాలించి మఱవఁడు మాతృభాష
దివిజకవిఁ జూచి మఱవఁడు తెలుఁగుకవులఁ-దెలియ [illegible]యుని దీక్ష యేమొ?
తనభాషాసంతానముఁ-దనభాషాకామరూప దైవతసురభిన్,
దనభాషా చింతామణి-దనయముఁ దలపోయుఁ దా సురాలయుఁ డయ్యున్.

కవి:—

అమృతకరసురేంద్రుఁ డతనిపీయూషామృత-మందకుండఁ బోయినట్టినాఁడె
యాంధ్రనిలయనంద నారామమున కేమొ-యాకురాలుగాల మయ్యె నకట!

పుల్ల విరిగి యెండిపోయె సంతానంబు-కామధేను వేమొ గాజువాఱె
బొగ్గుదేఱె కగ్గిపోయెఁ జింతామణి-చేతిగాలి కావి శేష మేమొ?

దేవదూత:—

ఇఁకమీఁద నిది విను మెల్లసంశయములుఁ దీఱుఁ గష్టంబులు తీఱిపోవు,
నొకనాఁడు త్రిదశేంద్రునొద్దకు భగవానుఁడైన శుక్రుఁడు వచ్చి యభిమతార్థ
సంభాషణంబుల జరపి యాతని పూజలంది క్రమ్మఱి పురి కరుగువాఁడు
గురు నర్థి దర్శించి సరసగోష్ఠి మెలంగి యాప్రక్క- నున్న మహానుభావుఁ
జంద్రుఁ గని వానివృత్తాంత మింద్రగురుని-వలన సర్వంబు నెఱిఁగి దివ్యప్రభావుఁ
డతనిఁ గృపఁ జూచి యోచించి యాక్షణంబ-యాగహాయ మొండు బుట్టించి యనియె
[నిట్లు.

అభిమతము తీరు వత్స! గుర్వానుమతిని-యోగయాగంబు సేయు మీయాగహాయము
మాతృదేశంబుఁ దిరిగి సమ్మతము మీఱఁ-జేరు నిను, నిది కల్యాణసిద్ధిఁ గూర్చు.

అని యాగహాయముఁ దోఁకొని-యనిమిషగురుతోడఁ జంద్రు నమరాధిపునొ
ద్ద నునిచి, భార్గవుఁ డతనికి-వినిపించి, శుభ మనిపించి, వెండియు ననియెన్.

శుభముహూర్త మయ్యె సురగురువరునాజ్ఞ-మంత్రసిద్ధి యయ్యె మామకాజ్ఞ
అర్థసిద్ధి యయ్యె నమరాధిపునియాజ్ఞ-యాగహాయము విడువు మయ్య వత్స!

అనుచుఁ జంద్రుచేత నామోదకరముగా-వినుత యాగహాయము విడువఁజేసి
వెనుక నన్నుఁ జూచి విద్యార్థి రమ్మని-యఖిలవేది శుక్రుఁ డనియె నిట్లు—

రావయ్యా! విద్యార్థివి-పోవయ్యా హాయమువెంటఁ, బుణ్యాత్మున కం
దీవయ్యా! గురుకీర్తులఁ-దేవయ్యా! విజయసిద్ధిఁ ద్రిదశేంద్రునకున్.

అచ్చు పరంబై చెల్లుచు-హెచ్చుసువర్ణముల నెసఁగి యేఁబది యాత్రై
నచ్చినపదములఁ దిరుగుచు-వచ్చుహాయము సుకవు లెల్ల వర్ణింపంగాన్—

ఇది మార్గ మాంధ్రమున కని-యిది భారతపద మటంచు నిది వర్ణకళా
స్పద మగు పద మగు నంచును-విదితము గావించు యోగవిద్యాశ్వంబే.—

చనుమని కావ్యుఁడు వలుకఁగఁ,-జను నని గురుఁ డానతీయ, సర్వసుపర్వుల్
ఘనమని నుతింప నింద్రుని-యనుమతిఁ జంద్రునిప్రియంబు నంది వెడలితిన్.

కవి :—

హాయము సమస్తదేశములయందుఁ జరించునుగాక, యోగవి
ద్యయు మఱి యాగవిద్యయు స్వధర్మపథం బునఁ గాంచి ధీరులై
నయవిదులై శుభార్థులయి నవ్యసనాతనరీతు లెంచి, యా
హాయమును జూచి పట్టఁగలయట్టి మహాత్మకు లిప్పు డుండిరే?

విక్రమార్కుఁ డున్న వెలుఁగునఁ గనుఁ గాక!-భోజుఁ డున్నఁ దెలిసి పోల్చుఁ గాక!
కృష్ణరాయఁ డున్నఁ గేరి పట్టును గాక! - వారు నేఁడు చూడలేరు గాక!—

నన్నియచోడరాజు, నల నన్నయయేలిక రాజరాజుఁ, ది
క్కన్నను మెచ్చికొన్న మనుమావనిపాలుని, శంభుదాసు నె
ఱ్ఱన్నను గొన్న వేమవసుధాధిపచంద్రునిఁ, జేమకూరవెం
కన్నను బ్రోచికొన్న నృపు నారఘునాథునిఁ గాన నేర్తుమే? —

దేవదూత :—

వారు మహానుభావులు, ధ్రువప్రతిమూర్తులు, వార లెల్లరున్
భారతియింటఁ బద్మభవుపల్కులఁ బాటల రాజహంసలై
గౌరిగృహంబునన్ శివునికైతలరీతుల జ్ఞానమూర్తులై
సారతరాత్మసత్వగుణ సంపదఁ జేరి రనంతధామమున్—

వారు లేరు గాక! వననిధివేష్టిత-భూవలయము వట్టిపోయె నయ్య?
చిక్కకుండుఁ గాక! చింతామణులు మఱి-జీవమణులు లేవె క్షీరవార్ధి?—

ఏపుట్ట నేమి యుండునో-చూపట్టునఁటయ్య మనము శోధింపక ము
న్నాపుట్టఁ బుట్టి యొకముని-దీపింపఁడె రాముచరితఁ దెలిపి సుకీర్తిన్—

తినఁబోవుచు రుచు లేలా? - యనఘా! యాగాంతమందె యది కనుఁగొనఁగా
ననువగుఁ గాదా; చనవలె-వినవలసిన దొండు వినుము వేడుకయేనిన్.

సవనహాయ శ్రీముఖమున-వివరించిన యోగయాగవిషయార్థము లీ
వవలోకించి పఠింపుము-భవాబ్ధితరణములు సకలపాపహరణముల్—

కవి :—

అన లేమున్నది! కన్నులు-మనసకలు హాఱినవి! చూపు మాసిన దిది నా
దెసఁ గల యపరాధంబో-మన లెడి గుఱ్ఱంబు గూడ మాయంబయ్యెన్—

దేవదూత :—

మఱచి చేయవుగదా మాతృవిద్రోహంబు చేసినపాపంబు చెప్పు మన్న!
మించి చేయవుగదా మిత్రవిద్రోహంబు తొడరిన కీడేమొ నుడువు మన్న!
సలిపియుండవుగదా స్వామివిద్రోహంబు తెలిసినదోసంబు తెలుపు మన్న!
ఆచరింపవుగదా యాత్మవిద్రోహంబు కలిగినవాదేమొ పలుకు మన్న!
లేకయుండినఁ గను గానరాకయున్నె! - కాకయుండినఁ జూపులు గప్పుకొన్నె!
అట్టులే కానిచో దృష్టు లాఁకఁ గన్నె!-అది జరుగకున్నఁ బొర లేటి కొదవునన్న!
చేసినది యనుభవింపక-మాసి చనునఁటయ్య! ముందుమా టుంచుము, నేఁ
బోసెద నమృతం బిదిగో! - గాసి విడిచి, కన్నుఁ దుడిచి కనుఁగొను మన్నా!

కవి :—

చేసినతప్పులు పెక్కులు-ద్రోసితివి కృపాంతరంగ! తొలఁచితి కన్నుల్,
భాసురహాయముఖపద్య-వ్యాసంబును గంటి, విందువా పఠియింతుర్.

" గురుఁడు—

" యోగాశ్వ మాత్మవిద్యా-యాగాశ్వము, సర్వమంగళాధారగుణా
భోగాశ్వము, చంద్రకృత-త్యాగాశ్వము దానవీరదర్పాశ్వంబే? —"

"శుక్రుఁడు—

"భోగులు రారు దుష్కలుషపూరితదేహులు వారు, ప్రాభవా
వేగులు రారు నిశ్చలవివేకవిహీనులు వారు, సద్గుణ
త్యాగులు రారు తామసవిదారితచిత్తులు వారు, బ్రహ్మవి
ద్యోగులొ రాజయోగివరులో కనవత్తురు నిన్ మఖాశ్వమా!"

"మహేంద్రుఁడు—

"దివ్యయాగభాగధేయ మీయశ్వంబు-దివ్యయోగభాగధేయు లైన
రాజయోగు లున్న రాఁబట్టుకొనవచ్చుఁ-బరమయోగు లున్నఁ బట్టవచ్చు—"

"స్వస్తి

"శ్రీముఖయు నక్షరాకృతి, సిద్ధపదయు-సుగతియు, సువృత్తయును, శుభలక్షణయును,
భావవేగయుఁ, బరమార్థభరితయు నగు - హాయము యజమాని కొసఁగుఁ గల్యాణ
చయము."

---

# అభిజ్ఞానశాకుంతలము—కాలవిచారము

కపిస్థలం శ్రీ రంగాచారిగారు

కాలవిచార మన నీనాటక మేకాలమునాటి దను చర్చ కాదు. మఱి యీనాటకమునందలి కథ జరుగుట కెంతకాలము పట్టియుండు ననుటను విచారించుట—ప్రథమాంకము మొదటినుండి సప్తమాంకము కడపటివఱ కెంతకాలము గడచినది; ఒక్కొక్క యంకము ముగియుట కెంతకాలమైనది అనుటను చర్చించుట. ఇట్టి విచారము చర్విత-చర్వణ మని కొందఱు తలపవచ్చును. కాని కొన్ని విషయము లింకను తేటపఱుపబడలేదు. నాకు కలిగిన యొకటిరెండు సందేహములను తెలుపుచు నీవిషయమును నా చేతనైనంతవట్టు తేటపరుతును.

మదరాసు విశ్వవిద్యాలయమునందు సంస్కృతమున రీడరుగ నుండు మ. రా. రా. శ్రీ కున్హన్ రాజా, ఎం. ఏ. గారు గడచిన అక్టోబరు నెలలో ప్రెసిడెన్సీ కాలేజిలో అభిజ్ఞానశాకుంతలమునుగూర్చి యుపన్యాస మిచ్చిరి. అప్పుడు వారు కాలమును చర్చించుచు, నీనాటకమునందలి పాత్రలపలుకులను చక్కగ పరిశీలించిన నిందలి యంకము లొకటి వెనుక నొకటిగ, నడుమ నెంత వ్యవధియు లేక, జరిగినట్లు తేలుచున్నదను తమ నూతనాభిప్రాయమును వెల్లడించిరి. వీరి మతమునకే రెండంకములకు నడుమ నొకటి రెండు దినములు గడచి యుండిన నుండవచ్చును—అంతే. వీరు తమ యభిప్రాయము నెట్లు సమర్థించిరో చూతము.

౧. ద్వితీయాంకమున విదూషకుడు[1] "నిన్న మే మెవ్వరమును లేనప్పుడు మృగమును వెంబడించుచు నాశ్రమపదముఁ బ్రవేశించిన మారాజునకు నాదురదృష్టమునఁ దాపసకన్యయగు శకుంతల కంటఁబడిన దఁట" అనుచున్నాడు. కావున ప్రథమాంకము జరిగిన మరునాడే ద్వితీయాంకము జరిగినది.

౨. తృతీయాంకములోని విష్కంభమునందు శిష్యుడు,—[2]"పూజ్యుఁడగు నాతఁడు ప్రవేశించినంత మాత్రముననే యాశ్రమానుష్ఠానములు నిర్విఘ్నముగాఁ గొనసాగినవి" అనుచున్నాడు. శిష్యుడీమాటలను యజ్ఞము ముగిసినవెంటనే లేక మరునాడే యనును గాని చాల దినములైనపిదప అనడు. ఏలన, క్రొత్తలో నిట్టితలపులు వచ్చుట సహజము గాని ముగిసిన యేడాదికి వచ్చుట సహజము గాదు. మఱియు ద్వితీయాంకమున ఋషికుమారులు రాజు నాశ్రమమును కొలదిదినములు సనాథముగ చేయుమనిరి. కొలదిదినము లనగా నొకటిరెండు దినములు. కాన ద్వితీయాంకము జరిగిన యొకటిరెండు దినములకు తృతీయాంకపు విష్కంభము జరిగినది.

3. పైవిష్కంభములో శిష్యుని [3]యాకాశభాషణమున చెప్పబడినట్లే తృతీయాంకమున శకుంతల మనకు కనబడుచున్నది. అంకము కడపట గౌతమియు యజ్ఞసంబంధమైన తీర్థము నామెకొఱకు తెచ్చుచున్నది.

---

౧. హ్యః కిలాస్మాస్వవహీనేషు తత్రభవతో మృగానుసారే ణాశ్రమపదం ప్రవిష్టస్య తాపసకన్యకా శకున్తలా మమాధన్యతయా దర్శితా.

(ఈ వ్యాసమున నుదాహరింపబడు సంభాషణలన్నియు శ్రీమతి విద్వత్కవితిలక కాంచనపల్లి కనకాంబచే నాంధ్రీకరింపబడిన అభిజ్ఞానశాకుంతలమునుండి తీసికొనబడినవి.)

౨. ప్రవిష్టమాత్ర ఏవాశ్రమం తత్రభవతి రాజని నిరుపద్రవాణి నః కర్మాణి ప్రవృత్తాని భవన్తి.

3. (పరిక్రమ్యావలోక్య చ ఆకాశే) ప్రియంవదే, కస్యేద ముశీరానులేపనం మృణాళవన్తిచ నలినీపత్రాణి నీయన్తే. (ఆకర్ణ్య) కిం బ్రవీషి ఆతపలఙ్ఘనా ద్బలవదస్వస్థా శకున్తలా తస్యాః శరీరనిర్వాపణాయేతి తర్హి త్వరితం గమ్యతాం ...అహమపి తావద్వైతానికం శాన్త్యుదక మస్యై గౌతమీహస్తే విసర్జయిష్యామి.

కనుక నీవిష్కంభము జరిగిననాడే తృతీయాంకము జరిగినది.

౪. తృతీయాంకమున శకుంతల, ౪ "సంతాపము నార్చు నోలతాగృహమా! మరల నిన్ను ననుభవించుటకు వచ్చెదను" అనినది. కావున నాటిరాత్రియే యామె యా లతాగృహమునందే దుష్యంతుని చూచినది. మరు నాడే దుష్యంతుడు తననగరమునకు వెడలెను. చతుర్థాంకములోని విష్కంభమున అనసూయాప్రియంవద లీగాంధర్వవివాహమును గుఱించి మాటలాడుచున్నారు. కాన చతుర్థాంకపు విష్కంభము తృతీయాంకమునకు మరునాడు జరిగినది.

౫. పైవిష్కంభమున చెలులు తాముకోసిన పూలతో గ్రుచ్చిన దండను శకుంతల చతుర్థాంకమున ధరించియున్నది. పంచమాంకమున రాజు, ౫ "స్పష్టముగఁ గనఁబడుచున్న గర్భచిహ్నములుగల యీమెను సందేహించుచున్న నే నెట్లు భార్యగా గ్రహింపఁగలను?" అనుటవలన శకుంతల నాలుగైదునెలల గర్భము ధరించి యున్నదని తేలుచున్నది. ఇకముందు తెలుపబడు కారణములవలన శకుంతల యాపూలదండ ధరించునప్పటి కించుమించుగ నాలుగైదునెలల గర్భము ధరించియుండెనని తేటపడగలదు. ఈపూలదండ యెన్నాళ్లకని వాడకుండును? రెండుమూడుదినములు వాడకుండును గాని నాలుగైదునెలలు వాడకుండునా? మఱియు శకుంతల నాలుగైదు నెలల గర్భము ధరించియుండ గౌతమికి కండ్లు లేకపోయెనా? రాజునకే కనబడిన గర్భచిహ్నములు స్త్రీలకు కనబడియుండవా? ఇక ముదుసలియైన గౌతమిమాట చెప్పవలయునా? కనుక నీయంకమున శకుంతల కింకను గర్భ మభివృద్ధి కాలేదని యూహింపవలసియున్నది. కనుక పైవిష్కంభము జరిగిన రెండుమూడుదినములకు చతుర్థాంకము జరిగినది.

౬. షష్ఠాంకమునందలి,

౬ "గీ. నాదునామాక్షరములు దినమున కొకటి
　　గాఁగ లెక్కింపు మిటుఁ దుదిఁ గల్గు తఱిని
　　ప్రియ, మదవరోధసద్మ ప్రవేశనేత
　　సేవకుఁడు నీసమీపముఁ జేరు ననుచు."

అను రాజుమాటలవలన రాజు తననగరము చేరుటకును వెంటనే పంపబడు అంతఃపురపరిచారకుడు కణ్వాశ్రమమును చేరుటకును చేరి మూడుదినము లగునని తెలియుచున్నది. కావున కాలినడకను బోయెడి శకుంతలకును ఆమెవెంటవచ్చువారికిని హస్తినాపురమును చేర రెండుమూడు దినములు పట్టును. వీరు చతుర్థాంకమున బయలుదేరి పంచమాంకమున రాజు నాస్థానమున నున్నారు. కావున చతుర్థాంకము జరిగిన రెండుమూడు దినములకు పంచమాంకము జరిగినది.

౭. షష్ఠ, సప్తమాంకములు రెండును శిష్యులును గౌతమియు కణ్వాశ్రమమును చేరులోపల జరిగియుండవలయును—అనగా రెండుమూడు దినములలో. ఏలన: శకుంతలను రాజు నిరాకరించెనని వీరు కణ్వున కెఱిగించిరేని యతని కెంతకోపము వచ్చియుండదు? రాజుపై కినిసి యతని కెట్టి ఘోరశాప మిచ్చియుండడు? ఎట్లున్నను శకుంతలకు తత్క్షణమే సుఖముకలిగించి యుండడా? మఱియు, రా జైదారేండ్లదాక కణ్వుని సందర్శించి యతనిమన్నన వేడకున్న నతడు తన కులపతియెడ తీరని తప్పిదమొనర్చుటయకాక తనశీలమునకు కళంకము తెచ్చుకొన్నవాడగును. ఇంతేకాక సప్తమాంకమున మాతలిదుష్యంతుల సంభాషణవలన రాజు నాటికి ముందటి రోజుననే స్వర్గమునకు పోయినట్లు తెలియుచున్నది.

పాత్రల సంభాషణలనుబట్టి కాలవిచార మీరీతిని చేయవలసియున్నదనియు, కథనుబట్టి తృతీయ చతుర్థాంకములనడుమ నాలుగైదునెల లుండవలసియుండుటయే

---

౪. లతావలయసంతాపహారక, ఆమన్త్రయే త్వాం భూయోఽపి పరిభోగాయ.

౫. తత్కథ మిమా మభివ్యక్తసత్త్వలక్షణాం ప్రత్యాత్మానం క్షేత్రిణ మాశఙ్కమానః ప్రతిపత్స్యే.

౬. ఏకైక మత్ర దివసే దివసే మదీయం, నామాక్షరం గణయ గచ్ఛతి యావదన్తం,
　　తావ త్ప్రియే మదవరోధగృహప్రవేశం, నేతా జన స్తవ సమీప ముపైష్యతీతి.

కాక, పంచమ, షష్ఠ, సప్తమాంకముల నడుమ నెందో యైదారేండ్లుండవలయునని తేల్చుకోవలసియున్నదనియు, ఇట్టి యీవిరోధమును పోగొట్ట తమచేత గాకున్నదే యనియు నచ్చెరువొందుచు మ-రా-రా-శ్రీ కున్హా రాజాగారొకవిధముగ తమ యుపన్యాసమును ముగించిరి.

ఈ రీడరుగారు "పాత్రలపలుకులను చక్కగ పరిశీలించి" పైవిషయములను తేల్చుకొనిరట! వీరు ఇంక కొంత బాగుగ నాటకమును చదివియుండిరేని తమ నూతనాభిప్రాయము తప్పని చప్పున తేల్చుకొనియుందురు.

౧. వీరు తేల్చుకొనిన మొదటివిషయము సమంజసముగనే యున్నది.

౨. ఇక వీరి రెండవవిషయమును పరిశీలింతము. అందుదాహరింపబడిన మాటలను శిష్యుడు యజ్ఞముముగిసినవెంటనే లేక మరునాడే యనునుగాని యాయజ్ఞమొకటిరెండు దినములే చేయబడెనని యెవరు చెప్పిరి? మఱియు వీరివాదము ద్వితీయాంకములోని ఋషికుమారుల మాటలపై నాధారపడియున్నది. కొలదిదినములనగా నొకటిరెండు దినములేనా?—తృతీయాంకమున శకుంతలయొక్క విరహావస్థ స్పష్టముగ వర్ణింపబడియున్నది. రీడరుగారి లెక్కప్రకారము శకుంతల రాజును చూచి మూడునాలుగు దినములై యుండవలెను. మూడునాలుగు దినములలో శకుంతల యట్టివిరహవేదనపాలు కాగలదా? ఇక రాజు నవస్థ చూడుడు.[౭] "మనమునఁ బుట్టుతాపమున మాపునమాపున వెచ్చనౌచు బాహువునిడుకంటికోనఁ బడుచుండెడుకీట వివర్ణరత్నమౌ, కనకపుఁ గంకణంబు గుణఘాతకిణంబులనాఁగి జాఱిపో,యినమనికట్టునుండి లలినే నెగఁద్రోయుదు మాటిమాటికిన్." ప్రియంవద యేమనుచున్నదో చూడుడు.[౮] "స్నేహభావముగల చూపులచే నీయం దభిలాషను గనఁబఱచిన యారాజర్షి నిద్రలేక యున్నాళ్లు కృశించుచున్నట్లు గనపట్టుచున్నాఁడు." శకుంతలాదుష్యంతు లిట్టి యవస్థపాలగుటకు సుమారు పదునైదు దినములైన పట్టును. కనుక ద్వితీయాంకము జరిగిన పదునైదు దినములకు తృతీయాంకపు విష్కంభము జరిగినది.

౩. వీరు తేల్చుకొనిన మూడవవిషయమున కే లోటును లేదు.

౪. తృతీయాంకమునకును చతుర్థాంకమునకును నడుమ నెంతకాలమైన దనుటనుగూర్చి యం. ఆర్. కాళె, బి.ఏ.గా రిట్లువ్రాయుచున్నారు.[౯] "తృతీయాంకమునకును చతుర్థాంకమునకును నడుమ సుమారు నెలాపదునైదు దినముల వ్యవధి యున్నది. మఱియు చతుర్థాంకమునకును దాని విష్కంభమునకును నడుమ పదునైదు దినముల కాల మున్నది."

రీడరుగారు తృతీయాంకము జరిగిననాటిరాత్రియే శకుంతల 'యాలతాగృహమునందే దుష్యంతుని కూడినది' అనుచున్నారు. ఉండవచ్చును. కాని, 'మరునాడే దుష్యంతుడు తన నగరమునకు వెడలెను' అనుట తప్పు. ఏలన: పంచమాంకమున శకుంతల తాను పరకళత్రము కాదని దుష్యంతునికి నిరూపించుటకి ట్లనుచున్నది: [౧౦]"ఒకదినమున వనమాలికామండపమునఁ దామరాకు దొన్నతో నీటిని నీహస్తమునం దుంచుకొంటివి ...."రాజు గాంధర్వవివాహము జరిగిన మరునాడే తన నగరమునకు వెడలియుండిన నతడు శకుంతల వర్ణించినరీతిని మెలగియుండుట తటస్థింపదు. శకుంతల యిప్పట్టున నిక్కము

౭. ఇద మశిశిరై రన్తస్తాపా ద్వివర్ణమణీకృతం, నిశి నిశి భుజన్యస్తాపాఙ్గప్రసారిభి రశ్రుభిః,
అనభిలులితజ్యాఘాతాఙ్కం ముహుర్మణిబంధనాత్కనకవలయం స్రస్తం స్రస్తం మయా ప్రతిసార్యతే.

౮. నను సరాజర్షి రేతస్యాం స్నిగ్ధదృష్ట్యా సూచితాభిలాష ఏతాన్దివసాన్ప్రజాగరకృశో లక్ష్యతే.

[౯] "An interval of about a month and a half separates the Fourth Act from the Third, there being a distance of about fifteen days between the Act itself and the Vishkambha."——M. R. Kale. B. A.

౧౦. నన్వేకస్మిన్దివసే నవమాలికా మణ్డపే నలినీపత్రభాజనగత ముదకం తవ హస్తే సంనిహిత మాసీత్.

వచించుచున్నదనుట కావంతయైన సందేహములేదు. కాన రాజు వివాహమైన మరునాడే తన నగరమునకు వెడలలేదు. రాజు శకుంతలను పరిహసించుచు నామెతో పైన వర్ణించినట్లు సరసములాడుట కామెతో బాగుగ మచ్చికపడి యుండవలయును. కావున వివాహానంతరము రాజాశ్రమముకడ సుమారు పదునైదుదినము లుండి యుండవలెను.

తృతీయాంకమునకును చతుర్థాంకపు విష్కంభమునకును నడుమ సుమారు నెలాపదునైదు దినములు గడచినవి యను యం. ఆర్. కాలెగారి వాదమును సమంజసముగ లేదు. ఏలన: ఇతనివాదము ననుసరించిన దుష్యంతుడు కణ్వాశ్రమమున రెండునెలల కాల ముండినట్లగును. రెండునెలలు 'కొలదిదినము'లా?

కనుక తృతీయాంకము జరిగి సుమారు పదునైదు దినముల వెనుక చతుర్థాంకపు విష్కంభము జరిగియుండవలెను.

౫. రీడరుగారు, 'పై విష్కంభమున చెలులు తాము కోసినపూలతో గ్రుచ్చినదండను శకుంతల చతుర్థాంకమున ధరించియున్నది' అని యెట్లూహింపగలిగిరో! ఈవిష్కంభము నెన్నిమార్లు చదివినను చెలులు శకుంతలకు దండగా గ్రుచ్చుటకై పూలు కోయుచున్నారని తెలియుటలేదు. వారు బలికర్మమునకును, శకుంతల యొక్క సౌభాగ్యదేవత నర్చించుటకును మాత్రము పూలుకోయుచున్నట్లే తెలియుచున్నది. అయిన రీడరుగారి కీయూహ యెట్లు కలిగెను? ఒకవేళ చతుర్థాంకమున (విష్కంభమునకాదు) ౧౧ "అట్టయినచో మాతశాఖకుం దగిల్చిన కొబ్బరియాకులబుట్టలో నెన్నిదినములైన (వాసనచెడక) నుండు పొగడపూవులదండ నామెకొఱకు నుంచితిని" అను అనసూయ మాటలను చూచి పొరబడిరేమో! ఇట్లు పొరబడియుండిరేని వీరు విమర్శకులహద్దును దాటిన వారగుదురు. కనుక వీరి మొదటివాదమున కర్థములేదు.

ఇక 'గౌతమికి కండ్లు లేకపోయెనా' యను వాదమును పరిశీలింతము. రామ, రామ! ఆమెకు కండ్లు లేకేమి? మఱియు గౌతమికి శకుంతల గర్భము ధరించియున్నదని తెలియును. శకుంతల యెవరిని పెండ్లాడినదియు బహుశః చెలులవలన తెలిసికొనినది. దీనివలన కలుగు లోటేమి? చెలులకు తెలియదా? చెలులకు సమానముగను, కాకున్న నెక్కుడుగను గౌతమి శకుంతలను ప్రేమించుట లేదా? చెలులవలె నీమెయు వలయునెడ నీవృత్తాంతమును కప్పిపుచ్చియుండదా? కాశ్యపు లీవృత్తాంతమును విని యేమందురో యను భియమా? ౧౨ "గుణవంతునికిం గన్య నీయవలయుననికదా ప్రథమసంకల్పము. దానిని దైవమే సమకూర్చినప్పుడు తండ్రిగారాయాసపడకయే కృతార్థులైనారుగదా" అను ఊరట గౌతమి కేల కలుగదు? రీడరుగారి దీవిషయమున నిలువని వాదము.

ఇంతకుముం దుదాహరించిన ఎం. ఆర్. కాలెగారి వాక్యములను పరిశీలింతము. వీరిమాటలవలన రాజు తృతీయాంకము ముగిసినవెనుక యాశ్రమమున నుండినది నెలాపదునైదు దినములని తెలియుచున్నది. రాజు నగరమునకు వెడలిన పదునైదు దినములకు (సుమారు) శకుంతలయు నాశ్రమమునుండి బయలుదేరుచున్నది. రాజు తృతీయాంకము జరిగిన నాటిరాత్రియే లతాగృహమున శకుంతలను కూడియుండిన, ప్రథమసంగమముననే శకుంతలకు గర్భము నిలిచియుండినను పంచమాంకమున శకుంతల సుమారు రెండునెలల గర్భము ధరించి యుండును. ఈరెండునెలలగర్భము శకుంతలకు తెలియగలదు. ఈ విషయములం దారితేరిన యమ్మలక్కలకుకూడ రెండు నెలలగర్భము సుమారుగనే తెలియగలదు. ఇంతకు వీరును ముట్టు నిలిచినప్పటినుండియే లెక్కవేసి తెలిసికోగలరు. ఈవిషయమున నమ్మలక్కల స్థితికూడ యిట్లున్నది.

---

౧౧. తేన హ్యేతస్మిం శ్చూతశాఖావలమ్బితేనాలికేరసముద్గక ఏతన్నిమిత్తమేవ కాలాన్తరక్షమా నిక్షిప్తా మయా కేసరమాలికా.

౧౨. గుణవతే కన్యకా ప్రతిపాదనీ యేత్యయం తావత్ప్రథమః సంకల్పః, తం యది దైవమేవ సంపాదయతి నన్వప్రయాసేన కృతార్థో గురుజనః.

ఇంక పంచమాంకమున రాజుగతి చూడుడు. అతనికి శకుంతలను ముందెన్నడును చూచినట్లుకూడ తోచుట లేదు. ఇతనిస్థితిలో నమ్మలక్క లుండినను కూడ శకుంతలను చూచి వారేమియు తెలిసికోలేరు. అయినను రాజునకు శకుంతల 'స్పష్టముగఁ గనఁబడుచున్న గర్భచిహ్నములుగల' యామెగా కనబడుచున్నదే. శకుంతల యిప్పటున సుమారు నాలుగైదు నెలల గర్భముధరించి యుండినదే రాజునకు పైజెప్పినట్లు కనబడగలదు. కాళెగారి వాదమును నీయెడ పనికి వచ్చుటలేదు. కనుక చతుర్థాంకమునకును విష్కంభమునకును నడుమ సుమారు నాలుగు నెలల పదునైదుదినములు గడచియుండవలెను.

౬. రీడరుగారు తేల్చుకొనిన యారవవిషయము సమంజసముగ నున్నది.

౭. ఇక వీరి యేడవవిషయమును పరిశీలింతము. ఇందు వీరివాదమును చూచినచో వీరికి కణ్వుని శీలము బోధపడినట్లు తెలియుటలేదు. 'కణ్వుడు శకుంతల మగనింటి కేగుటను తలపువలననే బెంగపడిన మృదులహృదయుడుకదా! శకుంతల యతనికి ప్రాణముకదా! అట్టి శకుంతలను రాజు నిరాకరించుటచే నతనిపై కణ్వుని కేల కోపమురాదు' అని వీరు తలచినట్లున్నది. కణ్వుడు మృదులహృదయుడే. శకుంతల యతనికి ప్రాణమే. కాని శకుంతలను నిరాకరించెనని యతడు రాజుపై కినియఁడు, కినియను పనియుండదు. ఏలన: [౧౩] "తపఃప్రభావమువలన నామహానుభావునకు సర్వము ప్రత్యక్షమే" యనుటవలన నతనికి దూర్వాసుని శాపము తెలిసియే యున్నది. రాజు శాపబలముననే శకుంతలను నిరాకరించెననియు నతనికి సువిదితమే. ఇంత తెలిసియుండియు నతడు రాజునకు 'ఘోరశాప' మిచ్చియుండిన నతనికిని దూర్వాసునికిని గల భేదమేమి? ఇక 'ఎట్లున్నను శకుంతలకు తత్క్షణమే సుఖము కలిగించి యుండడా' యనుటను విచారింతము. శకుంతలను రాజు పెండ్లాడలేదనుచున్నాడు. లోకులకును యథార్థము తెలియకున్నది. కణ్వునికిని, చెలులకును, గౌతమికిని, యాశ్రమవాసులకు కొందఱికిని మాత్రము నిజము తెలియును. లోకన్యాయ మెట్లున్నదో చూడుడు:—

[౧౪] "అధిపుఁడాడినయట్లు నీవైతివేని, తప్పినడచిన నీవు నీతండ్రికేల?" సామాన్యజనులకంటె మహనీయులకు లోకులయెడ భయభక్తు లెక్కువ. మహనీయులకు ప్రజారంజనము పరమోత్కృష్టకృత్యము. ప్రజారంజనమునకేకదా శ్రీరామచంద్రుడు "తుదకు జనకసుతనైన విడనాడుచో వెనుకాడబోను" అని పతివ్రతాశిరోమణి యగు సీతను, నిండు చూలాలై యుండియు, నడవుల కంపెను! కనుకనే మహనీయుడగు కణ్వమునీంద్రుడు తలరాత తప్పింపరానిదని యెఱిగి ప్రజారంజనార్థము శకుంతల కేసుఖమును కలిగింప యత్నింపడయ్యెను. మఱియు నతడట్లు యత్నించియుండెనేని దూర్వాసుని వాక్యముల నవమానించినవాడగును.

ఇక రాజుశీలమునకు వచ్చు కళంకమును చూతము. శాపము ముగిసినప్పటినుండి రాజెట్లుండెనో షష్ఠాంకమున చక్కగ వర్ణింపబడియున్నది. అతడు కొలువిచ్చుటకూడలేదు. శకుంతలానామస్మరణమే యతని లోకమై యున్నది. శకుంతలను నిరాకరించినందుల కతడూరక ఆత్మనిందచేసికొనుచున్నాడు. ఇట్టిస్థితిలో నతనికి కణ్వుని సందర్శించి యతని మన్ననవేడవలయునను తలపెట్లు రాగలదు? ఇట్టితలపు రాకుండుటయే యతని శీలమునకు కళంకము తెచ్చినచో నాకళంకము శీఘ్రములో మటుమాయమైనది. ఎట్లన: సప్తమాంకమున మారీచునితో రాజు [౧౫] "ఈమెను స్మృతిశైథిల్యమువలన నిరాకరించి మీసగోత్రీకుఁడైన కణ్వునికి నపచారమొనర్చితిని" అనుచు మనఃపూర్వకముగ తన తప్పిదమునకు పశ్చాత్తాప పడుచున్నాడు. మనఃపూర్వక పశ్చాత్తాపమునెదుట పై స్వల్ప కళంక మెట్లు నిలువగలదు?

౧౩. తపఃప్రభావాత్ప్రత్యక్షం సర్వమేవ తత్ర భవతః.

౧౪. యది యథా వదతి క్షితిప స్తథా, త్వమసి కిం పితు రుత్కులయా త్వయా.

౧౫. స్మృతిశైథిల్యాత్ప్రత్యాదిశ న్నపరాధోఽస్మి తత్రభవతో యుష్మత్సగోత్రస్య కణ్వస్య.

మాతలిదుష్యంతుల సంభాషణ నించుక పరికింతము. రాజు, ౧౬ "మాతలీ! నాఁడు రాక్షససంహారోత్సుకత్వమున, దివంబధిరోహించునపుడు స్వర్గమార్గమును జూడలేదు"అనియే చెప్పుచున్నాఁడు. 'నాఁడు' అనునది రీడరుగారి కొకవేళ'నిన్న'యని కనిపించినదేమో!

సప్తమాంకమున భరతుని చేష్టలను మాటలను చూచినచో వాని కధమపక్షము ఐదేండ్లుండవలయునని తెలియుచున్నది. ఈయైదేండ్లే రెండంకముల నడుమ గడచియుండునని విచారించుచు కాళెగారిట్లు వ్రాయుచున్నారు: ౧౭ "షష్ఠాంకము స్పష్టముగ వసంతఋతువును సూచించుచున్నది. కనుక మొదటియారంకములు నేఁడాదికంటె తక్కువగు కాలమున జరిగినవి. రాజు భరతుని కలసికొనునప్పుడు వానికి సుమారైదేండ్లుండెనని సప్తమాంకమునుండి తెలియుచున్నది. కనుక సప్తమాంకమునందలి కార్యములన్నియు పైరెండంకములకు నడిమి కాలమును సూచించును." వీరిమతమున షష్ఠ సప్తమాంకములకు నడుమ నైదేండ్లు గడచినవి. షష్ఠాంకమున సానుమతి, ౧౮ "నేనిప్పుడే యీతని నానందింపఁజేయుదును. ఏల! 'యజ్ఞభాగములం దాసక్తులైన దేవతలే శీఘ్రకాలములో ధర్మపత్నివగు నిన్ను నీభర్తకడఁ జేర్చెద' రని శకుంతల నాశ్వాసించుచుండిన యింద్రజనని నోటినుండియే వినియున్నాను" అనుచున్నది. ఐదేండ్లు 'శీఘ్రకాలమా'? మఱియు రాజునకు స్వర్గమున నైదేం డ్లేమి పని? కాన కాళెగారి వాద మిందు పొసగదు.

ఇకనీయైదేండ్లు షష్ఠాంకప్రవేశక షష్ఠాంకముల నడుమ గడచియుండవలెను. ఈయూహ పొసగునేమో చూతము. షష్ఠాంకమున రాజు, ౧౯ "ఆమెను నిరాకరించిన సమయమున నీవు నాసమీపమున లేవుకాని దానికిఁ బూర్వమునందైనను నాతో నామెపేరు నుచ్చరింపనైనలేదు. నావలెనే నీవును మఱచి పోతివా 'యేమి?" అని విదూషకు నడుగుచున్నాఁడు. రాజున కిట్టి సందేహ మైదేండ్లకా వచ్చును? ౨౦ "ఇపుడు శకుంతల ప్రథమదర్శనమును గూర్చినదంతయు జ్ఞాపకమునకు వచ్చుచున్నది" అని యత డైదేండ్లకా యనును? కాన నీయూహయు పొసగదు.

ఈయైదేండ్లు షష్ఠాంకప్రవేశకమునకును పంచమాంకమునకును నడుమ గడచెనేమో చూతము. ఈయభిప్రాయమున కేగొప్పయాటంకమును కలుగుటలేదు.

నాటకము జ్యేష్ఠద్వాదశినాఁ డారంభమగుచున్నది. షష్ఠాంకము వసంతఋతువున జరుగుచున్నది. పంచమాంకముకడపటివఱకై దున్నర నెలలైనవి. మిగిలిన నాలుగున్నర నెలలతో, శకుంతలకు గర్భమునిండి భరతుని కైదేండ్లగుటకు వలయు నైదేండ్లయైదునెలలను చేర్చినచో సుమారారేండ్లగుచున్నది. ఇందు ఐదేండ్ల పదునొకండునెలలు

---

౧౬. మాతలే, అసురసంహారోత్సుకేన పూర్వేద్యుర్దివమధిరోహతా న లక్షితః స్వర్గః.

౧౭. "The Sixth Act evidently refers to the spring season, so that the first six Acts cover a period of less than a year. From the Seventh Act it appears that Bharata was about five years old when the king meets him. The incidents mentioned in the Seventh Act therefore relate to a time between the two periods mentionedabove."——M. R. Kale.

౧౮. అహ మిదానీమేవ నిర్వృత్తం కరోమి, అథవా శ్రుతం మయా శకున్తలాం సమాశ్వాసయన్త్యా మహేంద్ర జనన్యాముఖా యజ్ఞ భాగోత్సుకా దేవా ఏవ తథానుష్ఠాస్యన్తి యథాచిరేణ ధర్మపత్నీం భర్తాభినందిష్యతీతి.

౧౯. స భవా న్ప్రత్యాదేశవేలాయాం మత్సమీపగతో నాసీత్, పూర్వమపి నత్వయా కదాచి త్సంకీర్తితం తత్రభవత్యా నామ, క్వచి దహమివ విస్మృతవానసి త్వం.

౨౦. సర్వ మిదానీం స్మరామి శకున్తలాయాః ప్రథమ వృత్తాన్తం.

పంచమాంకమునకును, షష్ఠాంక ప్రవేశకమునకును నడుమ గడచెననియు, మిగిలిన యొక నెలలో కొన్ని దినములు ప్రవేశకమునకును, షష్ఠాంకమునకును నడుమనుండె ననియు, కొన్ని దినముల వ్యవధి షష్ఠసప్తమాంకములకు నడుమ నుండెననియు గ్రహింపవలసి యున్నది.

ఈవ్యాసమునందలి నావాదములయందు తప్పు లేవైననున్నచో పండితులెవరైన వానిని చూచి యీపత్రికమూలముననే నాకు తెల్పినచో వారి కెంతయు కృతజ్ఞుడనై యుందును.

---

## కోట్లు, షరాయీల సంయోగము




---

# అభినవాంధ్ర కవితాపితామహుని కవితావినోదములు

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

బ్రహ్మశ్రీ పార్వతీశ్వరకవిగారు తమ స్వీయచరిత్రమున నిట్లు వ్రాసికొన్నారు:

సీ. ప్రభవసంవత్సరప్రారంభమున, భవత్
ప్రేరణంబునఁ జేసి విజయనగర
మున కేఁగి, యచ్చటఁ బులిగడ్డకులజుఁడౌ
నరుణాచల కవీంద్రు పురుషకార
గతి శ్రీమ దానంద గజపతిరాజ మ
హారాజసన్నిధి నధిగమించి,
కవితాచమత్కార గౌరవలాభంబుఁ
జెంది, సంవత్సరం బందె యుండి,
కార్యసాఫల్యవేళ కాకస్మికముగ
వార్త రా వెంట నింటికి వచ్చినపయి
నిజపితామహి మృతిమిష నిలిపి తౌర,
హరిహరేశ్వర దేవ మహానుభావ.

భోజుని యనంతరము శ్రీకృష్ణదేవరాయలును, నాతని యనంతరము తంజాపూరి రఘునాథరాయలును నధిష్ఠించియుండిన భౌతిక సామ్రాజ్య కవితాసామ్రాజ్యనామక సామ్రాజ్యద్వయ సింహాసనము నానందగజపతి యొక్కఁడే యధిష్ఠింపఁగలిగెను. 1897-వ సంవత్సరమున నానందగజపతి మరణించినది మొదలు నేఁటిదనుక నట్టివిద్వత్ప్రభు వాంధ్రదేశమున జనింపలేదు. అట్టి విద్వత్ప్రభువులసన్నిధికి పార్వతీశ్వరకవిగారు ప్రభవసంవత్సరమునఁ బోయి, యొక్కసంవత్సర మందుండి, కవితాసామర్థ్యముచే వారికి వినోదము కలిగించిరి.

శ్రీమ దానందగజపతి మహారాజసన్నిధిని పార్వతీశ్వరకవిగారు రచించిన పద్యములలోఁ గొన్నిటి నిందు వ్రాయుచున్నాము:

శ్లేష - తెలుఁగుపద్యము

క. అప్ప్రదుఁ డగు మేఘుఁడు, బలి
కుప్రదుఁ డగు, ఖేచరుం డగు నసుప్రదుఁ, డ
క్షిప్రదుఁ డగు నర్కుఁడు నం
దప్రదునకు సాటి యనఁగఁ దగునే వీరిన్.

సభంగాభంగశ్లేష - శ్లోకము

శ్లో. రంభాదిపం-కందర-మంగజంచ
తేజోయశోంగై-ర్మతిధైర్యదానైః,
సంపద్బలాత్యైః క్రమతో విజిత్య
శ్రీమన్మహానందవిభు ర్విభాతి.

సమస్యాపూరణము

శ్లో. విముచ్య-తే-మాన రసావలంబం
ప్రపశ్య బింబోష్ఠి వినావిలంబం,
నిపీత శేషాసవ సానుబింబం
పిపీలికా చుంబతి చంద్రబింబం.

పార్వతీశ్వరకవిగారికవిత్వమునకు ఆనందగజపతిప్రభువు లమితానందము నందుచుండిరి. ఒకదినమునఁ బండితసభలో ఆనందగజపతిప్రభు లీ క్రిందిసమస్య నిచ్చిరఁట:

విరిగోల లేయ, లే
యన్నవ తాళఁజాల కహ
హా యని తల్లడ మందె నెంతయున్.

ఆస్థాన విద్వత్కవులలో నగ్రగణ్యులును, శృంగారకవిత్వమునఁ బెట్టినది పేరుగా నున్న వారును, భగవత్కవులును నగు శ్రీమాఱ్ఱముడుంబై నరసింహాచార్యులుగారు,

ఉ. వెన్నెల గాయఁ గాయజుఁడు
వేమఱు మై విరిగోల లేయ, లే
యన్నవ తాళజాల కహ
హా యని తల్లడ మందె నెంతయున్.

అని యింతవరకే తమకుఁ దోఁచె ననియు, మిగిలినది పార్వతీశ్వరకవిగారు పూరింపవలె ననియు సెలవిచ్చిరఁట. వెంటనే పార్వతీశ్వర కవిగా రిట్లు పూరించిరి:

ఉ. క్రొన్ననఁ గోయఁ గోయనుచుఁ
గోయిల కిన్నెఱఁ జేయఁ, జేయటుల్
కిన్నెరఁ బాయఁ బాయసము
కీల్కొని పొంగిన చాయ చాయలన్
వెన్నెలఁ గాయఁ గాయజుఁడు
వేమఱు మై విరిగోల లేయ, లే
యన్నవ తాళఁజాల కహ [గ౯.
హా యనె మై మరుమాయ మాయఁ

పార్వతీశ్వరకవిగారి యీసమస్యా పూరణమున రెండు విశేషము లున్నవి.

(1) సమస్యలోని ముక్తపదగ్రహణ రూప చిత్రమును గ్రహించి, దాని ననుసరించియే పద్య మంతయు పూర్తిచేయుట.

(2) సమస్యలోని యుత్తరభాగమునఁ గల "తల్లడ మందె నెంతయున్" అనుదానిని, "మై మరుమాయ మాయఁగన్" అని మార్చి, పద్యము సమస్యలోని భావము చెడకుండ, ముక్తపదగ్రహణము విడువకుండ రచించుట.

పార్వతీశ్వరకవిగారి యీ సమస్యాపూరణము నరసింహాచార్యులుగా రనుకొన్న దానికన్న మిన్నయై యానందగజపతివంటి విద్వత్ప్రభువుల భావమునకు మెఱుంగు పెట్టినది. కావున, నాఁటి సభలో నున్న విద్వాంసులును, విద్వత్ప్రభువులునుగూడ నాశ్చర్యపడుట వింత కాదు గదా.

కాని, పార్వతీశ్వర కవిగారు విజయనగ రాస్థానకవిగా నుండుయోగము సంప్రాప్తించినది కాదు. వారి కవితాకల్పలత వేఱొకచోఁ బల్లవితమై, కుసుమితమై, ఫలితము కావలసి వచ్చినది. అది మున్ముందు వివరింతుము.

# నన్నయ యతులు - కొన్ని గతులు

విమర్శాదర్శక, వీరరాజు పంతులుగారు

(నవమసంపుట ద్వితీయసంచికా శేషము.)

## ౬. మువిభక్తియతులు

భట్టారకకవీంద్రుని భారతరచనమునాఁటి కాంధ్రకవిత్వమున కేర్పడియున్న యతులలో నెల్ల 'మువిభక్తిక యతి' యతి చిత్ర మైనది. మఱియు, విమర్శనీయ మైనది. ఏమన,

ప్రాచీన కవిమతమున మకారము 'ఏకతరయతి*' గణమునందు చేరియున్న ప్రత్యేక వర్ణము. ఆగణమునకు విధింపఁబడియున్న నియమము ననుసరించి (మకార గుణితాక్షర మగు) ము వర్ణమునకు—ము, మూ, మొ, మో—లతోఁ దక్క వేఱొకయక్షరము దేనితోడను యతిమైత్రి లేదు. కాని, యీ ముకారము ప్రథమావిభక్తి ప్రత్యయనామమున వేఱొకయవతారము నెత్తి పవర్గ సంజాతము లగు 'పు, ఫు, బు, భు,..........భో' లతో వడినెయ్యము సాగించుకొనుచున్నది! చూడుఁడు :—

"పురమువెలి మూఁడహోరాత్రములు వసించి."
—అరణ్య. ద్వి. ౬౫.

"బోరనఁ దా నగ్నిసూక్తములతో సెగసెన్."
—ఆది. ద్వి. ౩౮.

"దర్శనమును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించుటలెన్."
—సభా. ద్వి ౧౪.

"భువనంబులయందు సర్వములు ద్రిమ్మరు న్."
—ఆది. ద్వి. ౧౪.

పైప్రయోగములలోని యతిస్థానములను బరీక్షించువారికి, పుభ్వాదులకును, ముకారమునకును గల యతిస్నేహము విశదము గాఁగలదు. మఱియు, "ప, పా, పై, పౌ, బ, బా, ......భౌ' లతో మకారమునకుఁగాని, 'పి, పీ, ...బి, బీ,...బే, భే' లతో మివర్ణమునకుఁగాని లేని యతిమైత్రి పు, ఫు, బు, భ్వాదులతో మువర్ణమునకు మాత్రమే కలుగుట (శృంగ ప్రాప్తిచేతఁ గాఁబోలు నని భావించునంతటి) యాశ్చర్యమును బొడమించును. ఈ విచిత్ర సంఘటనమునకుఁ గల మూలకారణమును గ్రమముగ నారయుదము.

ఆంధ్రభాషయందు గల విభక్తిప్రత్యయ సముదాయములో మువర్ణ మొక్కటిగదా! తత్సమతద్భవాది శబ్దసంకలిత మగు నీభాష యందది యిరుదెఱఁగులఁ బరగుచున్నది:—

(౧) గీర్వాణశబ్దము తెలుఁగులోనికి గ్రహింపఁబడునప్పుడు దానితుదను జేర్పఁబడు

* మ, ర, ఱ, ల, వ—ఇవి యేకతరయతులు. వీనిలో నేయక్షరమున కాయక్షరముతోనే యతి. (చూ. భారతి, ౯ సంపు. ౨ సం.)

ముకార మొకటి—ఘటము, ఘనము, వరము మొదలగువానిలోనిది.

(౨) తెలుఁగు నుడులతోనే పుట్టి వాని కడపటఁ గన్పట్టునది యింకనొకటి—అందము, బెల్లము, కలము లోనగువానిలోనిది. *

పూర్వోదాహృత పద్యపాదముల యతి స్థానములయం దుండి పుభ్వాదులతో మైత్రి నెఱపు ముకారము లన్నియు, సంస్కృతపద ముల కడపటఁ జేర్పఁబడిన ప్రత్యయ ముకార ములే. దేశ్యపదముల చివర నుండు ముకార ములు నయితము పుబ్వాదులతోఁ బొత్తునే యుచున్నవి:—

"మాయయ్య యెవ్వ రెక్కడఁ
బోయిరి సెప్పు మని తెల్లముగ నడిగి తప
శ్శ్రీయుతుఁడు దండ్రి కడకుం
బోయెం దనయల్లు నెయ్యమునఁ దోడ్కొనుచున్."
—ఆర. తృ. ౨౪౨.

నన్నిచోడ కవిరాజశిఖామణి కుమా రసంభవ మహాకావ్యమునఁ దెలుఁగుపదముల కడపటి ముకారమునకును, బుభ్వాదిగణమున కును యతిని గూర్చిన ప్రయోగ మొక్కటి యుఁ గానరాలేదు. నన్నియభారతమునందైనఁ బైపద్య మొక్కటియే యివ్విషయమున లక్ష్య ముగా గోచరించినది. తిక్కనభారతమువంటి గొప్పగ్రంథమున,

"పురుషున కిత్తెఱఁగు తెల్లముగ వినవలతున్."
—శాంతి. చ. ౭౦.

అనునది యొక్కటియే యగపడినది. ఆరణ్యపర్వోత్తరభాగమునందును నిట్టివి యొం డు రెం డుదాహరణములకంటె నెక్కుడుగఁ జిక్కవు. ఇట్లే సర్వజ్ఞకవి యుత్తరహరివంశ మున నొక్కప్రయోగమే చూపట్టుచున్నది. మొత్తముమీఁదఁ బ్రామాణికాగ్రగణ్యు లగు కవిచంద్రుల కోశములయందు దెలుఁగుపద ముల తుదిముకారములకుఁ బుభ్వాదులతోడి యతిమైత్రి గలప్రయోగము లరుదుగనే యున్నవి. కాని, పురాతనలక్షణగ్రంథ మగు కవిజనాశ్రయమున నున్న,

"పోలికవడి శీల ముల్లమున కెనయనఁగాన్."

అను నిరాఘాటలక్ష్యము ముకార మం తమందు గల శుద్ధాంధ్రపదముతోఁ గూడి నదియే మై యున్నది!

ఈరీతిని మువర్ణకమునకును, బుభ్వాది గణమునకును గల పొందును బట్టియే మన పూర్వలాక్షణికు లిట్టియతికి 'మువిభక్తియతి' యని ప్రత్యేకనామకరణము నొనర్చిరి. మఱియు దీనికి, "ముకారయతి; † పోలికవడి" యను నామాంతరములు గలవు.

---

* ముకార మంతమందు గల యాంధ్రశబ్దములకు విభక్తిప్రత్యయముగ వేఱొక మువర్ణమును జేర్పవలసిన యక్కఱ లేమింజేసి మనపూర్వులు తత్పదాంతముకారమునె ప్రత్యయముగ గ్రహించిరి.

† విన్నకోట పెద్దనామాత్యుఁ డీయతిని 'ముకారయతి' యని వ్యవహరించెను. ముకారమనఁ బ్రత్యయ ముకార మనియే యాతనియాశయ మైన ట్లాతనిలక్ష్యములవలన గ్రహింపవచ్చును.

ఈ సమయమున నివ్విమర్శమునకుఁ దగిలివచ్చు విషయము నొకదాని నిచ్చటఁ దెలుపవలసియున్నది. అది యేది యన,

మన ఛందశ్శాస్త్రమున జాతిలాఁతిభేదములచే వకారము రెండు విధములు గలదిగాఁ బరిగణింపఁబడినది. అట్లే తెలుఁగుముకారమ సయిత మిప్పుడు ద్వివిధముగఁ బరిగ్రహింపఁ బడవచ్చును :—

ముదము — ఈ శబ్దములోని మొదటి యక్కరము జాతిముకారము; కడపటిది విభక్తి (లాఁతి) ముకారము. ప్రత్యయ (విభక్తి) ముకారమునకే కాని జాతిమువర్ణమునకుఁ బుభ్వాదులతో యతిమైత్రిఁ గూర్చుట ప్రాచీన కవిసమ్మత మైనట్లు దోఁపదు. నన్నియ భారతమున నిట్టి యతి లేదు. కావున,

"పురుహూతుం డరిగె నతత ముద మెదఁ బొదలన్."

అను నిట్టి యతి మువిభక్తికయతి గామింజేసి చెల్ల నేరదు. కాని,

"పురుహూతుం డంత మోదమునఁ బనివినియెన్."

అనుదానిలోని యతి యట్టియతి యగుటం జేసి చెల్లఁగలదు.

మఱియు, జాతిలాఁతివాలకు* సనాతనకవిమతమునఁ బరస్పర యతిమైత్రి లేదు గాని పై ముకారద్వయమున కట్టిపొందు గలదు! చూఁడుఁడు :—

"తనుపుచు నుండఁగఁ దత్పుర
మున పణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్."
—ఆది. ప. ౧౫౫.

ఇంతియ కాక,

"మనమునకుం బ్రియమును, హిత
మును, బథ్యముఁ, దథ్యమును, నమోఘమును,..."
—ఆది. తృ. ౨౦౪.

ఇత్యాది విధముగ విభక్తి ముకారము మూ, మొ, మో లతో సయితము చెలిమి సేయఁ గలుగుచున్నది!

పూర్వోక్తరీతిని బుభ్వాదులతో విరామమైత్రి నొందునది ప్రత్యయ ముకారమే కాని కేవల (జాతి) ముకారము గాదని తేలినది. కాని, యిప్పట్టున,

"పు, ఫు, బు, భ్వాదులతో విభక్తి ముకారమును, విభక్తిముకారముతో ము, మూ, మొ, మో లును యతిమైత్రి నొందుచుండఁగా, నట్టి చేరువచుట్టఱికముచుబట్టి పుభ్వాదిగణము (కేవల) ముకారగణముతో నేల పొత్తు సేయరాదు ?"

అను ప్రశ్న మొకటి యుదయింపవచ్చును. †

ఆంధ్రకవిత్వమున కేర్పడియున్న యితర యత్యక్షరములకుఁగల పరస్పరసంబంధములను

---

* 'చేవ' అనుదానిలోనిది జాతివా; 'అతఁడు వలికె' ననుదానిలోనిది (సంధివశమున నైన) లాఁతివా. పురాతనకవిమతమున నీరెంటికిని వడిమైత్రి లేదు. (భారతి, ౯ సం. ౨ సంచిక చూడుఁడు.)

† "Things which are equal to the same thing are equal to one another" అను క్షేత్రగణితసూత్ర మిట యనుకూలపడదు.

బట్టి విచారించుచోఁ బైప్రశ్నము యుక్తి యుక్తముగ నున్నట్లే తోఁచును గాని దీనికిఁ జిత్రమైన సమాధాన మొకటి చిన్నది గలదు. ఏది యన,

విభక్తి ముకారము సమయము వచ్చి నప్పుడు 'ంబు, మ్ము' అను రూపాంతరముల నొందఁగలదు. జాతిముకార మట్లు పొందఁజాలదు! (ముదము = ముదంబు, ముదమ్ము) ఈప్రబలహేతువుచేతనే ప్రత్యయముకారము బువర్ణమిత్రంబు లగు పుభ్వాదులతో విరామ సౌహార్దము ననుభవింపఁగలుగుచున్నది. జాతి ముకారమున కట్టిశక్తి లేమింజేసి యది వానితో స్నేహము సేయలేదు.

మువర్ణకమున కట్టి యన్యాక్షరరూప ధారణము గలుగుటకుఁ గల యాదికారణమును బరామర్శించుచో నదిపై సమాధానమునకు వివరణము గాఁగలదు.

ఇప్పుడు మనచే విభక్తిప్రత్యయముగా గ్రహింపఁబడుచున్న ముకార మంతమందు గల పదములు, అత్యంతప్రాచీనకాలమునందు 'మ్బు (= ంబు)' వర్ణము కడపటఁ గలవియైయుండినట్లు గన్పట్టుచున్నవి. ప్రాచీనశాసనములలోని వ్రాఁత లివ్విషయమును ధ్రువపఱుచుచున్నవి.

అమ్బు (అంబు), ఇమ్బు (ఇంబు), మొదలగునవి యిప్పటికిని నిల్చియున్నవి.

"తూమ్బు, నోమ్బు, పామ్బు" ఇత్యాదులు కాలక్రమమున నుచ్చారభేదముచే నథస్థితవర్ణములను బాసి "తూము, నోము, పాము" ఇత్యాదిగ వ్యవహరింపఁబడుచున్నవి. తమిళభాషయం దివి యిప్పటికిని "తూమ్బు, నోమ్బు, పామ్బు" అను రూపములతోనే యున్నవి! కర్ణాటకభాషయందును "తుమ్బు, తూబు, నోమ్బు" అనునవి గలవు.*

పది + తూమ్బు = పన్దుమ్బు — ఇది ప్రాచీనకాలపురూపము. (పెట్లూరి శాసనము— నెల్లూరి శిలాతామ్రశాసన సంపుటము.) పందుము — ఇప్పటిరూపము. ఇట్లే ఏను + తూమ్బు = ఏన్దుమ్బు = ఏఁదుము, &c.

అమ్బు, ఇమ్బు మొదలగువానిలోని 'మ్బు'లు హ్రస్వాక్షరపూర్వకము లగుటచేఁ

---

* అనేకశబ్దము లఱవమునుండియుఁ, గన్నడమునుండియుఁ దెలుఁగునఁ జేరియున్న వని కొంద ఱందురు. దాక్షిణాత్యభాషల కన్నిటికిని దల్లిభాష యొకటి చిరకాలముక్రిందట నుండెడి దనియు, నానాముఖములఁ జెదరిపోయిన జనుల యుచ్చారణములు కాలక్రమమున మాఱి భిన్నభాష లేర్పడియె ననియు, ద్రావిడాదిభాషలలోని సమానపదములు పూర్వభాషలోనివే యనియు, స్వల్పభేదములు గలవి కాలగతిచేఁ బలుకుబడులు మాఱఁగా నేర్పడినవై యున్నవనియుఁ గొంద ఱందురు. వీరివాక్యములే సమంజసములై యున్నట్లు దోఁచెడిని. లేకున్నచో, ఆడు, ఆఱు, కై, నెత్తి, పాడు, పాలు మొదలగునవి యితరభాషలలోనుండియే మనభాషలోనికి వచ్చియుండెనేని యిఁక నంధ్రభాష యను నామ మేఁటికో! ఇట్టి పదములకు బదులుగఁ దొంటి తెలుఁగున నేయేమాట లుండెడివో వారు చెప్పరేమో! తెలుఁగుబాసయే లేదా?

గాలక్రమమున 'అమ్ము, ఇమ్ము' ఇత్యాదిరూపములను దాల్చినవి. దీర్ఘాక్షరపూర్వకము లగుట నోమ్ము ప్రాదులకు ద్విత్వము రాక బకారము లోపించి "నోము..." ఇత్యాదు లయ్యెను.

ఎమ్ము — ఇది శిష్టజనవ్యవహారమున లేమిని, గ్రంథములఁ బ్రయుక్తముగామిని నిఘంటువుల కెక్కక ఎమ్ము మాత్రము నిల్చెను. నెమ్బు (నెంబు) వ్యవహారమున నున్నను 'నెమ్ము' లనురూపమే నిఘంటువులఁ జేరెను!

గారామ్బు—ఇవి యూర్ధ్వాక్షర మెడసి 'గారాబు' ను, అధోవర్ణము తొలఁగి 'గారాము' నైనది.

ఇట్లే గ్రంథస్థములు గాకయు, గ్రంథస్థములై యుండియు వ్యవహారమున లేకయు నానావిధరూపములను దాల్చియున్న పదములిట్టివే కొన్ని యీవిశాలాంధ్రదేశమునఁ గల పలుకుబడులనుబట్టియు, నితరకారణములను బట్టియు నింకను బరిశీలింపఁ బడవలసియున్నవి. ఉదా:—

గినుము, గిలుబు—అనునవి దేశ్యవిశేష్యములుగా శబ్దరత్నాకరమునఁ గలవు. కాని యవి యుదాహరణరహితములుగా నున్నవి. ఇవి యిట్టివే యని నిర్ధరించుటకుఁ దగిన ప్రయోగములు సయితమాంధ్రగ్రంథములయందు దుర్లభములే! మఱియు నివి, "గినుమాడు *, గిలుబాడు" ఇత్యాది క్రియాపదములనుబట్టి, వానినుండి, (పలుకాడు, కొట్టాడు మొదలగు వానినుండి పలుకు, కొట్టు లోనగునవియుం బోలె) విభజింపఁబడినవిగాఁ దోఁచుచున్నవి.

"చెలువు 'గిల్మాడుకొనిరి' గావలయునేను."

అను ప్రయోగము నన్నిచోడని కుమార సంభవమునఁ జూపట్టుచున్నది. "అన్యభాషాపద దూషితము గానియెడల నన్నెచోడునికవిత్వ ముత్తమమయిన దనియే చెప్పవచ్చును" అని కవిచరిత్రకారునిచే శ్లాఘింపఁబడిన కవనమును జెప్పిన యమ్మహాకవిచంద్రునిచేఁ బ్రయుక్తమైన యీయన్యభాషాపదమునుబట్టి పై శబ్దాదులు విమర్శింపఁబడవలసియున్నవి. కాని, తచ్చర్చ కిది యదనుగామి దాని నిప్పటికి నిలిపి ప్రకృతవిషయము ననుసరించెదను.

నన్నియభట్టారకునకు — నూఱు, ఇన్నూఱు, మున్నూఱు, నన్నూఱు—ఏండ్లకు మున్ను పుట్టియున్న గద్యపద్యమయ శిలాతామ్రశాసనములను బరిక్షించుచోఁ బ్రత్యయముకార మెట్లుండెడిదో తెలియఁగలము. వానిలోనుండి కొన్నిపదముల పూర్వరూపముల నిచ్చటఁ జూపుచున్నాను :—

* "తను నాప్యాయితుఁ జేసి...తల్లింగిను(ఱు?)మాడి..." అనుప్రయోగము, ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము, పూర్వభాగము (పంచ, ౧౯౭ ప.) నుండి శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడినది. ముద్రితగ్రంథములయందు నీపాఠమే కలదు. కాని నాయొద్ద నున్న తాటియాకుప్రతియందును, ఆంధ్రసాహిత్య పరిషత్కార్యస్థానమునఁ గల ప్రతులలో నె ౨౬౩౬ ర (కడపజిల్లా) ప్రతియందును 'తల్లిం గనుమాటి' అనుపాఠ మున్నది. మఱికొన్ని వ్రాఁత ప్రతులయందు 'గినుమాడి' అనియే కలదు. ఇందు లేఖకప్రసాద మేదియో, కవిప్రయోగ మేదియో విచారింపఁదగినదే!

౧. పదేన్దుమ్బు*— పది + ఏను + తూమ్బు. ఇది పైని జూపఁబడిన 'పన్దుమ్బు' వంటిది. (లక్ష్మీపుర శాసనము --- నన్నియకు మున్ను నన్నూఱేండ్లనాఁడు పుట్టిన తెలుఁగు శాసనము — ఇది బ్ర. శ్రీ. వేటూరిప్రభాకరశాస్త్రిగారిచే వెనుక భారతీపత్త్రికయందు ప్రకటింపఁబడినది. ఆసంచిక నాకు లభింపమిఁజేసి దానిసంఖ్య దెలుపఁజాలనైతి.)

౨. *పట్టనబు, సిద్ధాయమ్బు, అపరాధబు, వక్రమ్బు — అహదనకరతామ్రశాసనము. (ఇండియన్ ఆంటిక్వెరీ, 13 వాల్యం.)

3. చేకొని కాచె భూలోక బెఱుంగ— చాళుక్యభీమమహారాజు ధర్మవరశాసనము (గద్యపద్యమయము). దీనియందు పద్యమున్నట్లు కనిపట్టినవారు బ్ర. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. (దీనిని భారతియందు వీరే ప్రకటించినారు. ఈ సంచికయు నాకు లభింపదయ్యెను.) ఇది సీసపాదము నుత్తరదళము. దీని నిప్పటివర్ణక్రమము ననుసరించి, "చేకొని కాచె భూ - లోక మెఱుఁగ" అని పఠింపవలయును.

౪. బలగర్వమ్బొప్పంగం బై లేచి సేన,

౫. కోట్టమ్బులవ్రెణ్డెణ్డు గొని వేంగినాణ్టి.

(అద్దంకి శిలాశాసనము. ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) వారి శాసనపద్యమంజరి.)

పై ౪, ౫ ఉదాహరణములు తరువోజపాదభాగములు. వీనిని "బలగర్వ మొప్పంగ; కోట్టము ల్వంౘ్రెండు గొని వేఁగినాఁటి," అని చదువవలయును. లేకున్న గణభంగమగును.

మఱియుఁ బ్రాచీన శాసనములలోను గొన్నిట నచ్చటచ్చట విభక్తి మువర్ణమును (బింకము, పురము &c. ), వాని ద్విత్వరూపములు (మ్ములు)ను (ఉద్యోగమ్ము &c. ) గాన వచ్చుచున్నవి. కాని యవి మిక్కిలి విరళము గానే యున్నవి. (అట్టియుచ్చారమప్పుడపుడె యాయాప్రాంతములనంకురించుచుండెనేమో ! )

నన్నియభట్టారకునకు (సుమారు) నూఱేండ్ల మున్ను పుట్టిన యుద్ధమల్లుని బెజవాడ శాసనమున నున్న ప్రత్యయముకారము లన్నియు మ్బువర్ణములే ! చూఁడుఁడు :—

"మఠమ్బు, పాపబు, బృందబు, పట్టబు, అశ్వమేధమ్బు, ఫలబు, లింగబఱిసిన, పాపమ్బు, ప్రత్యక్షుబైయున్న, మఠమ్బును, క్రమమ్బున, కలశబిడ్డట్లు."

* ప్రాచీనశిలాతామ్రశాసనములయందు 'బు' వర్ణములు కొన్నిటితలలమీఁద దేవనాగరలిపియందుంబోలె (.) బిందువులు చెక్కఁబడి యున్నవి; కొన్నిట నవి చెక్కఁబడలేదు. ఇతరవర్గాక్షరములు (ముఖ్యముగా చ, ట, త వర్గానునాసికాక్షరములు) బిందుపూర్వకము లగునప్పుడు, తత్తద్వర్గాక్షర సంయుక్తములుగఁ (జాలవఱకుఁ) జెక్కఁబడియున్నవి. (లాఞ్ఛన, రఞ్జన, మణ్డన, భక్తుణ్డు etc.) దానంజేసి బువర్ణములును (బిందు వున్నను, లేకున్నను) 'మ్బు'అని సానునాసికములుగానే ! యుచ్చరింపఁబడవలసియుండును. ఎట్లన, అపరాధబు=అపరాధమ్బు= అపరాధము; పట్టనబు = పట్టనమ్బు = పట్టనము etc.

ఈరీతిని బురాతనశాసనములను బరిశోధింపఁగా వానియందు విభక్తిప్రత్యయము మ్బు (= ంబు), ము, మ్ము — అనురూపములతో నుండినట్లును, వానిలో 'మ్బు' వర్ణమునకే బాహుళ్య మెక్కుడుగ నున్నట్లును గన్పట్టెడిని. 'మ్బు' రూప మధికప్రచారమున నున్న కాలముననే మన యాంధ్రమహాకవులు దానిని సంయుక్తాక్షరముగ గ్రహించి, దాని ము వర్ణమునుబట్టి ము, మూ, మొ, మోల తోడను, బుకారమునుబట్టి తన్మిత్రములగు పుభ్వాదులతోడను యతిమైత్రిని గూర్చుచు వచ్చి రనియుఁ బదంపడి నాయక్షరము మువర్ణముగ నిల్చినను, దరువాతికవులు పూర్వప్రయోగముల ననుసరించి పు, ఫు, బు, భ్వాదులతో దానికి యతిమైత్రిని సంఘటించుచుండిరనియుఁ, గావుననే యప్పుడు 'ము విభక్తియతి' యను లక్షణము నేర్పఱుపవలసి వచ్చె ననియు నూహింప నగుచున్నది. మఱియు 'పోలికవడి' (మ్బువర్ణమును బోలిన ముకారము యతి) యని కవిజనాశ్రయకారాది లాక్షణికు లొనర్చిన నామకరణము పై హేతువువలన సార్థకమగుచున్నది.

భట్టారకకవిచంద్రుని భారతరచనము నాఁటికిఁ బ్రత్యయ మ్బు వర్ణరూపము పోయి మువర్ణకమే యేర్పడియున్న ట్లాతఁడు వ్రాసి చెక్కించిన నందంపూఁడి శాసనములోని 'పల్లము, ముందరము' అను శబ్దములలోని ముప్రత్యయమువలనను, నాతని భారతమువలనను గ్రహింపవచ్చును.

పై వివరణమువలనఁ బ్రత్యయముకారమునకుంబోలె జాతిముకారమునకు రూపాంతరములు లేవు గావున, దానికి పు, ఫు, బు, భ్వాదులతో విరామమైత్రిని సంధానించుట ప్రాచీన కవిమతమై యుండదని స్పష్టమగుచున్నది.

ఇఁకఁ బ్రామాణికకవీంద్రుల గ్రంథములఁ గొన్నిట జాతిముకారమునకును బుభ్వాదిగణమునకును మైత్రి గలిగియున్నట్లు గానంబడు ప్రయోగములనుగూర్చి సంగ్రహముగ విచారింతము.

ఆంధ్రమహాభారతము మొదటి మూఁడు పర్వములయందును జాతిముకార పుబ్వాదిగణములకుఁ బరస్పరయతి మైత్రి గలుగు ప్రయోగములు గోచరింపలేదు. కవిబ్రహ్మభారతమునన్నైన,

"రూ, పులు గనుంగొని మూర్ఛ మునుఁగువారు."

— స్త్రీపర్వ. ద్వి. ౨౨ ప.

అని యానంద ముద్రాశాల యందును, వావిళ్లవారి యచ్చుకూటమునందును ముద్రింపఁబడిన భారతపుఁ బ్రతులందు, ఒక్క ప్రయోగమే కానవచ్చినది. కాని, పూర్వతరముద్రణములు గల ప్రతులయందు వ్రాఁతప్రతులయందుంబోలె,

"రూ, పులు గనుంగొని మూర్ఛఁ బొరయువారు."

అను సరియైనపాఠమే కలదు. ప్రాచీన లక్షణమును దెలుచు నీ 'మునుఁగు' పాఠము చేరుట కెప్పు డేమి మునిఁగినదో కదా!

నన్నిచోడ కవిరాజు కుమారసంభవ మున,

"(౧) మూర్ఛిల్లి పెడఁబాసి పోవ దొండె."

—౭ ఆ. ౯౧౭.

"(౨) త, మ్ములమఁచవిన్ విహంగ గతిఁ బువ్వులతావి..."

౫ ఆ. ౫౯౦.

అనునవి రెండు ప్రయోగములు చూపట్టు చున్నవి. వీనిలో మొదటిదానియందున్న 'మూర్ఛిల్లి' అనునది పరపూరితము. ఏమన, నేఁటి ముద్రితగ్రంథమునకు మూలమైయున్న తంజాపూరివ్రాఁతప్రతియం దిచ్చోట నొకపద మునకు సరిపడునంత స్థలంబు విడువఁబడియు న్నది. కావున నిది కవి ప్రయుక్తము గానే రదు. ఇఁక రెండవప్రయోగములోని 'తమ్ము లము' అనుశబ్దమునకుఁ గవికాలమున 'తంబు లము' అను రూపాంతర ముండియుండును. మఱియుఁ గర్ణాటభాషయందు 'తమ్బుల' శబ్ద మే కలదు. ఒకవేళఁ దద్భాషాపదమునైనఁ దక్కినకర్ణాటకపదములతోపాటు కవి ప్రయో గించియుండును. కావున పు,ములయతి నిదియు సాధింపనేరదు.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునఁ బుభ్వాదు లతోఁ గేవల ముకారమునకు విశ్రమమును గూర్చిన ప్రయోగము నాకుఁ గనఁబడలేదు. సోముని హరివంశమునమాత్ర మొండు రెండు ప్రయోగము లగపడుచున్నవి. కాని యవి కవిప్రయుక్తములని పలుక సాహసింపఁజాలము. ఏమన, నాతనిగ్రంథము చాల శిథిలావస్థ నొం దియున్నది. సంపూర్ణకోశము లభింపనేలేదు! దొరకినభాగమైనను సంతుష్టికరముగ లేదు. పద్యములు, పద్యపాదములు పరులచేఁ బూరిం పఁబడినవే! దీనిచర్చ కిది యదను గాదు. చూడుఁ డొక చిన్నదృష్టాంతము! (నరకుఁడు యాగభాగములకై మునులను బాధించు ఘట్టము.)

క. "మనుజాశను లట! బలు లట!
మును లట! యజ్ఞంబు లట! నమో విశ్వసృజే
విన మెన్నఁడు మున్నిట్టివి!
కనుకనిఁ గొఱ్ఱెవ్వఁ డింటికంబను సేసెఁ."

—ఉ. హ. ప్ర.

ఇట్టి లోకోత్తరపద్యములోని మేలి దగు నాలవపాదము, వీరేశలింగముగారు ముద్రిం పించిన ప్రతియందు

"కన మెవ్వఁడు గొర నిట్టికర్జము సేయన్"

అని కలదు! ఇట్టి సవరణలు గల సర్వజ్ఞ కవి గ్రంథమున పు,ము యతు లుండుట యబ్బు రము గాదు. ప్రామాణికాగ్రగణ్యులలో నొక డైన యీ మహాకవి తన పూర్వుల లక్షణాదు లను బాగుగ గుఱితించి, గ్రంథమును వ్రాసి నాఁడే కాని లక్షణసేతూల్లంఘన మొనర్చిన వాఁడు గాఁడు. కావున నుత్తరహరివంశములోని

"మోదంబారఁగ నట్లు సేయఁ దలఁపన్
భూతేశ్వరుం డంతలోన్."

—మ. ౨౨౨.

"మును వొందిన యొప్పుతోడఁ బురణించెడు..."

—మ. ౨౩౫.

అను ప్రయోగములు శైథిల్యము నొం దిన (కడపటి యాశ్వాస?) భాగమున నున్న

శాంపిల్సు ఉచితము.




## కుసుమాల్ హెయిరాయిల్ (రిజిస్టర్డు)

శిరోజములకు, మెదటికి, శాకములతో చేయబడిన సహజమై నూనె. శిరోజబీజములను కాపాడి, మాడుపట్టును శుభ్రముగాను ఆరోగ్యముగాను ఉంచును. ఇందు చలువనిచ్చుపదార్థములు మిళితమై యుంటచే ఆలోచనాపరుల కద్వితీయముగా పనిచేయును. మంచి పరిమళము గలది.

వెల బుడ్డి 1-కి రు. 1-0-0.  3 బుడ్లు రు. 2-10-0.

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

ఉచిత శాంపిలుకొరకు ఒకఅణా స్టాంపును పోస్టేజినిమిత్తమై పంపుడు.



## కేటి వైట్ రోజ్ హెయిరాయిల్ నెం. 777 రు (రిజిస్టర్డు)

తాజా గులాబిపుష్పముల పరిమళమందు ప్రతిబింబించియున్నది. మెదటికి చలువనిచ్చును. శిరోజములకు మంచి టానిక్. వెల సీసా 1-కి 0-14-0 అణాలు.

వి. పి. చార్జీలు ప్రత్యేకము.

కొనునపుడు నెం. 777 రును గుర్తించి కేటి వైట్ రోజ్ హెయిరాయిలునే కొనుడు.

నమూనాలను అంగీకరింపకుడు.

## కేటి ఓటో రోజ్ నెం. 777 రు (రిజిస్టర్డు)



మంచి తాజా గులాబీపుష్పముల పరిమళము గల యత్తరువు. ఎక్కువకాలము వాసనపోకయుండునట్లు బాగుగా తయారుచేయబడినది. ఒకసారి పరీక్షించిన మీకే తెలియగలదు.

వెల $\frac{1}{4}$ ఔన్సు బుడ్డి రు. 1-0-0.  వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

పోస్టేజినిమిత్తం రెండణాల స్టాంపులను పంపి ఉచితశాంపిలును పొందుడు.



## కామినియా స్నో

శరీరమున కుపయోగించుటకు శాస్త్రీయముగా తయారైనది. మొటిమలు, పొక్కులు, మచ్చలు మున్నగువాటిని తొలగించి, ముఖవర్చస్సులో సౌందర్యమైన నవయౌవనమును నెలకొల్పును. చర్మమును మృదువుగాను, ప్రకాశవంతముగాను చేయును. మనోహరమగు పరిమళము కూడినది.

వెల బుడ్డి 0-12-0 అణాలు.  వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

సోల్ ఏజంట్లు:—ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

నెం. 285, జుమ్మామసీదు, తపాలాపెట్టె నెం. 2082. బొంబాయి.

వగుటచేఁ గవిప్రయుక్తము లని నమ్మఁజనదు. చూడుఁ డీ 'మ ప' ల యతిని !

"మన మభిషేకంబు సేయఁ బాళధరునికిన్."

—మ. ౨౬౩.

ఇట్లే ప్రాచీనకవుల గ్రంథములలోఁ బుభ్వాదులకును జాతిమువర్ణమునకును యతి మైత్రి సేయఁబడినట్లు గాన్పించు ప్రయోగము లొండు రెండు ఉన్నను, అవి శిథిలభాగపూరణములో పు, ము - యతిప్రియులు సవరించినవో నైయుండును గాని కవి ప్రయోగించినవై యుండవు. కావున నట్టియతి ప్రాచీనకవి సమ్మత మని చెప్ప వలనుపడదు.

ఒకానొక యాధునికకవి (బహుగ్రంథకర్త !) తన ప్రథమగ్రంథములోని మ, వ ల యతిని సాధించుటకై నన్నియభారతము, ద్వితీయాశ్వాసము 233 పద్యమునఁ గల

"మునివరు నాస్తికుని ముద
మునఁ దలఁచిన నరకభయము వొందదు జనులన్."

అను ప్రయోగమును జూపెను. ద్వితీయ పాదాది నున్నది విభక్తి ముకారము గావున బువర్ణతుల్యమనియు, దానితో మైత్రి నెఱపు 'వొ' అనునది యాదేశవకార మనియుఁ జెప్పితిని. ఆయన యర్థాంగీకారముతో, 'తిక్కన యిట్టిప్రయోగ మొనర్చినాఁడా ?' యని ప్రశ్నించెను. అప్పుడు,

"ఘోటక,మ్ముల నిలఁ గూలసేయఁ బొలి వోవని..."

—కర్ణప. తృ. ౨౩౩.

అనుదాని నగపఱిచితిని. ఆయన తన తప్పు నొప్పుకొని యట్టియతిని మాను కొనియెను.

---

# ఎంత కాలము ?

మల్లవరపు విశ్వేశ్వరరావు గారు

నాయికా! నా వనాన యనశ్వరములు
నవసుమమ్ములు పూయించినాడ నీకు
దండదండలుగా గ్రుచ్చి తావకీన
పూతభావాకృతీకంఠపూజ సలుప !

నాయికా! నీకు లతకూన దోయిలింత
లందు మధువులు పుష్పాళ్లు పొందుపరచి
నిలుపుకొనియుంటి, నెన్నాళ్లు తలపుతెరల
తెరచికొని రావు రూపొంది దివ్యమూర్తి?

కనబడని నిన్ను లోకలోకాల నరసి
వినబడని నీదుపాటకై వీను లొగ్గి
తను వాకేపూజగా నీకు ధారవోసి
చూపులెత్తుకు వేతు నీరూపు గాంచ.

ఎంతకాలము వేసట చింత రగుల ?
ఎంతకాల మాకలి రెప్ప లెగిరి వెదక ?
ఏచిరాశామరీచుల దోచితోచి
నావనసుమమ్ము లెన్నింటి నాహుతింతు ?

# చిత్రప్రతిమాదికశిల్పము—రసము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

'రస్యతే స్వాద్యత ఇతిరసః' అనఁగా, ఆనందానుభవరూపమగు స్వాదము రసము. 'స్వాదః కావ్యార్థసంభేదా దాత్మానంద సముద్భవః' అనఁగా, కావ్యార్థపరిశీలనమునఁ బైకిఁ బొంగునట్టి యాత్మానందమే రసాభిన్నమగు స్వాదమని లాక్షణికు లందురు. దీనికి ధనంజయమతమున లక్షణ మిది:—

గీ. బహువిధవిభావముఖ్యభావములచేతఁ
ప్రబలి యాస్వాదగోచరత్వమును జెందు
నట్టి రతిహాసశోకభయాదికంబు
స్థాయిభావము రసమని తలఁపఁబడును.

అట్టి యీరసము ౮-౯-౧౦-౧౨ విధములనుచు లాక్షణికులు వేఱువేఱుగా నిరూపించిరి. ఇపుడు వాని విచారణ యనావశ్యకము. శిల్పమువలన నీరసము లెట్లు గోచరించుచున్నవనుటయే ప్రకృతము.

రసమనునది యెల్లప్రాణుల హృదయమును సహజముగా నంటియున్నదే కాని, అప్పటికపుడు క్రొత్తగాఁ బుట్టునదియు, వచ్చి పోవునదియుఁ గాదు. అది, ఆలంబనవిభావము కన విన వచ్చినపుడును, నాయికానాయకాదుల యవస్థలనో, వారి చేష్టలనో చూచునపుడును, వినునపుడును, వానివర్ణనము చదువునపుడును వారివారి హృదయముననుండి శృంగారవీర కరుణాదిరూపమునఁ బైకిఁ బొంగి యనంతరము మరల నణఁగుచుండుననుట యనుభవసిద్ధము. కాని, రస ముద్బుద్ధమగుటకు సంభవించిన హేతువులనుబట్టియు, వానిని గని విను వారి హృదయస్థితినిబట్టియు దాని యుద్బుద్ధావస్థయందు హెచ్చుతగ్గులుమాత్రము కలుగుచుండును. ఇందు కుదాహరణము:—

సీతారాముల వృత్తాంతము చదువునప్పటికంటె దానిని రంగస్థలమున నటులు ప్రదర్శించునపు డానందశోకాదులు మిక్కిలి వికాసమునొందుట మన కనుభవసిద్ధమే. అట్లే వారి యుదంతము చిత్తరువునఁ జూపఁబడెనేని పైని జెప్పిన యానందాదు లుదయింపకపోవు కాని, చూచువా రాచిత్రప్రతిమల యవస్థల నెఱిఁగియున్నఁగాని రస ముద్బుద్ధము కాదు. శకుంతలావృత్తాంత మేమియు నెఱుఁగనివాఁడు, పతినిరాకృతయైన శకుంతలప్రతిమను జూచెనేని వాని 'కిది యిట్లుండఁ గారణ మే' మని తెలిసికొనుట కాసక్తి యుదయించును గాని, జాలి యుద్బుద్ధముకాదు. కాని, అవస్థ యించుక విస్పష్టముగా నుండెనేని అట్టి పామరునికైనను హృదయము కరఁగును. రావణునిచేఁ గొనిపోఁబడుచు విలపించుచున్న సీత ప్రతిమను జూచెనేని వానికి జాలియో, కోపమో యుద్బుద్ధము కాకపోదు. కావున, ఆయానాయికానాయకాదుల యవస్థలను

జదువునపుడును, రంగస్థలమునఁ జూచునపుడును సత్వరముగా నుద్బుద్ధమగుటకంటెఁ జిత్రప్రతిమాదులఁ జూచునపు డించుక మందముగా నుబికినను, శిల్పదర్శనమునఁ గూడ రస ముప్పతిల్ల కపోదని తెలియనయ్యెడి. ఇఁకనో, తత్తదవస్థల నెట్లోని తెలిసియున్నవారికి నాటకప్రదర్శనముమాడ్కిఁ జిత్రప్రదర్శనమును రస ముప్పొంగఁజేయుననుట నిజము. ఇందుకు వికలచిత్తయగు సీత కూఱటకలిగించుటకై శ్రీరాముఁడు పూర్వరామాయణకథను గోడలపైఁ జిత్రింపఁజేసినట్లు భవభూతిమహాకవి కల్పించిన చిత్రప్రదర్శనమే నిదర్శనము.

శిల్పము మృణ్మయము, దారుమయము, శిలామయము, ధాతురాగమయము, రేఖామయము నని పంచవిధముగా నున్నది. ఇందు కడపటిది యాధునికముగాని, తక్కినవన్నియు నతిప్రాచీనములే. ఇపుడు సినీమాలలోఁ గనవచ్చు బొమ్మలీపై జాతులకుఁ జేరినవికావు గాని, దానిని తేజోమయశిల్ప మనవచ్చును.

అఱువదినాలుగుకళలలో సంగీతము, కవిత్వము, చిత్రక్రియ యనుమూఁడును ముఖ్యములు. వీనిలో సంగీతము శ్రవణగోచరమై, కవిత్వము వాగమృతమై హృదయ మానంద పరవశము గావించునట్లే దృగ్గోచరమై చిత్తరువును మనస్సును రసమగ్నము గావించును. కావుననే పూర్వమహాకవులు కొందఱు తమ కావ్యములయందు చిత్తరువునకు సందర్భము కలిగించి దాని మహత్త్వమును బ్రశంసించియున్నారు.

భాసమహాకవి శిల్పకలయందలి యత్యాదరముచేత నే దానికిఁ బ్రాధాన్యమిచ్చి ప్రతిమానాటకము రచియించియున్నాఁడు. కవికులశేఖరుఁడగు కాళిదాసు శకుంతలను రాజోక్తిగా—

'చిత్రే నివేశ్య పరికల్పితసత్త్వయోగా
రూపోచ్చయేన విధినా మనసా కృతాను-'

అని వర్ణించియున్నాఁడు. మఱియు నతఁడే మేఘసందేశమున జీవకళ యుట్టిపడునట్టి ధాతురాగమయమైన చిత్రకల నిట్లు వర్ణించెను.—

'త్వా మాలిఖ్య ప్రణయకుపితాం
ధాతురాగైః శిలాయా
మాత్మానం తే చరణపతితం
యావదిచ్ఛామి కర్తుమ్,
అస్రైస్తావ న్ముహురుపచితై
ర్దృష్టి రాలుప్యతే మే
క్రూర స్తస్మిన్నపి న సహతే
సంగమం నౌ కృతాంతః.'

మఱియు భవభూతి మహాకవి మాలతీమాధవములో, మాలతి మాధవుని రూపము చిత్రించి తా నానందించుటయే కాక, నాయకుని కాశ్చర్యము గలిగించెనని వర్ణించియున్నాఁడు. ఇట్లెందఱో కవులు ప్రతిమాదిశిల్పములకుఁ బ్రసక్తికలిగించి రనుట విదితము. ఇంతయేల? సీతను బరిత్యజించిన శ్రీరాముఁ

డశ్వమేధయాగమునెపమున సువర్ణమయమైన సీతావిగ్రహము కల్పించుకొని తన దృష్టి నామెయందు నిలిపి హృదయమున కాశ్వాసము గలిగించుకొనె ననెడి భవభూతికవికిఁ బ్రతిమాచిత్రశిల్పములం దెంత యాదరమో, అట్టి శిల్పము రసావిష్కృతి కెట్లు హేతువగునని యతఁడు విశ్వసించెనో తెలిసికొన్న, శిల్పముగూడ రస ముద్బుద్ధమగుటకు సమర్థమగుననుట విశ్వసనీయము కాకపోదు.

కవిత్వసృష్టివలెఁ జిత్రసృష్టియుఁ గల్పనాసామర్థ్యమును, రసపోషణకౌశలమును బట్టి వన్నె కెక్కఁదగియున్నది. ఒకపద్యము సరసముగా లేదన్నపు డందలిలోపమును దెల్పుట కవిత్వకలాభిజ్ఞునిపని యగునట్లే యొకప్రతిమ మనోహరముగా లేదనునపు డందలి దోషము తెల్పుట చిత్రకలాభిజ్ఞుని పని. ఉన్న దాని నున్నట్లుగాను, జరిగినదానిని జరిగినట్లుగాను వర్ణింపఁ బూనిన కవి పదసంఘటనాదుల నేదో కొంత మెఱుఁగుపెట్టక పద్యమును మనోహరముగా వర్ణింపఁజాలనట్లే శిల్పకారుఁడు గూడ నొక రూపమును స్వభావమునకుఁ దగినట్లుగా నౌచిత్యము నతిక్రమింపకయే యవయవసన్నివేశమున నేదో కొంత మెఱుఁగుపెట్టక చూపరచిత్త మాకర్షించునట్లు నిర్మింపఁ జాలఁడు. అది వారి ప్రతిభాధీనము. ఇందుకు 'ఎండినచెట్టు నీయెదుట నున్న'దను విషయమును 'శుష్కో వృక్షో భాతి పురస్తే' యనుటకంటె 'నీరసతరురిహ భాతి పురస్తే' యనుట చక్కఁగా నున్నదన్న యార్యోక్తియే నిదర్శనము. ఇట్లే శిల్పమునందును, బుద్ధమునిశంకరాచార్యుల విగ్రహములు కొన్ని శాంతరసమొలుకుచున్నట్లు కనఁబడి చిత్తమును దన్మయము గావించుటయు, వారిప్రతిమలే మఱి కొన్ని యట్టివి గాకుండుటయు మన కనుభవసిద్ధమే. కావున శిల్పకారుని ప్రతిభనుబట్టి శిల్పమును రసపోషక మగుననుట తెల్లము. చిత్రప్రతిమాదికశిల్ప మిట్లు రసావిర్భావమునకు హేతువగునని కనిపెట్టియే ప్రాచీనులు చూపఱ కానందవివేకాదు లుదయింపఁజేయుటకై దేవాలయములమీఁదను, ప్రాకారకుడ్యములమీఁదను రామాయణభాగవతాది కథావిషయములను చెక్కించియు, వ్రాయించియు శిల్పకల నత్యున్నత స్థితికిఁ దెచ్చిరను మాటను స్మృతికిఁ దెచ్చుచున్నాను.

---

# 'ఆంధ్ర కవిత్వ చరిత్రము'*

కొంపెల్ల జనార్దనరావు గారు

( విమర్శము )

పేరునుబట్టి యిది ఆంధ్రకవిత్వముచరిత్రమని అనిపించుచున్నది—కాదా? కాని అట్లు కాదు. ఇందు ఉదాహరణరూపముననైన ఎక్కువ ఆంధ్రకవిత్వము కొంచెము. అందు తొంబదిపాళ్లు శ్రీఅప్పారావుగారి సొంతమే. మఱి యిది రచయిత రచింపఁబూనిన ఒక ఆగామి బృహద్గ్రంథమునకు ఉపోద్ఘాతప్రాయమైనదై, ఆపేరే తొడిగికొన్న దనుటకు ఆనుకూల్యము లేదు. ఇది ఒక గ్రంథమే అయి తనవిషయమునుబట్టి పేరు దాల్చి, కావలసినచో తన పీఠికయందు, రాఁబోవు ఒక ఘనాన గ్రంథమునకు ఇది ఉపోద్ఘాతప్రాయ మన్న ప్రకటనకు తావిచ్చిన ఈయవచ్చును. 'ఆంధ్రమున కవిత్వచరిత్రము' అని ఒక సమాధాన ప్రయత్నము. కవిత్వచరిత్ర మనఁగా, కావ్యమీమాంస అని, కవిత్వతత్త్వపరామర్శ మని, అర్థమగుచో, ఇందలి వస్తువున కీపేరు ఇంతవఱకు సరిపోయినదని కొందఱు సాఁగఁదీయఁగలరు.

ప్రాచ్యములు, పాశ్చాత్త్యములు నగు వివిధభాషా సాహిత్యములందు వివిధకాలములందు కావ్యప్రతిభ కాంచిన వికాసపరిణామములు, చరిత్రక్రమమున కాకున్న లక్షణక్రమపరముగ, ఇందు పరిశ్రమాయత్తమగు పరామర్శమునకు భాజనములయి, రచయిత అభిప్రాయధోరణికి అగ్రము చూపినవి. ఇది మిక్కిలి అదను పట్టిన, మెచ్చఁదగిన ప్రయత్నమే.

తెలుఁగున కవనప్రతిభ ప్రాఁతరాపిళ్లకు విప్లవించినవెనుక వెలువడిన విమర్శగ్రంథములలో నెల్ల భావస్వాతంత్ర్యమును, విషయవిస్తృతియు చూపు కొలఁది సంఖ్యలో చేరు నిది. సారస్వతమగు 'అరాజకోద్యమ' సంరంభమున మొదటిపఙ్క్తులలో కానవచ్చు ఈ 'భావకవి', తనస్వాతంత్ర్యరతి, పాఠసారము, ఉపజ్ఞ అడుగడుగున చిహ్నితమొనర్పఁగడఁగు విమర్శకుఁడుగ దర్శనములు విసరుచు వచ్చి యీపెద్దవిడిదిని విస్తరిల్లినాఁడు.

ఇది ౧౯-౨౧ లో విరచితమైనట్లు గ్రంథకర్త పీఠిక చెప్పును. ప్రకటితమైనది '౩౧ తుదనో '౩౨ తొలుతనో. ఇది రచించిన క్రొత్తనే ప్రకటితమై యుండిన, ఇది తెచ్చుకొనియుండు మెప్పు ఈపదేండ్ల రసజ్ఞతపెంపులో ఊరియుండెడిది. ఈప్రకటించు ముందే యిది రచితమై యుండినచో, విషయావగాహనము మెఱుఁగెక్కి, రచనాశక్తి పాకముతిరిగి, ఇంతకంటె మేలుతరమైన గ్రంథము మనకు లభించియుండెడిదని ఆశింతము. నాఁటిరచనయే నేఁడు ప్రకటితము కావలసివచ్చినను, కవిసంస్కృతివికసనము ననుసరించి గ్రంథమున కొంత సంస్కరణము ప్రాఁకుట స్వాభావికము. మఱి, రచయిత తనయెడ చెప్పుకొన్న పాదుపాలను మించిన బద్ధకమువలననో యేమో, ౧౯-౨౧ సం. ననే నిలువఁద్రొక్కుకొని మాటాడు వాక్యములు కొన్ని గ్రంథము నొకమట్టిపొరక్రింద కొంతచైతన్యముగా పట్టుచున్నవి. మహాసంగ్రామానంతరము ఐరోపీయవాఙ్మయగతి స్తంభించిపోవువఱకే ('ఇఁక ముందు నేపరిణామము దాల్చునో చెప్పుట దుస్తరము (?) అని నుడువుచు) తడవి, ఆసమయముకొసను వినవచ్చు కవితారావములలో 'యీట్సు' కవిగొంతుక ప్రాచ్యసంస్కృతిచ్ఛాయ లాలపింప మచ్చులు విసరె నన్న మథనము,

* గ్రంథకర్త: బసవరాజు వేంకటఅప్పారావుగారు, బి. ఏ., బి. ఎల్. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. క్రౌనుసైజు, ౩౦౦ పుటలు. వెల రు ౧-౮-౦.

నోబెలుబహుమానము నొడిచిన యీ పదివత్సరాల తత్కవివికాసమును పట్టుట యెంతఆవశ్యకమో, తద్విపర్యయమున నిపుడు చేపడిన ఆశాభంగము కొలతచూపి చెప్పఁగలదు.

ఆంగ్లకావ్యము లెన్నియో మెచ్చి, ఆంగ్లమున కవులయు విమర్శకులయు నభిప్రాయములు గౌరవముతో స్వీకరించిన ఔచిత్యము నెఱపియు, '...... ఆంగ్లేయులు సాక్షాత్తు కలిపురుషావతారులు. అందుకనియే వారికి ద్రవ్యకాంక్ష మెండు. రసభావము వ్యంగ్యము...' అన్న భావములు ఏప్రోద్బలమున నేర్పడినవైనను, ఈపదియేండ్లకు రచయిత పరిశీలించియు ప్రాచ్యతాముద్ర నిలఁబెట్టుటకో యేమో అట్లు వదలినాఁడని సమాధానపడుట సులభము కాదు.

“...‘తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వమ్మును జరపువాఁడు’ అనుభాగవతవచనము యొక్కయు, ‘ఆత్మవత్సర్వభూతాని’ యను నుపనిషద్వాక్యముయొక్కయుఁ బ్రామాణ్యమును క్రూరులును, రాజ్యకాంక్షాపరులును, హింసారతులును, మాంసాశనులును, నాస్తికులును నగు పాశ్చాత్యశాస్త్రజ్ఞులకును, పాశ్చాత్యజనులకును వెల్లడించి ‘భారతీయవిజ్ఞానప్రాశస్త్యమును ఘంటాపథముగఁ జాటి తన్నుఁగన్న దేశమునకు ఖ్యాతియును, దన కశేషశేముషియును (?) శ్రీవసువు [జగదీశచంద్రబోసు] గడించినాఁడు—”

ఇట్లు నిబిడితములైన వాక్యములకు లోకము అంగీకారముద్ర వదలఁగలిగినచో, వెలుతురువలె పరువిడుచున్న పాశ్చాత్త్యవిజ్ఞానగతిసహా తత్త్వపారమ్యసమర్థనమునకు బారలు చాఁచు ననెడి రహస్యములు కీర్తించిన జెనరల్ స్మట్సు-లు తల వంచుకొని సముద్రాలలో దాఁగుదురేమో!

గంటము త్రుప్పుపట్టి, అక్షరముల అక్షరాంకణమునకు లోహపుముద్రలు మొలచిన యీకాలమున రచనాకాలమునుండి ప్రచురణకాల మనుచు లెక్కించుకోవలసి వచ్చినది కనుక కాని,—గ్రంథమును యథాతథముగ పరిశీలింపఁజెల్లును.

ప్రాక్పశ్చిమములు రెంటికిని “పద్ధతులు వేఱయినను బరమార్థము...రసప్రతిపాదనమే యని గ్రహించిన” వారై తత్సంయోగము అసంభవము కాదని ఉపదేశించి, “పాశ్చాత్త్యవాసనలు నన్ను వీడక వెంటాడుచున్నను, భారతీయనాగరకతకు మూలకందమనఁదగు సంస్కృతవాఙ్మయమును జుల్కనఁగఁ జూడక, మూలాధారముగనే గ్రహించి సర్వత్ర వాదమునకుఁ గడంగితిని. కాని, సాంస్కృతి కాలంకారికుల ప్రధానసూత్రమును మాత్రమే కయికొని, యప్రధానము లగువానినెల్ల విడిచి సాహిత్యమునకును, రసమునకును, శైలికిని సంబంధించిన ముఖ్యసూత్రముల చర్చతోడనే గ్రంథమును బూరించితిని. అప్రధానవిషయములఁగూర్చి విపులవ్యాఖ్యానము గావలసినవారికి పూర్వసంప్రదాయానుసారములగు లక్షణగ్రంథము లెన్నియేనియుం గలవు. ‘చక్కనిరాజమార్గమే యుండఁగా సందుల గొందుల దూఱ నేలనే యో మనసా!’ యను త్యాగరాజవాక్యమునే ప్రమాణముగఁ గయికొని కావ్యతత్త్వాన్వేషణమున ముఖ్యసూత్రములనే ఆధారముగఁగొని రాజమార్గముననే నడువఁ బ్రయత్నించితిని”అని పీఠికయం దొసఁగిన రచనావిధానపరిచయము ననుసరించి నడచుచు వీరు సంస్కృతమున సాహిత్యచర్చ కావించిన లాక్షణికులను రెండుకక్షులకు విడఁదీసి, “ఒకపద్ధతివారు శాస్త్రాదేశము శిరసావహించువారు. రెండవపద్ధతివారు స్వచ్ఛందప్రకృతిమార్గముల ననుసరించి శాస్త్రాదేశమును గొన్నియెడల మీఱి రసమునే ప్రధానలక్ష్యముగ నంగీకరించి కావ్యలక్షణమును నిరూపించిరి. శాస్త్రాదేశము ననుసరించి కావ్యలక్షణమును నిర్వచించిన లాక్షణికులలో వామనుఁడును, వాగ్భటుఁడును [? ఉద్భటుఁడు], భోజుఁడును, మల్లినాథుఁడును, విద్యానాథుఁడును ముఖ్యులు. శాస్త్రాదేశమును ప్రధానముగ గడింపక రసప్రవృత్తియే ముఖ్యసూత్రముగఁ గైకొని కావ్యస్వరూపమును చిత్రించినవారిలో దండి, మమ్మటుఁడును, విశ్వనాథుఁడును, జగన్నాథపండితుఁడును ప్రముఖులు”అని యిరుకక్షులను వర్ణించిరి.

వామనాదులును, మమ్మటాదులునుగూడ తమ తమమతముల నిరూపించు శాస్త్రగ్రంథములను తామే నిర్మించిరి కాని, వామనాదు లొకశాస్త్రమునాదేశమును శిరసావహించుచు వర్తించినవారును కారు, మమ్మటాదులు నిర్మించినవి శాస్త్రగ్రంథములు కాకపోవను లేదు. గ్రంథకర్తప్రధానాశయ మేమన, కొందఱు (వ్యాకరణాదు లపేక్షించుచు) అదోషత్వ, రీతిగుణాలంకారాది విశిష్టత కావ్యమునకు వలయునని స్వీకరింప, కొందఱు, ఏది యేమైనను, రసరమణీయతాదులే ప్రధానము లని చెప్పిరి అని. కాని, మొదటిమతము 'లాక్షణికమత' మనియు, రెండవది 'రసికమత' మనియు పిలుచుకొన వీరికి మన సైనది. ఇచట, 'ప్రథమపీఠము వారు...నియమములను పెంచి ఆదర్శమునకు వైరళ్య మాపాదించిరి' అన్న స్వకీయ 'మిత్రు' లొకరు వ్రాసినది వీరు మెచ్చుచు స్వీకరించి 'లాక్షణికుల'కు సంకుచితత్వము లక్షించి, 'రసికమతము'ను రసికతకు, స్వాతంత్ర్యరతికి శ్లాఘించిరి. ఈగర్హ్యమతము నర్హ్యమతము వీరిచేఁ బడసిన విమర్శము గమనించినచో గ్రంథము ప్రధానసూత్రమున ఆకళింతకు వచ్చును.

"...కావ్యమునందలి సర్వాంగములు నదోషములుగను సగుణములుగను నున్నఁ గాని, కావ్యమున రస ముండనేరదని యిమ్మతమువారి యభిప్రాయము" అని వామనాదులయెడ వీరు కనిపట్టినది. రస ముండనేరదేమో యనుతహతహతో, తత్సంపాదనసామగ్రిగా అదోషత్వసగుణత్వాదు లుపాసించిరని వామనాదులను నిరూపింపఁగల యీవాక్యము వారిని రసికమతముతో చేర్చి, వారియెడ రచయిత ఇష్టవైరుధ్యమును డీకొనుచున్న దగుటచే, రసమన ఆస్వాద్యత యనుకొని, వారు ఆ (రీత్యాది) ద్రవ్యములకు ప్రాధాన్య మిచ్చి రన్నదే యిందలి తాత్పర్యముగ స్వీకరింపుఁడు క్షమాసంపన్నులు.

"'అదోషౌ సగుణౌ సాలంకారౌ' అను మాటలను దమవిజయపతాకలపై విలిఖించి కవిని ప్రతిఘటింపఁ జూచుచున్నా" రనిపించుకొన్న 'లాక్షణికుల' లో మొదట పేరు వేయించుకొన్న వామనుఁడు 'కావ్యశబ్దోఽయం గుణాలంకారసంస్కృతయోః శబ్దార్థయోర్వర్తతే' అనియు, 'రీతి రాత్మా కావ్యస్య' అనియు అన్నందులకు ఆతనిసరదా తీరినది. కావ్యవ్యాప్తిని సంకుచిత మొనర్చుటే లాక్షణికుల తాత్పర్యముగ గణించుటయందు, "సాహిత్య మెట్లు జీవసూత్రబద్ధమై దేశకాలపాత్రానుసారముగ మార్పులఁ జెందుచు, భిన్నపరిణామములఁ దాల్చుచు, నభివృద్ధిఁ జెందుచుండునో గోచరింపక మాన"కుండుటకుఁగా, "విశాలదృష్టితో, సమరసభావముతో సాహిత్యచరిత్రము నవలోకింపఁ" జెల్లు నను ఆశయము, రచయిత పాఠకులయెదుటఁ బెట్టినది, ఆయనచేత 'లాక్షణిక' 'రసిక' మతములను—ఒక్క సంస్కృతాలంకరికులను—బరిశీలించుటకే భిన్నమైపోయినది.

'రీతి కావ్యమున కాత్మ' యన్నయెడ, 'గుణవిశిష్టమైన పదరచన రీతి' యని వివరించినాఁడు వామనుఁడు. అలంకారములు లేకున్నయెడను కావ్యత్వము చెడ దాతనిమతమున. ఈగ్రంథకర్త దెబ్బ తప్పించుకొని, కావ్యత్వము గీయుసందర్భమున 'తదదోషౌ శబ్దార్థౌ సగుణౌ' అని విసరిన మమ్మటునిమాటలలో 'సగుణౌ'అను విశేషణమును విమర్శించి రసప్రాధాన్యమును స్థాపించు సందర్భమున విశ్వనాథుఁడు గుణముల కంగీకరించిన రసైకధర్మత్వము, సంకుచితత్వపు అభియోగమునుండి వామనుని రక్షించుచున్న సంగతి విశ్వనాథునివాదము సారమునే అటునుండి యిటు తిరుగవేసిన, ఫలించును.

శౌర్యాదు లాత్మకువలె, గుణములు రసైకధర్మములు. కావ్యత్వమున అంగీకృతములైన శబ్దార్థములయందు రస మున్నదనియా, లేదనియా? రస ముండియే తీరినపుడు సరసములని చెప్పక సగుణము లందు వేల?—అని విశ్వనాథుఁడు. విశ్వనాథుఁడు వీరికి ప్రమాణము. రస మున్నచోట గుణము లుండితీరిన వన్నమాట, విశ్వనాథుని యీమాటలచొప్పున. మఱి గుణములు లేనిచోట రసముమాత్ర మేదీ? పోనీ, గుణము లున్నచోట రసము లేకపోవు టెట్లు! అని ఒకటి. కావ్యమున గుణము లుండియే తీరుచున్నపుడు, గుణము లుండి

యే తీరవలయును కావ్యమున—అన్న అంశమునకు వర్తించు నిర్వచనము, కావలసిన, విశ్వనాథునికంటె వామనునకు తత్త్వసూక్ష్మతలనుబట్టి తక్కువ 'మార్కులు' తెచ్చు నసుము కాని, వామనుఁడును విశ్వనాథుని వస్తువును పట్టియే యున్నాఁడని తేలును. విశ్వనాథుఁడు గుణములు రసైకధర్మము లన్నాఁడు: వామనుఁ డట్లు చెప్పలేదు కావున, ఆతనిదృష్టితో ఆతఁ డెంత వఱకు రసవస్తువును ఆవాహించినాఁడో చూచిపెట్టుట మంచిదే.

'తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథఞ్చన,
స్యా ద్వపు స్సున్దరమపి శ్విత్రే ణైకేన దుర్భగమ్'

అని కావ్యమున దోషస్పర్శ సుంతైనను భరింపక,

'శరీరం తావ దిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ'

అన్న అదుర్భగమైన సౌందర్యముతో ఇట'రసికమతము'న ప్రవేశము కొట్టి, రసమునకును, గుణములకును గూడ అలంకారములం దంతర్భావ మిచ్చి భామహాదుల ఆవరణమునుండి కొంతగా వామనుని 'భాయి' యగుటకు చేయి చాఁపిన దండి, 'కావ్యశోభాకరములగు ధర్మములను అలంకారము లందురు' అన్ని చెప్పఁగా, ఆమాటలతోనే, 'కావ్యశోభను చేసెడి ధర్మములు గుణములు;—తదతిశయహేతువులు అలంకారములు కాని' అని వామనుఁడు ముందడుగిడి రీతిమతమును పరిణత మొనర్చెను. అట దశగుణములలో 'దీప్తరసత్వం కాంతిః' అని ఒక గుణమును చెప్పి, సమగ్రగుణయైన వైదర్భికి శ్రేష్ఠత్వము నప్పియు, 'ఓజఃకాంతిమతీ గౌడీయా' అని మూఁడిట నింకొకరీతియందుఁ గూడ దీప్తరసత్వమును తాపియు, 'సందర్భేషు దశరూపకం శ్రేయః' అని రసప్రధానమగు దృశ్యప్రబంధమునకు అగ్రతాంబూల మిచ్చియు రసపక్షపాతము చూపినవాఁ డాయెను.

విస్తార, వికాస, విద్రుతు లనెడి మనోవ్యాపారముల నేదే నొకటి నెఱపని రచన ఏదేసనుండియు మనసున కాస్వాద్యము కాక, కావ్యత్వద్వారము వెలుపట నొక 'మతము' సాహాయ్యమునకుఁగా పడిగాఁపులు పడియుండును. కాక,అట్టి ఆస్వాద్యత సంతరించుకొన్న కావ్యమున, ఆ మనోవ్యాపారములు భజించు ఓజః ప్రసాద మాధుర్యములు, అందు ఇమిడిపోవు వామనుని దశగుణములు, అవి నానిమ్మములు అయియే తీరుసని పెద్ద బోధింపవలెనా?

ప్రసాద మను గుణము సర్వరసాంతర్యామి యఁటగా!

'రీతి యన్నది సంఘటనావిశేషము. సంఘటన మఱి అవయవసంస్థానరూప మైనది. ఆత్మ తద్భిన్న మైనది. మఱి కావ్యమునకు రీతి ఆత్మ యెట్లు?' అన్న విశ్వనాథుని ప్రత్యుక్తికి పాల్పడ్డ వామనుని రీతిమతము, అథమము, విశ్వనాథుని రసమతమున వస్త్వలంకారాదులకు విడిది లేదన్న ఆక్షేపమునకు సతి కాని సందర్భములు తన వ్యూహమున ఇముడ్చుకొన్నదని రుజువు చేయుటకు సిద్ధపడు ఒక ప్రయత్నము, వామనాదులు సంకుచితులు కాక ఉదారముగ కావ్యతత్త్వము నారాధించి రసులకు వినియోగపడఁగల సార్థకత మనకు చాలును. ఈ రచయిత పట్టిన 'కావ్యశబ్దోఽయం గుణాలంకారసంస్కృతయోః శబ్దార్థయోః వర్తతే' అన్నయెడనైన, 'ఉపచారముచే శబ్దార్థమాత్రవచనము ఇట స్వీకృత'మని నుడివి, తొలుత సంతరించిన 'కావ్యం గ్రాహ్య మలంకారాత్; సౌందర్య మలంకారః' అన్న ఏర్పాటుచే, సౌందర్యము కల శబ్దార్థములు కావ్యత్వమున నిల్చు నను కట్టుబడి చేసి వామనుఁడు, వెనుకటి ఇష్టార్థవ్యవచ్ఛిన్నపదావళిని కావ్యరూపము నల్లుకొన్న దండి మొదలు, విశ్వనాథుని రసాత్మకవాక్యత్వము వఱకు ఎందును కావ్యాత్మను కృత్స్ననిహితముగఁ బడయఁ జాలమిని, 'రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్' అని తెగ ముందునకుఁ బోఁబోయి దండివఱకు వెనుకకును వెళ్లినవంటివాఁడయిన ఇటీవలి పండితరాజు ప్రతిభ వఱకును, జగన్మోహినివలె దొరకి దొరకక వినోదించిన కావ్యాత్మను నిరోధించుటకు కాని, కొల్లొవుటకు కాని తగిన ప్రయత్నమును కాని, అర్హతను కాని నెఱపె ననుటచే సాహిత్యవిమర్శకు లొక్కఁడును ముందిడఁ జాలరు. వాల్మీకి కాళిదాసాదుల యేమహాకావ్యము తెచ్చినను, అందఱు లాక్షణికులు నేదో ఒకలెక్కను కావ్యముగనే స్వీకరించి కావ్యసౌందర్యమును ఆస్వదించి

ఆరాధించిరి. అయిన, ఆసౌందర్యము ఏవిచ్ఛిత్తిరేఖలపై నృత్యము తిరిగినదో గుర్తించి వచించుటయందు పలుకులు భేదించుటకు, పలచినన్ని కారణములు.

'అనలంకృతీ పునః క్వాపి' అన్నందులకు మెచ్చఁబడియు, 'తదదోషౌ శబ్దార్థౌ సగుణౌ' అన్నందులకు, ఏమో, జార్చఁబడ్డమమ్మటునికంటె 'సాలంకారములు' అన్న ఒక్కపాపము చేసిన విద్యానాథుఁడు 'జీవితం వ్యంగ్యవైభవమ్' అని, ఈరచయిత రసికవర్గీయుల సంచికట్టులో లెక్కపెట్టిన వ్యంగ్యమును కీర్తించినవాఁడయ్యు 'లాక్షణికవర్గము'నఁ ద్రోయఁబడినాఁ డన్నచో, వీరు ఒకచాదస్తముగఁ బట్టిన దృష్టి 'అలంకారము' మీఁదనే నిప్పులు కురియుచున్నదో, దాని కస లాక్షపతలియే లేదో అని రెండును సిద్ధపడును.

ఈమనస్స్థితికి తోడు వాఙ్మయపరిచయము (అనోషత్వము వీరికి కిట్టనట్లు) కడు సదోషమనుటకు ఒకటి రెండుమాత్రమే ఉదాహరణములు లెక్కపెట్టుకొను ప్రయత్నము, వీరిసిద్ధాంతరచనలలో సహా ఆగుణము నిబిడితమై ఉన్న యాథార్థ్యమును కొంచెపఱుచుట యగును.

'నిర్దోషం గుణవ త్కావ్య మలంకారై రలంకృతమ్' అన్నభోజుఁడు, వెంటనే,

'రసాత్మకం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతించ విందతి'

అన్నను 'తొలిపీఠము'వాఁడే అనుటకు ఒక్కటే కారణముని(అసలు సరియైనది ఉన్నచో) ఎట్లు చెప్పఁగలము? "'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్' అను మల్లినాథుని మతము నంగీకరించుటకు గొప్ప చిక్కు తటస్థమగుచున్నది. మల్లినాథుఁడు మహావిద్వాంసుఁడును సుప్రసిద్ధవ్యాఖ్యాతయుఁ గానఁ గావ్యవ్యాఖ్యానములకు సంబంధించిన మరియాదలను సూచించెనే గాని, కావ్యసృష్టిని నిరోధింపఁగల నియమముల నేర్పఱుపఁదలఁప లేదు. వ్యాఖ్యాతల విమర్శనము లన్నియు నిట్టిఫలితమునే యర్థించుచున్నవి. అంతియే కాని యవి కావ్యలక్షణముగ నంగీకరింపఁ దగియుండ లేదు."

అని ఒకవ్యాఖ్యానము. కావ్యలక్షణమును విడఁబఱచుటకంటె ఈకావ్యమర్యాదల సూచించుటయందలి ఇతరమగు తాత్పర్యము మాట యెటులున్నను, 'అదోషౌ' మన్నగువాక్యము వ్యాఖ్యాతగ మల్లినాథుఁడు కాక లక్షణకర్తగ విద్యానాథుఁడు వచించినట్టిది. ఈసంగతి మొదటనే తెలిసియుండిన, దీనికిఁగా వీరికి ప్రత్యేకప్రయత్న మక్కఱయుండి యుండదు. విద్యానాథుఁడు కావ్యలక్షణమున గుణాలంకారములమాట చెప్పినది, ప్రాయశః ప్రాప్తమగు సౌందర్యావయవ నిరూపణముగ అన్వయించుకొని, ఆతఁడు వ్యంగ్యవైభవమును, రసాస్వాదమును కీర్తించి రసమతము ననుసరించిన వాఁడనుమాట మఱవకుండుట మంచిది. వామనుఁడు 'రాత్రియామ స్తురీయః కాలః' అని చెప్పినాఁడు కనుక, తెల్లవారుకడ, రాత్రి నాలవజామున మాత్రమే కవిత కట్టవలెను, వేఱొకప్పుడు వలదని యాతని తాత్పర్యముగ అనన్యముగ స్వీకరించుటయు, దానికిఁగా నాతని గర్హించుటయు నన్నవి బాఱెఁడిటు, బాఱెఁడటు తగులును. అది ఒకపరిశీలనము, ఒకఉపదేశము. శాస్త్రములు ప్రభుసమ్మితము లనుటయందు వానియెడ అహంకార, దుర్గర్వ సమ్మితములు చెప్పుకొనుట ఎప్పుడును తగియుండలేదు; క్రీస్తుశకము ఇరువదియవశతాబ్దికి మఱింతతగదు. వానియెడ పాలక, రక్షక సమ్మితము లేవో చూచుకొని, ఉన్నదానికి వ్యవస్థ సవరించుట వాని ఆశయమని స్వీకరించిన, వానిపదవి పూజింపఁబడ్డదే యగును: అంతకు దాఁటిపోవనందులకు సంతుష్టము కూడను. విద్యానాథునిజే అనుకోఁబడిన

'కావ్యం యశసేఽర్థకృతే'

అన్నపద్యము, కావ్యప్రయోజనముల నుగ్గడించునదగుటచే, వేఱొకతావున విమర్శ పడసినది. మమ్మటుని 'కావ్యప్రకాశము'లోనిదని 'ప్రతాపరుద్రీయము'న నుదాహృతమైన యీశ్లోకమును విద్యానాథునిదే యనుకొని వీరు ఎదుర్కొన్నారు.

'హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్'

అన్న స్వేచ్ఛారుతులచే వీరి మెప్పు నోడిచిన మమ్మటుఁడే అది వచించెనని యెఱిఁగియుండుచో, వీరు మమ్మటుని

దురా, నీచజన్మముతో నొక ప్రాణికి భుక్తి యిడుట ముక్తి కాదా ?'

'ఏమీ ? అంత స్వచ్ఛందశరీరుఁడవా ? అగుచో ఇంత పెనఁగితి వేల ?'

'అయ్యా, మీరనిన దేవతలకును హడలు. ఇఁక నామాటయా ? ఊరక చంపనిచ్చుట పాతక మనరా ? కాన పెనఁగితిని. దీనికి కినుక వలదు.'

'ఏమీ పెద్దమాట లాడుచుంటివే! ఊఁ చెప్పు!'

'అయ్యా, నేనేమి చెప్పఁగలను ? అయినను ఒక హిత వాఁడెదను. ప్రాణభీతిచేఁ గాదు. మాధ్యస్థ్యము నకు మాటలాడు చుంటిని. అయ్యా! నీవు నక్కవా, కుక్కవా, పులివా, పుట్రవా ? కావుగదా! దేవయోనివి. మీకు మాకంటె పాటవమూ యెక్కువ, తెలివియూ యెక్కువ. ఇట్టి నీకు భక్ష్యాభక్ష్య వివేకము లేకునికి పాడియా ? ఈనాశరీరము రుచియా శుచియా ? ఇదియు హింసైకలభ్యము. హింసవలన యమబాధ మీకును తప్పదే.

'మీకు దేవతలు సోదరులుకదా! మీరు వారిచే బాధింపఁబడుట కేమి కారణము ? తామసాహారము కాదా ? నాకు పలుకరాదు గాని చంద్రుని మొదటి కళ అగ్ని గ్రోలునఁట గాదా! దేవతలకు అమృత మాహారము. అది సాత్త్వికము. దాన వారు మీకంటె పెక్కేండ్లు జీవింతురు. ఇది యంతయు విచారించి మీరు రుచించినటులు చేయుఁడు.'

'అట్టే చంపకు. మాకు రాని చదువులా ? "ప్రథమాం పిబతే వహ్నిః"కదా! సరికాని, మాకు దేవతలు సోదరు లని నీవే యంటివి. అగ్ని చంద్రుని మొదటి కళ గ్రోలునని నీవే యంటివి. అట్టి అగ్ని తినని వస్తు వున్నదా ? ఇఁకఁ జాలు. ఇది మాకు వృద్ధానుచారము లే. సరే కాని చదువులు చాలఁ జదివితివి. చదువులతో ఆఁకలి యెవఁడు తీర్చుకొనఁగలఁడు ? చదువులలో వాదించి నా మెచ్చు గొనలేవుగాని నాయాఁకలి తీర్చి యీచదివిన కూర మంచి రుచిగా నున్నదని మాత్రము మెచ్చు గొనఁగలవు.'

'అయ్యా! నీవు సర్వజ్ఞుఁడవు. నాకోనమాలు రావు. పైఁగా నేను మాలఁడను. నీకు మాటాడఁగలనా ? నాపొరపాటు లన్నియు మన్నించి నాప్రార్థన మొకటి వినవలయును. కురుంగుడి దేవరను గొలుచుట నాకు నిత్యవ్రతము. సేవాకాల మయినపిదప ఈదేహము తమది.'

బాపనదయ్యము కొంచెము నవ్వి దాసరి చెక్కిలి గొట్టి యిటు లనెను: 'బలే మోసగాఁడవురా! దారులు కొట్టికొట్టి నిన్న కాదా దాసరి వైతివి. మంచిది కాని, నీవే చెప్పు! నోటిముద్ద నెవఁడు జాఱవిడుచును ? తప్పించుకొని శరీరము నెవఁ డిచ్చును ? నేను వదల మియు నీవు పోమియు నిక్కము. ఎందుల కిఁక రచ్చ ? చావునకు సిద్ధపడు!'

'నారాయణనారాయణా' యని చెవులు మూసికొని దాసరి కన్ను లింతలు చేసికొని ఏకాగ్రదృష్టితో నిటు లనియెను: 'నేను మరల రానిచో వామనస్వామి మీఁద ఒట్టు.'

తీవ్రమగు ఈపలుకుబడి బొమ్మరాకాసిని కదలించివయిచెను. కురుంగుడియూ వామనస్వామియు మాఁదాసరియు అంతయు గుఱుతు దగిలెను. వెంటనే బందము విప్పెను. దాసరి నమస్కరించి వెళ్లిపోయెను.

పిదప పెద్దభార్య మొదలుకొని చిన్న భార్య వఱకును గల రాణివాస మంతయు వచ్చి ముక్కుమీఁద వ్రేలు వేసికొనెను. వారందఱు గలిసి బండుబూతులు తిట్టిరి; ఎడపెడ తన్నిరి. 'చేఁ జిక్కినవానిని జాఱవిడిచిన విధవవు. ఇఁక నీచావు నీవు చావు' మని తిట్టి విడాకులు లేకయే గుడిసెమీఁద దెబ్బ కొట్టి లేచిపోయిరి.

సోమి యింత సులువుగా లేచిపోయినందులకు వానికి సంతసము కలిగెనుగాని హసిలికొఱకు కంట తడి పెట్టెను. పిమ్మట చెట్టుమీఁది కెగిరి యిఱుకు కొమ్మలలోఁ గూరుచుండి యేదియో యాలోచించుచుండెను. భార్య లందఱును లేచిపోవుటచే నతనికి వైరాగ్యము కలిగియుండవచ్చును.

## ౧౦

'వామనస్వామీ! నేను నీగుఱ్ఱమను, నేను నీ కేనుఁగను' అని యనుకొనుచు దాసరి నిండువేగముతో కురుంగుడికి పరుగిడెను.

నేఁడు వానిపాట ముక్తికి బాట. వాని పెదవుల మీఁది మందహాసము భగవంతుని చిద్విలాసము వాని కన్నులు ముక్తికి తెన్నులు. వాని మోము దేవుని గీము. ఇట్టిభక్తితో నతఁడు భజన చేసెను.

నేఁటి తాండవమున వాని మేను బంతి. వాని యడుగులు తాళములు. దాసరియే నాఁడు భజించెను. వామనుఁడే వినెను. దాసరియే నాఁడు తాండవించెను. వామనుఁడే చూచెను.

వామనుని విడిచి దాసరి వెనుదిరిగెను. వానిమోము మధుకలశము. అతఁడు పొరలుదండము లొనరించి లేచెను. శిఖరము కానిపించునంతవఱకు వెనుకనడకతో మ్రొక్కుచు నడచెను. పిదప మనోదేవాలయమున నే వామనుని గొలుచుచుఁ బరుగెత్తెను. బాపనదయ్యము వెఱ్ఱిచూపులు చూచుచుండఁగా దాసరి మఱ్ఱిక్రిందికిఁ జనెను.

ఆమండు టెండలో తన బట్టతల చట్టివలెఁ గానిపింపఁగా బ్రహ్మరాక్షసుఁడు దాసరిముందరికి నడచెను. దాసరి కౌఁగిలించుకొని 'మహానుభావా! నా వ్రతము పూర్తి చేయించితివి. నీ చెఱఁ బాపి నన్ను ముక్తి చెఱలోఁ బెట్టితివి. ఎన్నాళ్లో యాఁకలియో పాపము, పారణచేయుము' అని యనెను.

రాకాసికన్నులు బాష్పములచే గాజులాయెను. కౌఁగిలి వదిలించుకొని మాలనిచుట్టు ప్రదక్షిణ మొనరించెను. నొసలు పాదము లంట వ్రాలెను. పర్యాయముగా పాదములు నెత్తిని దాల్చి లేచి, 'అయ్యా, అతిదారుణమగు ఈప్రతిజ్ఞ నీకుఁగాక యొరులకుఁ జెల్లదు' అని స్తుతించుచుండఁగా దాసరి యిటు లనెను: 'అయ్యా! బాస నమ్మి యాఁకట మాడియు నోటిముందు ముద్దను జార్చుకొనువానిని నే నెన్నఁడును కని వినియుండలేదు. గొప్పదనము నీదా నాదా? బాసల కేమి? నోరికోలఁది చేయ నగును. అయ్యా, చాల తడవాయె న న్నిఁకఁ దినుము!'

'ఇఁక నటు లనవలదు. నరమాంసము చేతనే ఈ బొజ్జ పెరిఁగెను. నీచెలిమితో నాచక్రము తిరిగెను. మీవంటిభక్తులు మావంటి పాతకులను తరింపఁజేయనిచో మాకు గతి యేమి? వానకు సముద్ర మయినను ఎడారి యయినను ఒకటియే కాదా?'

'అయ్యా! బాసచొప్పున ఈశరీరము తమదే. నే నీయ ననుట లేదు. ఈశ్వరుఁడే సాక్షి.'

'వలదు వలదు. నాశరీరము నీవు గొనవలయును. అయ్యా! నేను ఘంటాకర్ణునికంటె తుంటరినా? శ్రీకృష్ణుఁ డతనికి శ్రేయ మిడలేదా? భక్తుఁడు భగవంతునికంటె మేలు చేయునందురు. అట్టి మేలు నాకు చేయరాదా? ఒకనికి మేలు చేయుట భగవత్పూజ కాదా?'

'అయ్యబాబో! అంతపని నాతరమా? నాబాబు తరమా?'

'ఆహా! నీతరమే.' అని ఆబొమ్మరాకాసి దాసరి పెడతలఁ బట్టి యూపి, 'నాయనా! నిన్నిచ్చట రాతఁ గొట్టితిని' అని చెప్పుచుండఁగా దాసరి 'భగవంతుఁడు నాపాపమున కారీతిగా సుంకము గొనెనే కాని వేఱు కాదు.' అని యనఁగా తెల్లఁబోయి తెలివి దెచ్చుకొని బాపనదయ్యము 'మహాత్ముఁడా! పిదప నేను దొంగచే కొట్టఁబడి వానిరూపే తలఁచుచు చచ్చి యిటు లయితిని. బాటసారులను పలువురను ఈపొట్టఁ బెట్టుకొంటిని. పూర్వజన్మమున బ్రాహ్మణుఁడను. దయ నీయుఁడను. నేఁడు నీపాడిన వామనస్తుతిఫలమును ధారాదత్తము చేయుము. ఇఁక ఈ నాదేహము తన యిల్లు చేరును' అని యనెను.

'అమ్మా! ఏమో యనుకొంటిని. ఈశరీరమునకు బదులు నేఁటి పాటఫలము కాదు సరికదా ఒక త్రుటిఫలమేని యీఁ జాలను. ఈశరీరము లెన్నివచ్చెను, ఎన్ని పోయెను? ఇది బుడగ. సరికాని, కప్పురమిచ్చి ఉప్పు కొను మందువా?'

'ఔరౌరా! సగమేని యిమ్ము! మీను మ్రింగినచో సముద్రమునకుఁ గొఱంతయా?'

'అయ్యా! నీకును నాకును జరిగిన బాస యేమి? ఇపుడు నీయడుగున దేమి? పాతాళప్రశ్నము లేల? బావిత్రవ్వఁగా బేతాళములు బయలుదేఱినవఁట! పాపము! ప్రొద్దు వోయెను. ఇఁక నన్నుఁ దినుము! ఓ యమ్మలారా! కుండ తెండు! కత్తి తెండు! దాలియేదీ? పీకేదీ? ఎవరును తేరే! పోనిండు! నేనే తెచ్చెదను! ఏడనున్నవో కొంచెము తెలుపుఁడు!'

'ఆసంసారము శాంతించెను. శాంతమ్ పాపమ్. అయ్యా! భక్తులకు దయ వలదా? పూర్ణాచార్యుల వారు సంతుష్టులయి రామానుజులకు గీతాచరమార్థము నుపదేశించి అనధికారులకుఁ జెప్పవలదని శాసించిరి. శ్రీ రామానుజులు లోకులయెడ దయ గలిగి రంగని గోపుర మెక్కి యెలుఁగెత్తి చాటిరి. దాన గురువు కోపించెను. శిష్యుఁ డిటు లనెను: "'నే నొకఁడనే నరకమునఁ బడుట మేలా? భక్తులందఱకు పరమపదము లభించుట మేలా?', అని నాలో నే నాలోచించుకొంటిని. రెండవదియే మేలని నిశ్చయించుకొంటిని. అంతట గోపుర మెక్కి మీరు చాటుటగా నేను చాటితిని" అనెను. గురువు సంతసించెను. నీవు లోఁగడఁ జెప్పినట్టు కలుషము గాని కాయమునఁగాని కల్యాణము కలుగదు. కావున ఈ పాదు రూపుడిపి నన్ను కృతార్థుని జేయుము. నీ పాటఫలములో పాతికపాలేని ఇమ్ము.'

'అమ్మ, ఎంతాశ!'

'పోనీ తుదిపాట ఫలమేని చాలును. ఇదిగొ ఈయనిచో ఇఁక లేచుట సున్న' అని ఆబొమ్మరాకాసి దాసరి పాదములను గట్టిగా లంకించుకొనెను.

'అయ్యా! నేను దీనిఫల మెఱుఁగను. పరమేశ్వరుని ముఖోల్లాసమే ఫలము. అదియుఁగాక ఆజ్ఞకుఁగాని అభ్యనుజ్ఞకుఁగాని ఫలపరిగణనము ప్రపన్నుని కేడది? మఱియొకటి. ఫలము బంధమునకు ఇక్క. ఫల మింత యనియు అంత యనియు లెక్కవేసి దానిలో ఇంత గొమ్మనుటకు వెఱపు గలుగుచున్నది. భగవంతుఁడే మిమ్ము రక్షించును. ఊఱడిలుఁడు.'

ఈమాటలు దాసరి నోట నుండఁగనే దయ్యము తలమీఁద పిలకయు, బుజమున జందెములును, చేత బుడిచెంబును, మేన బ్రహ్మవర్చసమును ఫుట్టుకొని వచ్చెను. పొగనుండి నిప్పువలె రాక్షసదేహము నుండి సోమశర్మ వెలువడెను.

---



పెండ్లి

# సతీపతుల సరససల్లాపాలు

జనమంచి వేంకటరామయ్యగారు

## గృహలక్ష్మి

పతి—(పీఁటమీఁదఁ గూర్చుండి) త్వరగా విస్తరి వేసి రెండు మెతుకులు పెట్టుదు. ఆకలి దహించుకొని పోతున్నది.

సతి—(వంటింటి అడ్డగోడచాటుననుండి) వడ్డిస్తున్నాను, ఒక్కనిమిషం ఓపిక పట్టండి.

ప—ఇంకా ఓపికపట్టడమేనా? వేసేవి పదకొండు.

స—అవును. కచేరీసావడిలోనుండి యెన్ని పిలిచినా కదలి రావడం కష్టం. వచ్చినతరువాత ఎంత బతిమాలినా కొంచె మోపికపట్టడం అంతకంటె కష్టం.

ప—నీ కంతకోప మెందుకు? ఆలాగే ఓపిక చేస్తానులే.

స—ఓపికచేస్తే కొంచెం సంధ్యావందనం తరవాయికూడా తీర్చుకొన్నట్టవుతుందేమో?

ప—సంధ్యావంధనమూ లేదు, చట్టుబండలూ లేదు. ఈవేళకు అక్షతలు వేసుకొంట్లాను పోనిత్తు. మీ ఆడవాళ్లునోముమధ్య నాగా వస్తే అక్షతలు వేసుకొంటారు కామా?

ప—అయితే మా ఆడవాళ్లల్లో చే-రి-నా రన్నమాట. (అని సగము మ్రింగిన చివరమాటలును, విదియ చందురు వెలుఁగువంటి పెదవి దాఁటని పిన్న నగవును గల మొగమును ఇంచుక చూపించుచు తొంగి చూచును.)

ప—(అద్దము చూచుకొని మీసము సవరించుకొనుచు) చేరినా బాగుండును. శారదాదేవిలాగు జైలుకే వెళ్లుదుము.

స—అదేమిటి?

ప—ఏమున్నది? మన ఊళ్లో సీమగుడ్డ లమ్మవద్దని, కొనవద్దని బట్టలదుకాణాలదగ్గర ప్రబోధం చేసినందుకు పోలీసువా రామెను పట్టుకొని తీసుకొనిపోయి నేరం పెట్టి మూడుమాసాల విడిశిక్ష వేయించినారు.

స—అయ్యో పాపము! ఆవిడ బిడ్డలతల్లి కాబోలునే?

ప—కంచె మేకలాగు కడుపెడు పిల్లలు.

స—మీ మాటలు చూస్తే నాకు నవ్వు వస్తున్నది, అసమయంలోకూడా. అయితే, పెనిమిటి ఒప్పుకొన్నారా? ఊరుకొన్నారా?

ప—నీ వింకా పెరటితోవనే ఉన్నావు. బహిష్కారపత్రికలు పంచిపెట్టినందుకు ఆయన జైలుకు వెళ్లి అప్పుడే మూడుమాసాలు కావచ్చింది. ఆయన ముందు, ఆవిడ వెనుక—అదొక విధమైన దాంపత్యమన్నట్టు, ఇదొకవిధమైన సహగమనం.

స—సరిపోయింది మీరు చెప్పినమాట—అయితే పిల్లలో? పిల్లల నెవరి కప్పగించింది?

ప—"మూటా ముల్లె గట్టి ముసిలోళ్లతో సెప్పి" అని పదం పాడినట్టు, ముసలివాళ్లున్నారుగా? ఎడపిల్లల నత్తమామల కప్పగించి, చంటిపిల్లను చంకను వేసుకొని, మహాత్మ గాంధికి జే యన్నది.

స—సాహస మంటే ఆలా గుండవలె. స్త్రీ ఎప్పుడూ సాహసురాలే. కాని యీసాహసం చిత్రంగా ఉన్నది.

ప—ఏరోజు కారోజే కళ్లారా చూస్తూ, చెవులారా వింటూ చిత్ర మంటా వేమిటి? ఇప్పుడు మన ప్రజలలో దేశాభిమానం, స్వాతంత్ర్యేచ్ఛ ప్రబలినాయి. అందుచేతనే స్త్రీలు, పురుషులు, శిశువులు, వృద్ధులు అందరు కలిసి, తమకే కాకుండా నాగరక ప్రపంచానికంతకుకూడా, ధర్మసమ్మతమని తోచేపద్ధతి నవలంబించి దేశానికి బంధవిమోచనం కలిగించవలెనని విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. అందుచేతనే యెండకన్నెరుగని

గొప్పయింటి స్త్రీలుకూడా, ఈచెవిగా డ్వాచెవికి గొట్టే యీరోసిణి కార్తెలో బైటికి వచ్చి పడరాని బాధలు పడుతున్నారు. ఇప్పుడు స్త్రీలు వెనుకటిలాగు తూము కాలువలోనుండి తొంగిచూచే యెలుకలలాగు, తురక సాహేబును చూచిన తొండలలాగు అదరడం, బెదరడం యేమీ లేదు. చేమకూర వెంకటకవి చెప్పినట్టు "పువుఁబోండ్లు కటారి కత్తియ" లయినారు.

స.—అయితేమాత్రం అందరికీ చెల్లుతుందా అంతసాహసం? ఆవిడకే చెల్లింది గాని?

ప.—అయిదుగురు బిడ్డల తల్లికి అంతసాహసం చెల్లితే, తొలిబిడ్డతల్లికి చెల్లుతుంది చెల్లేది.

స.—ఏమిటి చెల్లేది? మూడుపూటల మూడుకంచాల భోజనం!

ప.—ఆలా గంటా వేమిటి? ఖద్దరుచీర కట్టుకొని అమ్మణ్ణి చంకబెట్టుకొని, పొరుగింటికి పేరంటానికి వెళ్లినావంటే, నీకూ చెల్లుతుంది ఏదోకొంత— డిల్లికి ఢిల్లి, పల్లికి పల్లి అన్నట్టు.

స.—చాలు, మీవేళాకోళాలు. ఉదయాస్తమానాలు, ఇంటిలోనే మునుగుతూ తేలుతూ ఉండే నాబోటిదానికి చెల్లే దేమిటి?

ప.—ఏమి మునగడమో, ఏమి తేలడమో! యింకా యిప్పటికి వంట తేలలేదు. అష్టావధానం చేసే కవీశ్వరునిలాగు ఒకమాటు ఇటు, ఒకమాటు అటు చూస్తూ తల్లికొంగు పట్టుకొన్న పిల్లలాగు అద్దగోడచాటునుండి తొంగి దోబూచు లాడుతున్నావు. (వంటింటిలో చుంయిమను శబ్దము విని) ఏమిటో చుంయిమని పిస్తున్నావు. ("నళినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీ హారకం, దళమాత్కారపరంపరల్ పయి పయిన్ మధ్యాహ్నముం దెల్పెడున్"అని మెల్లగా చదువును.)

స.—ఏమిటో మధ్యాహ్న మంటున్నారు.మధ్యాహ్నం మీరే చేసుకొన్నారు. ఎంతసేపటికి రాకపోయేటప్పటికి, వేసినపెసరట్టు చల్లారిపోయింది. పొయిసెగ నుంచితే గట్టిపడుతుందిగదా? అందుచేత, ఎందుకైనా మంచిదే, కచేరీతొందర లేని ఆదివారంగదా, ప్రభువు లేవేళకు వస్తారో అని రుబ్బినపిండి కొంచెమట్టే ఉంచినాను. ఆఉంచడం మంచిదే అయింది. ఇప్పుడు దానితోనే, తాజా పెసరట్టు వేసినాను. వడ్డిస్తున్నాను. (అని విస్తరివేసి నీళ్లు చల్లి పదార్థములు వడ్డించును.)

ప.—(భుజించుచు) ప్రభువు లంటే జ్ఞాపకం వచ్చింది. వెనుక నూరు నూటపాతికయేండ్లక్రిందట, యూరోపుఖండములో నెపోలియన్ అని ఒకమహావీరుడుండేవాడు. ఆయన మహాయుద్ధసన్నాహంలో నుండి యేదో వ్యూహమును గురించి ఆలోచన చేస్తూ అందులోనే మునిగిఉండడంచేత, భోజనాని కేవేళకువచ్చేది తెలిసేది కాదు. అందుచేత భక్తివిశ్వాసాలుగల అతని వంటవాడు, చేసిన వంట చల్లారిపోయినప్పుడెల్ల గంట గంటకు తాజామాంసం తయారుచేసి ఉంచేవాడు. అందుచేత నాలస్యముగా వచ్చినప్పటికి తనకు ఎప్పటి కప్పుడే వెచ్చనికమ్మని భోజనం లభించినందుకు ప్రభువు సంతోషించి దానికారణ మడిగి తెలిసికొని వాని నెంతో మెచ్చుకొన్నాడు.

స.—ఆలాగు మెచ్చుకోవడానికి నే నెంతదాన్ని గాని, ఈవేళ మీకుగూడా ఏదైనా యుద్ధమేనా యేమిటి ఆలస్యానికి కారణం? (అని విసనకఱ్ఱ పుచ్చుకొని నిలువఁబడి విసరుచున్నది.)

ప.—మహాపతివ్రతవు! నీవాక్యం అమోఘం—ఆహా! యుద్ధమే కారణం.

స.—ఈస్తోత్రాల కేమి గాని, యేమియుద్ధమో చెప్పుదురు.

ప.—ఉదయం ఏడుగంటలకు కాఫీ పుచ్చుకొని, ఆదివారంగదా అని ఒకమాటు సమాజమందిరానికి వెళ్లినాను. ఇంటివద్ద కాలక్షేపం కానివాళ్లకు, కోర్టులో కేసులు లేనివాళ్లకు ఈసమాజమందిరం ఒకవిధమైన శరణాలయం వంటిది.

స.—ఈగౌతమీతీరాన అన్నసత్రాలు వేసిన పుణ్యాత్ముల కెంతపుణ్యమో, ఆమందిరం కట్టించిన వారికి కూడా అంతపుణ్యం.

ప—ఇంకా ఎక్కువేమో కూడా. ఆసంగతి ఆలా నుంచు. మందిరానికి వెళ్లినాను. వెళ్లి స్వరాజ్యపత్రిక చేత బుచ్చుకొని చదువుకొంటూ ఉండగా, కొందరు స్నేహితులు నాదగ్గరకు వచ్చి, "రామారావు! కాకినాడ నుండి బిలియర్డ్స్‌లో గండపెండేరం వేయదగిన గజఆటకాడు-ఒకవకీలు-వచ్చియున్నారు. నీవు ఆయనతో ఒకచేయి చూచి మనసమాజంపేరు కొంచెం నిలబెట్టవలెను. నీవు తప్ప ప్రస్తుత మిక్కడ ఆయన కుద్దీ మరిఒకరు లేరు. లేవాలి రావాలి అని గట్టిపట్టు పట్టి చేతిలోనుండి పేప రూడ లాగి జబ్బ పట్టుకొని కుర్చీలోనుండి నన్ను, మొగమోటపుమట్టాన్ని భోజనానికి లేవదీసినట్టు లేవదీసినారు.

స—(నవ్వుచు) అంతే గాని అలకపాన్పుపైనుండి పెండ్లికొడుకును లేవదీసినట్టు కాదుగదా—ములుకోల కఱ్ఱ చేత బట్టుకొని?

ప—(నవ్వుచు) మరికొంచెం బెట్టుసరిచేస్తే ఆలాంఛనంకూడా జరిగేదే కాని చేయడాని కవకాశ మేదీ? వారంతు బంట్రోతులాగు వాళ్లామట్టుగానే నన్ను బిలియర్డ్స్ గదిలోనికి కెట్టుకొని పోయినారు.

స—ఆతరవాయి అక్కడ తీరిం దనుకొంటాను—మీద బడి కొట్టవచ్చేలాగు చొక్కాచేతులు పయికెగదోసుకొని గొడుగుకామలాటి కఱ్ఱ ఒకటి చేత బట్టుకొని తయారుగా నిలిచిఉండే ఆపెద్దమనిషివల్ల ?

ప—(నవ్వుచు) ఎప్పుడో ఏసభకు వెళ్లినప్పుడో చూచినట్టున్నావు. అచ్చంగా నీవు చెప్పినట్టే ఉన్న ఆయనవైఖరి ఆయనపేరుకు తగినట్టుగానే ఉన్నది.

స—ఆలాగా? ఎవ రాయన?

ప—శ్రీమత్ప్రతివాది భయంకరం వెంకటనరసింహాచార్యులు గారు.

స—పేరు చూస్తే పట్టినవ్యాజ్యమెల్లా గెలిపించే గొప్ప వకీలులాగున్నారు.

ప—ఆటలోకూడా అందెవేసినచెయ్యే. కాని చాలా సరసుడు. గుడ్ మార్నింగ్, అంటే గుడ్ మార్నింగ్, అను కొన్నతర్వాత, చిరునవ్వుతో ఆయన "ఒకఆట ఆడుదామా?" అన్నాడు. అందుపయిని నేను "మీరు ఇంగ్లీషుక్లబ్బులో కూడా ఆడి ఆరితేరిన ఆటకాళ్లు. మీయెదుట నేను నిలువగలనా?" అన్నాను. దాని కాయన పెదవి చిట్లించి "అందులో ఏమున్నదండి? మన మేమయినా మెప్పులకోసం మెడల్సుకోసం ఆడుతున్నామా? ఊరకే సరదాకి గాని" అని అన్నాడు. అటయితే సంతోషమే అన్నాను, నేను. ఆపయిని ఆట ఆరంభమైనది. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం చూచే దేవతల లాగు—ఇది ఊరికే ఉపమానంకోసం చెపుతున్నాను—మాస్నేహితు లందరు రెప్పవాల్చక కండ్లన్నీ మా ఆటమీదనే పెట్టుకొని చూస్తూ ఉండగా మా ఉభయులము ఒక గంట గంటన్నర సేపు మా బలాబలాలు చూపించినాము. మొదట కొంత సేపటివరకు జయాపజయాల అంతరం, అసమాన స్నేహమయొక్క అంతరంలాగే కొంచెము హెచ్చుగానే ఉండెను. గాని, తరువాత తరువాత క్రమక్రమంగా అది, పటకా బిగించిన దొరసానినడుములాగు సన్నగిల్లి పోయింది.

స—(నవ్వుచు) ఆట సమ మయిన దందురు, సన్నాయినొక్కులు నొక్కక.

ప—నీ వన్నమాటే నా స్నేహితుల నోటిలోనుండి సంతోషధ్వనిగా వచ్చేటప్పటికి నాకు ముచ్చెమటలు పోసినాయి. మూడుసోడాకాయలు ఖర్చాయినాయి.

స—సోడాకాయలేనా, యింకా యేమయినా కాయలుకూడా ఖర్చయినాయా?

ప—ఇంకా-ఏమయినా - కాయలసంగతి మీ అన్నయ్యకు తెలియవలెను. అతడు ప్రస్తుతం విశాఖపట్నంబస్తీలో ఆబ్కారీ ఉద్యోగస్థుడుగా ఉన్నాడు కాబట్టి.

స—ఇప్పుడు మన రాజమహేంద్రవరం కూడా విశాఖపట్నానికి తీసిపోవడం లేదట గానూ?

ప—ఎక్కడిమాట? విశాఖపట్నంలో ఉన్నది సముద్రం, రాజమండ్రిలో నున్నది గోదావరినది. సముద్రానికి నదికీ "అంతరం మహదంతరం" అన్నట్టు ఎంతో అంతరం.

స—ఇదా ఈవేళ మీరు చేసినయుద్ధం? ఇంకా యుద్ధమంటే చదరంగమేమో అనుకొన్నాను. అక్కడకు వెళ్లి శ్రమపడి యెండలో అలసి పులుసుగూరై రాకపోతే, కడుపులో చల్ల కదలకుండా ఇంటివద్ద గూర్చుండి నాతో ఓమనగుంట లాడరాదూ?

ప—(పకపక నవ్వుచు) ఇంకా నయం, గవ్వలు గచ్చకాయలు ఆడుమన్నావు కావు?

స—అంటే యేమి? మీ రిప్పు డాడిన ఆటలో అంతకంటె విశేష మేమున్నది?

ప—ఉన్నదని కాదు. అంతకంటె విశేషమైన ఆటలు నీతో ఇదివరకే చాలా ఆడి ఉన్నానుగదా అని కాని.

స—ఏమి గడుసుతనము! ఏమేమాడినా రేమిటి?

ప—ఏమే మాడినానా? ఉండు, కొంచెము జ్ఞాపకము చేసుకొంటాను. (ఎడమచేతితో తల తడవి కొనుచు) పెండ్లాడినాను. పెండ్లిలో బంతులాడినాను. ఇంకా దేవుడు మేలుచేస్తే—ముద్దులాడినాను. ముచ్చటలాడినాను. సరసాలాడినాను. సల్లాపాలాడినాను.

స—ఇంకా.

ప—ఇంకా, నీకు కోపం రాకపోతే—

స—కోప మెందుకు? చెప్పదలచుకొన్నదేమో చెప్పండి.

ప—అప్పుడప్పుడు చిన్నచిన్న కల్లలు కయ్యాలు ఆడినాను.

స—ఎన్ని ఆడినారు! న్యాయవాదులు కల్లలాడుతారా?

ప—ఆడుతారులే. బంగారపు పనివాళ్లు టంకపుపొళ్లు వేసి అతికినట్టు నిజం నిలబడడంకోసం ఆడుతారులే. ఆకల్లలు వేరు. కాని—

స—ఈకల్లలు?

ప—పెండ్లివిందులో లడ్డు జిలాబీ తింటూఉన్నప్పుడు మొగంమొత్తకుండా ఉండడానికి మధ్యమధ్యను నాలుకకు రాచుకొనే పచ్చడి బద్దలవంటివి.

స—మీరు మగవారు—ఎందుకైనా సమర్థులే, ఏమాడినా ఆడుతారు. నీళ్లాడుతారు కూడాను.

ప—(పకపక నవ్వి) అసాధ్యం తెచ్చిపెట్టకు, నీపుణ్యమాయెను. ఆపనిమాత్రం మావల్లగాదు.

స—కాకేమి? ఈమధ్య నెక్కడో ఏదేశంలోనో మగవానికడుపున బిడ్డ పుట్టినదని పత్రికలలో ఉన్నట్టు చెప్పుకొన్నారే?

ప—ఏమో, ఆసంగతి నే నంతగా పాటించలేదు. కాని జీవోత్పత్తిని గురించి చెప్పేశాస్త్రంలో, స్త్రీపురుషభేదం లేని కొన్నిక్రిమికీటకాలు వాటంతట అవే వృద్ధవుతున్నాయని చెపుతారు.

స—అయితే పూర్వము ద్రోణాచార్యుడు తల్లి కడుపున బుట్టలేదని మనపురాణాలలో కూడా ఉన్నదిగదా?

ప—గాలికి బుట్టి ధూళికి పెరిగినాడు కాబోలు! అదంతా యుగాంతరవిషయం. మనకు ప్రస్తుతం ఆమలులో ఉన్నవిషయం కావలెను.

స—అటయితే, ప్రస్తుతం అమలులో ఉన్న విషయం భోజనమే. మాటలసందడిని మరచిపోయినారా యేమిటిది, మువ్వంకాయకూరను అంత|చిన్నచూపుచూచినారు? కాయలు మన పెరటిలోవే.

ప—పెరటిలో కాసినవి, పెండ్లాము వంటచేసినవిన్నీ. ఇంకేమి? "స్వచ్ఛందతః స్వభవనే స్వకృషీయ మన్నం, పత్నీకరాగ్రపచితం ద్విజభుక్తశేషం" అన్నట్టు, కూర మరీ బాగా ఉంటుంది. కొంచెము అన్నము పెట్టి నెయ్యి వెయ్యి, చెపుతాను.

స—(అట్లు చేయును.)

ప—(రెండుగ్రుక్కలు మంచినీరు త్రాగి సద్దుకొని) సాధారణంగా, ఏకార్యక్రమానికైనా ముందు ఇష్టదేవతాప్రార్థనం కావలెను. అది యిప్పటి కైనది.

స—అయితే మీకు పెసరట్టైనా యేమిటి యిష్టదేవత ?

ప—పెండ్లాము కూడాను.

స—అమ్మయ్యో ! పెండ్లామును కూడా పెసరట్టులాగు విరిచి ముక్కలు చేసి నోటిలో వేసుకొని నమలి మ్రింగివేయడమే !

ప—తప్పు తప్పు. దేవతాప్రసాదములాగు కన్నుల నద్దుకొని నెత్తిమీద బెట్టుకొనే దివ్యపుష్పం వంటిది పెండ్లా మంటే.

స—అయితే లోకంలో ప్రతిపురుషుడు ఆలాగు చూస్తూన్నాడా ?

ప—చూడకపోతే పెనిమిటే పెసరట్టవుతాడు. పెండ్లామే తన్ను మెడగట్టుకొన్న ఆనిర్భాగ్యుని బట్టుకొని ముక్కలు ముక్కలుగా విరిచి నోటిలో వేసుకొని నమలి మింగి వేస్తుంధి.

స—(నవ్వుచు) మహాశక్తిలాగా ?

ప—అవును, మహాశక్తి లాగే. 'కలౌ శక్తి గృహే గృహే' అన్నాడు. కలియుగంలో ఇంటింట ఒక శక్తిఉన్నది. ఆశక్తి నారాధిస్తే గృహలక్ష్మి అవుతుంది. కాని యేకారణంచేతనైనా సరే అసమర్థుడై ఆరాధించ లేకపోతే యమదేవతే అవుతుంది. అందుచేతనే ఎవడో రోమకలు చిట్లంగట్టిన గట్టిముండావాడొక్కడు "పెండ్లామో యమదేవతా" అని గీతావాక్యానికి పాఠాంతరం కల్పించినాడు.

స—ఏమిమాటలు ? లోకంలో ఎక్కడా పతివ్రతలే లేనట్టు చెపుతున్నారు.

ప—సామాన్యవిషయంగా చెప్పినాను గాని లేకేమి ? ఉన్నారు, పగటిచుక్కలలాగు అక్కడక్కడ నూటికి కోటికి పరగపాటుగా. ఇక్కడ నీవే ఉన్నావుగా, బి. యల్. పరీక్షకు నేను చేసిన అప్పు నన్ను పట్టుకొని పీకేస్తూ ఉంటే, పెండ్లినాడు పెట్టిన రెండుపెద్ద నగలు తెచ్చి నాచేతిలో బెట్టిన మహాపతివ్రతవు !

స—నానగ లేమిటి ? నే నెవతెను ? నేను మీ దానను గానా ? మీసొత్తు గానా ? నలమహారాజుతో దమయంతి చెప్పినట్లు 'నేను మీధనము'. మీ ధనము మీయిష్టంవచ్చినట్లు చేసికోవచ్చును. ఇందులో నేను చేసిన త్యాగ మేమున్నది ? ఈప్రశంస ఇం కెప్పుడూ చేయకండి, నామాట విని.

ప—చేయను గాని, నిజంగా అప్పటి కంటె ఇప్పుడే నీరూపం నాకంటికి కెక్కువ ఆనందకరంగా కనబడుతున్నది సుమీ ?

స—ఎందుచేత ?

ప—ఆ పట్టునూలుచీర, ఆ సంసారపక్షపు నగలు, ఆ పువ్వులు ధరించి, విసనకఱ్ఱ చేత బట్టుకొని నిలువబడి నాకు నీవు ఉపచారం చేస్తూ ఉంటే, ముని కన్నెవేషంతో అతిథిసత్కారం చేస్తున్న ఆ శకుంతల యొక్క దివ్యమంగళవిగ్రహమే కళ్లకు కట్టినట్లుగా ఉన్నది.

స—తరుచు నాటకాలకు వెళ్లడంవల్ల మీ మనస్సును ఒకవిధమైన భ్రాంతి ఆవరించిన ట్లున్నది. అందుచేత మీకంటికి మిణుగురుపురుగు మెరుపుదీగలాగు కనిపిస్తున్నది.

ప—పోనీ, నీవు శకుంతల వయినా కాకపోయినా నేను మాత్రం నీసుఖంకోరకు రవ్వంతసేపు దుష్యంతుడను కాక తప్పదు.

స—తాను కోరి పెండ్లాడినపెండ్లాము తన్ను చేరవచ్చినప్పుడు చెందనాడిన దొడ్డమహారాజు ! ఆయన పోలికమాత్రం తెచ్చుకోకండి మీపుణ్యమాయెను.

ప—లోకు లెప్పుడూ ముందరిగుణంకంటె వెనుకటి దోషమునే త్వరగా ఎంచుతారు — ఆ దోషం బుద్ధిపూర్వకంగా చేసినది కాదని తెలిసీకూడా !

స—మోచేయి, నిద్రలో ప్రమాదవశాన్ని తగిలినప్పటికీ ప్రక్కపోటుబాధ తప్పదుగా ?

ప—సెబాసు! లాయరుపెండ్లాములాగే చెప్పినావు! సబబు. అవును గాని, నే నెప్పుడయినా నిద్రలో ఆలాటి అపచారం చేయలేదుగదా, కొంప తవ్వి?

స—చేస్తేమాత్రం ఏమి చేస్తాను? శకుంతలలాగు సహించుకోవలసినదే — సున్నము బెల్లము పట్టు వేసుకోకుండా.

ప—నీ వయితే సహించుకొంటావు గాని, ఆ మాట విని నేనుమాత్రం సహించలేను సుమీ! చాలును. ఈపాటి కావిసనకఱ్ఱ క్రిందబెట్టి, అక్కడ ఎదురుగా పీటమీద కూర్చుండు.

స—ఎందుకు? మీరు నాటక మాడుతుంటే చూడడానికా?

ప—నాటకమూ గాదు, బూటకమూ గాదు. కడుపులో ఉన్నది చెపుతున్నాను. విను.

స—చెప్పండి, చేతులు పనిచేస్తూంటే చెవులు వినగూడదా యేమిటి? (నిలువబడి విసనకఱ్ఱతో విసరుచునే యున్నది.)

ప—ప్రకృతిచేత నే సుకుమార మైన నీశరీరమును ఈవిధంగా కష్టపెట్టుకోవడం చూస్తే నాకు చాలా కష్టంగా ఉన్నది. ఈలాటి వేసవికాలంలో పొయి సెగను బడి ఇన్ని పదార్థాలు తయారుచేసిన కష్టమే చాలును. పయిగా విసనకఱ్ఱ చేత బట్టుకొని నిలువబడి విసరడంకష్టం కూడానా?

స—దుష్యంతవేషం బాగానే వినిపిస్తున్నారు. నా కేమీ కష్టం లేదు. ఆయాసం లేదు. మీరు సుఖంగా భోజనం చెయ్యండి. కొంచెము అరటిపండ్ల పచ్చడి వేతునా?

ప—అక్కరలేదు. చారు పోసుకొంటాను. అయితేను, ఆయాసం లేదంటున్నావు. ప్రొద్దుట కాఫీ పుచ్చుకొన్నావా? ఏమిటి, జవాబు చెప్పక నీళ్లు నములుతున్నావు? అన్నట్టు ఆదివారవ్రతం కాబోలు. ప్రొద్దుట కాఫీకి ఆదివారం. సాయంకాలం భోజనాని కాదివారం. రాత్రి తాంబూలం వగైరా—.

స—ఏమిమాటలు? బొత్తిగా చిన్నతనం వస్తున్నది! (అని పతిభుజమును మెల్లగా విసనకఱ్ఱతో తాఁకును.)

ప—తగిలింది, ఇప్పటికి బాగా తగిలింది.

స—ఏమిటి?

ప—హాయిగా చల్లనిగాలి.

స—ముక్కుగోస్తే సెత్తురు రాగే బాపతు మనుష్యులు!

ప—ఆలాగయితేనే ప్రపంచంలో బ్రతకడం. ఈప్రపంచంలో మనుష్యుడు అన్నిరకాల అనుభవాలను అమారుగా ఉండవలెను. చూడు. నేను చెన్నపట్టణంలో లాకాలేజీలో చదువుకొంటూ ఉన్నప్పుడు ఇంటిదగ్గర నుండి వచ్చే మనీఆర్డర్లు ఇష్టంవచ్చినట్టుగా ఖర్చుపెట్టుకొని తింటూ తిరుగుతూ సాయంకాల మయ్యేటప్పటికి బీచ్‌రోడ్డుమీద చల్లగాలికి సరదాగా సైకిల్ తొక్కుకొంటూ ఆపక్కను కనబడే సముద్రానికీవలెనే నాసుఖానికికూడా మేరలేదనుకొంటూ ఆనందిస్తూ ఉండేవాణ్ని. అప్పటి అనుభవము అది. ఇంక—

స—ఇప్పటిది?

ప—పెండ్లాముచేత విసనకఱ్ఱదెబ్బలు తినడం, ఆపయిని—

స—(నవ్వాపుకోలేక విసనకఱ్ఱ నోటికి కడ్డుపెట్టుకొని) ఆపయి నేమిటి?

ప—ఏమున్నది? శ్రీకృష్ణమూర్తి కాళ్లబేరమే. "అయ్యో! పాపము! విసనకఱ్ఱ పట్టుకోవడంచేత నీచేతివేళ్లు ఎంత కందిపోయినవో" అని చూస్తూన్నట్టే ఉండి చేతులు పట్టుకోవడం, బతిమాలడం, బుజ్జగించి చేరదీయడం, బుగ్గ ముద్దుపెట్టుకోవడం, మళ్లీ ఆనందించడమున్నూ, ఈలా గుంటుంది యీ సంసారానుభవాల క్రమం. శ్రీశైలశిఖరంలాగు దూరాని కగపడని యేదో ఒక సుఖమపేక్షించి దానికోసమై పరుగులెత్తడం, పడడం, లేచి దుమ్ము దులుపుకోవడం, మళ్లీ పరుగెత్తడం, ఈలాగుంటుంది సంసారయాత్ర అంటే. అంతే గాని, "యెవరో

వస్తారు. తలపుళ్లు కడిగి రక్షిస్తారు. కళ్ల నీళ్లు తుడిచి కడుపులో బెట్టుకొంటారు" అని బిక్కమొగం పెట్టుకొని దిక్కులు చూస్తూ నిలువబడి ఉంటే పుణ్యకాలం కాస్తా దారిలోనే వెళ్లిపోతుంది. విన్నావా?

స—విన్నాను. బాగుంది, మీ 'ఆటలో అరటిపండు' వేదాంతం. మీ రీవేదాంతం వ్యాజ్యాలు పోయిన పార్టీలకు ఉపదేశం చేశారంటే, వాళ్లు చెన్నపట్నందాకా పోరి యిల్లు ఒళ్లు గుల్లచేసుకొన్నా, మనసు గట్టిపడడంచేత భక్తిమార్గం తొక్కి బాగుపడతారు.

ప—(పకాలున నవ్వి) ప్లీడర్లగుట్టు మాబాగా బైటబెట్టినావు! ఒక్కసారి షేక్ హాండ్ ఇయ్యి. (అని యెడమచేయి చాచును.)

స—(నవ్వుచు) నే నేమీ దొరసానిని గాను షేక్ హాం డియ్యడానికి. ఇంతకును ఆముచ్చట పెండ్లినాడు తీరనే తీరినది. (వెళ్లి చారు తెచ్చి వడ్డించును).

ప—(పుడిసెడు పుచ్చుకొని) ఓహో! ఏమి చారు! "చారు చారుతరం భాతి హింగు జీలక సంయుతం" అని యెవడో నావంటి భోజనప్రియుడు చెప్పిన శ్లోకం జ్ఞాపకం చేస్తున్నది.

స—అత్తయ్య రామేశ్వరం వెళ్లినప్పటినుంచి మీకు బొత్తిగా చిన్నతనం వస్తున్నది సుమండీ.

ప—ఆమాట నేనొప్పుకోను. చిన్నతనం ఇప్పుడు కొత్తగా వచ్చినదా యేమిటి? ఇదివరకే ఉన్నది. అత్తయ్య రామేశ్వరం వెళ్లిన తరువాత నీకు నాకు పెత్తనము వచ్చినది.

స—ఇంటిపెత్తనమా?

ప—అవును. చిన్నతనంలో పెత్తనం.

స—ఈలాటి పెత్తనమా చిన్నతనంలో రావలసినది?

ప—మరి ఒకలాటి దైతే, అది బాల నెరుపులాగు చూడడానికి అందవికారంగా ఉంటుంది. నేను చిన్నప్పుడు స్కూలులో చదువుకొనే దినాలలో మా మాస్టరుగారి కొకరికి—పట్టుమంటే పాతికేండ్లు నిండా లేవుసుమా—ముగ్గుబుట్టలాగు నెరిసిపోయింది తలంతా. (వీధితలుపు కొట్టినట్టు చప్పుడు వినఁబడును.)

స—ఎవరో పిలుస్తున్నారు, వారపు పిల్లవాడేమో? పాపము! ఈవేళ ఎందుచేతనో కాని చద్ది అన్నానికి రాలేదు.

ప—వాకిటిలో నౌకరుపిల్ల యేమి చేస్తున్నది, తలుపు తీయక?

స—అమ్మణ్ణి నిదురపుచ్చి తానుగూడా నిద్ర పోతున్నది కాబోలు. నేను వెళ్లి తీస్తాను. (వెళ్లి చేతిలో ఉత్తరముతో తిరిగి వచ్చి సంతోషముతో) అత్తయ్యకు నూరేండ్లు ఉన్నాయి సుమండి. రామేశ్వరంనుంచి ఆవిడ వ్రాసిన ఉత్తర మిదిగో టపాబంట్రోతు తెచ్చి యిచ్చినాడు.

ప—క్షేమంగా ప్రవేశించినదా? ఏదీ చదువు.

స—(చదువును) "శ్రీరస్తు. చిరంజీవికి ఆశీర్వచనములు. మే మీ ఉదయం రామేశ్వరస్వామికృపవల్ల సుఖంగా రామేశ్వరం ప్రవేశించినాము, సేతుస్నానం చేసినాము. ఇక్కడ యింకా రెండుమూడురోజులుండి తీర్థాలన్నీ సేవించి ఆపయిని మధురమీదుగా వారం రోజులలో శ్రీరంగం చేరుతున్నాము. మనవైపున ఉన్నట్టు ఇక్కడ యెండలు తీవ్రంగా లేవు. ఇంత మంచి సహవాసం ఈతరుణం తప్పితే మళ్లీ దొరకదని యెప్పుడూ గడప దాటి వెళ్లినదాన్ని గాకపోవడంచేత, యేమిటో వెఱ్ఱిపడి యీలాటి వేసవికాలంలో యిల్లు విడిచి పిల్లలను విడిచి యాత్రకంటూ బైలుదేరినాను. నాప్రాణా లన్నీ మీమీదనే ఉన్నాయి. మీ రిద్దరూ చిన్నవాళ్లే:—పయిగా సీత చంటిబిడ్డతల్లి. ఎప్పుడూ నన్ను విడిచి ఉన్నవాళ్లు కారు. గనుక యిల్లు జాగ్రత్తగా చూచుకోవలెను. గాడుపురోజులలో చంటిపిల్లను బహు జాగ్రత్తగా చూడవలెను. నీవు సినిమాలకు నాటకాలకు వెళ్లక చీకటి పడకుండా ఇల్లు చేరుకోవలెను." ఈచివరమాట బాగా వినండి.

ప—వింటున్నాను పయిని చదువు.

స—“ నేను నెలలోపులో యింటికి వస్తున్నాను. మీ క్షేమసమాచారం తిరిచినాపల్లి కాలేజీలో నీస్నేహితుని పేర వెంటనే ఉత్తరం వ్రాసి తెలిపితే నాకు తెలుస్తుంది. కొంత మనసు కుదుటబడుతుంది. మళ్లీ శ్రీరంగంనుంచే వ్రాస్తాను.—మహాలక్ష్మి.”

ప—ఇది సంతోషవార్త. బాగా ఉంది. నెల లోపా? సరే, తిరిగి అమ్మడి అన్నప్రాశనకు ఇల్లు చేరు కొంటుం దన్నమాట.

స—అవును. చల్లని సంతోషవార్త విన్నారు కాబట్టి కడుపు చల్లగా పెరుగు అన్నం తినండి, పనస తొనలు వేసుకొని. (రెండూను వడ్డించును.)

ప—పనసతొన లెక్కడివి?

స—నరేంద్రపురంపార్టీ పంపినాడని గుమాస్తాగారు చెప్పినారు.

ప—ఈ నెలవుదినాలలో మనకు మామిడిపండ్లు పనసపండ్లే కడుపునిండే ఫీజు. అయితే కొంచెం వైశాఖ పూజ చేసినావా?

స—గుమాస్తాగారికి ఒక పాళపు పెద్దచెక్క పంపినాను. ప్రక్కయింటివారికి పదితొనలు, నాకర్లిద్దరికి చెరినాలుగు, తరంగాలు పాడే యాయావరబ్రాహ్మడికి ఒక అయిదు ఇచ్చినాను.

ప—తరంగాల బ్రాహ్మడికి అయిదుపనసతొనలే యేమిటి, “ గాయతి వనమాలీ—అతిమధురం మధురం—గాయతి వనమాలీ” అని పాడినాడంటే నీ వాయనకు నిలువు దోపే యిస్తావు!

స—ఏమి యిచ్చినా ఆపుణ్యమంతా మీదే.

ప—అవును, నీవుగృహలక్ష్మివికావడంచేతనాదే.

---

# అమృత పాత్ర

పురాణం కుమారరాఘవశాస్త్రిగారు, బి. ఏ.

ఆ ప్రశాంతనిశార్థమం దచట నేను
ఒకఁడనే అటొత్తిగిలి పండుకొనినాను
కలతనిద్రలో తీయనికలలు గనుచు.

మెల్లగా నీవు వచ్చి నీమృదుకరముల
నాభుజము తట్టి మేల్కొల్పినావు; నీత
నూలత ఒకింత వంగి నీవాలుజడయె
నాగళము కౌఁగిలించుకొన్నది, శుభాంగి!

పెదవిమాటున దాఁగొని మధురభావ
మేదియో బయల్పడక, మరింతమధుర
మై, నయనయుగళముకాంతిమంత మయ్యె.

ఎవరు? అప్సరఃకన్యవా! ఈహతాశు
దరికి రానేల స్వర్గసౌధంబు విడిచి.

అమృత మొసఁగిపో వచ్చినావా? తమోవి
లీన దేహుండ నగుచు నిద్రించునాకు;
ఐనచో పాత్ర పెదవుల కందనిమ్ము,
ఒక్కచుక్కైన ఒలికిపోకుండ తెమ్ము.

అమలస్వర్గీయసౌధభాగముల నేవ
నాంతసీమల సంచారివౌదువో, అ
టకె ననుంగూడఁ గొనిపోవటవె, అమర్త్య
సీమ కర్హుండఁ ద్వత్సుధాసేచనమున.




## గుడ్డాడిసొమ్ము

శర్మ

ఒకవూళ్లో ఒక సెట్టి వుండేవాడు. అతడు చాలా బీదవాడు. ఆముదం అమ్ముకొని వర్తకం చేస్తూవుండేవాడు. దాంతోనే జీవనం. పిత్రార్జితం సున్న. ఒకరోజున ఆముదం పీపా తీసికో వెళుతున్నాడు, ఎద్దుమీద వేసి, ఆముదం కొనుక్కోవద్దామని. గోదావరిగట్టువెంబడే వెడుతున్నాడు. "గుడ్డాడిసొమ్ము ఏట పడి పోతోంది"అని వినపడుతోంది. వంగిచూసాడు. ఒక గంగాళం కనపడింది. దాన్నిండా కాసులు వున్నాయి. వాటి నన్నిట్నీ పీపాలో పోసు కొన్నాడు. వెనక్కి దారి పట్టాడు

చీకటిపడేప్పటికి ఒకవూరుచేరుకొన్నాడు. ఆవూరి సెట్టింట్లో బస. పాపం ఆసెట్టికూడా చాలాబీదవాడే. "ఆపీపా యేమిటి" అని ప్రశ్నించాడు, భోజనాలయాక నలుగురు పెద్ద మనుష్యులతో మాట్లాడుతున్న సమయాన్న. "ఆముదంపీపా" అని సమాధానం చెప్పాడు. పడుకోమని ఒక వసారా చూపెట్టాడు సెట్టి. లోకాభిరామాయణమంతా అయాక పీపా ఆ వసారాలో పెట్టుకొని దాన్నే తలచుకొంటూ నిద్రపోయాడు.

ఆ రాత్రే బసయిచ్చిన సెట్టిభార్య నీళ్లాడింది. ఇంట్లో ఆముదం లేదు. ఆముదం పీపా సంగతి జ్ఞాపకంవచ్చి దానిదగ్గిరకు వెళ్లి మూత తీసాడు. దాన్నిండా మొహిరీలే. వాట్ని ఇంట్లోకి జారేశాడు. ఒక మొహిరీపెట్టి ఆముదం కొని పీపానిండా పోశాడు, చడీచప్పుడు కాకుండా.

తెల్లారాక మనసెట్టి లేచి ప్రయాణ మయ్యాడు, పురుడు వచ్చినసంగతి తెలిసి కొని, ఇంటివాళ్లకి యిబ్బంది అవుతుందేమో అని. పీపా యెత్తాడు. తేలికగా వుంది. మూత తెరిచాడు. రాత్రి జరిగిన సంగతులన్నీ తెలిసి కొన్నాడు. దాన్నిబట్టి నలుగుర్లోనూ 'ఆముదంపీపా' అని చెప్పాడు. మెదల్టానికి వీలులేదు. పీపా ఎద్దుమీద పెట్టాడు. "పిల్లా పిల్లాడా"అని ప్రశ్నించాడు సెట్టిని. "గుడ్డివాడు" అని సమాధానం చెప్పాడు సెట్టి. "గుడ్డివాడిసొమ్ము చేర వేశాముకదా" అనుకుంటూ మన వర్తకుడు యింటిదారి పట్టాడు.

# వంకాయ

టి. వి. కనకవల్లిగారు

పూర్వ మొక నవాబుగా రుండిరి. వారి వద్ద నొక బ్రాహ్మణుడు మంత్రిగా నుండెను. ఇట్లుండ కొంతకాలమునకు మంత్రిగారి కొమార్తె వివాహము వచ్చెను. ఆ సందర్భములో నవాబుగారికిని ఇతరపెద్దమనుష్యులకును విందుజేయ దలచి, మంత్రిగారు వారి నందర నాహ్వానించెను. విందునకై అనేకభక్ష్యములు తయారుచేయబడినవి. వీనితోకూడ నూనెవంకాయను గూడ మంత్రిగారు తయారు జేయించిరి. నవాబుగారుకాని యాతనివజీర్లుగాని యెప్పుడును నూనె వంకాయను తినియెరుగరు గదా, వంకాయనైనను చూచియెరుగరు. నూనెవంకాయ రుచికి నాశ్చర్యపడుచు నవాబుగారును ఆతని యనుచరులును ఇతరపదార్థములను తినుటమాని, దానినే తినదొడగిరి. ఇంతలో నవాబుగారు తన సమీపమున నిలిచియున్న మంత్రినిజూచి 'యిది యేమిపదార్థ'మని ప్రశ్నించిరి. అతడు, 'ఇది నూనెతో పక్వముజేసిన వంకాయ' అని విన్నవించెను. తక్షణమే నవాబుగారు 'ఒక వంకాయను తెచ్చి చూపు' మనిరి. మంత్రి ఒక పెద్దవంకాయను తెప్పించి వారి కిచ్చిరి. ఆవంకాయను చేతబట్టుకొని నవాబుగారు త్రిప్పి త్రిప్పి చూడసాగిరి. కొంతతడ విట్లుచూచి నవాబుగారు, "వహవ్వా! వహవ్వా! దీనితో సమానమైన వస్తు వీప్రపంచమునందు లేనే లేదు. కావుననే దీనిశిరమున 'అల్లా' కిరీటము నొకటి నిర్మించియున్నాడు"అని పొగడసాగెను. ప్రక్కనున్న వజీర్లును "అచ్ఛా అచ్ఛా" యనుచు గడ్డముల సవరించుకొనిరి. విందు పూర్తియయ్యెను. ఆదినమునుండి నవాబుగారు వంకాయనుతప్ప ఇంకొకపదార్థమును తినగూడదని తన యాస్థానములోనివారికేకాక, ప్రజలకునుగూడ గట్టియుత్తరువు చేసెను. కొన్నిదినములకే ఊరిలోని తోటలన్నియు వంకాయతోటలుగామారెను. ఎక్కడచూచినను వంకాయలే! ఎవ్వరియింటజూచినను నిత్యము వంకాయకూరయే! కొంతకాలమునకు వంకాయలు కాయుకాలము గడచిపోయెను. ఒక వంకాయ కూడ దొరకనట్టిస్థితి వచ్చెను. నవాబుగారికి కోపము వచ్చునేమోయని ముండ్లవంకాయలను దెచ్చి వండిపెట్టుచుండిరి. ఒకానొకనాడు వంటవారి పరాకువలన కూరతోడ ముల్లొకటి చేరియుండి నవాబుగారి గొంతులో గ్రుచ్చుకొనెను. నవాబుగారికి వంకాయపై మహా ఆగ్రహము కలిగెను. తక్షణమే వజీర్ల నందరను పిలిపించెను. వారందరు వచ్చినతోడనే నవాబుగారు వారితో వృత్తాంతమంతయు జెప్పి ఆదినము మొదలుకొని యెవ్వరుగాని వంకాయకూరను తినగూడదని గట్టిగా నొక్కిచెప్పెను. ఈ మార్పునకు కారణము దెలియక చకితులైన వజీర్లనుజూచి నవాబుగారు "యీ వంకాయవంటి హల్కావస్తువు లోకములో లేనేలేదు. కావుననే దీని శిరమునందు 'అల్లా'

ఒకగూటమును కొట్టియున్నాడు" అని పలికెను. వజీర్లందరునుగూడ "అచ్ఛా! అచ్ఛా!" యని యేకగ్రీవముగా తమ సమ్మతిని దెలిపిరి. తన ప్రజలలో మెవ్వరుగాని వంకాయను స్మరింపనైన స్మరింపకూడదని నవాబుగారు శాసించిరి. మరల కొలదిదినములలో వంకాయతోటల న్నియు నేలచదరమయ్యెను. వెదకిచూచినను వంకాయ మొక్కగూడ దొరకదు.

---

## కోమటియుక్తి కోటిసేయు

శ్రీ కమలానాథ రాయిగారు

అనగా, అనగా ఒక ఊరిలో ఒక కోమటి ఉండేవాడు. అతనికి భార్యతప్ప ఏవిధమైన సంతానముగాని, బంధుగులుగాని లేరు. ఆ కోమటియొక్క వ్యాపారము బాగుగా సాగుట చేత చాల ధనమును ఆర్జించెను. ఆ ఊరు నందు ఉండు ఒక దొంగ కోమటిధనమును దొంగలింప ప్రయత్నించుచుండెను. ఇట్లుండ వా డొకనాడు కోమటిదంపతులకు తెలియ కుండా పెందలకడనే వారింట జొరబడి, అటకు పైని దాగుకొనెను. కోమటిదంపతులు ఇద్దరు రాత్రిభోజనముచేసి దొంగదాగుకొనిన అటకు క్రిందనే పండుకొనిరి. కొంతసేపటికి భార్యా భర్తలు పండుకొనిరో లేదో యని దొంగ అటకుపైనుండి తొంగిచూచెను. ఆ సమయ మున కోమటి దొంగను చూచెను. కోమటి తన్ను గాంచలేదని నిర్భయముగా దొంగ అటకుపైననే కూర్చుండియుండెను. దొంగ, దొంగ యని కేకలు వేసినయెడల దొంగ అటకుపైనుండి దిగివచ్చి తమ కేమి హాని చేయునో యని తలచి కోమటి ఒక యుక్తిని పన్నెను. అదేమనగా భార్యను లేపి "నీకు మగబిడ్డ పుట్టిన ఇష్టమా లేక ఆడుబిడ్డ పుట్టిన ఇష్టమా" అని అడిగెను. "నాకు ఆడబిడ్డ పుట్టిననే మంచిది" అని భార్య బదులు చెప్పెను. అది విని "నాకు మగశిశువు జనన మొందుటే ఇష్టము. కుఱ్ఱవాడు పుట్టిన యెడల వానికి 'అప్పడు' అని నామకరణము చేసి, ఐదుసంవత్సరములు వచ్చిన వెంటనే అక్షరాభ్యాసము చేయించి బడికి బంపుదును. వాడు పెద్దచదువు చదివి గొప్ప ఉద్యోగము చేసి మనలను పోషించును. వాడు బడినుండి వచ్చుట ఆలస్యమైనయెడల అరుగుపైని నిలచి 'అప్పడూ' 'అప్పడూ, అని కేకలువేసి పిలతు" నని కోమటి గట్టిగా అరచుచుండెను. ఆ కేకలు విని వాని పొరుగున నున్న 'అప్పడు' అనువాడు లేచివచ్చి తలుపు తట్టుచు "ఇంతరాత్రివేళ నన్ను ఎందులకు పిలచితి" వని అడిగెను. "నిన్ను నేను పిలువ లే" దని కోమటియు, "నన్ను పిలచియు లే దనుచున్నా వే" మని అప్పడును తగువు లాడ మొదలిడిరి. ఆ తగువును విని ఇరుగు పొరుగువారు లేచివచ్చి అచ్చట మూగి 'యే

మే' మని అడగగా కోమటి ఇట్లు చెప్పెను: "నాకు మగశిశువు పుట్టినయెడల 'అప్పడు' అని పేరుపెట్టి వానిని బడిలో వేసెదననియు వాడు బడినుండి వచ్చుట ఆలస్యమైన యెడల అరుగుపై నిలచి 'అప్పడూ' 'అప్పడూ' అని పిలచెదననియు నాభార్యతో చెప్పుచుంటిని; కాని ఈయనను పిలువలేదు. నా భార్య నా మాట చెప్పనని మీరు భావించినయెడల అటకుపైనుండు పెద్దమనుష్యుని అడుగు" డనెను. వచ్చినవా రందరును 'అటకుపైని యెవ రున్నారు' అని ఆశ్చర్యమును జెంది అటకు ఎక్కి పైనుండువానిని పట్టుకొని దొంగగా తెలిసికొని వానిని రాజభటుల కప్పగించిరి.

కథ కంచికి; మనం ఇంటికి.

---

# వై రా గ్యం

ప్రో. సీ. రా. ఆచార్యులుగారు

ఒకవూళ్లో ఒక కాపుకుటుంబం ఉండేది. ఆ యింట్లో అందరు వైరాగ్యానికి పేరుపోయినవాళ్లు. ఒక నాడు త్రిమూర్తులు వాళ్ల వైరాగ్యాన్ని 'పరీక్షింతా'మని ఆవూరికి వచ్చారు. వాళ్ల పొలంలో బ్రహ్మదేవుడు ఒక పుట్ట అయినాడు; శివుడు నాగుపాము అయి అందులో చేరుకున్నాడు; విష్ణువు ముసలిబాప డయి ఆదగ్గర నిలుచుకున్నాడు.

తండ్రికొడుకు లిద్దరు తెల్లవారే లేచి నాగళ్లు కట్టుకొని పోయి ఆపొలంలో దున్నుతూ పుట్టదగ్గరికి రాగానే పుట్టలోఉన్న పాము బయటికివచ్చి కొడుకును కాటువేసింది. నిలువునా కిందపడి ప్రాణాలు విడిచినాడు, వాడు. వెనక మడకతో వచ్చినతండ్రి చచ్చిపడివున్న కొడుకును జూచి కాళ్లుపట్టి యీడ్చి ఆవలపారవేసి దున్నుకుంటూ పోయినాడు. అక్కడున్న ముసలిబాపడు వాడిదగ్గరకు వచ్చి 'అయ్యో, చేతికందినకొడుకే! అందులో ఏక పుత్రవిషయం; పామువాత పడి చచ్చెనే! నీకీవయసులో ఎంతదుఃఖము ప్రాప్తించిందోయి!' అని ఓదార్పు మాటలు చెప్పినాడు. వాడు ఆయనను చూచి చిరునవ్వు నవ్వి, "వైరితండ్రీ, దీనికి విచార మెందుకు మనకు?

'ఋణానుబంధరూపేణ పశు పత్ని సుతాలయాః,
ఋణక్షయే క్షయం యాంతి కా తత్ర పరివేదనా'

అని చెప్పలేదా పెద్దలు? ఋణం వున్నంతవరకు బతికి వుండి, తీరగానే తనదోవను తాను పోయినాడు వాడు. ఈమాత్రానికి చింత ఎందుకు" అని దున్నుకుంటూ వుండినాడు.

'వీడితో లాభం లే' దనుకొని ముసలాయన వాని పెండ్లాముదగ్గరికి పోయి జాలి పుట్టేట్టుగా కొడుకు చావును వినిపించినాడు.

అది విని ఆమె ఒక నిట్టూర్పు విడిచి, "ఏమో నాయనా, ఇది మాయలోకం.

'అనేకశతభాండాని భాండకారః కరోతి వై,
భిన్నభాండాన్ పరిత్యజ్య, కా తత్ర పరివేదనా'

అనడం నీవు వినలేదా? అయ్యా, కుమ్మరవాడు పగిలిపోయిన కుండలను పారవేయగా అవి మంటిలో కలిసిపోతున్నవి కదా! ఇదికూడ అంతే కామా! దీనికెందుకు విచారము?" అనిచెప్పి తల్లి ఏదోపని చూచుకోపోయింది.

'ఆమొగుడికి తగినపెండ్ల మేరా' అని ఆశ్చర్యపడుతూ, చచ్చినవాడి భార్యతావుకు పోయి మొగుడి చావును గుండెబద్దలయ్యేట్టుగా తెలిపినాడు, బ్రాహ్మడు

ఇక ఆమె అన్నదికదా, "అయ్యా, ఇదొక పెద్ద సంగతిగా చెప్పి నన్ను ఓదార్చుతున్నావు!

'ఇదం కాష్ఠ మిదం కాష్ఠం నదీతోయేషు సంగతమ్'
సంయోగేచ వియోగేచ కా తత్ర పరివేదనా'

అన్న పెద్దలమాట నీవు వినలేదా! కాలప్రవాహంలో రెండుజీవులు కలుస్తూ ఉంటవి, భార్యాభర్తలుగా; మళ్లీ విడిపోతూవుంటవి. అక్కడనుంచి దేనిదారి దానిదే. దీనికా నేను దుఃఖించవలసింది! పనిలేదు" అని నిర్వికారంగా ఉండిపోయింది. ఆ బ్రాహ్మడక్కడనుంచి ఆమె తమ్ముడిదగ్గరకు వెళ్లి చెప్పినాడు. వాడయినా దుఃఖించడా అనుకున్నాడు. వాడాయనను పారచూచి, "స్వామీ—

'మాతులో యస్య గోవిందః పితా యస్య ధనంజయః,
అభిమన్యుర్హతో యుద్ధే కా తత్ర పరివేదనా'

అనే పెద్దలమాట తమకు తెలియంది కాదు. గొప్ప వీరులయిన కృష్ణార్జునులు కంటికి రెప్పలవలె కాచియున్నా అభిమన్యునికి చావు తప్పిందా? ఇంక మా బావమాటెందుకు?" అని నిర్లక్ష్యంగా మాట్లాడినాడు.

మాయబాపడు వీరందరి వైరాగ్యానికి నివ్వెరపోయినాడు. కుటుంబంలో అందరినీ పరీక్షించడం అయింది. తనపట్టు నెగ్గిందికాదు. ఇంక పనికత్తె ఒక్కతె మిగిలింది. దాన్నయినా లొంగదీయక పోతానా అనుకొన్నాడు. పాపం దానిదగ్గరికి చేరినాడు. చావు సంగతి చెప్పి 'నీకు ముందు దిక్కు లేకపోయిరి కదా' అని తానుకూడా ఏడిచాడు. "నీవు చాల ముసలాయనవు. లోకస్వభావం ఎరగకపోవడం చాలా వింతగా ఉంది. చూడు:

'ఏకవృక్ష సమారూఢా నానాజాతివిహంగమాః,
తత్ క్షయే చాపరం యాంతి కా తత్ర పరివేదనా'

పక్షులు ఆశ్రయమయినచెట్టు లేకపోయినప్పుడు ఇంకొక్క చెట్టును చూచుకోవడం లేదా? నారు పోసినవాడు నీరు పొయ్యకపోతాడా? ఎందుకు నాకు విచారం" అని జబాబు చెప్పింది.

అప్పుడు త్రిమూర్తులు వీరివైరాగ్యానికి చాలా మెచ్చుకొని వారికందరికి ప్రత్యక్షం అయి, చచ్చినవానిని బ్రదికించినారు. 'ఇంక వీళ్ల నిక్కడనే వుండనిచ్చామంటే వైకుంఠం కుక్కలదొడ్డిఅయిపోతుం' దనుకొని వాళ్లకు మోక్షం ప్రసాదించారు. వెంటనే దివ్యవిమానాలు వచ్చినవి. వాళ్లందరు వాటిని ఎక్కి వైకుంఠం చేరినారు.

కథ కంచికీ, మనం ఇంటికీ చేరుకున్నాము.

---

# "చోరః"

ఒకగ్రామంలో నాలుగువేదాలూ, ఆరుశాస్త్రాలు నోటికి వచ్చేట్టు చదివిన ఒక శాస్త్రులు ఉండేవాడు. ఆయనకు చదివి గట్టిచేసిన చదువును ఉపయోగపరుచుకునే తెలివితేటలు సున్న. అయితే తన్నుమించిన పండితుడే లోకంలో లేడన్నగర్వం చాలా ఉండేది ఆయనకు. వారింట్లో వారుచదివిన పాతతాటాకు పుస్తకాలు రెండుబండ్లకు సరిపోయేవి అటకనిండుకు నిండి ఉండేవి. అహోరాత్రాలు వాటిని ముందుపడవేసుకొని ఏవో గట్టిగా వల్లిస్తూ ఉండడం ఆయనకు అలవాటు. మఱీ, తప్పో, ఒప్పో సంస్కృతమే మాట్లాడేవాడు. అది చూచి 'ఎంత పెద్దపండితుడురా' అని ఆయనకు, ఆయన సంగతి తెలియనివాళ్లెవళ్లయినా ఇంతో అంతో తరుచు ముట్టచెపుతూఉండేవారు. సిత్రార్జితంకూడా బాగా వుంది, ఆయనకు. తనకు యాభయి, భార్యకు నలభయియెనిమిది దాటినా సంతానం కలగనేలేదు. దమ్మిడీ కర్చుకు చచ్చేరకం మనిషి. సేకరం అంతా రూపాయలుగామార్చి బుట్టలోపోసి అటకమీదైన తాటాకుపుస్తకాల కట్టల్లో దాచడం మామూలు. అట్లా రెండు బుట్టలకు నింపి దాచుకున్నాడు.

పక్కయింట్లో, అంత పండితుడు కాకపోయినా లోకజ్ఞానం కల పంతులొకాయన, ఉండేవాడు. ఆయన నిండా పేదవాడు; పిల్లలకోడి. దినభుక్తి జరగడంకూడ కష్టం. మంచిపరిచయం ఉన్న పక్కయింటిశాస్త్రులను ఎన్నిమార్లు సహాయం చేయమని వేడుకొన్నా ఆయన చేశేవాడుకాడు. పంతులకు మండిపోయి, శాస్త్రులడబ్బును ఎట్లా అయినా సంగ్రహించవలెననుకున్నాడు. శాస్త్రులతో మంచి పరిచయం ఉండడంచేత ఆయన గుట్టంతా పంతులకు తెలుసు. సమయం చూస్తూ ఉన్నాడు.

ఒక అమావాస్యనాడు, అర్ధరాత్రపుడు, కన్ను పొడుచుకున్నా కానరాని చీకట్లో, శాస్త్రులు తలుపు తీసికొని వెలుపలికివచ్చి మళ్లీ పోయేటపుడు తలుపువేసి గడియపెట్టడం మరిచిపోయినాడు. అది కనిపెట్టినాడు పక్కయింటిపంతులు. మసిపూసుకొని మారువేషం వేసుకొన్నాడు; మరొకగడియకు శాస్త్రులుగారియింటికివచ్చి వాకిటితలుపు మెల్లగా తీసినాడు; కిర్రుమని శబ్దముయింది. శాస్త్రులు అది విని మెలకువపడి 'కవాటశబ్దః కిం' అన్నాడు. పంతులు మారుగొంతుకతో 'చో' అన్నాడు. 'చో అంటే ఏమిటా' అనే ఆలోచనలో పడిపోయినాడు, శాస్త్రులు. పంతులు చప్పుడు కాకుండా అటకదగ్గరకు చేరి, దానిపైన ఉన్న రూపాయలబుట్టలను రెంటినీ తీసికొని మళ్లీ వెలుపటికి వచ్చి తలుపు చేరవేసినాడు. మళ్లీ కిర్రు మన్నది. 'పునః కవాటశబ్దః కిం' అన్నాడు మళ్లీ శాస్త్రులు. 'రః' అంటూ పంతులు తనయింటికి దాటుకున్నాడు. ఇదివరకు విన్న 'చో' అనేదానికే అర్థం తెలియక ఆలోచిస్తూ ఉండే శాస్త్రులను, 'రః' ఒకటి తగులుకుంది. అదిమొదలుకొని నిద్రపోకుండా తెల్లగా తెల్లవారేదాకా ఆలోచించాడు, వాటి అర్థానికోసం; తెలిసింది కాదు. పండ్లయిన తోముకోకుండా నిఘంటు సంపుటాలన్నీ ముందరపెట్టుకొని వీధి తిన్నెపయిన కూర్చుని ఆకులు తిప్పుతూ ఉన్నాడు.

పక్కయింటి పంతులు నిద్రలేచి పనులు తీర్చుకొని ఈశాస్త్రులను చూచినాడు: 'అయ్యా ఎవ్వరులేరే? ఏమిటి గ్రంథాలు తిరగవేస్తున్నారు' అని అడిగినాడు. రాత్రి జరిగినసంగతంతా శాస్త్రులు చెప్పినాడు. పంతులు ఆరెండక్షరాలను వరసగా వ్రాసి శాస్త్రులకు చూపించాడు. అంత శాస్త్రులు గాభరాపడి లేచి లోపలకుపోయి ఇల్లంతా చూచుకున్నాడు. అటకపయిన రూపాయలబుట్టలు లేవు. నిలువున నీరయి నేల మీద కూలబడ్డాడు, 'నారూపాయలన్నీ దొంగలు దోచుకొని పోయినారోయి,' అని అరిచి.

'రాత్రి రెండున్నరజామప్పుడు ఎవరో రెండు బుట్టలు ఎత్తుకొని మీయింట్లోంచి పోతూఉండగా నేను చూచినానండీ. మీతో మాట్లాడ్డానికి వచ్చి మీకు పండ్లో ఏవో సమర్పించి పోతూన్నవాళ్లనుకున్నానండి. అయ్యో, పాపం! రూపాయలు పోయినవా' అని పంతులు అన్నాడు.

ఇంతలో దొడ్లో పనిచేసికో పోయిన శాస్త్రుల భార్య వచ్చి 'పొద్దున వాకటితలుపు గడియ తీసి ఉండినది. మీరే తీసినారనుకున్నానండి' అన్నది.

శాస్త్రులు అదిమొదలు డబ్బును మూటకట్టడం మాని సుఖంగా అనుభవించుకొంటూ వుండినాడు. కథ కంచికీ, మనం ఇంటికీ చేరుకున్నాము.

'మనోహరం.'

# చిచ్చుపువ్వు

శ్రీ ముక్తేవి లక్ష్మీనృసింహదాసు గారు, బి. ఏ.

అమితనిష్ఠాగరిష్ఠత కగ్గిపుట్టి
తప్తమై కిల్బిషమ్ములు తఱిగిపోయి
అచ్ఛహృదయస్థుఁ డైనట్టియవసరమున
గగనసుమ మది సోకినకరణి యయ్యె.

ఇది మహోత్పలకారంభ మిద్ది శిశిర
హిమము జిల్లనిపించుట, నిదియు నొక్క
యననుభూతమృత్యుసుఖము కనగరాని
భూసువర్లోకనిత్యవిభూతి యిదియ.

జలధి కిరుటంచులనుగూడఁ గలియఁగట్టి
ఒక్కటే యన్న భావమ్ము నూఁదికొన్న
నాప్రకృతిలోన నిది యేలొ నాద మొలుకు
గిరులు చుట్టుచు విన్నసంగీతమట్లు.

ఇదియు పంచేంద్రియమ్ముల గదిసికొనుచు
మానవాకృష్టదైవికమహిమవోలె
అన లనిత్యపుటంచులఁ గొసరుకొనుచు
కట్టుకొనఁ జూచె నొకపూర్వకర్మరజ్జు.

తెరలు తెరలట్ల మబ్బుపందిరులనడుమ
పొడవు సాగించుకొన జూచి నడచునట్టి
మెఱపు నామీద నొకమారు మెరసె ననక
పట్టి బంధింపజూచిన భ్రాంతి కయితి.

ఈమహాభ్రాంతి దట్టించి యింత కింత
జలము గురియించు మేఘమ్ముసరణి నన్ను
పలుచబరచినకొలఁది నాబలము తగ్గి
ఎడము దూరమ్ము విచ్ఛిత్తి నేల పెంచు?

ఇది గ్రహించిననామెద మెగసిపోవ
పొగిలి పొగలెత్తి సెగలెత్తి రగిలి రగిలి
ఇంతచిఱుమేఘమై యింత కింత పెరిగి
జలధరస్వామిపోలిక చదలు ముట్టు
అసలు పడనీను నీటిబొట్టైన నింక.

హద్దు కుంచించ నొకబెత్తెడైన నింక
అంతలింతలు తగ్గక యట్టె నిలిచి
ప్రళయమేఘాకృతిగ నేను ప్రజ్వలింతు
మెఱపుతీవియ! నీ విందు మెఱయవచ్చు
వెలుగు వెలిగించి నన్ను కవ్వించవచ్చు
వచ్చి నీయిచ్చ నిట నచ్చుపడగవచ్చు
ప్రళయమేఘమ్మునే నేను ప్రళయ మేను.

[గగనసుమము శూన్యతారంభము. ఇది గజపలాయనోభయమిథ్య కాదు. అయినను ఆరోపమువలన నుత్పలకారంభాదికము లనుభూతములే యగుచున్నవి. నాద మొలుకుట దీని యనంతభావానేకములలో నన్యతమము. ఇదియే కర్మరజ్జువని వ్యపదిష్ట మగుచున్నది.

మెఱపు జీవస్వరూపము. మేఘము తదాగూఢమైన ప్రకృతి. ఉభయులకు ఉభయ భ్రాంతి. "అసలు పడనీను నీటిబొట్టయిన నింక" యనుదానిలో కవియొక్క తపోవ్యగ్రత వ్యంజితమైనది. చివరిపద్యము ఏతావతా యిది జీవప్రకృతిలీలయని నిర్దేశించుచున్నది.

—ఒకరు.]




# అఱలపెట్టె

కె. నరసింహాచారిగారు

ఇచ్చట వర్ణించబడిన అఱలపెట్టెయందు తొమ్మిదిఅఱలు కలవు. ఇదేరీతిని మన యిష్టము వచ్చినన్ని అఱలుగల పెట్టెలను చేయవచ్చును.

చిత్రము 1.

పదిఅంగుళములు నిడివియు, అంతియ వెడల్పును గల ABCD అను ఒకఅట్టను దీసికొని, దానిఅంచువెంబడి రెండు అంగుళముల వెడల్పుగల భాగములను (Margins) గుర్తించవలెను. అప్పుడు 6 అంగుళములు చదరము A, B, C, D, లోపల ఏర్పడును.

చిత్రమునందలి విధముగ మూలలందు కత్తిరించి అంచులను ఎత్తి మూలలను అతికించినయెడల పెట్టె అడుగుభాగము (చి. 6 B) ఏర్పడును.

చిత్రము 2.

పిమ్మట 8 1/4 అంగుళము నిడివియు, అంతియ వెడల్పును గల మఱియొక అట్టను దీసికొని అంచువెంబడి చుట్టును, ఒకఅంగుళముల వెడల్పుభాగమును గుర్తించుకొనవలెను. అప్పుడు చుట్టుగోడలు ఒక్కొక్క అంగుళములుగా EFGH అను 6 1/4 అంగుళము ప్రక్కపోగల మూతభాగము మధ్య మిగులును. దీనినిగూడ ముందటితీరున మూలలందు కోసి, అంచులను మడిచి మూలలను అతికించిన యెడల పెట్టెమూత పూర్తియగును. (చి. 7.)

మొదటి చిత్రమునందు AB యొక్క కొలత 6 అంగుళము లైనయెడల రెండవచిత్రమునందలి EF యొక్క కొలత ఒకపాతిక అంగుళము ఎక్కువగా నుండిననేగాని ABCDకి పైన మూతగా EFGH దిగబడజాలదు.

చిత్రము 3.

ఒకటవచిత్రమునందలి AB కొలతకన్న 1/8 అంగుళము తక్కువ అనగా 5 7/8 అంగుళముల పొడవును, పెట్టెకు లోతగు 2″ కొలతకన్న 1 1/8″ తక్కువ అనగా 1 7/8″ వెడల్పును గల అట్టముక్కల నాలుగింటిని దీసికొనవలెను. (ఇందలి పొడవువెడల్పులలో 1 1/8″ తగ్గించుట, పెట్టెలో నీతునుకలు చక్కగ నిముడుటకొఱకే.) వాటి యందు

పొడవునందు 3 సమభాగములు గుర్తించవలెను. KL (Nనందు), PQ (Mనందు)నుచూడుడు: KL వద్ద అట్టవెడల్పులో సగమువఱకు మాత్రము కోతలు వేయవలెను.

చిత్రము 4.

పిమ్మట Mలోని Pకోతను Nనందలి Qకోతలో దిగవేసిన యెడల చిత్రమునందలి విధముగా నేర్పడును. ఇదేరీతిని తక్కినకోతలలో తక్కినముక్కల కోతలను దిగవేసినయెడల 5-వ చిత్రము నందలి విధముగ అఱలు ఏర్పడును.



















చిత్రము 6.

ఈఅఱలను, చిత్రము నందలి B అనుపెట్టెలో దిగవేసిన యెడల అఱలపెట్టెపూర్తి యగును. ఏడవ చిత్రము మూత యగును.

ఇందలి కొలతలను మార్చి మన యిష్టము వచ్చిన విధము లగు పెట్టెలను చేసికొనవచ్చును. పెట్టెలుపెద్దవైనయెడల గట్టి అట్టలను ఉపయోగించిన బాగుండును.

# పాత పాటలు (సెప్టెంబరు ౧౯౩౨ సంచిక తరువాయి) నేదూరి గంగాధరంగారు

కాకరికాయల్లు కరిభూషణాలు
గంట వొడ్డాణమ్ము పెద్దవదిననడుము
చిక్కుడుకాయల్లు సిరిభూషణాలు
చిలక వొడ్డాణమ్ము చినవదిననడుము.

ఏటేట పెళ్లిళ్లు కుప్ప నూర్పుళ్లు
ఎదురింటి మావదిన యేట బాలింత.

కొబ్బరికాయల్లు తోట వేయించి
కొప్వ్వారు కోదండరాము లేలేరు
గోపాలకృష్ణమ్మ మాపాల నుండు
పచ్చిపాలు తాగు బాలుడు నువ్వు
వెన్నముద్దలు తిన్న వెన్నుడు నువ్వు
కొండలు యెత్తిన కొమరుడు నువ్వు.

రోకలి చిన్నది రోలు చిన్నది
నాతోటి పోటువేయు చెలియ చిన్నది.

రాట్నము చిన్నది కదురు చిన్నది
ఏకులు వడికేది యెవరాడపడుచు
కోమలిచేతికి రత్నకంకణమ్ము
కొమరొప్ప రాట్నమ్ము గొప్పది కాదె.

తురకాళ్ల దొడ్డిలో దూడ చచ్చింది
తెచ్చుకో బావయ్య తెలకపిండిలోకి
కొయ్యవోయి బావయ్య గోరు తెగ్గోసి
వండవే మాఅప్ప కుండ చిల్లొడిచి
తినపోతె బావయ్యకు ముడు సడ్డమడెను
రాదని మాఅప్ప రాగాలు తీసి
రాగాలుతీయకప్ప నీరాతఫలము.

కాటుకపెట్టిన కళ్ల నీరు కారేను
కలకసుందరమ్ము తొలకరించేను.

కోరుకొండనుంచి కొత్తల్లు డొచ్చె
గీసిగీసి వండెను గిద్దెడిబియ్యమ్ము
తినలేక తిన్నాడు తీపులమారాడు
లేవలేక లేచేడు నేల పట్టుకొని.

చిట్టీతపళ్లమ్మ పొట్టీతపళ్లు
అమ్మకని పంపేరు అమ్మతమ్ముల్లు
మాకని పంపేరు మేన మామల్లు.

తింటేను తియదోస పళ్లు తినాలి
కంటేను తొలిచూలి కొడుకును కనాలి
అంది తే అన్నతో వియ్యమందాలి
ఆడితే వదినెతో జగడమాడాలి.

మేనమామకూతుర్ని మెచ్చి పెళ్లాడి
కన్నెచిన్నదాన్ని కడమేడనుంచు
తనయీడుప్రాయము వచ్చిననాడు
నీళ్లకెళ్లినచోట కాము డెదురాయె
ఎవరికోడలు నీవు యెవ రాడబడుచు
జీలకర్ర కలవారి చిన్నకోడలిని
ఆవాలు గలవారి ఆడపడుచుని
మెంతులు కలవారి మేనకోడలిని.

దూరాబారంనుంచి దూలాలు తెస్తే
దూలాలకేమన్న భార మున్నాదా ?
తమ్ముడు అబ్బాయి తగవు తీరిస్తె
తగవందు యేమైనా తప్పు లున్నాయా ?
నాలుగు స్తంభా లాట పాట
నడిమికి తడిమికి తప్పక తన పేరేమి ?
ఉట్టిమీద బెల్లం, పొట్టికాకర
సీసరు కొబ్బరి తలకట్టు.
కుండనిండా కందులు
రంగసాని బొందులు
జల్లెడనిండా పువ్వులు
జగ్గాలమ్మ తీర్థం.
ఆళ్లుచోళ్లు కుప్పనూర్పుళ్లు
అటకమీది బోడన్న అయన్న మొగుడు.



E. N. P.

౪. క్రొత్తదుస్తులు

తెల్లనిబట్ట. బంగారుజరీపని గలది. సాయంసమయ విహారములయందు దీనిని ధరింతురు.

# తంజావూరు నాయకరాజాస్థాన సంస్కృతాంధ్ర కవులు—౨

## ౧. గోవింద దీక్షితుడు

తంజావూరుసంస్థానము పేరెత్తినంతనే యత్యంత సన్నిహితసంబంధముచే గోవిందదీక్షితుని పేరు జ్ఞప్తికి వచ్చును. అందుచే నాయన గూర్చి మొట్టమొదట చెప్పవలయును. ఈమహామహుని సమగ్రచరిత్రమును 'భారతి' ప్రజోత్పత్తి ఫాల్గుణ సంచికయందును నాంగీరస, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ సంచికలయందును, సమగ్రముగా వ్రాసియున్నాను. తద్వ్యాసముల నిచ్చట నన్వయించుకొనుటకు పాఠకులను వేడుకొనుచున్నాను. తద్విషయము మరల విపులముగా నిచ్చుట చర్వితచర్వణమగును.

## ౨. అప్పయ్య దీక్షితుడు

ఈయన సాక్షాత్తుగా నాయకరాజాస్థాన కవి కాకపోయినను తదాస్థానకవుల చరిత్రకును నీయనకును సంబంధముండుటచేతను నీయనకూడ ప్రథమ నాయక రాజుచే పూజింపబడుటచేతను నీయనచరిత్రముకూడ సంగ్రహముగా నిచ్చుటే యవసరమగుచున్నది. దక్షిణ హిందూస్థానమున నీ పండితకవినామము నెరుంగని సంస్కృతవాఙ్మయజిజ్ఞాసు వుండడని చెప్పవచ్చును. ఈయన స్వగ్రామము దక్షిణఆర్కాటుజిల్లాలోని యడియపాలె మను గ్రామము. ఈయన వంశీయులు దక్షిణ హిందూస్థానమున ననేకస్థలముల నుండుటయేకాక ఈయన స్వగ్రామమునకూడ నున్నారు. ఈయన జన్మించిన కుటుంబము మిక్కిలి విద్వత్కుటుంబ మయి శ్రౌతకర్మలయం దత్యంతాసక్తకలది యగుటచేతను, తత్కుటుంబములో నీయనతరువాతకూడా నీ రెండు గుణములను ననువర్తించుటచేతను నీయన కుటుంబమునందలి వెనుకముందరి పురుషులనుగూర్చి చెప్పుట యనవసరము కాజాలదు. కొంత వంశవృక్షము నిట నిచ్చుచున్నాను.[2]




ఈ వంశవృక్షమును తిలకించిన నీ వంశమునకు వైదికకర్మలయందుండు ప్రత్యయము తేటపడగలదు.

1. వీరిది వడమశాఖ. ఈవడమలలో నుత్తరాదివడమలనియు దక్షిణదేశ వడమ లనియు రెండు తెగలుకలవు. వారిలో నీకుటుంబ ముత్తరాదివడమశాఖకు చెందినది.

2. కొంతభాగము వీరరాఘవకవికృత వంశావళి నుండి గ్రహింపబడినది.

అప్పయ్య దీక్షితుని తాత యగు నరసింహయాజి కృష్ణరాయల సభ నలంకరించెను.[1] అప్పయ్య దీక్షితుని తండ్రియగు రంగరాజాధ్వరి గొప్ప పండితుడై కవియై ప్రకాశాత్మయతి రచియించిన పంచపాదికావివరణమునకు వివరణదర్పణమను వ్యాఖ్యానమును రచియించెను.[2] ఈయన కద్వైతవిద్యాచార్య డను బిరుదముండెను.[3] ఈ బిరుదము గోవింద దీక్షితునికిగూడ నుండెను.[4] ఈయన యే యాస్థానమునను కవిగా నుండకపోయినను సమకాలీనులలో కీర్తిపాత్రుడై మెలగెనని తెలియును.[5] ఈ వంశమునందలి నీలకంఠదీక్షితుడను నప్పయ్యదీక్షితుని భ్రాతృపుత్రుడు సంస్కృతవాఙ్మయమున చిరస్థానమేర్పరచుకొనియున్న విద్వత్కవి.[6] ఈయన "నీలకంఠవిజయచంపు", "గంగావతరణకావ్యము", "శివలీలార్ణవము" మొదలగు ననేకగ్రంథములను రచియించుటయే కాక గోవింద దీక్షితునివలె యాన్వీక్షక్యాదుల దిట్టయై మధురరాజ్యమున మంత్రిపదవి నలంకరించినట్లు చెప్పబడుచున్నాడు.[7] ఈయన కవిత్వము గంగాలహరివలె నిర్దుష్టమై శ్రోత్రపేయమై విరాజిల్లుచున్నది. ఈయన మంత్రిత్వ విషయములో నభిప్రాయభేదము కలదు. ఏతద్వంశీయులు, ప్రస్తుతము ప్రెసిడెన్సీ కళాశాలలో సంస్కృతోపాధ్యాయులు నయిన శ్రీయుత పి.పి.యస్. శాస్త్రిగారు "వంశావళి"కి పీఠిక వ్రాయుచు నీయన క్రీ. శ. 1670 మొదలు 1705 వరకు మధురలో మంత్రిపదవిలో నుండెనని వ్రాసినారు.[8] [9] అందే మరియొకతావున నీ సంవత్సరములమధ్య కొంతకాలము మొదట రాజు మైనరై యున్నకాలమున ప్రతినిధిగాను, తరువాత మంత్రిగాను నుండెనని వ్రాసినారు. ఈ వంశీయుడే యగు శ్రీ మహాలింగ శాస్త్రిగారు మంత్రిత్వ మెంతకాలమో వ్రాయలేదు కాని నీలకంఠుడు మధురలో మంత్రిగా నుండెనని మాత్రము గట్టిగా వ్రాసినారు. కాని వారిచ్చినకాలము పైదానితో నేకీభవించుటలేదు. వారు నీలకంఠుని మంత్రిత్వమునకు క్రీ. శ. 1626 సంవత్సరమిచ్చినారు. శ్రీ పి. పి. యస్. శాస్త్రిగారు నీలకంఠుడు క్రీ. శ. 1613 సంవత్సరప్రాంతమున జన్మించినట్లు చెప్పుచున్నారు.[10] అట్టియెడ 13 వయేట అనగా క్రీ. శ. 1626 సంవత్సరమున మంత్రిగా నుండుటగాని, గొప్ప వేదాంతచర్చలో పాల్గొనుటగాని యసంభవములు. ఈ విషయమున నొక చిక్కుని కలదు. నీలకంఠుడు తన నీలకంఠవిజయచంపువును కల్యబ్దము 4738 న వ్రాసితినని చెప్పుకున్నాడు. ఇయ్యది క్రీ. శ. 1637 సంవత్సరమగును.[11] ఈ గ్రంథమీయనయొక్క మొదటిగ్రంథమని చెప్పవచ్చును. అప్పటి కింకను మంత్రిత్వపదము వచ్చి

---

1. J. O. R. Madras, Vol. III. p. 158.

2. Tanjore Skt. Catalogue, Vol. XII. p. 5206.

3. " ఇతి శ్రీమదద్వైతవిద్యాచార్య శ్రీమద్భరద్వాజకుల...శ్రీరంగరాజాధ్వరివరసూనోః..."
(విధిరసాయనము.)

4. భారతి ఆంగీరస వైశాఖమాసము, పుటలు ౮౨౬, ౮౨౭.

5. "యత్కీర్తిః సకల దిగంతరప్రచారా యో కార్షీద్వివరణదర్పణాభిధానం." (వంశావళి.)

6. ఈయన గోవిందుని ద్వితీయపుత్రుడగు వెంకటమఖి శిష్యుడు.

7. "శ్రీనీలకంఠమఖివూళిమణి స్స యోభూత్
శ్రీనీలకంఠ విజయాభిధచంపుకర్తా,
యోనీలకంఠ పదపంకజ దత్తచిత్తః
యోనీలకంఠమఖియాచనపాత్ర మాసీత్.
యః పాండ్యదేశపతి రాస యదీయకీర్తి
ర్దిక్సుందరీవదనచిత్రకభావ మేతి,
* * * *
యశ్చాధ్యువాస మధురాం మధురామగారైః.
యః ప్రబంధాన్ షట్కరో ద్వైరాగ్యశతకాదికాన్,
గంగావతరణం కావ్యం శివలీలార్ణవం తథా.
(వంశావళి.)

8. Introduction to Vamsavali, p. iii.

9. J. O. R. Madras, Vol. III. p. 144

10. Vamsavali Introduction, p. ii.

11. Ibid.

యుండ దని నా యూహ. తరువాత మంత్రి యగుట తటస్థించినయెడల శ్రీ మహాలింగ శాస్త్రిగారి యభిప్రాయము పూర్వపక్ష మగును. ఎవరి మైనార్టీలో నీయన రాజప్రతినిధిగా నుండె ననువిషయమును నిర్ధారణ చేయుటకై శ్రీ సత్యనాథయ్యరుగారు వ్రాసిన మధుర నాయక రాజచరిత్రమును వెదకినను నా కనుమానము తీరలేదు. శ్రీ శాస్త్రి మహాలింగశాస్త్రిగార్లు తిరుమలనాయకుని వద్ద మంత్రిత్వము చేసె ననుచున్నారు గాని యది నమ్ముట కెంతమాత్రమును వీలులేదు. మరియు శ్రీ శాస్త్రిగారి కాల మంగులకు విరుద్ధముగానున్నది. క్రీ. శ. 1659 సంవత్సరములో మృతినొందిన తిరుమల నాయకుని వద్ద క్రీ. శ. 1570 లో మంత్రిత్వము ప్రారంభించిన నీలకంఠు డెట్లుండుట సంభవమగును? శ్రీ శాస్త్రిగారు చెప్పినది నిజమే యైన చొక్కనాథుని యనంతర మాయన కుమారుడు కొలదిదినము లేలి చనిపోవ నాయనకొడుకు పిల్లవాడగునప్పుడు మంగమ్మగారు[1] (అనగా చొక్కనాథుని భార్య) కొంతకాలము వహించినప్పు డీయన రాజప్రతినిధిగా నుండి యుండవలెను. అట్లయిన శ్రీ శాస్త్రిగా రిచ్చినకాలము కొంతవరకు సరిపోవును. (క్రీ. శ. 1689-1706.)[2] కాని యిదికూడ నమ్ముటకు కష్టముగా నున్నది. ఏలన క్రీ. శ. 1613-వ సంవత్సరములో జన్మించిన నీలకంఠు డిప్పటికి 76-వ సంవత్సరమున రాజ్యమేలగల శరీరమనోదార్ఢ్యము లుండవలెను. ఒకవేళ నుండెనేమో? ఉండిన నుండవచ్చును. కాని యీయన తిరుమలనాయకుని కాలము నుండి మధురరాజాస్థానమున పండితుడుగా నున్నట్లొప్పుకొనక తప్పదు. ఈయనకు మధురరాజులు కొన్ని యగ్రహారముల నిచ్చిరి.[3] నీలకంఠునితరువాత నీయనశాఖ తిరునల్వేలిజిల్లా నివాసముగా నేర్పరచుకొనెను.

నీలకంఠుని తమ్ముడగు చిన్నప్పయ్య అప్పయ్య II. కు దత్తుడుగా నెడలెను. ఈయన పేరుకూడ అప్పయ్యదీక్షితుడే.[4] ఈయన "తంత్రసిద్ధాంతదీపిక" యనియు "దురూహశిక్ష" యనియు రెండుమీమాంసాగ్రంథములను రచియించెను. ద్వైతులు మీమాంసాశాస్త్రవిషయములగూర్చి యప్పయ్యదీక్షితుని వ్రాతలపై వ్రాసిన విమర్శనముల కన్నిటికి సమాధానములుగా నీరెండుగ్రంథములను రచియించెను. ఈతంత్రసిద్ధాంతదీపికను భట్టోజీదీక్షితుడు రచియించెనను ప్రవాదమున్నది కాని యది ప్రమాదము. గ్రంథాంతగద్యము స్పష్టముగా కాదని తెలియజేయుచున్నది.[5] ఈగద్యయందు ముగ్గురప్పయ్యలు పేర్కొనబడినారు. అప్పయ్యదీక్షితుడు II. కూడా అలంకారతిలకాదిగ్రంథములను రచియించినట్లున్నది కాని యీ గ్రంథము లెచ్చటను లభింపలేదు. అప్పయ్యదీక్షితుడు III. రచియించిన "దురూహశిక్ష" కూడా యెక్కడను లభించినది కాదు. ఈవంశీయులందరును కర్మఠులును పండితులునై వరలిరి. అప్పయ్యదీక్షితుని సాక్షాత్కుటుంబముయొక్క చరిత్ర మెచ్చటను కానరాదు. ఎవ్వరివద్దనో యున్నట్లు వినికిడియేకాని యింకను బయటపడక పోవుట విచారకరము.

అప్పయ్యదీక్షితుని కాలమునుగూర్చి వాదోపవాదములు కలవు. ఏతత్కుటుంబములోని యొకశాఖకు చెందిన శేషదీక్షితు లనునాయనతరువాత ప్రవ్రజించి శివా

1. ఇప్పటికిని మధురలో "మంగమ్మసత్ర" మను పేరుగల సత్రము కలదు.

2. History of Nayaks of Madura, p. 204.

3. ఈవంశమువారు పాలామడై, కడయం మొదలగు ననేకస్థలముల నున్నారు. వీనిలో నొకదానికి నీలకంఠసముద్రమని పేరున్నది.

4. ఈయనను అప్పయ్య దీక్షితుడు III. అందము.

5. ఇతి శ్రీమద్భరద్వాజకుల జలధికౌస్తుభ శ్రీకంఠమత ప్రతిష్ఠాపనాచార్యచతురధికశతప్రబంధనిర్మాణధురంధర మహావ్రతయాజి శ్రీమదప్పయ్యదీక్షిత సోదర్య శ్రీమదచ్చాదీక్షితపౌత్రేణ, అలంకారతిలకాద్యనేకప్రబంధ నిర్మాతు రప్పయ్యదీక్షితస్య పుత్రేణ, భూమిదేవీ నందనేన శ్రీమదప్పయ్యదీక్షితేన విరచితాయాం తంత్రసిద్ధాంతదీపికాయాం......"

(తంత్రసిద్ధాంతదీపికా.)

నందులను నామమును ధరించి అప్పయ్యదీక్షితచరిత్రము నొకదానిని రచియించెను. అందు అప్పయ్యదీక్షితుని జాతకముకూడా యియ్యబడినది.[1] కాని యిటీవల శ్రీ మహాలింగశాస్త్రిగారీ విషయమై పరిశోధనముచేసి యన్ని ప్రమాణములను చేర్చి చర్చించి యిది సరికాదనియు, నీజాతకము నష్టజాతకమనియు చారిత్రికవిషయములతో చర్చించిన నిది సరిపోవుటలేదనియు నిర్ధారణముచేసి యిది ప్రమాదమని సోపపత్తికముగా నిరూపించియు న్నారు.[2] వీరియభిప్రాయ మీయన విక్రమసంవత్సరము నకు సరియైన క్రీ. శ. 1520 సంవత్సరమున జననమందె ననియు[3] క్రీ. శ. 1593 సంవత్సరమున పరమపదించె ననియు. ఇయ్యది చారిత్రికదృష్టితో నాలోచించిన సమంజసముగా నున్నది. ఈసిద్ధాంతము పూర్వపక్షమగు వరకు దీనిని గ్రహింపవలెను. పూర్వపక్షముకావని నాకు గట్టినమ్మకము. దీనికి చరిత్ర మిక్కిలి బలకరముగా నున్నది. శ్రీమహాలింగశాస్త్రిగారి పితామహులును నీప్రాంతమందు మిక్కిలి ప్రఖ్యాతివడసిన మహామహో పాధ్యాయ మన్నారురుడిరాజుశాస్త్రిగారుకూడా యీ యభిప్రాయమునే వెలిబుచ్చినట్లుకూడా చెప్పబడి యున్నది.

అప్పయ్యదీక్షితుడు ఇరువది సంవత్సరములవా డగునాటికే శాస్త్రములన్నిటి నభ్యసించి విఖ్యాత కీర్తి మంతుడై పిన్నవయసుననే వివాహితుడై దీక్షితుడయ్యె ను. అప్పుడే సార్వభౌముడను నొకపండితవర్యు డీయన కీర్తిచే నాకర్షింపబడి యీయన దర్శనముచేయుట కుత్తరదేశమునుండి వచ్చెనట. ఇట్లు వచ్చి దర్శనము చేసి యీయననుగూర్చి యొకశ్లోకము[4] చాటువుగా చెప్పె నట. ఈయన వివాహమునుగూర్చి యొకరసవంతమగు గాథకలదు. జింజిలో సూరప్పనాయకుడను నొకరా జేలుచుండెను. ఈయన పండితపోషకుడు. తదాస్థానమున తత్త్వఖేల శ్రీనివాసదీక్షితుడను నొక పండితచక్రవర్తి యను కవీశ్వరుడుండెను.[5] ఈయన సర్వతంత్రస్వతంత్రు డును బహుగ్రంథనిర్మాతయునై యుండెను. పండితు డయినవారెల్ల నీయనకు వినమితశిరస్కుడగుచుండెను. ఈయన యప్పయ్యదీక్షితునిచే నమస్కారము గొందునని ప్రతినబూనెనట! వీరి కిద్దరకును మధురయాస్థానమున సభ జరిగి వాగ్వాదము జరిగెను. ఆకాలము క్రీ. శ. 1 42 సంవత్సరమని చెప్పబడుచున్నది.[6] ఈవివాదము జరిగినది రామరాయలవిఠ్ఠల చినతిమ్మనాయకుల యాస్థానమున యని నాయభిప్రాయము. వారు దక్షిణమునకు రాజప్రతి

---

1.

| చం | | శ<br>రా | కు |
|---|---|---|---|
| | రాశిచక్రము | | |
| బృ | | | |
| | కే | శు | లగ్నము<br>ర. బు. |

క్రీ. శ. 1553 సం. 18 సెప్టెంబరు, లేక శక వర్షములు 1475 ప్రమాదీచ సంవత్సర కన్యామాస కృష్ణప్రథమ. ఉత్తరాఫల్గునీ నక్షత్రము. (శివానంద కృత అప్పయ్యదీక్షిత చరితము.)

2. J. O. R. Madras, 1928, p. 225.

3. "విక్రమే భూతలం ప్రాప్య విజయే స్వర్గమా యయౌ."

4. "బద్ధస్పర్ధాన్య విద్వత్ప్రముఖముఖపుటే
ముద్రణోన్నిద్ర మేధా
శిల్పం స్త్వామప్పయజ్వన్ కథయ కథమివ
ద్రోగ్ధుమల్పాః ప్రగల్భాః,
క్రీడాచంచచ్చపేటా హతకరటిఘటా
కుంభకూటాధిరూఢ
ప్రౌఢాటోపాయ మూఢాః కిము మృగపతయే
ద్రోహితా ద్రోహితారః"

5. ఈయననుగూర్చి ముందు ముచ్చటింతును.

6. అప్పుడు మధురలో చంద్రశేఖరపాండ్యు డేలుచున్నట్లు శ్రీమహాలింగశాస్త్రిగారు చెప్పుచున్నారు కాని యదియనుమానము. ఆకాలము రామరాయవిఠ్ఠ లుడు దక్షిణదండయాత్ర కళిరామరాయలచే నంపబడిన కాలము. విఠ్ఠలునితమ్ముడగు చినతిమ్మభూపతి యప్పయ్య యొక్క ప్రథమపోషకుడు.

నిధులుగా వచ్చి మధురలో ఆస్థానమును స్థాపించిరి. వీరిశాసనము లీప్రాంతమున క్రీ. శ. 1544—1555 మధ్యసంవత్సరముల కలవు.[1] కావున నీవివాదము చిన తిమ్మనాయకుని యెదుటనేనని నిర్ధారణముగా చెప్పవచ్చును. ఈవాదమున రత్నఖేటునకు జయించునట్లు లేకపోవుటచే నాయన యొక పన్నుగడ పన్నెను. అప్పయ్యపాండిత్యమునకు మెచ్చి తనకుమార్తె నాయనకు వివాహము చేయునట్లు భూపతిద్వారమున నప్పయ్య నొడంబరచెనట! అంతట వివాహముకాగా నల్లునిచే నమస్కారమునుపొంది తనప్రతిజ్ఞను కాపాడుకొనెనట! అప్పయ్యభార్య పేరు మంగళాంబిక.

అనేకాస్థానముల నీయన బహుమానములబడసెను యీయన ముఖ్యపోషకులు మువ్వురు.[2] మొదటివాడు చినతిమ్మనాయకుడు. ఈయన పోషణప్రారంభకాలమున నప్పయ్య చిన్నవాడై యుండెను. ఈయన యభ్యర్థనమున వేదాంతదేశికుని యాదవాభ్యుదయ కావ్యమున కప్పయ్య వ్యాఖ్యానమును రచియించెను.

* * * *

“ శేషమహీ తేషుజయతి త్రిదివాధీశేషుపద్మబంధురిన,
శ్రీచిన్నతిమ్మరాజః ప్రతాపనీరాజితక్షమావలయః.

* * * *

సాహిత్యగోష్ఠీం సరసమాతిష్ఠన్నయమేకదా,
యాదవాభ్యుదయంకావ్యమశ్రౌషీద్విదుషాంముఖాత్.

అవ్యాఖ్యాతతయాప్రాగ్రైరనభివ్యక్త భావకం,
అస్పృష్టమివశిల్పజ్ఞై రభిజాతం హరిన్మణిం.

తదాకర్ణ్య నతస్సద్య స్సముదంచత్కుతూహలః,
విదుషాం పురత స్తస్య వివృతౌమాంన్యవేదయత్.

కవితార్కిక సింహస్య కావ్యమేతద్యథామతి,
వివృణోమి మహీపాల బహుమాన నియోగతః.”

(యాదవాభ్యుదయ వ్యాఖ్యానము, ప్రస్తావన.)

వేదాంతదేశికునియం దప్పయ్యకెక్కువ గౌరవముండెను. యాదవాభ్యుదయవ్యాఖ్యయే యీయన మొదటి గ్రంథమని చెప్పవచ్చును. ఈచిన్నతిమ్మనృపతి క్రీ. శ. 1555 సంవత్సరప్రాంతమున ననగా తాలికోట యుద్ధమునకు పూర్వమే విజయనగరమునకు సోదర సమేతుడై వెడలిపోయెను. కావున నీవ్యాఖ్యానము క్రీ. శ. 1550 సంవత్సరప్రాంతమున రచియింపబడియుండును. అంతట నీయన వెడలి వేలూరున చినబొమ్మనాయకుని ప్రాపుజేరెను. ఆకాలమున రాజాస్థానములు పండితులకును కవులకును పట్టుకొమ్మలుగా నుండెను. ఈ చిన్నబొమ్మనాయకుని తండ్రి చినవీరప్పనాయకుడు. తండ్రి తదనంతరమున క్రీ. శ. 1550 సంవత్సరప్రాంతమున నీయన రాజ్యమునకువచ్చెను. ఈయన యత్యంత శివభక్తుడు. అప్పయ్యదీక్షితుని కాలమున నద్వైతమత మొకవైపునుండి శ్రీవైష్ణవులయొక్కయు, మరియొకవైపునుండి మధ్వమతముయొక్కయు దాడికిలోనయ్యెను. వీనిరెంటిమధ్య నద్వైతము నలిగిపోవుచుండెను. సాక్షాచ్ఛైవమత మీదాడిలో నద్వైతమునకు సాయమొనర్పలేకపోయెను. ఇంతకుముందే శ్రీకంఠాచార్యుడు బ్రహ్మసూత్రములకు శైవభాష్యమును రచియించెను.[3] కాని తత్ప్రచారమును గావించుటకు తగినవ్యక్తి జనింపకపోయెను. మఱియు నట్టి వ్యక్తి సర్వతంత్రస్వతంత్రుడు కావలసియుండెను. అప్పయ్యలో నన్ని యోగ్యతలును కూడెను. అందుచేత నీయనను కొందరు పరశివావతారముగా నెంచుచున్నారు. వైష్ణవమధ్వమతములు తర్కశాస్త్రముపై నాధారపడియుండెను. ఈతర్కమును మీమాంసాగదతో కొట్టినగాని యణగుటకు వీలులేకపోయెను. సగుణమును నమ్మువారికి కూడా మార్గము చూపవలసివచ్చెను. అందుచే శైవాద్వైతములకు రెండిటికిని ప్రచార మవసరమయ్యెను. తద్బాధ్యతయంతయు నప్పయ్యదీక్షితుడు నిర్వహింప వలసివచ్చెను. అందుచే నాయన కృతులు

1. తంజాపురాంధ్రనాయక చరిత్రము, పుట 81.

2. చిన్నతిమ్మనృపాలుడు, చిన్నబొమ్మభూపాలుడు, వెంకటపతిరాయలు.

3. శ్రీకంఠుడు బ్రహ్మసూత్రములకు మొదటి భాష్యకర్త యని శ్రీ. కె. వి. లక్ష్మణరావుగారు తమ హిందూమహాయుగమున వ్రాసినారు.

నయమునను భయమునను కూడ విశిష్టాద్వైత ద్వైతముల ఖండించెను. ఈప్రచారమునకు రాజాదరణ మవశ్య మయ్యెను. విజయనగర మీకాలమున నళియరామరాజుచే నేలబడుచుండెను. ఆయన వీరవైష్ణవుడు. తాతాచార్యుని ప్రియశిష్యుడు. అందుచే నచ్చటికి చేర వీలులేక పోయెను. చిన్నబొమ్మనృపతి యీయనకు తావిచ్చెను. అదివరలో నీ చినబొమ్మ నృపతికూడ వైష్ణవుడైనట్లు కన్పట్టును. కాని యప్పయ్య యచట ప్రవేశించిన తరువాత క్రమముగా నాయనను శైవునిజేసెను. వైష్ణవ మధ్వమతములను మిక్కిలి ఖండించుటచే నీకాలమున నీవివాదవాఙ్మయ మభివృద్ధియయ్యెను. వైష్ణవమునకు దొడ్డాచార్యుడను మహాచార్యుడు సాయమువచ్చెను. మధ్వమతమునకు విజయీంద్రాదులు సాయమువచ్చిరి. అప్పయ్యకును నాయన శిష్యుడగు భట్టోజిసాయపడెను. వీరందరును కలసి గొప్ప వివాదవాఙ్మయమునకు కర్తలైరి.[1] ఈచినబొమ్మనాయకునివద్దనున్న కాలమప్పయ్య కత్యుచ్చకాలము శైవగ్రంథములలో దాదాపుముఖ్యము నీకాలమునందే యీయన రచియించెను.[2] శివార్కమణి దీపిక యను శ్రీకంఠభాష్యవివరణము నీయన పూర్తిచేసినపుడు చినబొమ్మనృపతి యీయనకు కనకాభిషేకము గావించెను. ఈకనకాభిషేక ద్రవ్యముతో చినబొమ్మ భూపతి చనిపోయినయనంతర మాయన ప్రశంసతో తన స్వగ్రామమగు నడియపాళెమున నప్పయ్య యొక శివాలయమును నిర్మించెను. ఈకనకాభిషేకవార్తను నీలకంఠదీక్షితులు ఇట్లు వర్ణించినారు.

"హేమాభిషేకసమయే పరితో నిషణ్ణ
సౌవర్ణ సంహతిమిషా చ్చినబొమ్మ భూపః,
అప్పయ్యదీక్షితమణే రనవద్యవిద్యా
కల్పద్రుమస్య కురుతే కనకాలవాలం."[3]

"నానాదేశ నరేంద్రమండల మహా
యత్నాతిదూరీభవ
త్కాదాచిత్క పదారవిందవినతే
రప్పయ్య యజ్వప్రభోః,
శైవోత్కర్ష పరిష్కృతై రహరహ
స్సూక్తైస్సుధాలాలితైః
పుల్లత్కర్ణపుటస్య బొమ్మనృపతేః
పుణ్యాని గణ్యాని కిం."[4]

ఏతద్గ్రంథరచనముచే నీయన శైవాద్వైతమత స్థాపనాచార్యుడయ్యెను. దానితో నీయన కీర్తి దిగంత విశ్రాంతమై భట్టోజీదీక్షితునివంటి మహాపండితుని నాకర్షించెను.[5] ఈకనకాభిషేకము క్రీ. శ. 1582 సంవత్సరమునకు పూర్వమై యుండవలెను. ఏలన నడిపాళెయపు శాసనమున నప్పయ్యదీక్షితుడు చినబొమ్మ నృపతియనంతరము శివాలయమును కట్టినట్లు చెప్పుచున్నాడు.

"యేన శ్రీచిన్నబొమ్మక్షితిపబలభిదః
కీర్తి రవ్యాహతాసీత్
యేన శ్రీకంఠభాష్యం పరమశివమత
స్థాపనా యోద్ధధార,

---

1. "పంచమతభంజనము", "చండమారుతము" మొదలగు గ్రంథములను మహాచార్యుడు రచియించెను. విజయీంద్రుడు "మధ్వాధ్వకంటకోద్ధరణము"ను "నప్పయ్యదీక్షిత కపోలచపేటిక"యను గ్రంథమును రచియించినట్లు కన్పట్టును తుదకు తాతాచార్య డప్పయ్యను చంపుటకు కుట్రపన్నినట్లుకూడా తెలియును.

"సహస్రంసంవత్సరాంశం పథిపథికృతేసాహసకృతః
ప్రవర్తంతాం బాధాం మయి,వివిధమప్యారచయితుం
నలక్షీకుర్వేఽహం నలినజలిపిప్రాప్తమపి త
న్మమస్వామీచామీకరశిఖరిచాపోస్త్రిపురతః.—"

J. O. R. Madras, Vol. iii. p. 156.

2. శివార్కమణిదీపిక, శివార్చనచంద్రిక మొదలగు చాలాగ్రంథము లీకాలమునకు చెందినవియే.

3. నీలకంఠదీక్షితకృత "నలచరితనాటకము."

4. ఔత్తరాహుడగు నొకకవి.

5. భట్టోజి కాశినుండి దక్షిణమునకు వచ్చి యప్పయ్యవద్ద వేదాంతశాస్త్ర మభ్యసించెను. ఇచ్చటికి వచ్చునప్పటికే యీయన సిద్ధాంతకౌముదిని రచియించియుండెను.

తేన శ్రీరంగరాజాధ్వరివరతనయే
నాప్పయజ్వాధిపేనా
కారి ప్రౌఢోన్నతాగ్రం రజతగిరినిభం
కాలకంఠేశధామ."[1]

"ఆసీత్" అనుపద మట్టియర్థము నిచ్చుచున్నది. చినబొమ్మనృపతియనంతర మీయన యేయాస్థానము నందును నిలకడగా నున్నట్లు కానరాదు. ప్రతిరాజును తనయాస్థానమునకు రమ్మని యీయన నాహ్వానించిరి. అంతట విజయనగరము వెడలి కొంతకాల మచ్చట నున్నట్లు తెలియును. అప్పటికి విజయనగరసామ్రాజ్యము వెనుకటివన్నె దొరగెను. విజయనగరమునుండి రాజధాని పెనుగొండకు వచ్చెను. అళియరామరాయల తరువాత, శ్రీరంగరాయలును చనిపోయి క్రీ. శ. 1585 ప్రాంతమున వెంకటపతిరాయలు రాజ్యమునకువచ్చెను. అప్పుడు నాల్గయిదువత్సరము లీయన యాస్థానమునుండినట్లు కన్పట్టును. అందుచే వెంకటపతిరాయ లీయనకు తృతీయపోషకు డయ్యెను. వెంకటపతియాస్థానమునకు వెళ్లినప్పటి కప్పయ్యకు రాజాదరణ మంతగా యనవసరమైన ట్లీ క్రిందిశ్లోకమువలన తెలియును.

"ప్రాప్తం తత్ప్రాభృతీయం కిలయదిహ కియాల్
పూరణీయో మనోస్తినాంశో
నానిష్టంవా నివర్త్యం నిజవిషయతయా
దృశ్యతే కించిదత్ర,
కింతు వ్యాపార మేవ ప్రథయతి ఫలసం
యోజనార్థం పరేషాం
ప్రాప్తః పుణ్యై రగణ్యైరివ విబుధ గణో
వేంకటక్షోణిపాలం."

(విధిరసాయనము.)

అప్పటికి స్వవిషయమున రాజాదర మనవసరమను స్థితి కీయన వచ్చెను. తనశిష్యుడగు భట్టోజీదీక్షితు నచ్చట వెంకటపతి యాస్థానమున నియమించెను.[2] వెంకటపతి యభ్యర్థనమువలన కూడా కొన్నిగ్రంథముల నీయన రచియించినట్లు స్పష్టము. కువలయానంద మట్టిది.[3] ఈయన పరిమళమను నమలానందుని కల్పతరువునకు వ్యాఖ్యానమును గోవిందదీక్షితుని ప్రేరణమున రచియించెనని యైతిహ్యము కలదు ఇందు గోవిందు డప్పయ్యకంటె పెద్దవాడయినట్లు చెప్పుచున్నారు.[4] ఒకవేళ గోవిందుని ప్రేరణమున నప్పయ్య పరిమళమును రచియించి యుండవచ్చును. కాని గోవిందు డప్పయ్యకంటె తప్పక చిన్నవాడు. అప్పయ్య క్రీ. శ. 1520 సంవత్సరమున జనించినట్లు వెనుక మనవిచేసినాను. నా తంజాపురాంధ్ర నాయకచరితమున నీవిషయము సమగ్రముగా చర్చించి యున్నాను. క్రీ. శ. 1618 సంవత్సరమువరకు జీవించిన గోవిందుడు క్రీ. శ. 1593 సంవత్సరమున చనిపోయిన యప్పయ్యకంటె పెద్దవా డెట్లగును? అందును నప్పయ్యకూడా చాలావృద్ధుడగువరకు జీవించియుండెను కాన నీవిషయ మింకను నసంభవము. గోవిందు డప్పయ్యకంటె తప్పక యిరువదివత్సరములు చిన్నవాడని నాయాశయము. కాని యిద్దరికిని స్నేహ ముండెనని మాత్రము స్పష్టము. సెవ్వప్పనాయకుని తుది దినములలో

---

1. అడియపాలెము శాసనములోని శ్లోకము. శకాబ్దము 1504.

అప్పయ్యదీక్షితుని కుమారునిపేరును నీలకంఠదీక్షితులని యీశాసనమువలన తెలియవచ్చుచున్నది.

2. J. O. R. Madras, 1928, p. 233.

3. "అముం కువలయానంద మకరోదప్పదీక్షితః,
నియోగాద్వేంకటపతే ర్నిరుపాధికృపానిధేః."
(కువలయానందము.)

4. "నాహమధీతవేదోయత్రతకుత్రచిచ్ఛాస్త్రే
కింతు దరేందువతంసిని పురహింసిని భూయసీభక్తిః."
అని యప్పయ్య యనగా,
"అప్పయదీక్షిత కిమిత్యతిస్తుతిం
వర్ణయామ భవతో వదాన్యతాం,
సోపి కల్పతరు రర్థలిప్సయా
త్వద్గిరా మవసరం ప్రతీక్షతే."
అని గోవిందుడు సమాధానము చెప్పెనట! అంతట నప్పయ పరిమళమును రచియించెనట!

నప్పయ్యదీక్షితుడు తంజావూరున పూజనందెను.[1] శివానందు డప్పయ్య తంజావూరున చాలాకాలము నివసించెననికూడా చెప్పుచున్నాడు. ఈయన చినబొమ్మనృపతి యనంతరము దక్షిణదేశమునందలి యన్ని యాస్థానముల కును వెడలి పూజల నందినట్లు కన్పట్టును. తుదిపర్షంబులీయన చిదంబరక్షేత్రమున శివసన్నిధిని కాలముగడపి యచ్చటనే వరమపదించి శివసాయుజ్యమునందెను. శైవమును సమర్థించి సర్వసిద్ధాంతమును శివపరమని చెప్పెను. కాని వైష్ణవులుచేసిన ట్లప్పయ్య విష్ణుదూషణము కావింపలేదు.[2] ఈయనచుట్టును ననేకగాథలను పెంచి తరువాతివారీయననిజస్వరూపమును మాటుచేసినారు కాని యవి యన్నియు తెలివిగల కవుల స్వకపోలకల్పితములేకాని నిజము లెంతమాత్రమును కానేరవు. తుద కీయన శ్రీరంగమునందలి రంగనాథుని శివునిగా ధ్యానింప శివుడైపోయెనని కూడా చెప్పుదురు. ఆకాలమున పాండిత్యమున నప్పయ్యతో సమానుడు లేడని గట్టిగా చెప్పనచ్చును. వాదమున నాయనను కేసరియని పేరిడవచ్చును. ఇప్పటికి నద్వైతశైవములు నిలచియున్నవి యన్న తత్కీర్తియంతయు నప్పయ్యకే చెందవలెను. శైవసిద్ధాంత ప్రవక్తలలో నీయన 'యగ్రస్థానము నలంకరించుచున్నాడు. ఈయనశైలి గంగాఝరీసమానము. విషయచర్చలో నీయనతో సమాను డుండు టరుదు. ఈయన మీమాంసాగ్రంథముల నీయన పాండిత్యశేముషీవిశేషములు బాగుగా తెలియుగలవు. ఖండదేవునివంటి మీమాంసకు డీయనను "మీమాంసాపూర్ధన్య"డని పిలచెను.[3] ఈయనయొక్క రచనాధోరణి మిక్కిలి స్వతంత్రము. ఆయనపూర్వపక్షమున కాయనయే సమాధానము చెప్పవలయును. విధిరసాయనమును చదువునపుడు పూర్వపక్షము చదువగా నీయన దర్శనమునే లేకుండచేయునాయని యనిపించును. ఈయన రచియించిన కొన్ని గ్రంథముల కీయనయే వ్యాఖ్యానములను రచియింపవలసి వచ్చెను. దీనివలన తద్రచనములు మిక్కిలి భావగంభీరములని తేలును. ఈయన 108 గ్రంథములను రచియించెనని వదంతి.

"కాలేన శంభుఃకిల తావతాపి
కళా శ్చతుష్షష్టిమితాః ప్రణిన్యే,
ద్వాసప్తతింప్రాప్య సమాః ప్రబంధా౯
శతంవ్యధా దప్పయదీక్షితేంద్రః."[4]

ఈయనగ్రంథములనుగూర్చి కొంచెము ముచ్చటింతును. ఈయన పరశ్శతములైన గ్రంథములను రచియించినను దాదా పిరువదియైదుకంటె పేరుచే నెవ్వరెరుగరు.[5] వీనిలో కొన్ని యముద్రితములు; కొన్ని

1. Aravidu, Heras; J. O. R. Madras, Vol. III. p. 159.

2. "విష్ణుర్వా శంకరోవా శ్రుతిశిఖరగిరా
మస్తు తాత్పర్యభూమిః
నాస్మాకం తత్రవాదః ప్రసరతి కిమపి
స్పష్ట మద్వైతభాజాం,
కింత్వీశద్వేషగాఢానలకలితహృదాం
దుర్మతీనాం దురుక్తా౯
భంక్తుం యత్నో మమాయం నహి భవతుతతో
విష్ణువిద్వేషశంకా."

3. "నాస్తిపూర్వం పరత్రవా అప్పయ్యదీక్షితాత్కశ్చి న్మీమాంసకః, యస్మిన్నేతస్యైవ న్యాయసంచారనైపుణం తాదృశ మాకలయేమ."
(మీమాంసాభ్యుదయము.)

4. నీలకంఠదీక్షితుని శివలీలార్ణవము.

5. (1) పరిమళము.
(2) సిద్ధాంతలేశసంగ్రహము.
(3) శారీరకన్యాయరక్షామణి.
(4) శివార్కమణిదీపిక.
(5) వాదనక్షత్రమాలికా.
(6) యాదవాభ్యుదయవ్యాఖ్యానము.
(7) రత్నత్రయపరీక్షా (భాష్యసహితము.)
(8) శివాధిక్యము.
(9) శివాద్వైతనిర్ణయము.
(10) శివకర్ణామృతము.
(11) శివార్చనచంద్రిక.
(12) కువలయానందము.

నామమాత్రావశిష్టములు.[1]

హరివంశసారచరిత వ్యాఖ్యానమును గూర్చి యెట్టి యనుమానమును లేదు. గద్యమును మాచినతప్పక ఈయన రచియించినట్లు తెలియును.[2] కాని తత్కావ్యము మాత్రము గోవిందదీక్షితునిది కాదు. తద్విషయమును గోవిందునిక్రింద సమగ్రముగా చర్చించియున్నాను.

సమస్తశాస్త్రముల నభ్యసించి, సమస్తవైదికకర్మల నాచరించి, పరశ్శతగ్రంథకర్తయై, చిరాయువై, సకల రాజనీరాజిత చరణుడై, దుర్మతఖండన చక్రవర్తియగు నీవిద్వత్కవికంఠీరవు నింతటితో నమస్కరించి విడుచుచున్నాను.

---

(13) శాస్త్రదీపికావ్యాఖ్యానము, మయూఖావళి.*

(14) ఉపక్రమపరాక్రమము.

(15) విధిరసాయనము (సుఖోపజీవి నీవ్యాఖ్యాసమేతము).

(16) రామగీతావ్యాఖ్యానము.

(17) ఆనందలహరి (వ్యాఖ్యాసహితము).

(18) అపీతకుచాంబాస్తవము.

(19) ఆత్మార్పణస్తోత్రము.

(20) హరివంశసారచరితవ్యాఖ్యానము.*

(21) నిగ్రహాష్టకము.

(22) అద్వైతదీపిక.*

(23) శివతత్త్వవివేకము.*

(24) లక్షణరత్నావళి.*

(25) చిత్రపటము.*

(26) చతుర్మతసారసంగ్రహము.*

*ఈగుర్తుంచిన గ్రంథము లముద్రితములు.

1. అద్వైతదీపికయను గ్రంథ మప్పయ్యరచిత మెచ్చటను కానము. నృసింహాశ్రమిరచితమగు తన్నామకగ్రంథము ప్రకటింపబడి యున్నది. చిత్రపటమను నది తంజావూరునందలి గ్రంథమగునాయని యనుమానము.

Tanjore Skt. Catalogue, Vol. XII. p. 5142.

లక్షణరత్నావళియను గ్రంథము నీయన రచియించినట్లు తద్గ్రంథముయొక్క యసంపూర్ణ వ్యాఖ్యానము వలన మాత్రమే తెలియనగును.

Tanjore Skt. Catalogue, Vol. IX. p. 4079.

2. "ఇతి శ్రీమద్భారద్వాజకులజలధి కౌస్తుభ శ్రీమదద్వైత విద్యాచార్య శ్రీవిశ్వజిద్యాజి రంగరాజాధ్వరివరసూనోః......"

(హరివంశసారచరిత వ్యాఖ్యానము).

# హిందూముస్లిము సారూప్యములు

బుర్రా శేషగిరిరావు గారు
( భారతీతీర్థ ప్రధాని )

౧

భారతదేశీయ స్వరాజ్యప్రాప్తికి భారతీయములగు వివిధజాతముల పరస్పర మైత్రియు సామరస్యమును అవసరమనియు, అందును హిందూముస్లిముజాతముల సఖ్యము అత్యవసరమనియు పలువురు దేశీయరాజ్యాంగవేత్తలు గ్రహించి సర్వసంఘసామరస్యప్రణాళికను పరివర్తనములోనికి దే బ్రయత్నించుచుండుటయు నట్టిప్రయత్నములు సఫలీకృతములగుటయు కన్నులపండువ యగుచున్నది. కాని ఇట్టిసామరస్యమును దృఢపరచుటకు సాంఘికముగాను సారస్వతీయముగాను వివిధప్రయత్నములు దేశములో నెల్లెడలను విరివిగాజరుగవలెను. అస్పృశ్యతా నివారణవిషయమున సంఘములును తదుపసంఘములును ఏర్పడి పనిసాగించుచున్నట్లే హిందూముస్లిము సారూప్యములు ప్రజలజ్ఞానదృష్టికి విశదపడునట్లు పత్రికాప్రకటనములు, కరపత్రప్రచురణములు, సంచారక ప్రచారక ప్రసంగములును ఎడలేక జరుగవలెను. లేకున్న నీసామరస్యమునకు విఘాతములు కలిగించి హిందూదేశదాసత్వమును బలీయముచేయగల స్వప్రయోజనపరుల ప్రయత్నములు పొడచూపకమానవు. భావివత్సరమున భారతీ పత్రికాముఖమున సారస్వతీయమగు "హిందూముస్లిము సారూప్యనిరూపణ" ప్రయత్న మఖండముగ సాగును గాక యని నాయాశయము.

ఈవిషయమున మా భారతీతీర్థమండలి యాధ్యాత్మిక విజ్ఞానవిభాగములో ప్రత్యేకవిమర్శలు జరుగుచు వచ్చినవి. వాటిఫలితములను రాబోవువత్సరమున "భారతి" లోను దేశములో ప్రసంగముల మూలముననను ప్రకటింపదలచుచున్నాము. అందుకు మంగళాచరణముగా నీయంశమును గూర్చి నేను కొన్నిప్రసంగము లిందు వ్యాఖ్యానించుచున్నాను.

ఇండోఆర్యన్, సెమిటిక్కు, ద్రవిడియన్ అని భారతవర్షీయులను తదితరులను భాషావిశేషముల ననుసరించి పాశ్చాత్యులుచేసిన నిర్ణయములు నిలువనేరవనియు, విభజింపబడిన యిట్టిభారతీయసంఘము లాదినొక్కసంఘమేయనియు, నొకేభాషను వ్యవహరించియుండిరనియు కొందరు దాక్షిణాత్యపండితులు రుజువుచేయుచున్నారు. తమిళము నాధారపరచుకొని యిట్టి యైక్యప్రతిపాదనము చేయువారిలో మ॥ రా॥ రా॥ శ్రీ మాణిక్యనాయకరుగారును, ఎమ్. ఎస్. రామస్వామి అయ్యరువారును ప్రముఖులు. సులువుగా జంకించరాని మహాపండితులు. చూచీచూడకుండా "పిచ్చివ్రాత" లని త్రోసివేయుట కవకాశము లేనివాదమును లేవదీసినవారు. వీరిలో రెండవవారిదృష్టికి అరబ్బు, యూదుభాషలు (సెమిటిక్కు అనబడు తెగలో ముఖ్యమైనవి) రెండును తమిళభాషాజన్యములని సిద్ధాంతరాద్ధాంతములు చేయుచున్నవారు. ఇది యొకవిశేషము.

భారతీతీర్థములో సాంఘికవ్యవహారముల ననుసరించియు, మతగ్రంథముల ననుసరించియు, జీవాత్మపరమాత్మతత్త్వముల ననుసరించియు నీహైందవ,— అందులోను ఆర్య, ఆర్య-ద్రావిడ,—ముస్లిముసంఘసారూప్యములు విమర్శింపబడుచున్నవి. అందులో కొన్నిసాంఘికవిచారణల ఫలిత మిందుదాహరింపబడుచున్నది.—

హిందువులవలెనే—అందును భారతీయార్యులవలెనే—సెమిటిక్కులనబడు ముస్లిములును పారలౌకికులు, ఆత్మప్రతిపాదనపరులు, జీవితములో నీశ్వరకటాక్షమపేక్షించువారు. జీవితములో ననుక్షణమును "తత్ సత్ బ్రహ్మార్పణమస్తు" అని గడపవలసినవారు. ఐహికజీవితములో ననుక్షణమును ఆసర్వసాక్షిసమక్షమున జరుగుచున్నదనువారు. సంస్కారపరులు. తమప్రతీకార్యమును సంస్కారపురస్సరముగా చేయువారు. కాని హిందువులలోవలెనే వారిలోను జ్ఞానలోపముచేత ధర్మమూఢ్యము కలిగి గతానుగతికముగా కేవలము కర్మవాదులైన ఛాందసులుగలరు; జ్ఞానపరులగు సూఫీలునుగలరు. హిందూ

సన్యాసులలోవలె వారిలోను పలుతెరగులను ఫకీరులు కలరు. వీరిలో పురోహితులవలె వారిలో కాజీలుకలరు. వీరిలో కవిపండితులవలె వారిలో పండితకుటుంబీకులు కలరు. వీరిలో ఉద్యోగివంశీయులవలె వారిలోనుఉద్యోగివంశీయులుకలరు. వీరిలోచాతుర్వర్ణ్యమువలె వారిలో నాలుగుతెగలవారు కలరు. వీరిలో నీచాతుర్వర్ణ్యమునకు మన్వాదులకాలములోవలె వారిలో నాలుగుతెగలవారికిని అనులోమ విలోమవివాహములు కలవు కాని వీరిలో మనుస్మృతికిపూర్వ మందువలె వారిలో నీయనులోమ విలోమవివాహములలో నొకదానికన్న నొకదానికెక్కువతక్కువలు లేవు. అనగా సెమిటికులనబడు అరబు, తుర్కి, పారసి, పఠాను తెగలజాతములు మనుసంహితకుపూర్వపు దినములలో "ఆర్య" జాతమునుండి విడపడిపోయిన ఆర్యులై యుండవలయునని తోచును. కాని శిశువులను బీజన్యాయానుసారముగా తండ్రివంశమునకు చెందజేయుటచే గృహ్యసూత్రముల ప్రకారము నిర్ణయింపబడిన యార్యజాతమువంటివారే— ఆర్యులే—ముస్లిములై యుండవలెనని తోచును. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రజాతము లనాది యగు ద్విజసంఘమునుండియే వివిధములగు కర్మభేదములచేతనో కర్మలోపములచేతనో ఏర్పడినవని బ్రహ్మాండపురాణ సిద్ధాంతమువంటిదే ముస్లిములలో షేకు, సయ్యదు, మొగల్, పఠాను అనునాలుగుతెగలును ఏకవంశజన్యములేయను గాథ. ఇట్లు హిందూముస్లిము సంఘములకు సాంఘికాధ్యాత్మికాదినిర్ణయములలోను ఆశయములలోను ఇన్నిసామ్యములు కనబడుచుండగా వీటినన్నిటిని మరచి ముస్లిము లీనాడు భారతదేశములో భారతీయు లగు హిందువులతో నేమాత్రమును సంబంధములేని యన్యదేశీయు లగు భిన్నజాతీయులమనియు హిందూముస్లిము మతముల కేమాత్రమును పోలిక లేదనియు చెప్పుచుండుట కడుంగడుశోచనీయము. ఇది మన బ్రిటిషు విద్యావిధాన ప్రభావముకాని వేరొండుగాదు. ఏబదియారువది సంవత్సరముల క్రిందటివరకును హిందూముస్లిము సంఘముల కెంతో సఖ్యముకలిగియుండెను. ప్రీబ్రిటిషుదినములలో రాజ్యాధిపత్యములకై పోరాడిన హిందూముస్లిము రాజుల సైన్యములలో హిందూముస్లిము జాతములవారగు యోధు లిరువాగులయందును పోరాడి తమ యేలికలకొరకు-హిందువు, ముస్లిము అను భేదములేక- తమరక్తమును ధైర్యముగా ధారవోసిరి. యుద్ధములులేనిదినములలో "విద్యయావిద్యా" అను న్యాయానుసారముగా పరస్పరవిద్యాదానమునందును విద్యావ్యాసంగములందును వృత్తి జీవనములందును సౌభ్రాత్రముతో మెలగియుండిరి. అప్పటివారి పరస్పరాన్యోన్యతావిశిష్టము లగు చరిత్రలు జనసామాన్యమునకు తెలియపరచుటయే భావిభారతరాజ్యాంగవిధానమును స్వరాజ్యవిధానముగా మార్చుటకు పరమోత్కృష్టమగు సాధనమని తోచుచున్నది. ఆంధ్రావనియందీ ప్రయత్న మమోఘమై భారతావని కాదర్శప్రాయమగునుగాక !

ఆర్యసంతతివారగు భారతీయులు ఐహికజీవితమును జననముతో ప్రారంభింతురు. "ఆజన్మాంత" మని జీవితమునకవధి. కర్మస్థానమగుపృథివికి జీవుడు భోగస్థానమగు పరలోకమునుండి వచ్చును. పరమాత్మతో నైక్యమగుటకు నైహికజీవనమువల్ల జీవుడు తానుపొందవలసిన సంస్కారమును పొందును. అనేకజన్మసంస్కారములవల్లగాని జీవునికి కర్మపరంపరనుండి ముక్తికలుగనేరదని యార్యసిద్ధాంతము. ఒక్కజన్మసంస్కారముతోనే శ్రీమహమ్మదు ప్రవక్తవారు చూపిన మార్గమున పోవువారికి ముక్తి కలుగవచ్చునని ముస్లిము సిద్ధాంతము. ఎట్లయినను ఐహికము జననముతో ప్రారంభము, మరణముతోనంతము- "పునరపిజననం పునరపి మరణం" అని ఆర్యు లందురు. అయితే కావచ్చునని ముస్లిము లందురు. కర్మవాసనారాహిత్యమువలన ముక్తి యని యిరువురును అంగీకరించినయంశమే.

కాగా జననము శుభోదంతము. కుటుంబమునకు సంతోషజనకము. హిందూముస్లిముసంఘముల రెండింటిలోను ఇట్లే. హిందువులలోవలెనే స్త్రీజననముకన్న పురుషజననమందు సంతోష మెక్కువ. పురుషశిశువు పేర చేయబడు బలిదానమునకు రెండు గొర్రెపోతులు

నిర్ణీతమగు బలియైతే స్త్రీశిశువుపేర జరుపబడుదాని కొక్కగొర్రెపోతే నిర్ణయమట. *

గర్భిణియైనస్త్రీని ఏడవమాసమున పుట్టింటికి తీసికొని వెళ్లే ఆచారము హిందువులలో గలయట్లే ముస్లిములలోను గలదు. అప్పుడు ఆమెపుట్టింటివారు జరిగించేఉత్సవమునకు "సత్వాసా" అనిపేరు. ఇది "సత్ + మాసా" లేక "సప్తమాస" యను సంస్కృత పదబంధము. సప్తమాసీయోత్సవ మన్నమాట. ఏడుమొద లుతొమ్మిదవ మాసమువరకు, అనగా పురుడు వచ్చేవ రకూ ముస్లిముస్త్రీలు ఉజ్జ్వలమగు వస్త్రములుగాని ఆభరణములుగాని ధరింపగూడదట. బహుశః దృష్టిదో షము తగులుననియై యుండును. లేదా అది దీక్షాసమయ మేమో. అయినయెడల ప్రసవించుట యెంతపవిత్రమైన యుదంతమో తేటపడును. ప్రసవమయ్యేరోజున "సనకు ఫాతీహా" అనగా శ్రీమహమ్మదు ప్రవక్తవారి పుత్రిక పేర "ఉపహారనివేదన" చేయుదురు. ఆమెకరుణచే స్త్రీకి సుఖప్రసవమగుగాక యనియాశయము. ప్రసవమ య్యేవరకూ రాత్రి "రత్‌జగ్గా" అనుసంగీతోత్సవము చేయుదురు. "రజ్జగా" యనునది "రాత్రిజాగరణ" అన్న సంస్కృతపదబంధమే. హిందువులలో వలెనే ముస్లిము లలోను స్త్రీకి ప్రథమప్రసవము పుట్టినింట జరిపించు టయే సనాతనాచారము. ప్రసవమైన స్త్రీకి ఆరోజుమొ దలు నలువదిదినములు పురిటిలెక్క. జాతాశౌచము వంటిది. పురిటిగది సాధారణముగా దాటనివ్వరు. పని పాటులలోనికి రానివ్వరు.

హిందువులవలె ముస్లిములును మనకంటికి కగోచ రములగు భూతపిశాచాదులు మనల నావరించికొనియుం డునని నమ్ముదురు. అట్టివి పురిటియింటిలో జొరకుండ ప్రసవమైన స్త్రీపర్యంకముప్రక్క నొక నిమ్మకాయ యును బొడ్డుకోసినకత్తిగాని కత్తెరగాని, కొన్నివేప రెమ్మలతోకూడా ఉంతురు. పురిటిరోజులలో ఆగది లోని కెవరువచ్చినను బిడ్డకు సాంబ్రాణిధూపము వేయు దురు. హిందువులలో తవుడును ఆవాలునుకూడా ధూప మువేయుదురు. వీటివల్ల అన్నివిధములగు దృష్టిదోషము లును పోవునట. గదిలోనికి కుక్కనుగాని పిల్లినిగాని రానీయరు. అచ్చోట పిల్లి పేరైనా ఎత్తరు.

హిందువులలోవలెనే ముస్లిములలో నామకరణ సంస్కారము లౌక్యముకాదు. ఆసంస్కారము వారిలో పుట్టిననాడే జరుగును. కొంద రదిజరిగేవరకూ తల్లికి పానీయమేమియును ఈయరు. పుత్రోదయమైనసంగతి "పుతసా" యను నుత్సవముతో పంచదారముక్కలు పంచిపెట్టుచు బంధుమిత్రాదులకు తెలియపరతురు. "పుతసా" యన్నది "పుత్రోత్సవ" యనుసంస్కృతము నకు తద్భవము. ఆర్యులలోవలె బిడ్డ తండ్రివంశమునకే చెందును గనుక తండ్రివంకవారి వంశనామమే ధరిం చును. ఉదాహరణము. పిల్లవాని తండ్రి సయ్యదుఅయితే అతనిపేరులో మొదటిమాట సయ్యదు అనియుండవ లెను. ఈవంశనామములు ప్రాచీనార్యులలోని శర్మ, వర్మ, గుప్త, దాస యను వంశద్యోతకపదములవంటివి. వీటిలో ననేకవిశేషములు కలవు. ఇవిరానురాను లోపిం పబడుటచే యేముస్లిముబిడ్డ యేవంశీయుడో వెంటనే తెలియదు. ఆర్యజాతియందటివల జరిగినవంశీయనామ సాంకర్యములవలెనే ముస్లిములలోను జరుగుచువచ్చినవి. అదిగాక అనులోమవిలోమవివాహములనుబట్టి కూడా కొన్నిసాంకర్యములు కలిగినవి. ఉదాహరణములు.

౧. తండ్రి షేకువంశీయుడు + తల్లి సయ్యదు వంశీయ బిడ్డ(షేకుతెగ) షేకు అనువంశనామము ధరించును. షరీఫు అనిపేరు ధరించుట విధి. ఇది రెండ వపక్షము.

౨. తండ్రి మొగల్ + తల్లి సయ్యదాని. బిడ్డ ఖోజాజడాయి అనుపేరు ఇతరమాటలతో కలిపి ధరించ వలెను.

---

* ఇందులో నుదాహరింపబడు ముస్లిముఆచారములకు ధాఖలా జాఫరుషరీఫు అనుపండితుడు రచించిన "ఖనూన్-ఎ-ఇస్లాము" అను గ్రంథము. మద్రాసు, హిగ్గిన్‌బాదము అండు కో. ౧౯౦౫ (ముద్రితము).

ఇట్లే షేకువంశీయులకు ఖోజా, గొలాము, మహమ్మదు, డీను, బక్ష్, అల్లీ, అల్లా అను నామాంతములును, సయ్యదులకు సయ్యదు, మీరు అను నామాంతములును, మొగలులకు మీర్జా, బేగు, ఆగా అను నామాంతములును పఠానులకు ఖాను అనియు నిర్దేశములు కలవుగాని రానురాను ఇవియు హిందువులలోవలెనే కలగలుపు అయిపోయినవి. కాని యిట్లు నాలుగు తెగలును (ఏకవంశజనితములు) వాటివాటికి ప్రత్యేకమగు నామాంతములును ముస్లిములలో భారతీయార్యులయందువలెనే యుండుటమాత్రము గణనీయము.

మరియు ముస్లిములలో బిడ్డలకు తండ్రితరము వారి వర్గత్రయములో, ఆర్యులలోవలెనే, నామనిర్దేశము చేయు నాచారము గలదు. లేదా కులదైవతములుగా నెన్నుఋషులపేర్లు పెట్టుదురు. కొందరు నామనక్షత్రవిధానముగా జననకాలనక్షత్రముపేరులో మొదటియక్షరముగాని తుదియక్షరముగాని తీసి దానితో ప్రారంభించు పేరు పెట్టుదురు. లేదా పుట్టినదినమునుబట్టి యందుకనుగుణమగు పేరుపెట్టుదురు. హిందువులు గృహ్యసూత్రవిధానముగా నామకరణము చేయునప్పుడు "మాసనామ్నా, నక్షత్రనామ్నా" అని వ్రాయుదురే. దానికీ దీనికీ వస్తుతః ఏమీ భేదములేదు. దీనినిబట్టికూడా కాలమానస్థితి వైపరీత్యములచేత నార్యసంఘమునుండి యేనాడో విడిపోయియు నప్పటియాచారముల ననుసరించుచున్న ఆర్యసంఘములే యీముస్లిములేమో యని పొడకట్టుచున్నది.

శిశుజనన సంబంధములగు నుత్సవముల జాతము—

౧. శిశుజననమైన మూడవదినమున "పట్టీ" యను నుత్సవము ముస్లిములలో చేయుదురు. తల్లికి తలచిక్కుదీసి పాపిటతీసి దువ్వి యలంకరించి మాతాశిశువులకు కంటికికాటుక పెట్టుదురు. ఈకాటుకకు "కజల్", "కలిక్" అనిపేరు. "కజ్జల", "కలికం" అని సంస్కృతపదములే యివి.

౨. ఆరవదినమున "ఛట్టీ" యను నుత్సవము బిడ్డలునష్టపోయినవారిది ఆలోపుననే చేయుదురు. ఇది "షష్టి" ( = ఆరు) అను సంస్కృతపదభవము.

౩. నలువదియవనాడు జరుపునుత్సవము హిందువులలో చాలసారెవంటిది. బంధుమిత్రాదులకా తొలిరోజున "చిక్కసము" పోయుదురు. షీకాయ, నువ్వులు, నలుగుపిండి పంపుదురు. ఈ ఉత్సవమున కాంధ్రదేశములో "చిక్కసము" పోయుట అని పేరు వచ్చినది. "చిక్కస" అనగా నలుగుపిండి. ఖురాను ప్రకారము ఈ నలువదియవనాటి యుత్సవము జరిగే వరకూ ప్రసవించినస్త్రీ ప్రార్థనజరుపగూడదు. ఉపవాసముండకూడదు. ఖురానుముట్టకూడదు. మసీదులో కాలు పెట్టకూడదు. అనగా ఆమె ఏమడిపనికిని పనికిరాదన్నమాట. నెలపురుడువెళ్లేవరకూ, అనగా నలభైరోజులు దాటేవరకూ హిందువులలోను ఇట్టిఆంక్షయే కలదు. ఈరోజున బిడ్డకు తల్లి వంకవా రాభరణాదికము లిత్తురు.

౪. ఈ నలుబదియవదినముగాని అంతకుముందుగాగాని (హిందువులలో ౨౧ దినమననే) బిడ్డను ఉయ్యాలలోపెట్టి యుత్సవముచేయుదురు. దీనికి "గహ్వార" యనిపేరు. 'గహ్వార' యనునది సంస్కృతపదము. "గుహ" యని యర్థము. ఉయ్యాలలో ఉన్నపిల్ల గుహలో ఉన్నట్టే ఉండును.

౫. ఈ రోజునగాని ఆ మరుచటిదినమునగాని "ముండన" యను కేశఖండనోత్సవము చేయుదురు. ఇది చాలాపవిత్రమైన సంస్కారము. హిందువులలోవలెనే ఆరోజున మంగలివానికి బహుమతులుదొరుకును. కొందరు బిడ్డకు కులదైవతములగు ఋషులపేర ఫించములుంచు నాచారమును కలదు. దరగాలకు మొక్కుకొన్నవారు బిడ్డకై దారువత్సరములువచ్చువరకును కేశఖండనము చేయించరు. హిందువులలోను ఇదియే యాచారము. "ముండన" అనునది కేవలము సంస్కృతపదమే.

ఈరోజుననే "ఉఖేకా" అను బలిదానము చేయుదురు. ఇది చాలాముఖ్యమైనది. శిశువునకు దీక్షా

యువు నిచ్చునదని జరుపబడును. ఆనాడు ఒకటో రెండో గొఱ్ఱెపోతులు బలియీయబడును. పురుషుడైతే రెండు, స్త్రీయైతే ఒకటి—దీనిని బలియిచ్చుచు అరబ్బులో నీమంత్రము చెప్పబడును—

"సర్వశక్తుడవగు నోదేవా, నా యీబిడ్డకు మారుగా ప్రాణమునకు ప్రాణము, రక్తమునకు రక్తము, తలకు తల, ఎముక కెముక, జుట్టుకు జుట్టు, చర్మమునకు చర్మము నీకు సమర్పించుచున్నాను. నీకుగా నీ మేకపోతును బలిదానము చేయుచున్నాను."—అని.

దీనినిబట్టి యిట్టి జనసంఘము ప్రాచీన హిందూ ఆర్యసంఘమునకు గృహ్యాకర్మలలో నెంతదగ్గరగా నుండెనో యూహింపవచ్చును.

ఇట్లే బిడ్డకు నాలుగవమాసమున "ల్డ్మూబంధన" మనియు, ఏడవమాసమున చట్టనము (నాకించుట = ప్రాశనము) అను అన్నప్రాశనోత్సవమును, బిడ్డ ప్రాకగలిగినప్పుడు "మోఢీబంధన", "రేంగడ" మను నుత్సవములను జరుపుదురు. ఈయుత్సవముల పేర్లన్నియు సంస్కృతభవములే. ఆడుబిడ్డలకు ఒకటిరెండు సంవత్సరములు గడవకముందు చెవులుకుట్టింతురు. దీనికి "కర్ణచైదన" అనిపేరు. ఈమాట "కర్ణఛేదన" మను సంస్కృతమే.

ఇట్టిజాతకర్మసంస్కారముల నన్నిటినిబట్టియు, వాటిని గూర్చిన నియమములను బట్టియు, వీటికి ముస్లిములలో వచ్చు సనాతనపు పేర్లు సంస్కృతజన్యము లేయగుటనుబట్టియు ముస్లిముజనసంఘములు పూర్వమెప్పుడో, అనగా హిందూసంఘము మనుస్మృతిబద్ధమై పోవకపూర్వము సంస్కృత భాషగా నుపయోగించిన సంస్కారపరాయణులైన పారలౌకికులైన యార్యులై యుండవలయునని తేలును. కాగా హిందూముసల్మాన్ విభేదము వస్తుతః ఎందున్నదాయని వితర్కించవలసి వచ్చును.

విద్యాభ్యాసప్రారంభాది యితరసంస్కారము లింకొక వ్యాసములో వ్యాఖ్యానము చేయబడును.

---



౧. భద్రాద్రి రామదేవాలయములు

శ్రీ దమ్మేటి గోపాలరావుగారు తీసిన ఆకస్మిక ఛాయాచిత్రము.

# జలపాతజవిద్యుచ్ఛక్తినిర్మాణములు-వాటివలన కలుగులాభములు

బుర్రాలక్ష్మణరావు గారు, L. E., (B. H. U.)

(Economic Advantages of Hydro-Electric Schemes)

ప్రపంచమునందు వాడబడుచున్న శక్తిస్వరూపములన్నిటిలోను విద్యుచ్ఛక్తియొక్క ప్రాముఖ్యత సర్వవిదితము. అట్టిప్రాముఖ్యతకు గలకారణములు- ౧. విద్యుచ్ఛక్తిని అపారముగ నుద్భవింప జేయవచ్చును. ౨. విద్యుచ్ఛక్తిని దూరప్రదేశములకు సులభముగను, చౌకగను తీగలద్వారా పంపవచ్చును. కావున ప్రపంచమున నీవిద్యుచ్ఛక్తిని అతిచౌకధరలకు తయారుచేయగల్గుటయే ప్రతిఇంజనీరు యొక్కయు ఆశయమైయున్నది. ఈఆశయము ఇప్పుడుప్రపంచములో దినదినాభివృద్ధినొందుచున్న జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణములవలన (Hydro-Electric Schemes) చాలవరకు ఫలించుచున్నదనియే చెప్పవలెను. ౧౯౧౪లో జరిగిన ప్రపంచయుద్ధమునకు తరువాత ఇటలీమొదలగు దేశములలో కలిగినటువంటి ఆర్థికపారిశ్రామికాభివృద్ధులకు ఈజలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణములే ముఖ్యకారణములని నేనోళ్ల మనము వినుచున్నను, మనదేశములో జనసామాన్యమునందింకను అట్టినిర్మాణములయొక్క ఆవశ్యకతనుగురించియు, వాటియొక్క ఆర్థికతత్వమును గూర్చియు, యెన్నోశంకలు తీరుటలేదు. అట్టిశంకలలో ముఖ్యమైనవేవనగా—౧. ఈనిర్మాణములు ఆర్థికపారిశ్రామికవ్యాపారాభివృద్ధికి ఎట్లు సాయపడగలవు? ౨. అమితమగుధనము నీనిర్మాణములలో ఉపయోగించుటవలన, ఆవెచ్చించినధనమునకు వడ్డీయైనకిట్టునా? లేక ౩. ప్రజలపై బహు పన్నులింకను ఎక్కువగునేమో!—అనునవి. ఈప్రశ్నలకు త్తరములు సాధ్యమైనంతవరకు తెలుపుటయే ఈవ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

[1] మనచెన్నరాజధానిలో ౧౯౨౯ సంవత్సరములో సుమారు రు. ౧, ౧౦, ౦౦౦లు (పెట్రోలు పేరాఫిన్ కాక) విలువగల రాక్షసిబొగ్గు దిగుమతిచేసినాము. ఇదిగాక సింగరేణిగనులనుండికూడ చాలబొగ్గు మనపరిశ్రమలలోవాడుక చేసినాము. మొత్తము మనరాష్ట్రములో సుమారు రు. ౧, ౨౫, ౦౦, ౦౦౦ లు విలువగల బొగ్గు, నూనె వివిధకర్మాగారములలోను, పరిశ్రమలలోను వాడబడినది. అయితే ఈమొత్తములో మూడువంతుల స్థానే అంతకుసరియగు జలపాతజవిద్యుచ్ఛక్తి వాడబడినదనుకొందము. అట్లయిన రు. ౭౫,౦౦,౦౦౦ లు మిగిలినవన్నమాట. ఈ విద్యుచ్ఛక్తిని తయారుచేయుటకు సుమారు [2] రు. ౭,౦౦,౦౦,౦౦౦ లు అవసరమగును. ఈసొమ్ము యితరదేశములనుండి అప్పుతెచ్చినయెడల దానిపైవడ్డీ మొదలగు ఖర్చులు సంవత్సరమునకు ౪౯ లక్షల రూపాయిలగును. కనుక పై ౯౫ లక్షలలోను ౪౯ లక్షలు తీసివేయగా మిగిలినసొమ్ము ౪౬ లక్షల రూపాయిలు. దీనిలో సుమారు ౨౦ లక్షల రూపాయిలు ప్రతిసంవత్సరము యంత్రాలయపు ఖర్చులకింద పోగా మిగిలిన ౨౬ లక్షల రూపాయిలు లాభమన్నమాట (Net profit). ఈ ౨౬ లక్షల రూపాయిలు, దేశాభ్యుదయకరమగు ఇతరపారిశ్రామికాభివృద్ధికై ఉపయోగించవచ్చును. అనగా ఇప్పుడు మనము ప్రతి సంవత్సరము ౯౫ లక్షల రూపాయిలు బొగ్గు, పెట్రోలు మొదలగువాటి విషయమై ఇతరదేశములకు పంపివేయుచున్నాము. కాని మనము మనరాష్ట్రములోగల జలపాతములను పయోగించి జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణ

1. Major Howard's lecture to the MadrasRotary Club.
E C M A (Engineering College Magazine, Benares) 1931. No. III.

2. Pykara Hydro-Electric Scheme.

ముల నెలకొల్పినయెడల పైదేశములకు ౪౫ లక్షల రూపాయిలు మాత్రమే పంపుటగాక మొత్తముపై ౨౬ లక్షల రూపాయిల లాభమునుగూడ పొందుచున్నాము. మరియు కావలసిన మూలధనము ౭ కోట్లు రూపాయిలు మనదేశమునందే సమకూర్పగలిగినయెడల ఆ ౪౫ లక్షల రూపాయిలుగూడ విదేశములకు పంపవలసిన అవసరముండదు.

౧౯౨౧ వ. సంవత్సరపు గవర్నమెంటు లెక్కల ప్రకారము మనరాష్ట్రములో మొత్తము ౬౬,౦౦౦ H. P. (Horse Power) వివిధయంత్రాలయములలో వాడబడినది. తరువాత నీపదిసంవత్సరములలో కలిగిన అభివృద్ధి సుమారు ౨౪,౦౦౦ H. P అని యనుకొనవచ్చును. కాగా మొత్తము ౬౬,౦౦౦ + ౨౪,౦౦౦ = ౯౦,౦౦౦ H. P. అని తేలును. మరియు నీ ౯౦,౦౦౦ H. P. వేర్వేరుయంత్రాలయములలో వేర్వేరు మొత్తములుగా వాడబడినవి. అదియునుగాక ఈ యంత్రశాలలన్నిటిలోను ఒకేసమయమున, ఆయావాటికి కావలసిన శక్తి మొత్తములు (Individual Maximum power demands) ఒకేసారి వాడబడుట సంభవింపదు. కావున వీటన్నిటియొక్క మొత్తపు టావశ్యకపు శక్తిసంఖ్య (sum of all the Individual Maximum power demands) కంటె, ఏసమయమందైనను ప్రధాన విద్యుచ్ఛక్తినిలయము (Central Electrical power station) పైబడుడిమాండు చాలతక్కువగ నుండును. ఏదేని ఒక సమయమున, నీవివిధయంత్రాలయములలో కావలసినశక్తి మొత్తములయొక్క (Individual Maximum demands) మొత్తపుటావశ్యకపు శక్తిసంఖ్య (Sum of all the Individual Maximum demands) కును, అదేసమయమున ప్రధానవిద్యుచ్ఛక్తి నిలయముపైబడు శక్తిడిమాండు (Power demand on the Central Station) నకును గల నిష్పత్తి (ratio) 'Diversity factor' అందురు. దీనివలన మనము ౬౬,౦౦౦ H. P. తయారుచేయగల ప్రధానవిద్యుచ్ఛక్తి నిలయమును నిర్మించినయెడల మనవివిధ కర్మాగారముల నన్నిటిని సమానముగ నడుపగలుగుదుము. దీనినిబట్టి ఒకేపనిని విద్యుచ్ఛక్తిమూలమున తదితరమైన శక్తివిశేషముల (other forms of Power) కంటె తక్కువ ఖరలో, తక్కువయంత్రములతో చేయవచ్చునని తేలుచున్నది.

మనరాష్ట్రములో ఎన్నో యెకరములనేల నీటివసతిలేక బంజరుగా నుండిపోయినది. అట్టినేలకు విద్యుచ్ఛక్తివలన నడుపబడు పంపులద్వారా నీటివసతి కలుగజేసి, దానినిఫలవంతముగ నొనర్పవచ్చును. ఆవిరియంత్రములతోను, నూనెయంత్రములతోను, నడుపుటకంటె, పంపులు, విద్యుచ్ఛక్తిమోటారులతో నడుపుటయే సుగమము, సులభగ్రాహ్యము.

మనరాష్ట్రములోనికి దిగుమతియగు ప్రతి ౧౦ పౌనుల (lbs) బొగ్గు (coal) నుండియు ఒక H. P. (one utilizable Horse Power) తయారగుచున్నది. ఈపదిపౌనులబొగ్గుఖరీదు ౧.౮ అణాలు. (@ రు. ౨౫/ టన్ను). మంచిపరిస్థితులలో నడుపబడు ఒక పెద్దమిల్లు ఇంజను ఒక H. P. తయారుచేయుటకు ౬ పౌనుల బొగ్గువాడును. ఈ ౬ పౌనులబొగ్గు ఖరీదు ౧.౧ అణాలు. ఈఖరీదునకు, పనివాండ్రఖర్చులు, వడ్డీలు, మరమ్మత్తులు, మొదలగుఖర్చులలో వంతు సుమారు ౦.౪ అణాలు, కలిపినయెడల మొత్తము ఖరీదు ౧.౫ అణాలని తేలును. అయితే పైకారాస్కీము ప్రకారము ఒక H. P. తయారుచేయుటకు [1]౦.౫ అణాలు మాత్రము పట్టును. కావున తయారైన ప్రతి H. P. వద్దర మనమెంతసొమ్ము వృథాగా ఖర్చుపెట్టుచున్నామో వేరే చెప్పనక్కరలేదు. మరియు బాయిలర్లు (Boilers), వాటితో కూడికొని యున్నకష్టములు తొలగ వాటిస్థానే సకలవిధముల సులభసాధ్యములైన విద్యుచ్ఛక్తి మోటార్లు (Electric Motors) వాడవచ్చును.

• మరియు నీజలపాతజవిద్యుచ్ఛక్తి నిలయములు, రైల్వేలు, హార్బర్లు మొదలగు వాటివలె దేశముయొక్క

---

1 o. 5 as/H. P. on a block of 1,000 H. P.

బలమగు మూలధనములు (Solid Assets) గా పరిగణింపబడును.

ఇట్టి జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణముల స్థాపించుటకు మనరాష్ట్రములో మంచిసౌకర్యములు గలవు. ప్రస్తుతము పూర్తికానున్న పైకారావిద్యుచ్ఛక్తి నిర్మాణమేగాక అట్టివింకను ఒకటో రెండో మనరాష్ట్రములో స్థాపించుటకు వీలున్నదనియు, అవసరమనియు నాయూహ. ఆంధ్రదేశములో జయపుర సంస్థానములో నిట్టి నిలయము స్థాపించుట కవకాశములున్నవని చాలకాలముకిందనే వినాము. ఇంకా యితరస్థలములలో గూడ జలపాతములు గలవు. ఆజలపాతముల విద్యుచ్ఛక్తిజనకములుగ చేయువిషయమున నొకగొప్ప ప్రయత్నము చేయవలసి యున్నది. కనడా, అమెరికా, స్విట్జర్లాండు మొదలగుదేశములు విద్యుచ్ఛక్తి విషయములో అప్పుడేపైమెట్టు చేరినవనియే చెప్పవచ్చును. వాటితో పోల్చిచూచినయెడల మనరాష్ట్రమిప్పుడిప్పుడే విద్యుచ్ఛక్తి యనుమాటయొక్క అర్థమును మాత్రము తెలిసికొనుచున్నదని చెప్పవలెను. [1]కనడాలో మనిషిఒక్కంటికి (Per Capita)౧,౪౦౦ యూనిట్ల విద్యుచ్ఛక్తి వాడబడుచున్నది. మనచెన్నరాష్ట్రములో ౨ యూనిట్లు మాత్రమే వాడబడుచున్నవి. అయితే విద్యుచ్ఛక్తి విషయములో మనరాష్ట్రమెట్టి యభివృద్ధియు పొందుటలేదని చెప్పుటకాదు. మనరాష్ట్రములో నూతనముగా స్థాపించబడిన పైకారాస్కీము విస్తీర్ణమునందు ప్రపంచములోగల జలపాతజవిద్యుచ్ఛక్తినిర్మాణములతో తులతూగుటయేకాక ఒకప్పుడగ్రస్థానము నలంకరించియున్నదేమో యనిగూడచెప్పవచ్చును. కానిపైవ్యత్యాసమునుబట్టి యింకను అభివృద్ధినొందుటకెంతయవకాశముగలదో స్పష్టముకాగలదు. అపారమగు విద్యుచ్ఛక్తిని తక్కువఖరీదులో తయారుచేసి తక్కువధరలకు పంచిపెట్టవలయునన్న జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణములతో మరేవియుసాటిరావు. మనదేశములో నింతవరకు స్థాపించబడిన కొన్ని జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణములయొక్క లెక్కల పరీక్షించిన యెడల నీవిషయము తేటపడగలదు. పంజాబురాష్ట్రములో నూతనముగా స్థాపించబడిన [2]"ఉహల్"నది జలపాతజవిద్యుచ్ఛక్తి నిలయమువారు ఒకేసారి 36,000 K. W. తీసికొనువారికి యూనిటుఒక్కంటికి ౯-౧౫ పైసలచొప్పున విద్యుచ్ఛక్తి సప్లై చేయుటకు కంట్రాక్టునిచ్చియున్నారు. దీపములకు తదితరమైన చిన్నచిన్న పరిశ్రమలకుగూడ మామూలుకంటె చాల తక్కువధరలకు విద్యుచ్ఛక్తి నీయగలమని చెప్పుచున్నారు. [3]మైసూరులో కావేరీ జలపాతజవిద్యుచ్ఛక్తినిలయము చాలకాలమునాటిది. అక్కడిచార్జీలు యూనిటుఒక్కంటికి దీపములకు ౪అణాలు,పరిశ్రమలకు ౧అణా(301 H.P. & above), నీటినితోడుపంపులకు ౧౩ అణాచొప్పున నిర్ణయింపబడినవి. మనరాష్ట్రములో నూతనముగా స్థాపించబడిన పట్టణ విద్యుచ్ఛక్తినిలయములవారు యూనిటు ఒక్కంటికి దీపములకు ౬ అణాలు, పరిశ్రమలకు, మిల్లులకు 3అణాలు చొప్పునను పుచ్చుకొనుచున్నారు. కొన్నిప్రదేశములలో దీపములకు యూనిటు ఒక్కంటికి దీపములకు ౮ అణాలు కూడ పుచ్చుకొనుట కలదు.

జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణముల స్థాపించుటలో ముఖ్యముగా కొన్నిసంగతులు గమనింపవలసియున్నది. అట్టివి నిర్మించుటకు ఇబ్బందులు (Technical difficulties) లేనంతమాత్రమున ఆర్థికముగా నవి లాభము చేకూర్పగలవని నమ్ముటకు వీలులేదు. తక్కువమొత్తముగల విద్యుచ్ఛక్తి నుత్పత్తిచేయుటకు జలచక్రములకంటె (turbines & water wheels) ఆవిరి,నూనె, యంత్రములే. (steam & oil engines)

1 Major Howard's (Chief Engineer, Pykara Hydro-Electric Scheme) lecture to the Guindy Engineering College Students, Society—"Hindu" 19th Aug, 1932.

2 ECMA (Benares Engineering College Magazine) 1931, No. III. "Uhl River Hydro—Electric Scheme."

3 Ibid. 1930, No. II. "Cauvery Hydro-Electric Scheme."

ఉపయుక్తములుగను, లాభకరములుగను ఉండునని చెప్పవచ్చును. అయినను తక్కువ మొత్తము గల విద్యుచ్ఛక్తి నుద్భవింపజేయుటకు జలశక్తి ఉపయోగింపబడకపోలేదు. [1] పంజాబురాష్ట్రములో New Hgerton Wollen Mills లోను, Amristsar H. E Pumping Installation లోను 670 K. W. 525 K. W. ప్రమాణముగల విద్యుచ్ఛక్తి జలచక్రములనుగా నష్టములేకుండ తయారుచేసినారు. అయితే దూరప్రాంతముల కీశక్తిని పంపవలసిన అవసరము లేకపోయినది. కాని సామాన్యముగా జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణములు లాభకరములుగా నుండవలెనన్న ఈనిర్మాణము లేయే ప్రదేశములకు విద్యుచ్ఛక్తిని సప్లయిచేయునో ఆయా ప్రదేశములయొక్క మొత్తము 'Load factor' బాగుండవలెను. 'Load factor' అనగా సంవత్సర మొత్తమున సప్లయిచేసిన యూనిట్ల సంఖ్యకును, విద్యుచ్ఛక్తి నిలయములో నెలకొల్పబడిన యంత్రముల యొక్క శక్తిమొత్తమును (total capacity in K. W. of the machinery installed) ఆ సంవత్సరములో సప్లయిచేసిన గంటలసంఖ్యతో గుణించగా వచ్చినమొత్తమునకును గల నిష్పత్తి (ratio). ఈ నిష్పత్తి ఎంత యెక్కువగానున్న (Load factor) అంత బాగున్నదన్నమాట. అనగా విద్యుచ్ఛక్తినిలయములో సమకూర్చబడిన యంత్రములయొక్క మొత్తపుశక్తి సంఖ్య (installed Kilowatts) లో చాలభాగము ఖర్చగుచుండవలెను. కావున ఏయేప్రాంతములలో పరిశ్రమలు వృద్ధికాగలవని తోచునో ముఖ్యముగ నాయాప్రాంతములలో జలపాతజవిద్యుచ్ఛక్తినిర్మాణముల కవకాశము లున్నవేమో తెలిసికొని అట్టియవకాశము లున్నయెడల తప్పక యిట్టి నిర్మాణముల స్థాపించవలెను.

[2] పైకారాస్కీములో ఒక్కొక్క H. P. తయారుచేయుటకు(యంత్రముల కొనుబడి, పనివాండ్రు, ఆనకట్టులు, తదితరఖర్చులు కలుపుకొని) రు. ౬౩౦ లు. (capital cost) లేక రు. ౪౦౦ లు (from installed H. P.) ఖర్చయినది.[3] హిందూదేశములో ఇప్పటివరకు స్థాపించబడిన జలపాతజ విద్యుచ్ఛక్తినిలయములలో ఒక్కొక్క H. P తయారుచేయుటకు అయిన ఖర్చులలో మిక్కిలియెక్కువైనది (Maximum) రు. ౧, ౩౬౦ లు. మిక్కిలితక్కువైనది(Minimum) రు ౨౪౦ లు. కనుక average ఖర్చు రు. ౯౦౦ లు. కాని పైకారాస్కీముయొక్క చీఫ్ ఇంజనీరుగారైన మేజర్ హవర్డుగారు ఒక యూనిటు తయారుచేయుటకగు ఖరీదు రు. ౭౫౦ లు దాటకూడదనియు' మనదేశములో నంతవరకే జలపాతజవిద్యుచ్ఛక్తి నిర్మాణములు లాభకరములుగా నుండుననియు చెప్పుచున్నారు. మనదేశములో ఆఖరీదు దాటవలసిన యవసరముకూడ నుండదు.

---

1 Sir Gangaram's Pocket Book of Engineering.

2 Major Howard's Lecture to the Guindy Engineering College Electrical Engineering Students' Society.

3 Sir Gangaram's Pocket Book of Engineering.

# అరవిందయోగి

పేమ్మరాజు లక్ష్మీపతిగారు

ఆర్యవిజ్ఞానభాస్కరోద్యత్ప్రభాప్తి-వికసనమునందు నొక యరవింద మతడు;
తన్మరందరసాస్వాద తత్పరమతి-మరగి తిరుగాడెడు కిశోరమధుప మేను.

అమరలోకోద్భవవిభూతి నంది; వసుధ-పై ప్రవహిల్లుగంగాస్రవంతి యతడు;
ఆమనోహరవీచికాహతుల జెలగి-మిట్టిపడుచున్న ఒకచిరుమీన మేను.

ఘోషణాతిమోహనముగ కుంభవృష్టి-గురియుచుండెడి నీలమేఘుం డతండు;
ఆయమృతధార లొకటిరెం డాస్వదించి-తనివిసని చొక్కు చిన్నిచాతకము నేను.

గౌరీశంకరపర్వతాగ్రముపయిన్ గాలూను, దోడ్తోడ, గం
భీరాంభోధియగాధతల్పములపై విశ్రాంతి దీపించు ధీ
ధౌరంధర్య మమూరె! సూక్ష్మతమ తత్త్వజ్ఞానవ్యోమంబునం
దారూఢస్థితి బొల్చు నాతనిమహత్త్వం బెన్న సామాన్యమే!

భావవిహంగముల్ నిగిడి పారగలేని యఖండయోగతే
జోఽవృత (?) దివ్యలోక గగనాంతరసీమల, లీలవోలె, స్వే
చ్ఛావశ సిద్ధయానమున సంచరణం బొనరించు యోగ వి
ద్యావిజయాంకితప్రథితు డాతడు, తా నొక రాజహంసయై.

అతనివిపంచిపై నొకసహస్రము తంత్రులు మ్రోగునేమొ; న
ద్భుతగతి సర్వతోముఖసముజ్జ్వలమై యెనలేనిమేటి పాం
డితి జిలికించు నానడకతీవి; హృదంతరసూక్ష్మనాళసం
తతుల గదల్చు నాతనియుదాత్తరసాంచిత కావ్యగీతికల్.

సరసత వేదకాలపుటుషస్సులలో జననంబు నంది, యు
ద్ధురతరశౌర్యవాహినుల దోగి, మనోహరసూత్రబంధన
స్ఫురణ దలిర్చి, యంత్రయుగపుంబెనుచీకటి జీల్చుచున్న మా
భరతజగద్వికాస మనపాయత నాతనియందు వెల్గెడిన్.

ఆజగచ్ఛక్తి లీలావిహారముల, వి - లీనమై పోవు యోగసంధానగరిమ,
విశ్వశ్రుతియందు, దా మేళవించినాడు-తనదు వ్యక్తిత్వమధురగీతము నతండు.



"మాతా శిశువులు"

[త్రివర్ణచిత్రమునుండి తీయబడిన నామూచిత్రము]

చిత్రకారుడు: యస్. యన్. నామెహర్, జి. డి. (ఆర్ట్), కాకినాడ



దేవాలయగోపురము (దాక్షారామము)

శ్రీ వరదా వెంకటరత్నముగారు చిత్రించినది.

# వ్యవసాయము

రావు బహద్దర్ దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు

## ఎరువుల నుపయోగించు విధానము

నరు లడిగినట్లు వానలు
గురియుచు సస్యములు పండుకాలందికి మిగులన్,
సురభులు ఘనముగఁ బితుకును
ధరణిం బ్రజావృద్ధి తనరుఁ దద్రాజ్యమునన్.

చట్టుపైనైన రాజనమును జెఱకును
గావింపఁగల మహాకర్షకులును..

అనంతామాత్యుడు తన భోజరాజీయములో ఉత్తమ వ్యవసాయమును, రైతులను గూర్చి పైయట్లు వర్ణించియున్నాడు. రాతిపైనైనను వరి, చెఱకు పండించగల కర్షకనిపుణులు సస్యాభివృద్ధికి అత్యంతావశ్యకములైన ముఖ్యాంశములను తెలిసినవారుగా నుందురు. అనగా నిస్సారములగు నేలలోగూడ సరియైన పంటలను పండించుటయే ముఖ్యవ్యవసాయలక్షణము.

ప్రప్రథమములో తగినంత భూమి గలిగి యున్నప్పుడు సస్యములు బాగుగనే పెరుగుచుండెడివి. రాను రాను జనాభివృద్ధి యగుటవల్లను, వ్యాపార సౌకర్యము లధికము లగుటవల్లను ఆహారపదార్థములు వ్యాపారవస్తువులు ఎక్కువగా పండించవలసిన పరిస్థితు లేర్పడి విరామము లేకుండ పంటలను పండించవలసివచ్చుటవలన క్రమేణ భూములు నిస్సారములగుచు వచ్చినవి. ప్రపంచ ఆర్థికపరిస్థితులు మారుచుండుటవలన ఆహారసస్యముల కంటె వ్యాపారసస్యముల కెక్కువ ప్రాముఖ్యము గలుగుటచే మనదేశములోని భూములు క్రమక్రమముగా బీదలైపోయినవి. కాలవశము ననుసరించి మనవాళ్లకు చద్ది అన్నముకు బదులుగా కాఫీ ఉపమా మొదలయిన వెట్లు ముఖ్యములయినవో అదేరీతిని మనభూములకు కృత్రిమపు ఎరువు లగత్యము లైనవి. లంచమిచ్చినగాని నేలకూడ పండకున్నది. తగినరీతిని బలపరచుటే లంచమిచ్చుట. నేలను బలపరచుటకు ఎరువులు వేయవలెను. వీటిని మూడువిధములుగా విభజింపవచ్చును. పశువులయెరువు, మేకలపెంట, పాటిమన్ను మొదలగునవి చంటిపిల్లలకు తల్లిపాలవంటివి. గానుగపిండ్లు (oil cakes), పచ్చిఆకు యెరువులు (green manures) పోత పాలవంటివి. ఇపుడు కంపెనీలచే అమ్మబడు రసాయన వస్తువులతో తయారుచేసిన యెరువులు డబ్బాపాలవంటివి. తల్లిపాలు, పోతపాలు వలయునంతమట్టుకు సరిగా దొరకనప్పుడు డబ్బాపాలె ట్లావశ్యకము లగుచున్నవో అట్లే ఆయెరువుకుకూడ అగత్య మేర్పడుచున్నది. ఏరీతినో భూమిని బలపరచినగాని పంటలు సరిగా పండకున్నవి. నూతనవైద్యవిధానములో ఇంజక్షనులకు ప్రాముఖ్య మేర్పడినట్లు ఎరువులువేయుటలో ఆయెరువులకు స్థానము లభించినది. పిల్లలకు తల్లిపాలు దొరకనప్పుడును, చాలనప్పుడును, పోతపాలో డబ్బాపాలో పోసి శిశువులను పోషించుట విధియైనప్పుడు వానిలో నేవి ఉపయోగించుట మంచిదో శిశుతత్త్వము ననుసరించి వైద్యులు చెప్పురీతిని, మామూలు ఎరువులు చాలినంత లభింపక యితరయెరువుల నుపయోగింపవలసివచ్చినప్పుడు వ్యవసాయశాస్త్రజ్ఞులు భూతత్వమును బట్టియు పైరులను బట్టియు నీటివసతి మొదలగు ఇతర పరిస్థితులనుబట్టియు ఏయే యెరువులను ఎంతెంత వేయవలయునో నిర్ణయింపవలయును. కాని యాయెరువుల నమ్ము కంపెనీ ఏజెంట్ల మాటలను నమ్మి రయితులు మోసపోకూడదు. పశువుల యెరువును కొద్దిగనైనను వేసి దానితోగూడ యెరువును ఉపయోగించిన భూములు చెడిపోకుండనుండును. అట్లు పశ్వాదుల యెరువును వేయక ప్రత్యేకముగా రాసాయనికములగు ఎరువులనే ఉపయోగించిన యెడల నేలలు త్వరలో చెడిపోగలవు. రాసాయనికములగు ఎరువులసత్తువ సారాపట్టువలె తాత్కాలికమైనది. ఆయెరువుల నుపయోగించిన వెంటనే పైర్లు నల్లవడి పోదిగా వచ్చుట

చేత మోసపోరాదు. ఎరువుల నుపయోగించుటలో తెలియవలసిన ముఖ్యాంశము లెన్నో కలవు.

సస్యములు బాగుగా పెరుగుటకు నేల షడ్గుణాన్వితమై యుండవలెను. ఈ ఆరుగుణములును ప్రత్యేకము సస్యాభివృద్ధిని కలుగజేయు సామర్థ్యముకలవి. వలయునంత ౧. సస్యాహారపదార్థములు, ౨. నీరు, ౩. గాలి, ౪. అనుకూలమగు ఉష్ణత, ౫. వేళ్లుప్రాకుటకు తగినంత అవకాశము, ౬. హానికరమగు వస్తువులు లేకుండుట. వీనిలో ఏది లోపించినను మొక్క సరిగా పెరుగజాలదు. గణితశాస్త్రరీతిని ౨ × ౩ × ౪ × ౦ మొత్తము సున్న యయినట్లు లోపించిన గుణమును బట్టి ఫలితము శూన్యమగును. ఈలోపమునే వ్యవసాయ రసాయనశాస్త్రజ్ఞులు అవసరమైన మితిగా (limiting factor) చెప్పుచున్నారు. ఈలోపమును పూర్తిచేసిన గాని సస్యము సరిగా పెరుగనేరదు. కనుక ఈయారింటను మొదటిదయిన "సస్యాహారపదార్థము" లందు ముఖ్యాహారములు మూడు: నత్రజని, భాస్వరము, బూడిద క్షారము. వీటికిగాను వివిధములైన యెరువులు అమ్మబడుచున్నవి. అన్ని నేలలలోను సస్యములకు కావలసిన ఆహారపదార్థములు కొద్దిగనో గొప్పగనో ఉండియుండుటవల్ల ఏయెరువు వేసినను మొదట మొక్కలు పెరుగుట కారంభించి పైనచెప్పిన ఆరుగుణములలో దేనికైనను లోప మేర్పడినస్థితి సంభవించినప్పుడు పెరుగుట ఆగిపోవుటయేగాక పైరుకూడ నశించుఅవస్థ తటస్థించును. ఇట్టి అపాయము రాకుండ కనిపెట్టవలెను. రాసాయనికములగు ఎరువులు తొలుత అమ్మకమునకు వచ్చినప్పుడు ఒకవ్యవసాయ శాఖోద్యోగి అతని తల్లిగారికి ప్రీతికరమగు తులసిమొక్కను బాగుగ పెరిగేటట్లు చేయుఉద్దేశ్యముతో గుప్పెడు అమోనియా ఎరువును తులసి మొదట వేసి కప్పిపెట్టగా వెంటనే ఆచెట్టు చచ్చినది. కనుక క్రొత్త ఎరువుల నుపయోగింపగోరువారు ఏయేయెరవులను ఎంతెంత, యేవిధముగా వేయవలయునో సరిగా తెలిసికొని మరి ఉపయోగించవలెను.



మదనమోహన మాలవీయుని బంగాళా

ఛాయాచిత్రకారుడు: కే. కే.

# సైనిక వ్యయము

నార్ల వెంకటేశ్వరరావుగారు

సర్వదేశములలోను భారతావని కడు బీదదనుట యెల్ల రంగీకరించిన విషయమే! ౧౯౨౨-వ సం॥ లో ఫిండిలేషిరాస్ గారు భారతీయుని సాలుసరిసకటాదాయము రు. ౧౧౬ లు అని గుణించి యుంటిరి. ఈ గుణితము సత్యవిదూరమైనదని పెక్కుమంది భావించుచున్నారు. ప్రఖ్యాతి కెక్కిన అర్థికశాస్త్రవేత్తలగు కె. టి. షాగారి లెక్కల ప్రకారము భారతీయుని సాలుసరిసకటాదాయము రు. ౪౬ లు కన్న నధికముగ లేదు. పోనీ, వాదము కొఱకొకించుక సేపు షిరాస్ గారి గణితమే సత్యమైనదని యంగీకరింతము. అప్పుడైనను తదితర దేశస్థుల సాలుసరిసకటాదాయముతో భారతీయుల యాదాయమును సరిపోల్చి చూచిన మనదేశము దుర్భరదారిద్ర్యావస్థలో మునిగియున్నదని స్పష్టపడగలదు. ఇట్టి సరిపోలిక క్రింది[1] పట్టికలో చూపబడినది:—

| దేశము పేరు | సాలుసరిసకటాదాయము (తలకు) రు. |
|---|---|
| అమెరికా | ౧,౯౨౫ |
| ఇంగ్లండు | ౧,౦౦౦ |
| ఆస్ట్రేలియా | ౫౫౫ |
| కెనడా | ౫౫౫ |
| ఇండియా | ౧౧౬ |

పైన పేర్కొనబడిన పట్టికవలన తదితర దేశముల కంటె భారతదేశ మార్థికముగ నెంత వెనుకబడియున్నదియు తెలియుచున్నది. ఐనను లెక్కలతోను, పట్టికలతోను పనియేమున్నది? భారతదేశము కడు దారిద్ర్యావస్థయందున్నదనుట నేనారంభముననే నుడివినట్లు సర్వజనాంగీకృతమైన విషయమేకదా.

ఇట్లు భారతదేశము ఘోరదారిద్ర్యపీడిత భూమియైనను సైన్యపోషణక్రింద ప్రభుత్వము విపరీతముగ ధనము వెచ్చించుచున్నది. ధనరూపము క్రింద చూచిన మనదేశములో కంటె మఱికొన్ని దేశములలోనే సైనిక వ్యయము క్రింద హెచ్చు మొత్తములు ఖర్చుపెట్టబడుచున్నవి. కాని దేశముయొక్క సాంవత్సరికపు ఆదాయమునకును, సైనికవ్యయమునకును గల యంతరమును పోల్చిచూచిన ప్రపంచమునగల దేశము లన్నిటిలోను భారతదేశములోనే యధికముగ వెచ్చింపబడుచున్నది. ఈక్రింద నుల్లేఖింపబడిన పట్టిక[2] లో నట్టిపోలిక చూపబడినది:—

| దేశము పేరు | మొత్తము ఆదాయములో సైనికవ్యయము నూటికి |
|---|---|
| ఇండియా | ౪౫.౨౯ వంతులు |
| జపాను | ౨౬.౫౭ ,, |
| ఇటలీ | ౨౩.౪౬ ,, |
| ఫ్రాంసు | ౧౯.౭౫ ,, |
| సంయుక్తరాష్ట్రములు | ౧౬.౦౯ ,, |
| ఇంగ్లాండు | ౧౪.౭౫ ,, |
| జర్మనీ | ౭.౧౬ ,, |

ఈ పట్టిక వలన మనసాంవత్సరికపు టాదాయములో దాదాపు సగము సైనికవ్యయము క్రిందనే చెల్లిపోవుచున్నట్లు విదితమగుచున్నది. కానికొందరు ప్రభుత్వోద్యోగులు పైవిషయము నంగీకరింపరు. ప్రభుత్వాదాయములో సైనికవ్యయ మెంతభాగ మాక్రమించుకొనుచున్నదో నిర్ణయించుటయందు కేవలము కేంద్ర ప్రభుత్వాదాయమునే గాకరాష్ట్రీయప్రభుత్వముల ఆదాయమునుకూడ లెక్కలోనికి తీసుకొనవలెనని వారు

1 Indian Economics, by Jathar and Beri, Vol. II, p. 169.

2 Public Finance and Our Poverty, by J. C. Kumarappa, pp. 104—5.

వాదింతురు. సైనికశాఖ కేంద్రప్రభుత్వమునకు చెందినది గాన పైవిషయమును నిర్ణయించుటయందు కేవలమొక కేంద్రప్రభుత్వాదాయమునే గైకొనుటధర్మము. ఈధర్మమును త్రోసిపుచ్చి రాష్ట్రీయప్రభుత్వముల ఆదాయమును కూడచేర్చి లెక్కకట్టవలెనని వాదించినచో కేవలము దానితోనే సంతృప్తిపడనేల? రాష్ట్రీయప్రభుత్వముల ఆదాయముతోపాటు జల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, పంచాయతీబోర్డులు మున్నగువాని ఆదాయములను కూడ చేర్చుకొనినచో మఱింత బాగుండునుగదా.

ప్రస్తుతము సైనికవ్యయముక్రింద సంవత్సరమునకు షుమారు ౫౫ కోట్ల రూపాయలు ఖర్చుపెట్టబడుచున్నవి. ఈదుర్భర వ్యయమును గూర్చి భారతరాజకీయవేత్తలు కాంగ్రెసు పుట్టినప్పటినుండియు గగ్గోలు పెట్టుచున్నారు. కాని యది తగ్గింపబడుటకు బదులు హెచ్చింప బడుచున్నది. "స్వతంత్రము కుంటుబడుచోటు" (Where Freedom Falters) అను గ్రంథమున జర్మనీ యుద్ధమునకు పూర్వమును, తర్వాత పదివత్సరములకును వివిధదేశముల సైనికవ్యయములో గల వ్యత్యాసము స్పష్టముగ నొకపట్టిక[3] లో నీయబడినది. దానిలో ౧౯౨౪-౨౫ వ సం. లో ౧౯౧౪-౧౫ సం. లో కంటె భారత ప్రభుత్వము సైనిక శాఖ క్రింద దాదాపు రెట్టింపు వెచ్చించెనని తెలుపబడినది. ఇంతటి హెచ్చుదల మఱేదేశమందును గానరాదు. ఆపట్టికను క్రింద చూపుచున్నాను:—

| దేశము పేరు | హెచ్చుదల నూటికి |
|---|---|
| ఇండియా | +౯౦ వంతులు |
| ఇంగ్లండు | +౩౨ ,, |
| జపాను | +౧౯ ,, |
| బెల్జియము | +౮౪ ,, |
| ఇటలీ | —౧౦ ,, |
| ఫ్రాంసు | —౩౨ ,, |

౧౯౨౨-౨౩ సం. లో దమ నివేదికను వ్రాసిన ఇంచికేపుకమిటీవారు సహితము సైనికవ్యయము చాల హెచ్చుగ నున్నదనియు, దానిని కనీసము ౫౦ కోట్ల రూప్యముల కైనను తగ్గింపవలయుననియు సిఫారసు చేసిరి. వారు వ్రాసినవాక్యములను క్రింద పేర్కొనుచున్నాను:—

"సర్వసైన్యాధ్యక్షుడు మా యభిప్రాయముతో నేకీభవింపకపోయినను ధరలు మఱికొంత పడిపోయినట్లయిన సైనికవ్యయమును కొలదిసంవత్సరముల పిదప ౫౦ కోట్ల రూపాయలకు మించకుండునట్లు తగ్గింపవచ్చునని మేము తలంచుచున్నాము. ఈ మొత్తమైనను భారతదేశీయుని భరింపమని కోరదగిన దానికంటె హెచ్చని మాయభిప్రాయము. వర్తకము పునరుద్ధరింపబడుటవలన ప్రభుత్వాదాయము వృద్ధినొంది నప్పటికిని సైనికవ్యయమును మఱికొంత తగ్గించుటకు ప్రయత్నింపక యుపేక్ష వహించుటకు సమ్మతమైన కారణమేమియు నుండదని మేము భావించుచున్నాము."[4]

ఈ నివేదికను వ్రాసిన తర్వాత ధరలు సగమునకు పైగా పడిపోయి నప్పటికిని సైనికవ్యయము రు. ౫౦ కోట్లకు తగ్గింపబడనే లేదు. తమ కనుకూలముగ లేనప్పుడు తాము నియమించిన కమిటీలకు కూడ ప్రభుత్వము వారిట్టి గౌరవమునే చూపుచున్నారు.

పైనొక చోట దాదాపు ౫౫ కోట్ల రూప్యములు సైనికశాఖకై వెచ్చింప బడుచున్నవని నేను

3 *Vide* Legislative Assembly Debates, Vol. I, No. 32, p. 2117—Dt. 19-3-29.

4 "Should a further fall in prices take place, we consider that it may be possible, after a few years to reduce the military budjet to a sum not exceeding Rs. 50 crores, although the Commander-in-Chief does not subscribe to this opinion. Even this is more, in our opinion, than the tax-payer of India should be called upon to pay, and, though, revenue may increase through a revival of trade, there would, we think, still be no justification for not keeping a strict eye on military expenditure, with a view to its further reduction." Quoted in Sixty years of Indian Finance, by K. T. Shaw, pp. 80-82.

వ్రాసియుంటిని. కాని నిక్కువముగ నంతకన్న చాల హెచ్చుగనే సైనికశాఖకై ఖర్చు పెట్టబడుచున్నది. సాధారణ పరిస్థితులలో సైనికశాఖక్రింద రావలసిన కొన్ని మొత్తములు తక్కినవానిలో జేర్పబడుచున్నవి సైనిక ఆర్థికశాఖ (Military Finance Branch) కై యేటేట షుమారు ౮ లక్షల రూప్యములు వెచ్చింపబడుచున్నవి. ఈ మొత్తము న్యాయముగ సైనికవ్యయము క్రిందకు రావలయును. కాని యది భారత ఆర్థికశాఖ (Indian Finance Department) యొక్క ఖర్చులలో జేర్పబడుచున్నది. ఇట్లే పశ్చిమోత్తరసరిహద్దును కాపలా కాయుటకు నియమింపబడిన వారిఖర్చులన్నియు పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రపువ్యయము క్రింద త్రోసివేయబడుచున్నవి. ఈ కాపలాకు దాదాపు కోటిరూపాయలు ఖర్చగును. ఇంతేగాక, కేవలము సైనికదృష్టితో వేయబడిన రైళ్ల (Stratagic Railways) పై వచ్చునష్ట మంతయు రైల్వేశాఖ నెత్తిపై రుద్దబడుచున్నది. ఇట్టిరైళ్లను నడుపుటవలన యేటేట దాదాపు ౩౨ లక్షల రూప్యములు నష్టము వచ్చుచున్నది. వానిని నిర్మించుటకై పట్టిన పెట్టుబడి పైన ప్రతివత్సరము ౧ కోటి ౬౩ లక్షల రూప్యములు వడ్డీదండుగ తగులుచున్నది. ఈమాదిరిగ సైనికవ్యయమును న్యాయదృష్టితో పరీక్షించినచో నది ౮౬ కోట్ల రూప్యములను మించిపోగలదు. 5

సైనికవ్యయ మిట్లు విపరీతముగ నుండుటకు మన దేశమందున్న బ్రిటిషుదళములే చాలవఱకు కారణమైయున్నవి. ౧౯౨౮ వ సం.లో భారతప్రభుత్వమువారు "సైన్యము —దానిపరిణామము" (The Army and Its Evolution) అనుగ్రంథము నొకదానిని ప్రకటించిరి. ఆగ్రంథపు ౧౯౩ వ పుటలో భారతసైనికునికన్న బ్రిటిషుసైనికునికి దాదాపు నాలుగురెట్లు హెచ్చు ఖర్చగునని స్పష్టముగ వ్రాయబడినది. ౧౯౨౧ వ సంవత్సరములో భారతశాసనసభయం దొకప్రశ్నకు ప్రత్యుత్తర మొసగుచు సర్ గాడ్ ఫ్రే ఫెల్ గారు సకటున నొక్కొక సిపాయికి సంవత్సరమునకు రు ౫౦౦ లు చొప్పున ఖర్చగుననియు, సోల్జరునకు రు. ౨,౦౦౦ చొప్పున ఖర్చగుననియు పలికిరి. మఱొక విపరీత మేమన, బ్రిటిషుసైనికునికి బ్రిటిషుదేశములోకంటె భారతదేశమున హెచ్చుగ ఖర్చగును. ఈవిషయమును భారతప్రభుత్వమునకు సైనికకార్యదర్శియగు జి. యం. యంగుగారే యొప్పుకొనిరి. వారు భారతశాసనసభలో నిట్లుపలికిరి:- "ఇంగ్లండులో నున్న బ్రిటిషుదళములకంటె భారతదేశములో నున్న బ్రిటిషుదళములకు హెచ్చుగా ఖర్చగును."

బ్రిటిషు సైనికుల కత్యధికమైన వేతనములే గాక తలకట్టిరిపు అలవెన్సు, వివాహపు అలవెన్సు, ఘర్మిచరు అలవెన్సు మున్నగున వెన్నియో యొసగబడును. ప్రస్తుతము భారతదేశమందున్న బ్రిటిషుసైనికులకు కేవలము వివాహపు అలవెన్సుల నిచ్చుటకే ౫౦ లక్షల రూప్యములకు పైగా వెచ్చింపబడుచున్నది. ఈ అలవెన్సుల విషయమై మున్ముందు వివరముగ చర్చింతును.

మనదేశపు సైనిక వ్యయము విపరీతముగ నుండుటకు కేవలము బ్రిటిషుసైనికుల కొసగబడు హెచ్చుజీతభత్త్యములే కారణము గాదు. భారతసైనికశాఖవారు పెక్కువిషయములలో నతిదుబారాగా ఖర్చుపెట్టుదురు. ఇంచికేపుకమిటీవా రిట్టిదుబారా ఖర్చులను కొన్నిటిని కడుతీవ్రముగ విమర్శించియుండిరి. ఇట్లు విమర్శింపబడిన వానిలో సైనికశాఖవారి వస్తుసంగ్రహణ పద్ధతి ప్రథమమైనది. ౧-౮-౧౯౨౨ వ తేదీని మిలిటరీ డిపార్టుమెంటు వారివద్దనున్న వస్తుసముదాయపు ఖరీదు దాదాపు ౨౦ కోట్ల రూప్యములని అంచనా వేయబడినది. వీనిలో యుద్ధపరికరములు, మందుగుండు సామగ్రి మున్నగునదియే ౧౮ కోట్ల రూపాయల ఖరీదుచేయును. ఇట్లు విపరీతముగ సామగ్రి నిలువచేయుటవలన పెక్కునష్టములున్నవి. ఆవస్తువులు కొంతకాలము గడచిన పిదప నిరుపయోగము కావచ్చును. లేదా, వానిధర తగ్గిపోవచ్చును. ఒక సందర్భమున యుద్ధ పరికరముల శాఖ (Ordnance Department) వారు వలసినదానికంటె నధికముగ నున్నదని ౫౦ లక్షల రూప్యముల విలువగల

5 *Vide* Legislative Assembly Debates, Vol. 1, No. 33, pp. 2117-8—Dt. 19-3-1929.

వస్తుసముదాయము నమ్మివేయ నెంచిరనియు, దానికి ౯ లక్షలకు మించి ధర రాదని యంచనా వేయబడినదనియు పై కమిటీవారికి తెలుపబడినది. ఇంతేగాక వస్తువులను విపరీతముగ సేకరించి నిలువచేయుటవలన వడ్డీనష్టముకూడ వచ్చును. ౧౯౨౨ వ సం.లో నిలువయున్న వస్తువులపైన నెలకు నూటికి యెనిమిదణాల వడ్డీచొప్పుననే సంవత్సరమునకు దాదాపు ౧ కోటి ౨౦ లక్షల రూప్యముల వడ్డీ దండుగ తగులును. ఈనష్టము లన్నియు నటుండ చేతినిండ వస్తువు లున్నప్పుడు వానిని విరివిగ వాడుట సహజముగ సంభవించును. పైనపేర్కొనిన సందర్భము లన్నియు దృష్టియం దుంచుకొని ఇంచికేపు కమిటీవారు వస్తు సంగ్రహములో నతిజాగరూకతతో మెలగవలసి యుండు నని సిఫార్సుచేసిరి. కాని వారిసిఫార్సు నాచరణలోనికి గొనివచ్చినట్లు కానుపించదు. ఇప్పటికిని వస్తుసముదాయమును మొదట విపరీతముగ సేకరించుట, పిదప నిరుపయోగమని చెప్పి యేదోయొకధరకు తెగనమ్ముట జరుగుచునేయున్నది. ఈమధ్యనే నిరుపయోగమైన వస్తుసామగ్రి నమ్ముటవలన క్రిందిమొత్తములు జమవచ్చినవని మిలిటరీ అకౌంట్సు కమిటీవారు తమరిపోర్టులో వ్రాసిరి:—

| సం. | రు. |
|---|---|
| ౧౯౨౬—౨౭ | ౧,౯౩,౦౦౦ |
| ౧౯౨౭—౨౮ | ౩౬,౭౨,౦౦౦ |
| ౧౯౨౮—౨౯ | ౪౨,౪౪,౦౦౦ |
| ౧౯౨౯—౩౦ | ౨౯,౩౦,౦౦౦ |
| మొత్తము | ౧,౧౦,౩౯,౦౦౦ |

పై యంకెల వలన ౧౯౨౬-౩౦ సంవత్సరముల మధ్య నిరుపయోగమైన వస్తువుల నమ్ముటవలన ౧ కోటి రూప్యములకు పైగా జమవచ్చినట్లు తెలియుచున్నది. సాధారణముగా నిట్టియమ్మకములలో పదిరూపాయల వస్తువు రూపాయకు చెల్లిపోవుచుండును. కనుక పై నాలుగుసంవత్సరములలోను భారతదేశమునకు కనీసము ౮ లేక ౯ కోట్ల రూప్యములు నష్టము వచ్చియుండును

ఇంచికేపుకమిటీవారు సరఫరాశాఖ(Transport Service) ను కూడ తీవ్రముగ విమర్శించి యుండిరి. ౧౯౨౨ వ సం. ప్రాంతమున పై శాఖ స్వాధీనమున ౨౬౧ మోటారుకార్లు కలవట. ఇన్నికార్లు అనవసరమనియు, ౧౫౦ కార్లున్న సరిపోవుననియు వారు వ్రాసిరి. ఇట్లే వారు మఱి పెక్కు దుబారా ఖర్చులను తగ్గింపమని సిఫార్సులను చేసిరి. సరఫరా శాఖకు ౧౯౧౩-౧౪ సం. లో దాదాపు ౨ కోట్ల రూప్యములు ఖర్చగుచుండెడిది. కాని ౧౯౨౨ వ సం. వచ్చుసరికా వ్యయము ౬త్తి కోట్ల రూప్యములకు పెరిగి పోయినది. సవ్యముగ పరిపాలించినచో దీనిలో ౧ కోటి ౧౫ లక్షల రూప్యములకు పైగా ఖర్చును తగ్గింపవచ్చునని కమిటీవా రభిప్రాయపడిరి.

భారతీయసైనిక వ్యయమును గూర్చిచర్చించునపుడు మనము మఱొకముఖ్యవిషయమును గమనింపవలెను. ప్రతిదేశమును స్వరక్షణకై సైన్యమును పోషించును. అట్లే భారతదేశమునకూడ కేవలము దేశరక్షణనిమిత్తమే సైన్యము పోషింపబడుచున్నదా? ఈప్రశ్నకు బ్రిటిషుప్రముఖుల చేతనే ప్రత్యుత్తరము చెప్పించిన బాగుండును గదా?

కొంతకాలము భారతదేశమునకు రాజప్రతినిధిగనున్నకర్జను ప్రభువుగారు తమగ్రంథములలో నొకదానియం దిట్లు వ్రాసిరి:—

"భారతదేశ సైన్యము ప్రారంభము నుండియు ధర్మత్రయమును గలిగియున్నది. ఆధర్మత్రయ మేమన: భారతదేశాంతరంగికశాంతి రక్షణగావించుట, భారతదేశపు సరిహద్దులను కాపాడుట, క్షణములో ప్రపంచములోని తదితర భాగముల కెక్కడికైనను సామ్రాజ్యసేవకై బయలుదేరివెళ్లుటకు సంసిద్ధముగ నుండుట, చిరకాలమునుండియు బ్రిటిషు సామ్రాజ్యరక్షణయందు కడు ప్రాముఖ్య స్థానమాక్రమించి భారతదేశము తనతృతీయ ధర్మమును చక్కగ నిర్వహించుచున్నది."[6]

6 "The Indian Army in fact has always possessed......a triple function: the preservation of internal peace in India itself; the defence of the Indian frontieis, and prepared-

కర్జను ప్రభువుగారు స్పష్టముగ నుడివినట్లు భారత దేశ సైన్యము సామ్రాజ్యరక్షణకు కూడ వినియోగించు కొనుట కుద్దేశింపబడి నప్పుడు దానికగువ్యయములో సామ్రాజ్యము కొంతభాగమును న్యాయముగ భరింప వలదా? ఈప్రశ్నకు ప్రస్తుతము బ్రిటిషుదీవులకు ప్రధాన మంత్రిగనున్న మాక్డనాల్డుగా రొకచో క్రింది విధముగ ప్రత్యుత్తర మొసగిరి :—

“భారతదేశసైన్యములో చాలభాగము — కనీసము సగము — సామ్రాజ్య సైన్యమని చెప్పవచ్చును. ఈభాగము భారతేతరావసరముల కుపయుక్త పడుచున్నది. కనుక దానికగు ఖర్చునంతను మనము భరింపవలెను.”[7]

కాని భారతదేశ సైనికవ్యయములో నొకరాగి దమ్మిడి నైనను బ్రిటిషుప్రభుత్వము భరించుటలేదు. ఇదిట్లుండ, సామ్రాజ్య కార్యనిర్వహణకై భారతదేశ సైన్యములను విదేశములలో నుపయోగించినప్పు డైనట్టి యదనపు ఖర్చులుకూడ మననెత్తిపైననే రుద్దబడినవి. మొదట ఈస్టు ఇండియా కంపెనీవారును, తర్వాత బ్రిటిషు ప్రభుత్వమువారును భారతదేశసైన్యములను చైనా, పర్షియా, నేపాలు, అబిసినియా, ఈజిప్టు, సూడాను, ఆఫ్ఘనుస్థాను, మున్నగు దేశములతో యుద్ధములను సల్పుటకు వినియోగించిరి. దీనికిగాను ౧౮౫౭ వ సం.నకు పూర్వము ౩౫ కోట్ల రూప్యములును, ౧౮౫౭-వ సం.నకు పిదప ౩౭త్తి కోట్ల రూప్యములును అదనముగ ఖర్చుపెట్టబడెను. ఈమొత్తమంతయు నన్యాయముగ భారతదేశము నుండి వసూలు చేయబడెను.

జె. సి. కుమారప్ప గారి లెక్కల ప్రకారము కేవలము భారతదేశావశ్యకతలకొఱకే భారతదేశసైన్యము పోషింపబడి యుండినచో సైనికశాఖ క్రింద ౧౮౫౯-౧౯౩౦ సంవత్సరముల మధ్య ౧,౩౮౦ కోట్ల రూప్యములు మాత్రమే ఖర్చుపెట్టవలసివచ్చెడిది. కాని భారతదేశసైన్యమును సామ్రాజ్యకార్యనిర్వహణకుకూడ నుద్దేశించుటవలన ౨,౧౨౮ కోట్ల రూప్యములు ఖర్చుచేయబడెను. ఈవిధముగ భారతదేశ సైనికశాఖక్రింద పైన పేర్కొనబడిన సంవత్సరముల మధ్య షుమారు ౭౪౮ కోట్ల రూప్యము లధికముగ వెచ్చింపవలసి వచ్చినది.[8]

ఇంతే గాక, భారతవర్షము బ్రిటిషుసైనికులకు శిక్షణ గఱపుకొనునిమిత్త ముపయోగించుకొనబడుచున్నది. ఈసందర్భమున మేజరు డి. గ్రాహం పోలు గారు క్రిందివిధముగ వ్రాసిరి:—

“నిష్కర్షగ నొప్పుకొనక పోయినను, సత్యమేమన, భారతభూమి బ్రిటిషుసైన్యమునకు శిక్షణ నొసగుటకు ప్రధానమైన స్థానము.”

౧౮౭౦ వ సం. లో ప్రారంభింపబడిన “షార్టు సర్వీసు సిస్టము” (Short Service System) క్రింద పైవిధముగ బ్రిటిషుసైనికులకు భారతదేశపు వ్యయముతో శిక్షణగరపబడుచున్నది. ఈపద్ధతిక్రింద సైనికో

ness to embark at a moment's notice for Imperial service in other parts of the globe. In this tbird aspect India has for long been one of the most important units in the Scheme of British Imperial defence..."—Lord Curzon in his book, "The Indian Corps in France."

7 "A large part of the Army in India—certainly one half—is an Imperial Army which we require for other than purely Indian purposes and its costs, therefore, should be met from Imperial and not Indian Funds."—Government of India, by J. R. MacDonald, p. 135.

8 *Vide* Report on Financial Obligations between Great Britain and India, Vol. I, pp 64-66.

9 "The fact is, of course, although it is not usually so candidly admitted, that India is the chief training ground of the British Army."—Major D. Graham Pole in New India, 3-7-1930.

ద్యోగికి ౭ సంవత్సరములును సైనికునికి ౫ సంవత్సరములును శిక్షణ గఱపి, పిదప వారిని యింగ్లండునకు పంపివేయుదురు. వీరికి తరిఫీదునొసగుట కనువ్యయముగాక, వీరిని ఇంగ్లండు నుండియిండియాకు తెచ్చుటకును, తిరిగి ఇంగ్లండుపంపుటకును కావలసిన స్టీమరుఖర్చులుకూడ మనపైననే వేయబడుచున్నవి. ౧౯౨౩ వ సం.న ౬,౯౩,౦౦౦ పౌనులు పై నుదాహరించిన స్టీమరుఖర్చుల క్రింద వెచ్చింపవలసి వచ్చెను. ౧౯౦౦ సం.లో నియమింపబడిన వెల్బీకమిషనువారు పైఖర్చులలో సగము బ్రిటిషువారు భరింపవలెనని సిఫార్సుచేసిరి. కాని వానిలో ౧,౩౦,౦౦౦ పౌనులు మాత్రమే బ్రిటిషుప్రభుత్వము భరించుచున్నది. తక్కినదంతయు మనము చెల్లించుకొనవలసి వచ్చుచున్నది. ఈవిధముగ మనవ్యయముతో తరిఫీదు నొందినవారందరును యింగ్లండుసైనికశక్తి నభివృద్ధిపరచుటకుపయుక్తపడుచున్నారు. ఈపద్ధతిని గూర్చి గోక్లేగారు వెల్బీకమిషనుముందు సాక్ష్యమిచ్చుచు క్రిందివిధముగ పలికిరి:—

"మేము 'షార్టుసర్వీసు'నకు ఖర్చుపెట్టుకొందుము. కాని దానివలన కలుగు లాభమంతయు ఇంగ్లండునకు పోవును. ఈపద్ధతిలో గలసుగుణ మేమన, దానివలన పెద్దరిజర్వు లభించును. మాయింగ్లీషురిజర్వు యింగ్లండులో నున్నది. అది మా కన్నివేళలయందును ఉపయోగపడదు. అందువలన భారతదేశమున గల బ్రిటిషుసేనలను యుద్ధసన్నద్ధములుగ నుంచవలసివచ్చుచున్నది."10

గోక్లేగారి వంటి మితవాద శిఖామణి ఖండించిన పద్ధతినిగూర్చి వేరుగ విమర్శన గావించుట కేవల మనవసరముగదా!

నేను పైన వివరముగ వర్ణించినట్లు భారతదేశ సైన్యము పెక్కువిధములుగా సామ్రాజ్యసేవకై వినియోగించుకొనబడుచున్నది. కాని దానికిగాను భారతదేశమున కెట్టిముదరా యివ్వబడుటలేదు. ఇట్లుగావించుట యన్యాయమని మాక్డనాల్డుమంత్రిగారుకూడ నుడివిరి. కాని భారతదేశమునకు జరుగుచున్న యన్యాయమిదియొక్కటియే కాదు. ఎప్పుడైన నత్యావసరము కలిగినప్పుడు బ్రిటిషుప్రభుత్వ సైనికదళములు భారతదేశమునకు రప్పింపబడినయెడల వానికగుఖర్చులు భారతీయుల నుండి రాబట్టుకొనబడుచున్నవి. దీనికి ౧౮౫౭ వ సం.లో జరిగినసిపాయివిప్లవము నుదాహరణగ నైకొనవచ్చును. అప్పుడు భారతప్రభుత్వసహాయార్థము కొన్ని బ్రిటిషుసేనలురప్పింపబడెను. ఆసేనలు భారతదేశములో నున్నంతకాలమువానికైన ఖర్చులన్నియు బ్రిటిషుప్రభుత్వము గుంజుకొనెను. పోనీ, అంతటితో సరిపోయినదా? లేదు. బ్రిటిషుసేనలు భారతదేశమునకు పయనమైన తేదీకి ౬ మాసముల క్రితము నుండియువానికైన ఖర్చులుకూడ వసూలుచేయబడెను.11 ఈవిషయము "మాయింటికి వస్తే నాకేమి పెడతావు; మాయింటికి వస్తే నాకేమితెస్తావు" అన్న సామెతను నుర్తునకు తెచ్చుచున్నది.

ఇట్లే "క్యాపిటేషను" ఖర్చులపేరిట భారతదేశమునకు మఱియొక అన్యాయము జరుగుచున్నది. భారతదేశమునకు బయలుదేరి వచ్చుటకు ముందు సోల్జరులకు కొంతకాలము బ్రిటిషుదేశములో తరిఫీదొసగబడును. దానికగు ఖర్చంతయు భారతప్రభుత్వము నుండియే వసూలుచేయబడును. దానినే "క్యాపిటేషనుచార్జి" అందురు. ప్రారంభములో దీనిక్రింద ప్రతి సోల్జరునకు ౭ పౌనుల ౧౦ షిల్లింగుల చొప్పున పుచ్చుకొనుచుండిరి.

10 "Here we pay for short service, but the advantage of the system goes all to England. The peculiar merit of the system is that it gives a large reserve. Our English reserve is in England, and it is not always available to us. Hence the British troops in India are all placed on a war booting".—Speeches of G. K. Gokhale, Appendix I, p. 32. (G. A. Natesan & Co., Madras.)

11 *Vide* Report on the Financial Obligations between Great Britain and India, Vol. I, p 15.

యుద్ధములో దీనినే ౧౧ పౌనులు ౮ షిల్లింగులకు పెంచిరి. ఇప్పుడు ౨౭ పౌనుల ౧౦ షిల్లింగుల చొప్పున పుచ్చుకొనుచున్నారు.[12] ఇట్లు తరిఫీదు చార్జీలను విపరీతముగ వసూలుచేయుట యక్రమమని భారతప్రభుత్వము వారు మొరపెట్టుకొనుచు వచ్చిరి. కాని బ్రిటిషు యుద్ధకార్యాలయము (War Office) వారు వారి మొఱలను నిన్నమొన్నటివరకు నాలకించలేదు. ఈమధ్యనే దీనినిగూర్చియు, మఱికొన్ని చార్జీలనుగూర్చియు విచారణ సల్పుటకొక న్యాయాధిపతులకమిటీ యేర్పాటుచేయబడినది. కాని కమిటీసభ్యత్వపు టెన్నిక, దానివిచారణ క్రమము మున్నగునవి ప్రజామోదకరముగ లేవు. ఐనను దానివలన "గ్రుడ్డిలో మెల్ల" యన్నట్లు కొంతవఱకైనను లాభము కలుగునేమో చూడవలసియున్నది.

ఏకారణములచేతనైననేమి భారతదేశమున సైనికశాఖకై విపరీతముగ ఖర్చుపెట్టబడుచున్నది. ఇందువలన ప్రభుత్వపు బొక్కసములో, తదితర దేశహితకారకములైన విద్యాశాఖ, ఆరోగ్యశాఖ మొదలగువానిపై కావలసినంతగ వినియోగించుటకు ధనము మిగులుటలేదు. ఇంగ్లండులో తలకు ౨ షిల్లింగుల ౬ పెన్నీల చొప్పున విద్యావ్యాప్తికై వినియోగింపబడుచున్నది. మనదేశమున తలకు కేవలము ౬ పెన్నీల చొప్పుననే ఖర్చు పెట్టబడుచున్నది. ప్రస్తుతము మనదేశమున విద్యాశాఖపై షుమారు ౧౨ కోట్ల ౩౭ లక్షల రూప్యములు వెచ్చింపబడుచున్నవి. ఇంగ్లండులోవలె నిక్కడకూడ నున్నయెడల న్యాయముగ విద్యాశాఖపై షుమారు ౨౬ కోట్ల రూప్యములు ఖర్చుపెట్టబడవలెను. దీనినిబట్టి మనసైనికవ్యయము దేశాభివృద్ధి కెంతప్రతిబంధకముగనున్నదియో పాఠకమహాశయులే యూహించుకొనగలరు.

ఈ దుర్భర సైనికవ్యయము కనీసము సగము వఱకైనను తగ్గింపబడనిచో భారతవర్షము సర్వతోముఖముగ నభివృద్ధినంది సాటిదేశములలో గౌరవప్రదస్థానము నలంకరింప నేరదు. కనుకనే గాంధిమహాత్ముడు తన చారిత్రాత్మకమైన ౧౧ షరతులలో "సైనికవ్యయమును నూటికి ౫౦ వంతులు తగ్గించుట" అనుదానినికూడ చేర్చెను.

హృదయపూర్వకముగ ప్రయత్నించినచో సైనికవ్యయమును సగమునకు తగ్గించుట సాధ్యమే. ఏదేశమైనను స్వీయ రక్షణకొరకు కేవలము సైనికవృత్తియే జీవనాధారముగ పెట్టుకొన్నవారిపై నాధారపడియుండలేదు. అట్లాధారపడిన, భారతదేశమందువలె సైనికవ్యయము దుర్భరముగ పెరిగిపోవును. అందువలన స్వాతంత్ర్యము ననుభవించుచున్న ఫ్రాంసు, జర్మని, ఇంగ్లండు, అమెరికా, జపాను మొదలగు దేశములన్నియు "నిర్బంధ సైనికశిక్షావిధానము", "రైఫిలుక్లబ్బు", "కాడెటు కోర్సు", "టెరిటోరియలు ఫోర్సులు", "వాలంటరీఫోర్సులు" మున్నగు సాధనల నెన్నిటినో అవలంబించుచున్నవి. వీనివలన సైనికవ్యయము చాల తక్కువయగును. కాని యావసరము కలిగినప్పుడు దృఢగాత్రుడైయున్న ప్రతిదేశీయుడును యుద్ధమున కక్కరకువచ్చును. ఇట్లు సైనికవిద్యనే జీవనోపాధిగ పెట్టుకొనక, కావలసిన తరిఫీదునుబడసి, అవసరము వచ్చినప్పుడు దేశరక్షణ కుపయుక్తపడువారినందరిని "రిజర్వ్సు" అందురు. ఈక్రిందపేర్కొనబడిన పట్టికవలన కొన్ని స్వతంత్రదేశములలో గల సైనికుల సంఖ్యయు, రిజర్వ్సు సంఖ్యయు తెలియగలదు[13]:—

| దేశము | సైనికులు | రిజర్వ్సు |
|---|---|---|
| బ్రిటిషు దీవులు | ౧,౨౯,౮౦౦ | ౮,౭౦,౬౦౦ |
| ఫ్రాంసు | ౬,౬౬,౫౭౦ | ౨౯,౫౨,౬౭౦ |
| జర్మని | ౬,౧౦,౦౦౦ | ౩౮,౮౦,౦౦౦ |
| జపాను | ౨,౧౦,౦౦౦ | ౭,౩౦,౦౦౦ |

ఇట్లు తదితరదేశములలో సైనికబలమునకు కనీసము నాలుగు రెట్లధికముగ రిజర్వుబలమున్నది. కాని భారతదేశమం దట్లు కాదు. ఇక్కడ షుమారు ౧ లక్ష ౫౦ వేలమంది సైనికు లున్నారు. రిజర్వులో షుమారు ౬౬ వేల మంది మాత్రమే యున్నారు. ఈక్రిందపట్టిక[14]

12 *Vide* Indian Review, October 1932.
13 *Vide* 'Fifty Years of Indian Finance,' p. 83 (foot-note).
14 *Vide* Legislative Assembly Debates, Vol. I, No. 23, p. 1511—Dt. 5-3-29.

వలన కేవలము బ్రిటిషుసామ్రాజ్యముతో పోల్చిచూచినను పైవిషయములో మన మెంత వెనుకపడి యున్నదియు తెలియగలదు.

| దేశము | పురుష జనసంఖ్య | టెరిటోరియలు సైనికులు | లక్షమందికిగల టెరిటోరియలు సైనికులు |
| --- | --- | --- | --- |
| భారతదేశము | ౧౬,౩౯,౯౫,౫౩౪ | ౧౯,౦౭౪ | ౧౧ |
| ఇంగ్లండు | ౨,౨౫,౧౭,౫౦౦ | ౧,౮౩,౬౮౧ | ౮౧౧ |
| ఆస్ట్రేలియా | ౨౭,౬౨,౭౭౦ | ౩,౫౪,౦౦౦ | ౧౨,౮౧౨ |
| న్యూజిలాండు | ౭,౦౭,౫౫౬ | ౨౨,౨౨౫ | ౩,౧౧౦ |

తక్కిన దేశములలో వలె మన దేశములోకూడ రిజర్వుపద్ధతి పరిపూర్ణముగ ప్రవేశపెట్టబడినయెడల ప్రస్తుతమున్న ౧ లక్ష ౫౦ వేల సైనికులలో చాలమందిని తగ్గింపవచ్చును. అప్పుడు సైనికవ్యయము పూర్తిగ తగ్గిపోవును. దీనివలన ఖర్చు తగ్గినను రక్షణశక్తి వృద్ధినందును.

ఒకవేళ ప్రస్తుతమున్న సైనికులను తగ్గించుటకు వీలులేదని వాదించిన సైనికవ్యయమును దేశానర్థదాయకము గాకుండ చేయుటకు మఱియొక మార్గమున్నది. నేడు భారతదేశమునగల బ్రిటిషుసైనికులను, బ్రిటిషు సైనికోద్యోగులను తీసివేసి వారిస్థానముననే భారతీయులను నియమించినచో సైనికవ్యయము సగమునకుపైగా తగ్గిపోగలదు. దీనివలన ప్రస్తుతమున్న సైనికులసంఖ్య తగ్గదుకూడ.

ఇదెట్లు సాధ్యమగునో కొంతవఱకు నిరూపింప యత్నింతును. ప్రస్తుతము మామూలు "రేషన్"కాక ప్రతిసోల్జరునకు నెలకు రు. ౬-౧౩-౬ భోజనపు అలవెన్సు (messing allowance) ఇవ్వబడుచున్నది. సిపాయికి నెలకు కేవలము రు. ౦-౧౦-౦ మాత్రమే యివ్వబడుచున్నది. అనగా పైఅలవెన్సులో ప్రతిసోల్జరునకును సిపాయికన్న షుమారు ౧౦ రెట్లు ఎక్కువ ముట్టుచున్నది. సోల్జర్లను తీసివేసి వారిస్థానమున సిపాయిలను నియమించినచో దీనిలో ౪౨౦¾ లక్షల రూప్యముల ఖర్చును తగ్గింపవచ్చును.

తలకత్తిరింపు అలవెన్సు (hair cutting and washing allowance) క్రింద ప్రతిసోల్జరునకు నెలకు రు ౩-౦-౦ ఇవ్వబడుచున్నవి. ఈతల కత్తిరింపునకే ప్రతిసిపాయివద్ద నెలకు రు. ౦-౫-౦ పట్టుకొనబడుచున్నది. దీనిలో బ్రిటిషు సైనికులను తగ్గించుటవలన ౨౦¾ లక్షల రూప్యములను పొదుపుచేయవచ్చును. పైగా వారిస్థానే నియమింపబడిన సిపాయిలవద్దనుండి ౨¼ లక్షల రూప్యములను బిగబట్టుకొనవచ్చును. మొత్తముమీద దీనిలో ౨౩¼ లక్షలరూప్యముల ఖర్చును తేలికగ తగ్గింపవచ్చును.

దుస్తులఅలవెన్సు (kit and clothing allowance) క్రింద సోల్జరునకు రు. ౫-౧౫-౦, సిపాయికి రు. ౨-౧౫-౦ ఇవ్వబడుచున్నవి. సోల్జరుస్థానే సిపాయిని నియమించినచో తలకు రు. ౩-౦-౦ చొప్పున మొత్తము ౨౦¾ లక్షల రూప్యముల ఖర్చును తప్పింపవచ్చును.

సజ్జీకరణపు అలవెన్సు (equipment allowance) కూడ పైదానివలెనే యివ్వబడుచున్నది. దీనిలోకూడ ౨౦¾ లక్షల రూప్యములను ఆదాచేయవచ్చును.

ఫర్నిచరు అలవెన్సు (furniture allowance) క్రింద వివాహితులైన సోల్జరులకు నెలకు రు. ౩-౪-౦ ఇవ్వబడును. ఈ అలవెన్సు సిపాయిల కివ్వబడదు. దీనిలో షుమారు ౩ లక్షల రూప్యములను పొదుపుచేయవచ్చును.

వివాహపు అలవెన్సు (married soldiers allowance) క్రింద వివాహితుడైన ప్రతి సోల్జరునకు నెలకు రు. ౩౦-౦-౦ చొప్పున నివ్వబడును. పదిమంది భార్యలను కట్టుకొన్నను సిపాయి కిట్టి అలవెన్సు క్రింద రాగి దమ్మిడికూడ ముట్టదు. దీనిని తీసివేయుటవలన ౯ లక్షల రూప్యముల ఖర్చును తగ్గింపవచ్చును.




## మధురమైన విటమిన్ ఆహారము

మాల్టుసారమును, శాంతివంతమైన పాలక్రొవ్వును ఏ. బి. సి. డి. విటమినులు విరివిగాగల యితర పదార్థములును, యిందు మిళితమైయున్నవి.

## అమూల్యమైనది

ఎదిగేపిల్లలకు ఆరోగ్యము నిచ్చుటలోను, దంతములను, ఎముకలను చక్కగా నిర్మించుట యందును, అసమానమైనది.

## రేయాల్టు

కృంగి కృశించెడివారికిని, పాండురోగమునకును, సామాన్య దుర్బలత్వమునకును, గర్భిణి సమయమందును, ప్రసవానంతరమును సరియైన పోషణ నొసగుటకును ఉపయోగించును.

# Bengal Chemical & Pharmacutical Works, Ltd.,

## CALCUTTTA.

మద్రాసుస్టాకిస్టులు:—యస్. దేశాయిగౌండర్, బందరువీధి,

చిల్లరప్రదర్శనశాల:—చైనాబజార్ రోడ్డు, రాజుగారి ప్రతిమకు యెదురుగా.

# కేసరి రత్నత్రయము

"లోధ్ర"

వనితల ఋతుదోషాది రోగములకు.

"అమృత"

రక్తశుద్ధి ద్రావకము.

"అర్క"

సర్వ జ్వరములను హరించును.

అన్ని మందుల షాపులలో దొరుకును.

## కేసరికుటీరం,

ఆయుర్వేద ఔషధశాల,

ఎగ్మూరు, మదరాసు.

---

డాక్టరు కోనేటిరావుగారి

అమోఘములైన ఔషధరత్నములు

## ఆస్తమా స్పెసిఫిక్

ఉబ్బస మనే పెనుభూతముయొక్క భయములేదు.

పుట్టుకతోనుండి గాని, చిరకాలమునుండి గాని బాధించుచుండు ఉబ్బసవ్యాధులను (దగ్గు) నిస్సందేహముగా నివారించు దివ్యౌషధము. అనేకమంది డాక్టర్లు రాజవైద్యులు పరీక్షించి, దీని అమోఘమైన గుణమును మెచ్చుకొనియున్నారు. ఐదురోజులకు గుణము కనబడును. విడువకుండా 40 రోజులు సేవించిన తిరిగి ఉబ్బసవ్యాధి ఎన్నడు కాన్పించదు. ఇచ్ఛాపథ్యము.

40 రోజులకు రు. 5. 20 రోజులకు రు. 3.

## సిప్లిస్ స్పెసిఫిక్

సకలమైన మేహవ్యాధులకు దివ్యౌషధము

సీసా రు. 2.

స్వాస్థ్యకుటీరం, ఏలూరు, (పశ్చిమగోదావరి).

---

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడుకు చల్లదనమును కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 1-0-0 3 సీసాలు రు. 2-10-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అంతు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని,

కందుకూరి వేంకటసుబ్బారావు,

ఎం. డి. ఎ. గారి

## కామామృతము

స్వదేశమునందు, అనేకవిదేశములయందుఁ బ్రఖ్యాతిఁబొందిన యౌషధము. రాత్రిపూట యొకమాత్రపుచ్చుకొనిన ఎంతనిస్సారమైన శుక్రమైనను వెంటనే సంసారసౌఖ్యము నీయఁగలదు. 5 దినములలో మూత్రములోఁ గలిసిగాని ముందువెనుకలఁగాని నిద్రలోఁగాని పోయెడి వీర్యమును దృఢముగా నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరముల బలహీనముగలవారు ఈమందునే పైకి పూతగాఁగూడ నుపయోగించిన మిక్కిలి శక్తివంతులు కాఁగలరు. వెంటనే పరీక్షింపుఁడు. ఉత్తరములు రహస్యముగా నుంపఁబడును. మావద్ద మదరాసు గవర్నమెంటువారిచే నిర్ణీతమైన ఆయుర్వేదౌషధములు గూడ పెక్కులు గలవు. యోగ్యతాపత్రములు అనేకములు కావలసినవారు వ్రాయుఁడు.

20 మాత్రల కామామృతము సీసా 1-కి రూ. 2-0-0.

అమృతాశ్రమము, నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

బిడ్డల అలవెన్సు (Soldiers' Children Allowance) క్రింద బిడ్డలుగల ప్రతిసోల్జరునకు బిడ్డకు నెలకు రు. ౧౦-౦-౦ చొప్పున నలుగురు బిడ్డలవఱకు యివ్వబడును. ఈ అలవెన్సుకూడ సిపాయికి లేదు. దీనిలో ౬ లక్షల రూప్యములు మొదలు ౯ లక్షల వఱకు ఖర్చు తగ్గింపవచ్చును.

సోల్జరులకు పారిశ్రామికశిక్ష నొసగు నిమిత్తము ప్రతిసంవత్సరమును ౬ లక్షల రూప్యములు వెచ్చింపబడుచున్నవి. సిపాయిల కిట్టి సౌకర్యము లేదు. దీనినంతయు తగ్గింపవచ్చును.

ప్రస్తుతము భారత వర్షములో ౬౦ వేలమంది సోల్జరు లున్నారు. వారినందరిని తగ్గించినచో ౪ కోట్ల ౪౨ లక్షల రూప్యములను పొదుపుచేయవచ్చును.

ఇట్లే మఱి పెక్కువిధముల ఖర్చును తగ్గింపవచ్చును. నేడు భారతవర్ష సైనికదళములలో నున్న శ్వేతవర్ణుల నందరిని తగ్గించి, వారిస్థానమున భారతీయులను నియమించినచో (పైన కొంతవఱకు చూపబడినట్లు) సైనికవ్యయములో ౩౨ కోట్ల రూప్యములను పొదుపుచేయవచ్చును. ఈ లెక్కలనన్నిటిని వివరముగ నొకరచయిత కొంతకాలము క్రిందట బొంబాయి క్రానికలు పత్రికలో చర్చించెను.

ఇట్లే సైనికవ్యయమును తగ్గించుటకు మఱిపెక్కుమార్గము లున్నవి. వీని నాచరణలో బెట్టుటకు ప్రతిబంధకము లేవియు లేవు. కేవలము బ్రిటిషువారిహృదయము పరివర్తనమునందవలెను. ఆహృదయ పరివర్తనముచేయుటకొఱకే నేడు గాంధిమహాత్ముడు యెరవాడచెరసాలలో తపస్సుచేయుచున్నాడు.

---

ఆంగ్లో హైందవ మహమ్మదీయ సమ్మేళనమునకు సూచనలు



# పున్నమ చందమామ

కవిభూషణ, కవిరాజ శ్రీ రాజా వత్సవాయ వేంకట నీలాద్రిరాజుగారు

నీరజబాంధవుండు నలినీమలినీకరణప్రచారనీ
హార మడంప విల్గొనినయప్పుడు వాని నెదుర్కొనంగ నీ
హారమరీచి యెత్తిన శరాస మనంగ పునర్వసూశుభా
కారము వొల్చె దత్కరవికర్షితమై గగనాంగణంబునన్.

అలరున్ గైదువజోదుమామ యిలువేల్పైయుండ నింద్రాణితో
గలియన్ బల్లకి యెక్కి మోచు మునివర్గం బెత్తివైవన్ దివిన్
దలక్రిందౌ నహుషేంద్రువైఖరి మఘానక్షత్రభాజ్యోని మం
డలముత్తం బహీతార గానబడియెన్ బ్రాచ్యాచలాగ్రంబునన్.

తెమలిచి సంజకావితెర దించిన మంచముమీద యామినీ
కుముదదళాక్షికన్గవమొగుడ్పు దొరంగునెడన్ దదగ్రభా
గమునకు దెచ్చు తూర్పుచెలికత్తియ డాపలిచేతి మించుట
ద్దము క్రియదోచె ఫల్గునుల దాపున జాబిలి హస్తవైపునన్.

వ్రాలకవ్రాలె నస్తశిఖరంబున జిత్రయు స్వాతిగొల్వగా
మాలతి నవ్వ శీతకరమండల మప్పుడు కాలపూరుషో
న్మీలితహస్తముక్తరజనీరమణీస్తన హారమధ్యగ
స్థూలనవప్రవాళమణి శుంభదనుత్తమనాయకాకృతిన్.

---

# దండనీతి: మరణశిక్ష

ఏ. యల్. జగన్నాథరావుగారు, బి. ఏ., బి. యల్.

## ౧

మన మాతృభాష రాజభాష కాకపోవుటచే స్మార్తవ్యావహారికానుశాసనికములగు విషయములను సరిగాఁ జర్చించుటకుఁ దగిన పరిభాష మనకుఁ బరిచితమై యుండలేదు. మఱియు నాంగ్లభాషలో వ్యక్తీకరింపఁబడు కొన్ని భావములు మనభాషాసంప్రదాయమునకు నూతనము లగుటవలన, దండనీతిలో విధినిషేధనియమములను జర్చించునపుడు పారిభాషికపదములను జాగరూకతతో నెన్నుకొనవలయును. సంశయములను వీలైనంతవఱకుఁ దొలఁగించుటకుఁ గొన్ని పదముల నిట్లు పొందుపఱచుచున్నాను :—

౧. Criminal Law = దండ నీతి.

౨. Law = వ్యవహారము, ఆచారము, ఆదేశము, రాజాజ్ఞ, కార్యాకార్యనియమము, వ్యవహారవిధి, స్మృతి.

3. Crime = అపరాధము, దోషము, పాతకము, నేరము.

౪. ప్రత్యుపకృతి = Compensation.

ప్రకరణముఁ బట్టి పయిపదములలో ననువగువాని నచ్చటచ్చటఁ బ్రయోగించుచున్నాను.

## ౨

ఆధునిక దండనీతి కొన్నికొన్ని యపరాధములకు మరణశిక్ష విధించుచున్నది. అత్యంతపాతకులగువారు సంఘములో జీవింపఁదగరనియు, క్రూరమృగములను సంహరించునట్లు వీరలను గూడ నశింపఁజేసినఁగాని సంఘము వర్ధిల్లదనియుఁ, గొందఱు దండనీతిజ్ఞుల యభిప్రాయము. దీనికిఁ బూర్వపక్షము చేయువారు, మరణశిక్ష యెట్టిపాతకమునకైనను విధింపఁదగదనియు, నట్టి శిక్షావిధాన మధర్మమనియుఁ జెప్పుదురు.

ఈవిషయమును బూర్తిగాఁ జర్చించుటకుఁ బూర్వము దండనీతి పూర్వచరిత్ర నెఱిఁగియుండవలయును; మఱియు దండనీత్యుపష్టంభముల నెఱిఁగియుండవలయును. కావున దండనమననేమి? ఎట్టియు కార్యములు దండనార్హములు? దండించువా రెవరు? దండనమువలనఁ బ్రయోజనమేమి? అనుప్రశ్నల కుత్తరము లీయవలసియుండును.

మానవుని జీవితము సాంఘికము. మానవునిలో సంఘీభావము వృద్ధినొంది, రాష్ట్రమనునది యేర్పడినప్పుడు, రాష్ట్రపరిపాలనాక్రమముకొఱకు మానవుఁడు చింతించు నవస్థ, మానవసాంఘికపరిణామములో నొక యున్నతమైన సోపానము. మనప్రశ్నల కుత్తరము లిట్టి స్థితిలో నున్న సాంఘికవ్యవహారములను బరిశీలించిన గ్రహింపవచ్చును.

రాష్ట్రపరిపాలనాక్రమములోఁ గార్యాకార్యనియమమును, స్మృతివ్యవహారనిర్దేశమును ముఖ్యములు. దండనీతియనునది కేవలము కార్యాకార్యములను శాసించునది. ఇయ్యది కార్యము. కొన్ని సాంఘికపరిస్థితులలో ప్రతివ్యక్తియు నిట్టికార్యము విధిగా నిర్వర్తింపవలయును. ఇయ్యది అకార్యము: శాసనోల్లంఘనముఁ జేసిన నెవ్వఁడైనను శిక్షాపాత్రుఁడు కాఁగలఁడు. ఇట్లు దండనీతి నిర్దేశించుచుండును. ఇట్టి దండనార్హకార్యాకార్యములకును, స్మృతివ్యవహారవిషయములకును భేదము కలదు. అది యెట్లన :—

౧. దండనీతిలో నిషేధింపఁబడిన కార్యములు దోషములు, పాతకములు; స్మృతివ్యవహారనిషిద్ధకార్యములు పాతకహేతువులు కావు.

౨. అకార్యము లన్నియును అనర్థహేతువులు. కాని పాతకముల వలన సంభవించు ననర్థము సంఘసర్వస్వమునకును హేయము; అస్మార్త వ్యావహారికములు

అర్థిప్రత్యర్థులకు సంబంధించునవియే. కాని, ఇతరుల యెడ బాధకములు కావు.

3. పాతకములను దండించునట్టి యధికారము కేవలము రాష్ట్రీయము. ప్రత్యేకవ్యక్తులకు దండనక్రియ యందు పురస్కారము లేదు.

౪. పాతకులకు శిక్షవిధింపవలయును. అస్మార్త వ్యావహారిక కార్యములను జేయువారు ప్రత్యుపకృతి గావింపవలసియుండును.

ఈ భేదములు ఉదాహరణమువలన స్పష్టమగును.

౧. నేనొకవర్తకుఁడను. మఱియొక వర్తకునకుఁ గొన్ని వీసెల పంచదార నిచ్చెదనని వాగ్దానము చేసి యుంటిని. అట్లు ప్రతిజ్ఞ నెఱవేర్చ లేనందులకు, నేనాతనికిఁ బ్రత్యుపకృతి గావింపవలె నేకాని వేఱేమియు లేదు. అట్టిప్రతిజ్ఞా భంగము చేయుటవలన నేను పాతకుఁడను (Criminal) గాను.

౨. కోపావేశమున నేనొక మనుష్యునిఁ జంపితి ననుకొందు. అట్టితఱి నేను పాతకి నగుదును. మారణదోషము ప్రత్యుపకృతిచే శాంతింపదు— శాసనవిహిత దండనమును దోషి యవశ్యము పొందవలసినదే.

అట్లైనఁ గార్యజాలములోఁ బూర్వోదాహృత విభాగ మెట్లు కావింపవలయును ?

అందులకుఁ బ్రత్యేక సూత్రము కానరాదు. "జనవాక్యంచ కర్తవ్యం" అనునదియే మూలసూత్రము. సాంఘికచరిత్రఁ బరిశీలించిన దేశకాలానుసారముగాఁ బైవిభాగము మారుచున్నట్లు తెలియును. ఒకానొకప్పుడు మారణదోషమునకు కూడ నార్థిక ప్రత్యుపకృతి గావింపఁగలిగినవాఁడు శిక్షితుఁడు కానవసరము లేకుండెను. ఈవిభాగభారము శాసనసభలపై ప్రస్తుతముకలదు.

పిమ్మట దండనమువలన ప్రయోజనము విచారింతము. తత్ప్రయోజననిరూపణార్థము చతుర్విధవాదములు కలవు:—

౧. ప్రతీకారవాదము.

౨. పారివర్తనికవాదము.

3. నిరోధవాదము.

౪. భయహేతువాదము.

### ౧. ప్రతీకారవాదము

పాతకుఁడు సంఘమున కపచారముఁజేసెను. కనుక సంఘము దోషికిఁ బ్రతీకారము గావింపవలయును. ప్రతీకార మొనర్చుట మానవధర్మము. శిక్షితుఁడైన పాతకునివలన ధర్మసంస్థాపనము కాఁగలదు. దుష్టశిక్షణవలన సంఘమును దహింపఁజేయు ధర్మాగ్రహజ్వాల శాంతినొందును. ఇట్లు ప్రతీకారవాదులు తమపక్షమును సమర్థించుకొందురు. ఇందు వృద్ధుల వచనములు కూడఁ బ్రమాణములుగాఁ జూపవచ్చును. "సర్వో దండ జితో లోకః..." అని మనువచనము. దండభయముచేతను గాని యధర్మమును నిర్మూలింపసాధ్యము కాదు. పాశ్చాత్య స్మృతికారులు, "Eye for eye, foot for foot, tooth for tooth, hand for hand must go"* —"నీశత్రువు నీకట్టి యపకార మొనరించెనో అట్టి యపకారమును నీశత్రువు నెడలఁ గావింపవచ్చు" నని చెప్పియున్నారు.

కాని, కేవలము దండనము ప్రతీకారభావముతో జేయుట న్యాయవిధానము కాఁజాలదు. పాతకజనకములగు ప్రవృత్తులకు మూలకారణ మాలోచించి, వానిని నిర్మూలించిన, పాతకములు రాష్ట్రబహిష్కృతములు కాఁగలవు. ఇట్లు తర్కించువారు

### ౨. పరివర్తనవాదులు

వీరి మతముప్రకారము దోషులు రోగులు. దుష్కార్యప్రవృత్తి మానసికరోగము. అంధత్వము బధిరత్వము వలెనే, పాతకిత్వము వికృతి. అట్టిరోగోత్పత్తికి వివిధ కారణములు గోచరించవచ్చును. సంస్కారసంపర్క పరిస్థితి విశేషములను బట్టి వ్యక్తుల ప్రవృత్తులు మారుచుం

* పదార్థము:—కంటికి కన్ను, పంటికి పన్ను (ల్లు), కాలికి కాలు, చేతికి చేయి ఇవ్వవలసియుండును.

డును. కాని వస్తుతః ప్రతివ్యక్తియందును సుగుణమే యున్నదికాని దుర్గుణములేదు. అట్టితరి దోషులయెడలఁ బ్రతీకారభావము వహించుటకన్న దయఁబూని వారిని సన్మార్గానువర్తు లగునట్లు చేయుటయే రాష్ట్రీయాధికారముయొక్క పరమావధియైయుండును. కనుక వీరికి, కారాగృహము లన్నియు రోగనివారణాలయములుగా మారుచున్నవి.

ఇట్టిసంకల్పములో నిజము లేకపోలేదు. సహజముగా మానవుఁడు పాతకి కాఁడు. మనుజునకు సంస్కారసంపర్కాదులవలన వృత్తిపరిణామము కలుగును. కనుక, ఎట్లు దుస్సంస్కారాదులవలన వాఁడు పతితుఁ డయ్యెనో, అట్లే సుసంస్కారములవలన పునీతుఁడు కాఁగలఁడు.

ఈ కల్పన యెంత సమంజసముగా నున్నను, దీనియాచరణ విధానము దుర్బోధము. వ్యవహారరీతిని గొంతవఱకు నిరుపయోగము. ఒక పంచమహాపాతకునకు విద్యాబుద్ధులు గఱపి, యింద్రియ వైపరీత్యములను దృఢప్రజ్ఞతో నిరోధించునంతటి మునిపుంగవునిగా మార్చుట దురూహము.—అట్టిపరిణామము వచ్చుటలో నసందర్భమేమియు లేక పోయినను, సాధారణముగా నట్టిది సంభవించుట మిక్కిలి దుర్లభము.

మఱియుఁ గామక్రోధప్రచోదితములగు దుష్కార్యములు రోగోద్భూతవికారములని చెప్పుటలో సారస్యము తక్కువ. ప్రప్రథమమున రాష్ట్రీయాధికారులు దోషములను జేయువారలను నిరోధించినయెడల, రాష్ట్రములో శాంతి నెలకొల్పవచ్చును. కనుకఁ దద్విధానము ప్రధానముగాని, వేఱేదియును ముఖ్యముకాదు. ఈవిధమునఁ బరివర్తనవాదుల నాక్షేపించువారు

## 3. నిరోధవాదులు

వీరిమతమున దండనము నిరోధనార్థము. శిక్షితుఁడగు దోషి, పునర్దండనమునకు వెఱచి తనస్వాతంత్ర్యసుఖములను గోల్పోవలేక, తిరిగి పాతకకృత్యముల నాచరింపఁబూనఁడు.

వీరివాదము వ్యవహారరీతినిఁ జక్కఁగా నున్నది.

ఇంకొక వాదము, భయహేతువాదము.

## 4. భయహేతువాదులు

చాలవఱకు నిరోధవాదుల పథమునే యవలంబించుచున్నారు. వీరలకు భేదము విస్తారములేదు. దండనాదర్శము భయహేతువాదులప్రకారము, సంఘమందు భయోత్పాతము కలిగించుట. శిక్షితుఁడగు దోషి సంఘమునకు భయదిహ్నమగుచున్నాఁడు. ఏతత్స్మృతివలన నెవ్వరైనను దండనీతివిరుద్ధకార్యములను జేయఁబూనరు.

ఈసూత్రము ననుసరించియే కొఁబోలు మూఁడు శతాబ్దముల క్రిందట నింగ్లండు ఫ్రాన్సు దేశములలో దోషులను చెట్లపై నురిదీసి, యాకళేబరముల నట్లే కాకులకును గ్రద్దలకును విడుచుచుండెడివారు. అట్లు వ్రేలాడు కంకాళములు ప్రతిపథికునకును శాసనోల్లంఘన ఫలమును జక్కఁగా చిత్రించి బోధించుచుండెడివి.

ఆదినములు నడచినవి. అట్టి దుర్భరవిధానములు నేఁటి దండనవిధానమందుఁ గానరావు.

ఈసూత్రమున కూడ వాస్తవముగా దోషము కానరాదు. ఒకానొకదోషికి విధింపఁబడిన శిక్ష సంఘమునకు విజ్ఞాపనము.

కాని పైనిరూపించిన చతుర్విధవాదములను బరిశీలించి చూచినఁ బ్రత్యేకముగా నేదైనను, అసంపూర్ణమని తెలియును. ప్రతీకార, పరివర్తన, నిరోధ, భయహేతువాదము లన్నియు సమ్మేళనము చేసినఁగాని దండన విధానోపష్టంభము స్థిరప్రతిష్ఠ గాంచనేరదు. ఎట్టి దండన విధానములైనను, ప్రాశస్త్యాప్రాశస్త్యములను దేశకాలానుసారముగా విచారించి, నిరూపించినం గాని న్యాయవర్తనములు కానేరవు.

ఇఁక మరణశిక్షావిధానముయొక్క న్యాయాన్యాయములను విచారింపవచ్చును. ఆధునిక దండనీతిలో, గురుతమమగు శిక్ష మరణము. చిరకాలమునుండియు,

నిట్టి శిక్షావిధానము నానాదేశములయందును గలదు. ఇట్టి శిక్ష మహాపాతకులకే విధింపఁబడుచున్నది.

అయినను నాగరికత పెంపొందినకొలఁది, మరణశిక్షను దండశాసనములనుండి తొలఁగింపఁ బ్రయత్నము కానవచ్చుచున్నది. ప్రాచీనకాలమున మరణశిక్ష విధించునప్పుడు మారణవిధానములు మహాఘోరములు. దోషినిసూక్ష్మముగా బ్రాణత్యాగముచేయనీయక, పలుకష్టములపాలుచేసి తుదకు చంపెడివారు. ఇట్టియాచారము, పాశ్చాత్యదేశమున నేమి, మనదేశమున నేమి, ప్రబలముగానుండెడిది. ఏనుఁగులచేఁ ద్రొక్కించుట, మరుగుచుండెడి తైలములోఁ బడఁద్రోయుట మొదలగు క్రియలు, లోకవిదితములు. క్రమ క్రమముగా, మారణక్రియలలో సూక్ష్మములే యెన్నుకొనఁబడినవి. అమెరికాదేశములో విద్యుచ్ఛక్తివలన మారణముఁజేయుట కొన్నిస్థలములయందుఁ గలదు.

అదియట్లుండఁ గొందఱు ధర్మశాస్త్రకోవిదులు మరణశిక్షయే అప్రశస్తమని తలంచుచున్నారు. మరణశిక్ష దండనస్మృతినుండి తొలఁగించుటకు సాధ్యముకాదని తలంచువారలలో న్యాయాధ్యక్షుఁడగు డార్లింగ్ మొదలగువారు కొందఱుకలరు. వారివాదము సూక్ష్మము: మహాపాతకుఁడు అహివృశ్చిక వ్యాఘ్రతుల్యుఁడు. వానిని సంహరించుటయే సంఘమునకు శ్రేయోదాయకము. అదండ్యులను దండించుట యెంత పాపహేతువగునో దండ్యులను దండింపకపోవుటయు నంత పాపహేతువే యగును.

దీనికిఁ బూర్వపక్షము మిక్కిలి బలీయము. అది ముఖ్యము లగు మూఁడుకారణములపై నాధారపడియున్నది:—

౧. భగవద్దత్తమగు మానవజీవితమును సంహరించుటకు, మానవమాత్రున కధికారము లేదు. తాను నశింపఁజేయఁగలఁడే కాని మానవుఁడు, పునరుజ్జీవింపఁజేయ లేఁడు కనుక, మానవునకు మరణశిక్ష విధించుట కధికారము లేదు. అయ్యది యీశ్వరేచ్ఛకు వ్యతిరేకము.

౨. గుణ దోష విచారణచేయు న్యాయాధ్యక్షుఁడు ప్రకటితకార్యములనే విచారించును కాని, మానవతత్త్వము సరిగా నాలోచింపఁబూనఁడు. అతి భ్రష్టచరితుఁడైనను కాలపరిణామమున మిక్కిలి గుణవంతుఁడు కావచ్చును.

అట్టివానిలో నంతర్వాహినియై ఏమహాశక్తి ప్రవహించుచున్నదో? మరియు నొకానొకఁ డతిపునీతుఁడైనను కొంతవఱకు హేయగుణాన్వితుఁడు కాఁడని నిశ్చయముగాఁ జెప్పఁదగునా? బ్రతికియుండిన జీవితము మారవచ్చును. బ్రతికియుండిన మానవునిలో నణఁగియున్న శక్తుల నుద్బోధము చేయుటకు సమయము చిక్కును.

3. సాధారణముగా దోషములు స్థిరపరచుట కష్టము. ప్రత్యక్షముగా దోషము చేయఁబడినట్లు రుజువగుట దుర్లభము. న్యాయాధ్యక్షుఁడు అనుమానించి, పరిస్థితులనుబట్టి యూహించి, ఆరోపితదోషమును నిర్ధారణ చేయవలయును.

న్యాయాధిపతి యెట్టి మేధావియైనను, మానవుని ధీశక్తి స్వల్పమైనదనియే నమ్మవలయును. అట్టి వారే, ప్రమాణపురుషగణము కూడ. అట్టితరి కించిత్సంశయము కలిగినను, మరణశిక్ష అన్యాయహేతు వగునేమో యనుభయము కలుగును. కనుక, సాధారణముగ మరణశిక్ష తొలఁగించుట శ్రేయోదాయక మగునేమో.

ఈహేతువులచే, గాంధిమహాత్ముఁడు మొదలైన మహాపురుషులు కొందఱు మరణశిక్షను, దండనస్మృతినుండి తొలఁగింపవలయుననియే యభిప్రాయపడుచున్నారు.

# సాంత్వనము

దివాకర్ల వేంకటావధానిగారు

(కృష్ణునివలె దక్షిణనాయకత్వమును వహించి చరించు మధుకరయువకుని మోటుమా నిసివనియుఁ, జపలుఁడవనియు నిందించి భర్త కెఱింగించి పద్మకోరకకారానిహితాత్ముఁ జేయుదు నని నళిని బెదరించినది. ప్రణయకోపము వీడి ప్రేయసి మరలఁ బ్రసన్నయగుట కాతని వేఁడికోలు.)

విభుఁడు విభుం డటందు వరవిందమ! న న్నతఁ డేమి సేయు? నీ
రభస మొకింత చూచిన కొలందిగఁ బ్రేమయు హెచ్చుచుండె, నా
కభయ మొసంగి ప్రోవఁ దగు నంతియ కాని తిరస్కరించుచో
నుభయులమున్ మునుంగవలె నుద్ధతశోకమహాంబురాశిలో.

ఎక్కడనో నభమ్ముపయి నేఁగుచుఁ దా నొక మాఱు గూడ నీ
ప్రక్కకు రానివాఁ డకట! భర్తయె తీవ్రమయూఖుఁ డోసి! నీ
కెక్కడివెట్టి? బాల్యమున నింతవికాసము సంతరించి నీ
మక్కువ కాస్పదుండయిన మాన్యుఁడు తండ్రి యనంగఁ జెల్లఁడే?

మూలములేని కోపమును ముగ్ధ! వహింపకు నన్నువంటి ప్రే
మాలయుఁ డీ త్రిలోకములయందును లేఁడని నీ వెఱుంగవో?
చాలును జాలు నింక నవిచారిత వాక్యము లేమి సేతు? నే
గాలియె సోఁకుటన్ బెడమొగం బగుచుంటివి! క్రొత్తవాఁడనే?

అదియును సంతసంబె విను మంబుజకోరకబంధనంబు నా
కొదవుట! నాయవస్థ కయయో! యని కుంది ప్రసన్నచిత్తయై
తుదకు వికస్వరోన్ముఖముతో నది న న్నలరించుఁ గావునన్
బెదరెదు వాఁడఁ గానుజుమి! విద్విషవృత్తిఁ జరింపఁబూనుచో.

ఎఱిఁగి యెఱుంగలేక వచియించినఁ జెప్పెడి దేమి? నీకు నా
మొఱకుఁదనమ్ము పూర్వ మనుభూతమె? పూవిలుకాని బారికిన్
గుఱియయి చేయుచేష్ట లనుకూలములే యగు, రాగపూర్ణయా
తరుణికి మోటకుం డగునె తత్ప్రియకాంతుఁ డొకింత తెల్పుమా!

‘ఇంకొకతె కానుపించినయెడల నన్ను - వదలిపోదువు నీ వుత్తవంచకుఁడవు
నమ్మఁగా రాదు నీకుఁ బున్నెమ్ము గలుగు - నరుగు మెందేని నను వీడు’ మందువేని?

జనుల శాసింపఁగాఁ జాలిన విద్యావిశారదులైన భూస్వామివరులు,
తమప్రవృత్తియు శిష్యతతికి నాదర్శమై యలరారఁగగు నుపాధ్యాయగణము,
జగముఁ బ్రోచెదు మతాచార్యవర్యులమని సన్నాసులైన ముష్కరశతంబు,
సంఘ మధోగతిఁ జనుచున్న దీఁక మార్పు కావలె ననెడు సంస్కర్తృచయము,
నొక రనఁగ నేల? మనకన్న నూహయందుఁ - బెద్దలౌ మానవులె సిగ్గు విడిచిపెట్టి
నియతి మాలి చరింపఁగ నీచజాతి - కీటకమ్మున కుండవే లోటుపాట్లు!

అన్యపుష్పాసవపిపాస నప్పుడప్పు - డేఁగుచుందును మతి చలియించి కాని
సత్యమును బల్కుచుంటి సంశయము వలదు-నాకు నీ వన్న నెపుడుఁ బ్రాణమ్ముసుమ్ము!

చిన్నతనంబునుండియు వశీకృతమా హృదయమ్ము గల్గి నీ
సన్నిధినే చరింపుచు నజస్రము నీ గుణసంస్తవంబు న
త్యున్నతమా కలస్వనముతో నొనరించెద నట్టి నాయెడన్
గన్నియ! నీ వొనర్చెడు నికారము సైఁచుట యెట్లు తెల్పుమా!

చంపక మట్లు నీకు నతిసాహసముల్ బల మున్నచో ననున్
బంపుము పోవువాఁడ నణుమాత్రము నీపయి నాస లేక, యీ
తెంపును జంపు చాలును గదే! యిఁక నీమధు వానినిచ్చి మ
న్నింపుము! దోష మున్న సహియింపుము! నాపయిఁ గూర్మి నింపుమా!



# లోకబాంధవోపాసన

జోస్యుల శ్రీరామమూర్తిగారు

లోకబాంధవు డనగా సూర్యుడు. లోకమున కంతకును ఆయురారోగ్యముల నిచ్చి బంధుకృత్యము నెరవుటవలన సూర్యుడు లోకబాంధవు డయినాడు. అట్టిసూర్యునియొక్క ఉపాసన—సేవయే, లోకబాంధవోపాసన.

మానవులమగు మనకు దైవభక్తి పరమావశ్యకము. ఏజాతివారయినను—నాస్తికుల మాటయటుండనిండు—అందరును ఏదో యొకవిధమైన దైవమును గొలుచుచునే యున్నారు; అందరికిని భక్తి యనునది వదలరానిది. ఇట్టి భక్తి దైవముపై మనకు గుదురవలయు నన్న మనోనిశ్చలత యావశ్యకము. మనోనిశ్చలత సాకారమగు వస్తువు యందు గాని సాధ్యము కాదు. అందుకయియే విగ్రహము లేర్పడుట. ఇట్టియెడ ప్రత్యక్ష-దైవము, లోకబాంధవుడు నగు సూర్యుని యుపాసన మన మనోనిశ్చలతకు మిక్కిలిగ తోడుపడజాలదా? పైగా లోకబాంధవుడు తన్నుపాసించువారికి ఆయురారోగ్యములను, తద్ద్వారా ఐశ్వర్యమును ఒసగునుగదా!

ఈలోకబాంధవోపాసన మన పూర్వుల యాచరణయం దుండినది. కాలగతి బట్టి దానియం దాదరము మానవులకు సన్నగిల్లుచు వచ్చినది. కాని నేడది మరల మానవుల హృదయముల పొడసూపుచుండుట సంతోషింపదగినది. అందం దిప్పు డీయుపాసనను సాధింప సంస్థలు బయలుదేరుచున్నవి. దీనియం దాదరము నానాటికి హెచ్చుచున్నది. ఎందరో దీనివలన ఆయురారోగ్యములను బడయుచున్నారు.

ఇట్టి యీ లోకబాంధవోపాసన యెట్లాచరింపవలయునో తెలుపుటయే యీవ్యాసముముఖ్యోద్దేశ్యము. ఈలోకబాంధవోపాసననే మనవారు సూర్యనమస్కారము లందురు. వీనివలన దేహమునకును, మనస్సునకును మితిలేని లాభములు గలుగును.

## విధానము

నిత్యము బ్రాహ్మముహూర్తమున, అనగా సూర్యోదయమునకు పూర్వమే, లేచి, కాల్యకృత్యములను దీర్చుకొని స్నానము చేసి శుభ్రమైన వస్త్రములను ధరించి, అశూన్యలలాటుడయి చెట్లుచేమలు లేని శుభ్రమైన బయలుప్రదేశమునకు వెళ్లి, మెట్టపల్లములు లేని, గట్టిగనున్న సమప్రదేశమును చూడవలెను.

తరువాత తూర్పుగ తిరిగి వస్త్రము మోకాళ్లపైకి గట్టి తదితరవస్త్రముల విసర్జింపవలెను. శుభ్రమైన తెల్లని వస్త్రమును (సుమారు రెండడుగులు చదరముగలదానిని) భూమిపై పరచవలెను. రెండుపాదములను కలిపి కాలిబొటనవ్రేళ్లు గుడ్డఅంచును చేర్చియుంచవలెను. శరీరమును సరిగా నిలబెట్టి నమస్కరించి యుండవలెను. చేతిబొటనవ్రేళ్లు ఱొమ్మునమస్య నుంచవలెను. తక్కిన ఎనిమిదివ్రేళ్లు కలిపి యుంచవలెను. సూర్యునివైపు చూచుచు దృష్టి స్థిరపరచి శారీరక మానసిక దైవికబలములు రావలెనని మనస్సున సూర్యుని బ్రార్థించి, 'ఓం, హ్రాం, మిత్రాయ నమః' యని సూర్యనమస్కారములు ప్రారంభింపవలెను.



మొదటిస్థానము (చి. ౧):—పైచెప్పిన విధమువ.

నిలబడుట. శరీరమును వంచరాదు. దృష్టిని ఎదుటి వస్తువుపైననే కొంతసేపు నిలుపవలెను.



రెండవస్థానము (చి. ౨):—'ఓం హ్రాం మిత్రాయ నమః' అనుచు చేతులను పైకిఎత్తుచు గాలిని పీల్చవలెను. చేతులు చెవులకు తగిలీతగులన ట్లుంచవలెను. అరచేతులు ముందుకు ఉంచవలెను. వ్రేళ్లు కలిపియుంచవలెను.



మూడవస్థానము (చి. ౩):—వంగి అరచేతులను భూమిమీద (వస్త్రముమీద) ఛాతీవెడల్పున ఉంచవలెను. చేతిబొటనవ్రేళ్లు, కాలిబొటనవ్రేళ్లు పరచిన వస్త్రముఅంచున ఉండవలెను. ఈవిధానము చేయునప్పుడు చాలమందికి కాళ్లు వంచవలసి ఉండును. మొదట కష్టముగ నున్నను క్రమముగ చేసినచో తేలికగ నుండుటయే కాక హెచ్చరికగాకూడ ఉండును. ముక్కును మోకాళ్లయొద్దకు తీసికొనివెళ్లుటకు ప్రయత్నించవలెను. ఇప్పుడు రెండవస్థానమున పీల్చినగాలిని పూర్తిగ వదలవలెను. వంగినకాళ్లుకొంచెము ఎత్తుటకుప్రయత్నించవలెను.



నాలుగవస్థానము (చి. ౪):— కుడికాలును వెనుకకు జాచి వ్రేళ్లపై పాదమును నిలువుగా మోపియుంచవలెను. కాలిని జాచుకొనునప్పుడే గాలినిగూడ లోనికి పీల్చవలెను. మోకాలు భూమికి తగులవలెను. ఎడమపాదము భూమి నాన్చియుంచవలెను. ఎడమకాలు ఎడమచేతిలోపల నుండవలెను. నడుమును బాగుగా వంచి ముందుకు చూడవలెను. చేతులు కదల్పరాదు.



ఐదవస్థానము (చి. ౫):—ఎడమకాలునుకూడ

వెనుకకు జాచి కుడికాలితో చేర్చవలెను. రెండు పాదములు కలిపి వ్రేళ్లపై నిలుపవలెను. మనము లాకాశమును చూచుచుండవలెను. ఈస్థానమున జూపు క్రిందికి నుండవలెను. శరీరము సంచరాదు. శరీరము నంతను చేతులపైని, కాలివ్రేళ్లపైని నిలుపవలెను. గాలిని కుంభించియుంచవలెను.



ఆరవస్థానము (చి. ౬):— నొసలు, రొమ్ము, మోకాళ్లు భూమికి తగులునట్లు పరుండవలెను. గాలిని వదలవలెను. పొత్తికడుపు భూమికి తగులరాదు. పిరుదులు పైకి ఎత్తవలెను. మోచేతులను ప్రక్కలకు నదిమియుంచవలెను.



ఏడవస్థానము (చి. ౭):— చేతులపై పూర్తిగ లేచుచు గాలిని పీల్చుకొనవలెను. ఆకాశమువైపు చూడవలెను. మెడను సాధ్యమైనంతవరకు వెనుకకు వంచవలెను. మోకాళ్లు భూమికి వాన్చియుండవలెను. చేతులు కదపరాదు. నడుమును బాగుగా వంచవలెను.



ఎనిమిదవస్థానము (చి. ౮):— తలను కడుపులోనికి తోసికొని, బొడ్డును చూచుచు గాలిని వదలవలెను. పాదములను పూర్తిగ భూమిమీద నానించవలెను. చేతులను కదపరాదు.

తొమ్మిదవస్థానము:— ఎడమకాలును యథాస్థానమున చేర్చుచు గాలిని లోనికి పీల్చుకొనవలెను. నడుమును వంచవలెను. ముందునకు చూడవలెను. (నాల్గవస్థానము ప్రకారము ఉండవలెను.)

పదవస్థానము:— కుడికాలును కూడ ఎడమకాలుతో చేర్చి మూడవస్థానమున నున్నట్లుండవలెను. ముక్కును మోకాళ్లయొద్దకు తీసికొనివెళ్లుచు గాలిని వదలవలెను కాళ్లు వంగకుండ కొంచెము పైకి ఎత్తుటకు ప్రయత్నించవలెను.

పదునొకండవస్థానము:— మొదటిస్థానమునకు వచ్చుట. గాలిని పీల్చుకొనవలెను.

వరా:—పై పదునొకొండుస్థానములు కలసి ఒక నమస్కార మగును. ఇరువదియైదు (౨౫) నమస్కారములు కలసి ఒకయావర్తన మనబడును. అట్టి యావర్తనములు ఇరువది సం. ల వయస్సు దాటినవారు నాలుగైదయిన చేయవలెను. భూమిమీద అరచేతులు పెట్టినది మొదలు (3-వస్థానము) మరల మొదటిస్థానము

నపు వచ్చునంతవరకు చేతులను కదపరాదు. బయలు ప్రదేశమున సూర్యనమస్కారములు చేయుటకు వీలు లేనిచో తమ యింటిలో గాలి, వెలుతురు బాగుగా వచ్చు ప్రదేశముననైనను చేయవచ్చును. సూర్యుని పటమో, లేక తమ ఇష్టదేవతపటమో ఒకదానిని ఎదురుగ నుంచుకొనుట మంచిది.

ఈక్రింద నుదాహరించిన ౨౫ మంత్రములు ౨౫ నమస్కారములు చేయుటకు వీలగును. ఎన్నియావర్తనములు చేసినను ఈమంత్రములే. నమస్కారముల నారంభించినపుడెల్ల వరుసగా ఒక్కొక్కమంత్రమును గట్టిగా నుచ్చరించవలెను. అట్లుచ్చరించుటవలన ఊపిరితిత్తులకు బలము కలుగును.

౧. ఓం హ్రాం మిత్రాయ నమః.

౨. ఓం హ్రీం రవయే నమః.

౩. ఓం హ్రూం సూర్యాయ నమః.

౪. ఓం హ్రైం భానవే నమః.

౫. ఓం హ్రౌం ఖగాయ నమః.

౬. ఓం హ్రః పూష్ణే నమః.

౭. ఓం హ్రాం హిరణ్యగర్భాయ నమః

౮. ఓం హ్రీం మరీచయే నమః.

౯. ఓం హ్రూం ఆదిత్యాయ నమః.

౧౦. ఓం హ్రైం సవిత్రే నమః.

౧౧. ఓం హ్రౌం అర్కాయ నమః.

౧౨. ఓం హ్రః భాస్కరాయ నమః.

౧౩. ఓం హ్రాం హ్రీం మిత్ర రవిభ్యాం నమః.

౧౪. ఓం హ్రూం హ్రైం సూర్య భానుభ్యాం నమః.

౧౫. ఓం హ్రౌం హ్రః ఖగ పూషభ్యాం నమః.

౧౬. ఓం హ్రాం హ్రీం హిరణ్యగర్భ మరీచిభ్యాం నమః.

౧౭. ఓం హ్రూం హ్రైం ఆదిత్య సవితృభ్యాం నమః.

౧౮. ఓం హ్రౌం హ్రః అర్క భాస్కరాభ్యాం నమః.

౧౯. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం మిత్ర రవి సూర్య భానుభ్యో నమః.

౨౦. ఓం హ్రౌం హ్రః హ్రాం హ్రీం ఖగ పూష హిరణ్యగర్భ మరీచిభ్యో నమః.

౨౧. ఓం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః.

౨౨. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః, ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్ర రవి సూర్య భాను ఖగ పూష హిరణ్యగర్భ మరీచ్యాదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః.

౨౩-౨౪. ఈనమస్కారములు రెండును ౨౨-వ నమస్కారమువంటివి.

౨౫. ఓం సవిత్రే సూర్యనారాయణాయ నమః.

నమస్కారములు పూర్తియైనతరువాత 'ఓం పద్మినీఉషాఛాయాసమేత శ్రీ సూర్యనారాయణస్వామినే నమః' అని నమస్కారముచేసి భగవంతుని కేదియైన నొకఫలమును నివేదనచేసి, భుజించిన ఆయురారోగ్యైశ్వర్యములు గలుగును.

సూర్యనమస్కారమువలని లాభములు :— ఎనిమిది సం.ల వయస్సు దాటినది మొదలు ముదుసలివయస్సు వరకు గల స్త్రీ పురుషు లెల్లరు వీని నాచరించవచ్చును. ఈసూర్యనమస్కారములు మలబద్ధము, ఉబ్బసము, అజీర్ణము, నంజు, కుష్ఠు, బుద్ధిమాంద్యము, సోమరితనము, చర్మరోగములు మున్నగువానిని పూర్తిగ నివారించును; స్త్రీల ఋతుదోషాదిరోగములను నివారించి వారిని సంతానవంతురాండ్రుగ చేయును.

* సూర్యనమస్కారముల నాచరించువారు సాత్వికాహారమును మితముగ భుజించుట మంచిది.

చెన్నరాజధానియందు ౧౯౩౦-వ సంవత్సరము జూలై ప్రారంభము మొదలు సెప్టెంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యమార్గము—(ప్ర) దీనదయాళు అండ్ కో., మదరాసు

ఆరోగ్యశాస్త్రము, ఫా. 3—వెంకటరామయ్య

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

పురాణకథలు, భా. ౧—పి. సూర్యనారాయణశాస్త్రి

పురాణచంద్రిక, భా. ౧,౨—యం. వెంకటరత్నం

భారతకథలు—వి. మైసూరయ్య

వినాయకచరిత్ర—వి. సూర్యనారాయణ

విశ్వామిత్రుడు—యస్. తిరువెంకటాచార్యులు

శ్రీరామచరిత్రము—(ప్ర) జి. హరసర్వోత్తమరావు, నంద్యాల

శ్రీ విఘ్నేశ్వరచరిత్ర—పి. సుబ్బయ్యశర్మ

సగరపట్టాభిషేకము—(ప్ర) శ్రీసీతారాం అండ్ కో., కాకినాడ

## —కల్పితములు

కలియుగవినోదకథలు—బి. టి. నరసింహాచార్యులు

కుటుంబవినోదకథలు, భా. ౧—(ప్ర) విక్టోరియల్ కో., మదరాసు

నవీన చిత్రకథలు—(ప్ర) కె. మునిస్వామి నాయుడు అండ్ కో., మదరాసు

రత్నప్రభ—ఎ. వి. నరసింహంపంతులు

## —చారిత్రకములు

కాళిదాసుచరిత్రము—యస్. యస్. ఆంజనేయులు

జీమూతవాహనుడు, చంద్రహాసుడు—(ప్ర) పి. యస్. వెంకటేశ్వర్ అండ్ బ్రదర్స్, మదరాసు

విష్ణుసప్తుడు—జి. రాధాకృష్ణశాస్త్రి

## కల్పము

వినాయక వ్రతకల్పము—(ప్ర) పి. వి. సుబ్బరావు, నర్సాపురము

## గణితశాస్త్రము

ఐదవతరగతి గణితము—(ప్ర) టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్స్, మదరాసు

గణితశాస్త్రము, బుక్ 3—వి. శ్రీనివాసాచారి, పి. యస్. కృష్ణస్వామిఅయ్యంగారు

నవీనప్రారంభగణితము, త. ౪, ౫—జె. వి. రమణయ్య, జి. గోపాలం

వేళ్వేరుగ చేయతగినట్టి చిరుగణితపుస్తకము, నెం. ౧,౨—యల్. బి. లాసర్

వేళ్వేరుగా చేయతగినట్టి సంఖ్యామానము—యల్. జి. లాసర్

శిశుగణితము, భా. ౧, ౨—యస్. కృష్ణరావు

## గేయములు

కుశలవపట్టాభిషేకము—మస్తాన్‌షరీఫ్

గంగాపరిణయము—ఐ. సన్యాసదాసు

జానకీరామరామాయణము—వి. భాగవతస్వామి

దేవీఅంకమ్మభజనకీర్తనలు—బి. గంగరాజుకవి

పరతత్త్వకీర్తనలు—మొహియద్దీన్ భాషా

విఘ్నేశ్వరవిజయము—టి. కోటయ్య

శ్రమానందశతకమనుకీర్తన—యం. పాపయ్య

శ్రీ సమశ్శివాయ గేయామృతము—సాయం వరద దాస్

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము; అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము.

శ్రీ పాండరంగ భజనకీర్తనలు—టి. శేషదాసు

శ్రీ లక్ష్మీనృసింహధ్యానామృత కీర్తనలు— టి. యజ్ఞ మహాలక్ష్మమ్మ

శ్రీ వీరబ్రహ్మేంద్ర నామ తత్వకీర్తనలు—జె. నాగ భూషణదాసు

శ్రీ సీతాకల్యాణభజనకీర్తనలు—వి. వీరరాజు

శ్రీ హరి కీర్తనము లందలి భజనకీర్తనలు—డి. సర్వేశ్వరుడు

సీతావియోగంబను శబరీ మోక్షము—పి. రామదాసకవి

## చ రి త్ర

~~ఆంధ్రులు—యం. వెంకటరత్నం~~

ప్రపంచచరిత్ర—విజ్ఞానభిక్షు

ప్రపంచచరిత్రము, భా. ౧, ౨—జి. వందనం

హిందూదేశచరిత్ర, భా. ౨—యస్. శ్రీనివాసరావు

హిందూదేశచరిత్రకథలు—వెంకటపార్వతీశ్వరకవులు

హిందూదేశచరిత్రకథలు, బుక్ ౧—యం. కె. సుందర వరదాచార్లు

హిందూదేశచరిత్రకథలు, భా. ౨—సి. యస్. శ్రీని వాసాచారి

## చిత్రలేఖనము

చిత్రలేఖనము, బోధనాపద్ధతులు—టి. బుచ్చయ్య

## చ ట్ట ము

బాల్యవివాహ నిరసనచట్టము—(ప్ర) యం. యస్. పార్థసారథి అయ్యంగారు, మదరాసు

శారదాచట్టము— (ప్ర) అన్నపూర్ణాదేవి గ్రంథమాల, గుంటూరు

## ఛందశ్శాస్త్రము

కవిత్వ చింతామణి—సి. కోటి నరసింహము.

## జీవితములు

నెపోలియను బోనపార్టి జీవితము —(ప్ర) వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు.

రమణమహాఋషి జీవితము—తత్వానందస్వామి

## జ్యోతిషశాస్త్రము

జాతకదర్పణము—యస్. పురుషోత్తమకవి

జాతకనిర్ణయము—యం. రామమూర్తి

శ్రీ జ్యోతిషజంత్రి—పి. వెంకటకృష్ణరాయశర్మ

## దండకము

శ్రీ వీరాంజనేయస్వామి దండకము, అంగదరాయబార సహితము—కె. వెంకటకృష్ణ భావనారాయణ మూర్తి

## ధర్మశాస్త్రము

ధర్మసింధు—కె. కామశాస్త్రి

## న వ ల లు

కర్పూరమంజరి, భా. ౧—సి. లక్ష్మీనరసింహము

తిరుగుడుపెండ్లి—వెంకటపార్వతీశ్వరకవులు

దేవేంద్రబాబు—కె. కృష్ణమూర్తి

భైరవఖడ్గము—కె. కృష్ణమూర్తి

మాయామయి, భా. ౫—కె. రంగయ్య

రాసిలస్—(అను) కె. నరసింహం

లలిత—(అను) జె. సత్యనారాయణ

లలితకుమారి—వి. సుబ్బరావు

సంజీవి (ప్ర) అ. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము

## నాటకములు

అభిజ్ఞానశాకుంతలము— (అను) కె. కొండలరావు

కన్యాల దొరకదు అను గజపొంగ వైరాగ్యము—వి సుబ్బారెడ్డి

కుశలవ—జే. లక్ష్మీనరసింహము

చారుమతీ మోహనము—డి. లక్ష్మీనరసింహము

పద్మవ్యూహము—యస్. పురుషోత్తమరావు

పాండవోద్యోగము—తిరుపతివెంకటేశ్వరకవులు

ప్రచండచాణక్యము—పి. లక్ష్మీనరసింహరావు

ప్రతిజ్ఞాశాంతనవము—యం. సూర్యనారాయణశాస్త్రి

ప్రసన్నయుధిష్ఠిరీయనాటకము—కె. విశ్వనాథం

భక్తగౌరాంగ్—వి. వెంకటరత్నశర్మ

భీష్మబ్రహ్మచారి—యస్. రామానుజరావు
రంగూన్‌రౌడి—యస్. రామానుజరావు
విచిత్రవివాహము—పి. లక్ష్మీనరసింహరావు
విప్రసందేశము—కె. వెంకటరావు
శ్రీకృష్ణరాయబారము—సి. మాణిక్యశర్మ
సంపూర్ణోత్తరరామాయణము—రామనారాయణకవులు
సత్యహరిశ్చంద్రనాటకము—యస్. రామానుజరావు

నిఘంటువు

ఆంధ్రపదనిధానము (పద్యము)—టి. రామదాసకవి

నీతి

బాలనీతికథావళి—కె. వరలక్ష్మమ్మ
నీతికథాసచ్ఛము—పి. బాలకృష్ణరెడ్డి
నీతి కథామంజరి—డి. యస్. రావు
నీతి పద్యములు, త. ౪—(ప్ర). డి. కోదండ రామస్వామి, నర్సాపురము
నీతిపద్య రత్నాకరము—(ప్ర) డి. లక్ష్మణస్వామి, పిఠాపురము
నీతిరత్నాకరము—జె. శేషాద్రిశర్మ

పరిశిష్టము

అదృష్టదీపిక—(ప్ర) విక్టోరియా బుక్ డిపో, మదరాసు
అగుపదివత్సరముల దృగ్గణితపంచాంగములు—(ప్ర) వి. రామస్వామిశాస్త్రి అండ్ సన్స్, మదరాసు
ఆనందవాచక పుస్తకము, బుక్ 3—కె. నరసింహం, పి. యల్. నరసింహం
ఆర్తారావము—యస్. సూర్యనారాయణ
ఉత్తరప్రాసరామాయణము—ఏ. వెంకటరామయ్య
కమలాకరము. భా. ౧—(ప్ర). జె. సీతారామస్వామి, అనకాపల్లి
కమలావాచకములు, తరగతులు ౧, ౨, 3, ౪, ౫—యస్. కామేశ్వరరావు
కర్మాభరణము, భా. ౧, ౨—(ప్ర) యం. యస్. శర్మ అండ్ కో., తెనాలి
కలియుగ అల్లకల్లోలము—సి. వెంకటరమణయ్య
కల్లుసారాయుల కష్టములు—పి. పెరుమాళ్‌దాసు

గృహతంత్రపాఠపుస్తకములు, బుక్ ౧—జి. వెంకటరామయ్య
గుణితబోధిని, భా. ౧—కె. వీరరాఘవయ్య
గురుశిష్యసంవాదము—(ప్ర) కె. సుబ్బరాయ కృష్ణమూర్తి, బెజవాడ
చమత్కార చాటుపద్యములు—(ప్ర) డి. లక్ష్మట స్వామి, పిఠాపురము
జన్మపత్రిక—యం. రామమూర్తి
టీకాలవిజయము—కె. యస్. కన్నికేశ్వర అయ్యర్
తీర్థయాత్రావివరణము—(ప్ర) ఏ. నారాయణమూర్తి, తుని
దాస్యముక్తి—జి. వెంకటశేషాచల జగన్నాథరావు
నయప్రదీపము—కె. రామచంద్రకవి
పరీక్ష విజ్ఞానచంద్రిక—పి. అప్పయ్య
పెద్ద బాలబోధ—ఏ. కన్నయ్యనాయుడు, మదరాసు
ప్రసవపాతము—పి. సత్యనారాయణరాజు
బాలబోధ—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు
బాలరామాయణము—హెచ్. వాసుదేవరావు
బృహన్నలవిజయము—ఐ. శేషాద్రిశర్మ
భక్తమందారము—కె. సీతారామరాజు
భక్తిమార్గము—పి. వెంకటరామయ్య
భారతమోహులు, భా. ౨—సి. వీరభద్రరావు
భారతీవాచకములు, నెం. ౧, ౨, 3, ౪, ౫—యు. సత్యనారాయణ, పి. సూర్యనారాయణ, కె. వెంకటశాస్త్రి
భోజుడు—యస్. వి. గురుస్వామిశాస్త్రులు
మద్యమాంసనిషేధము—బి. రామానుజశెట్టి
మిత్రభాషితము, పా. ౧—డి. నరసింహశాస్త్రి
ముత్యాలు—పి. వెంకటరమణయ్య
మొదటిమర్యాద—టి. యస్. రామస్వామి అయ్యంగారు
రథాంగదూతము—కె. రామచంద్రకవి
రామేశ్వరయాత్ర—ఇ. వెంకటరావు
రూముపాదుషాచరిత్ర—సైయద్ అహమద్
లోకజ్ఞానము, త. ౨, 3—బి. సుబ్రహ్మణ్యం

వర్ణనరత్నాకరము, భా. ౨, ౩— డి. లక్ష్మణస్వామి, పిఠాపురము
వినాయకచవితి పద్యములు—(ప్ర) సి. పెరుమాళ్, గుంటూరు
వివిధకుసుమావళి—కె. వెంకటరావు
వివేకవాచకము, బుక్ ౫—సి. లక్ష్మీనరసింహం
విష్ణూపీనిగ్రహము—యస్. విశ్వనాథశాస్త్రి
శరీర దేవాలయరహస్యార్థ పారిజాతము—సచ్చిదానంద యోగి
శిశుస్వభావము—యస్. భూషణం
శీలవతి—యం. వెంకటసుబ్బయ్య
శ్రీధవళేశ్వరచరిత్రము—బి. వెంకటరత్నశర్మ
శ్రీనమ్మాళ్వారి కులప్రశంస—వి. సుబ్బారెడ్డి
శ్రీమద్రామాయణ దసరాపద్యములు—పి. చిన్మయాచార్యులు
శ్రీమొగిలీశదర్శనము—బి. కృష్ణుఁడు
శ్రీయీశ్వరమ్మగారి మహిమలు—జే. నాగభూషణదాసు
శ్రీరామగుణానువర్ణనము—సి. లక్ష్మీనరసమాంబ
శ్రీరామచంద్ర చరణచామరము—యస్. సూర్యనారాయణ
శ్రీ పతీహితచర్య—పి. కోటిరెడ్డి
శ్రీ హరికథావిధానము—కె. బాలబ్రహ్మానందదాసు
సంస్కృత లఘుబోధిని, భా. ౧—వి. దుర్గశర్మ
సమీరసందేశము—యస్. వాసుదేవరావు
సివిక్సు, త. ౨—యం. నరసింహరావు
సుమబాల— జె. గంగన్న

## పారిశ్రామికము

గిల్టుపరిశ్రమ—టి. బ్రహ్మానందరావ్ వర్మ
చేతిమగ్గపు నేత—ఐ. వాషింగ్టన్

## పురాణము

ఆంధ్ర వచన శ్రీ కల్కిమహాపురాణము—కె. విజయ రాఘవయ్యంగారు

## ప్రకృతిశాస్త్రము

పదార్థవిజ్ఞానశాస్త్రము, ఫా. ౪—యం. సాంబశివరావు
ప్రకృతిపరిశీలన—డి. సత్యనారాయణ మూర్తి, యం. లక్ష్మీనరసింహాచార్యులు
ప్రకృతి శాస్త్ర పాఠములు, ఫా. ౧, ౨—వెంకట రామయ్య
ప్రకృతి శాస్త్రపాఠములు, ఫా. ౪—జి. వెంకటరామయ్య, బి. సుబ్రహ్మణ్యదత్తు, జి. సత్యనారాయణ

## ప్రబంధము

యయాతిచరిత్రము—పి. తెలగనార్య

## ప్రహసనము

అవును—భ. కామేశ్వరరావు

## భూగోళశాస్త్రము

చెన్నరాజధాని భూగోళ శాస్త్రము, త. ౫—యస్. భూషణం
ప్రపంచభూగోళము, భా. ౧, ౨—డి. కోదండరామ స్వామి, కె. వెంకటరావు
భూగోళము, భా. ౨, ౩ — వి. సత్యనారాయణ, సి. దీక్షితులు
భూగోళశాస్త్రము, భా. ౧, ౨ —యం. వెంకటేశ్వర రావు
భూగోళశాస్త్రము, ఫా. ౨—ఆర్. శేషగిరిరావు.
భూగోళసంగ్రహము—పి. రామచంద్రరావు, పి. వి. రామకృష్ణరాయన్
మారుతి భూగోళశాస్త్రము—పి. నారాయణమూర్తి
హిందూదేశము—యం. వెంకటశాస్త్రి

## మతము—హిందు

ఆంధ్రగీర్వాణశఠకోప సహస్రము, భా. ౨ — యం. వెంకటరామానుజాచార్యులు
చాత్తాద శ్రీవైష్ణవమతసంగ్రహము—సి. శ్రీనివాసరామానుజదాస్
యాజుషప్రయోగానుక్రమణిక—(ప్ర) సి. లక్ష్మీనృసింహశాస్త్రి, మచిలీపట్టణము
లింగయజ్ఞోపవీతము, మహాలీల లింగమణిమాలిక—సి. కోటయ్యశాస్త్రి, సి. బసవశంకరయ్య

## —ఇతరములు

అమృతాధారము—జె. ఆలక్

ఆంతరంగికజీవితము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

కైలాసములో సాధు సుందరసింగుగారికిని మహమ్మదీయ క్రైస్తవ మహాఋషిగారికిని జరిగిన సంభాషణ—(ప్ర) జె. రాజరావు, గుంటూరు

జూనియరుసబ్బాతు బడి పాఠక్రమము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

పడిపోయినగింజ—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

పారిపోయిన మేక—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

బైబిలుకథలు—(ప్ర) యం. శామ్యూల్

మతబోధిని—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు

రక్షణమార్గసంగీతములు—(ప్ర) తెలుగుబాప్టిస్టు ప్రచుర సంఘము, బెజవాడ

## రాజకీయములు

భారతదేశమున రాజకీయాభివృద్ధి—(ప్ర.) డి. కె. పన్త్, బెజవాడ

## వేదాంతశాస్త్రము

అనుభూతయోగసారము—టి. సూర్యనారాయణేశ్వరం

గురుశిష్యసంవాద రాజయోగామృతం, భా. ౧—సి. వెంకటరత్నం

పరిమళచోళచరిత్ర—జి. వీరబ్రహ్మచార్యస్వామి

ప్రవృత్తిమార్గవికారము—డి. సన్యాసిరాజుయోగి

బ్రహ్మమార్గప్రదీపిక—యన్. వెంకయ్య

## వైద్యశాస్త్రము

అష్టాంగహృదయము—(ప్ర) వి. రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, మదరాసు

చరకసంహిత—(ప్ర) ఆర్. వెంకటాచలపతి ప్రసాద శాస్త్రి, బెజవాడ

బైరాగిచిటికెలు—వి. బలరామదాసు

వైద్యోపన్యాసములు, భా. ౧—యం. సత్యనారాయణమూర్తి

## వ్యాకరణ శాస్త్రము

ఆంధ్రచంద్రిక, భా. ౧—కె. వెంకటశాస్త్రి

ఆంధ్రవ్యాకరణము—పి. సత్యనారాయణరాజు

ఆంధ్ర వ్యాకరణసారము, భా. ౧—బి. ఏ. వి. నరసింగరావు

ఆరంభవ్యాకరణము, భా. ౧—ఏ. పరబ్రహ్మశాస్త్రి, ఏ. వ్యాసశర్మ

కవిజనసంజీవని—యం. రామభద్రకవి

సంగ్రహవ్యాకరణము—కే. వీరేశలింగం పంతులు

## శతకములు

దాశరథిశతకము—(ప్ర) ఏ. లక్ష్మణస్వామి నాయుడు, రాజమహేంద్రవరము

శ్రీ కోటీశ్వరశతకము—ఐ. వెంకటనృసింహరావు

శ్రీరామచంద్రశతకము—వి. సుబ్బారెడ్డి

శ్రీలంకగిరీశ్వరప్రభు శతకము—యు. వెంకటస్వామి

## సంగీతశాస్త్రము

సంగీతగానదర్పణము—యన్. గోవిందదాసు

## సాంఘికము

దుర్వ్యక్తిధ్వాంతభాస్కరః—ఎస్. లక్ష్మీనృసింహశాస్త్రి

ప్రారంభసాంఘికశాస్త్రము — డి. సత్యనారాయణమూర్తి

సాంఘికశాస్త్రము—యం. కృష్ణమాచార్లు

## స్తోత్రము

రామగీత—జె. వెంకటరామరాజు

## హరికథలు

చోకామీళునిచరిత్రము, హరికథ—బి. శంకరయ్య

శ్రీ కుశలవ జననము, హరికథ—పి. సత్యనారాయణాచార్యులు



# విమర్శనము



## పల్లెటూరి పడుచులు

గ్రంథకర్త: కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు.

క్రౌను సైజు, పుటలు, ౧౦౦ వెల రు. ౦-౮-౦

ఆర్థిక సాంఘిక మతవిషయములయందు, హిందూదేశ మతిదుస్థితియం దున్నది. ఈలోపములవలన సంఘమునకును, దేశమునకును కలుగు హానినిగురించియు, వీటిని పరిష్కరించుట యెంతకష్టము, సంస్కర్తలకు ప్రజ లెంత సానుభూతిని జూపుచున్నారో యను మొదలగు విషయములనే చిన్నికథలమూలముగ ఆంధ్ర లోకమునకు గ్రంథకర్తగారు వెల్లడిచేసిరి.

కష్టజీవులకు ఒకపూట భోజనమునకు చాలునంత కూలికూడ ఇవ్వని షావుకార్లు బలిష్ఠులయి బీదసాదల నిక్కట్టులపాలుచేయుచున్నారు. ధనవంతుల యత్యాచారములను దుదముట్టించుటకు స్థూలముగ మార్గముల గ్రంథకర్తగారు సూచించనప్పటికిన్ని అందులకు ప్రధాన సాధనమగు పట్టుదలను వీడరాదను సూత్రమును మాత్రము వెంకియొక్క పిచ్చిమాటలలో నిమిడ్చియున్నారు. "మాసిపోవాలి సావుకార్లు మాసిపోవాలి. రాట్నమే తిండెట్టా" లను అమాయికపుమాటయం దాయర్థ మంతయు గాననగును.

అతిబాల్యవివాహములు హిందూసంఘమున కొనరించు కీ డింత యని చెప్ప నలవిగాదు. ఇందులకు మూలకారణము అజ్ఞానము. కనకముయొక్క ఉత్సాహము, అభిమానము, అజ్ఞానాంధకారమున బడి తనచెల్లెలిని వైధవ్యము పాలుచేసినది. బారసాలతోడనే వివాహము చేయు మూర్ఖు లెవరయిన నుందురా?

కనకమువంటి స్థితియం దున్న పల్లెటూరిపడుచును జ్ఞానవతిగా మార్చుట సులభము. తనయొక్కయు, తనతలిదండ్రులయొక్కయు బుద్ధిపూర్వకమైన చేష్టలే తనచెల్లెలివైధవ్యమునకు కారణములు. ఈవిషయముల తా గుర్తెరిగియే యున్నది. కావున ఇట్టివారి మూలమున సంఘసంస్కరణ చేయబూనిన తప్పక సిద్ధి గలుగును.

హిందూసంఘమున మతము ప్రధానస్థాన మాక్రమించియున్నది. మనవలెనే పుట్టి మనవలెనే పెరిగి మనవలెనే చచ్చువారిలో గొంద రస్పృశ్యు లెట్లు కాగలరు.

పల్లెటూరిపడుచుల కమూల్యభూషణ మనదగు దీక్ష సుందరమున గలదు. పూర్వాచారపరాయణులగువా రీనూతనోద్యమముల తిరస్కరించుచున్నారు. కుల మేదైనను గుణాధిక్యముచే పంచము డగ్రజాతివానిని మీరగలడు. దైవ మెపుడును సద్ధర్ములనే గాపాడును.

అస్పృశ్యతానివారణకు బూనుటకు ముందు విద్యాభివృద్ధి గలుగవలయును. పండితులయ్యు పూర్వాచారములయందలి యభిమానముచే మూర్ఖతను బొంది యున్నారు.

కార్యదీక్ష బూనిన సుందరము గాయములతో స్పృహ లేక పడియుండగా ఆమె కుపచారము చేయవలయు నను కరుణ మాల వెంకి కొడుకునకు గలిగినది. "పంచము డెవడు. వాడు మనసోదరుడు కాడా." కార్య

నీక్షు, కరుణ, ఓపిక, గలిగిననే గాని యిట్టి ఉద్యమములు సఫలీకృతములు గానేరవు.

గ్రంథకర్తగారిట్లే యింకను నూతన గ్రంథముల మూలమున చిరకాలము సంఘసేవ చేయుదురుగాత.

ఒ. వ.

---

## మతత్రయ గీతాభాష్య విమర్శ

గ్రంథకర్త: ఎతిరాజవేంకటకృష్ణదాసు, ఏలూరు.

క్రౌనుసైజు, ౨౦ పుటలు, వెల అణాలు ౪.

గ్రంథకర్తగారీపుస్తకమున ద్వైతాద్వైతవిశిష్టాద్వైత సిద్ధాంతముల సంగ్రహముగా విమర్శించి తమ యనుభవార్థములగు విషయములను శ్రీకృష్ణతత్త్వమను నామముతో వివరించియున్నారు. త్రిమతముల నొక్కపెట్టున విమర్శించి, ఖండించి, స్వమతస్థాపనము నొక చిన్న గ్రంథముతో వీరు చేయఁబూనుట సాహసమన నొప్పును.

శంకరసిద్ధాంతములేవన, ౧. బ్రహ్మమొక్కటియే నిత్యము, ౨. జగత్తు మిథ్య, ౩. బ్రహ్మము మాయావృతమై పరిభ్రమించుచుండును, ౪. మాయాతిక్రమణము కావించి 'సోహం బ్రహ్మ' యని యెఱుఁగుటయే మోక్షప్రాప్తి—మొదలగునవి.

౧. ప్రకృతిపురుష పరమేశ్వరులు భిన్నభిన్నములు, నిత్యములు, ౨. పరమేశ్వరుఁడాత్మ ప్రకృతి పురుషులాతనికి శరీరము, ౩. భక్తిప్రపత్తులచే నీశ్వర స్వరూపానుభవము పొందుటయే మోక్షము—మున్నగునవి రామానుజ సిద్ధాంతములు.

మాధ్వప్రతిపాదితములెవ్వియన, ౧. చిదచిదీశ్వరులు మూడును సత్యములు, ౨. ఈశ్వరునకు ప్రకృతి పురుషులకును శరీరాత్మసంబంధములేదు, ౩. ఈశ్వరుఁడు స్వతంత్ర తత్త్వము. ప్రకృతిపురుషులస్వతంత్ర తత్త్వములు, ౪. భగవత్కటాక్షమున జీవులకుఁ గలుగు స్వస్వరూప యోగ్యమగు నానందమే మోక్షము—మొదలుగాఁగలవి.

గ్రంథకర్తగారు "న త్వేవాహం జాతు నాసం" అను నొక శ్లోకాధారమున త్రిమతముల నూహించుకొని తమకుఁ దోఁచినరీతి యంటియు నంటనట్లు విమర్శించుచు, పూర్వోత్తరసందర్భముల వదలి శ్లోకముల నుదాహరించి యందలి యర్థమూలమున పైవారి సిద్ధాంతముల ఖండించుచు, తుట్టతుదకు శంకరప్రతిపాదిత విషయమొక్కటియు రామానుజ సిద్ధాంతమునొకటియు కలిపి కలగూరగంపగా శ్రీకృష్ణతత్త్వమను నామమున వేరొండు స్థాపించిరి. ఇందలి విషయములివ్వి—౧. జీవేశ్వర ప్రకృతులు మూఁడును నిత్యములు. ౨. జీవప్రకృతుల కీశ్వరునియం దైక్యము కలదు. ౩. భగవంతుని నుండి యపరశక్తియు, అపరశక్తినుండి అచేతన ప్రకృతియు నుద్భవించుచున్నవి. దీనిని శ్రీకృష్ణ తత్త్వమనుటకన్నను త్రిమత సిద్ధాంత కదంబమన్న సమంజసముగా నుండును.

భగవద్గీతా యోగ శాస్త్రమందలి యర్థ మతి నిగూఢము. చతుశ్శాస్త్రపండితులై స్వార్థ రహితులై పరోపకారదీక్షాపరతంత్రులై పరమపావనులై భగవత్కటాక్షలబ్ధ జ్ఞానమును విస్తరించిన ఆచార్యసిద్ధాంతములయందు లోపముండఁబోదు. లోపము కానవచ్చుటకు మన స్థూలదృష్టియే కారణము. సిద్ధాంతపరిశీలనాగాధములోఁ బడిపోయిన పరమాత్మానుసంధానము ప్రాప్యముకాదు.

ఈ గ్రంథాంతమున మోక్షాసక్తిగల వ్యక్తి కర్మఫలాపేక్షారహితుఁడై కర్మాచరణము కావింప వలయుననియు, జ్ఞానయోగము దుర్ఘటమనియు నిత్యాది విషయములు చక్కగా వివరింపఁబడినవి.

'జగన్నాథం.'

---

## తులసీదళము

కర్త: విద్యార్ణవ, సాహిత్యసరస్వతి, మా. పేరిరాజుగారు. చిన్నసైజు, ౩౦ పుటలు, వెల అణాలు ౪. లభించుస్థానము: బాలభారతీ గ్రంథనిలయము, చాగలమర్రి, కర్నూలు జిల్లా.

ఇందలి కథావృత్తాంతము కృష్ణతులాభారము. జగన్నాటకసూత్రధారుఁడగు శ్రీకృష్ణపరమాత్మ, చిత్తశుద్ధిలేని సత్యా సంపదకు సంతోషింపక స్థిరభక్తియుతురాలగు వైదర్భి సమర్పించిన తులసీదళమునకు సరితూఁగుట భక్తిప్రభావమును వెల్లడించుచున్నది. గ్రంథమున విశేషముగ వ్రతవృత్తాంత ముండుటచేతను తులసీదళము రుక్మిణీభక్తిప్రకర్షమున కొకానొక హేతువుగామాత్ర ముండుటచేతను గ్రంథనామము విషయమునకు తగినటుల లేదు. తులసీమాహాత్మ్య మింకను ఎక్కువగా వర్ణింపఁబడియుండిన బాగుండును.

గ్రంథము మంజరీద్విపదరూపమున సులభశైలియందు సుబోధముగా నున్నది. సంస్కృతాంధ్రపదములు సమానముగా నున్నవి. కొన్నికొన్నిపట్టుల చాల రసవంతముగా నున్నది. భక్తిరసమే అంగిగాను శృంగారాది తక్కినరసములు అంగములుగా నున్నవి. ఉపమా, రూపకాద్యలంకారశోభితమై యలరారుచున్నది. ఈ చిన్నిపొత్తము బాలికల కవశ్యపఠనీయము. కవిరాజు ఇట్టి గ్రంథములు పెక్కులురచించి భాషాసేవ యొనర్చుఁగాక!

'జగన్నాథం.'

---

## కుప్పుస్వామిశతకము

కర్త: కవిరాజు, సూతాశ్రమము, తెనాలి.

చిన్నసైజు పుటలు ౧౦౪, వెల అణాలు ౩.

ఈ చిన్నగ్రంథమున కుప్పుసామి యనుపదముతో నంతమగుచు నూట రెండుగీతము లున్నవి. కృష్ణస్వామి యను పదమునకు వికృతిరూపమగు కుప్పుసామి ముద్దుపదముకాబోలు! ప్రాతవియును క్రొత్తవియును అగు నీతులు గ్రంథమున గలవు. సుమతీ, కృష్ణ, కుమారీ, భాస్కర, నారసింహాది నీతిదాయకములగు శతకములు ఆంధ్రవాఙ్మయమున నెన్నిమో కలవు. ఆంధ్రదేశ నీతి మతాచార సంప్రదాయము లన్నియు నిట్టి గ్రంథముల సోదాహరణములు.

ఈ పొత్తమున, 'అంత్యనిష్ఠురముకన్న నాదినిష్ఠురము మేలు' 'ఉప్పులేని కూర చప్పన' మొదలగు ప్రాచీన లోకోక్తులు కాననగుచున్నవి. 'నవలచదువు, వ్యాజ్యెంబుల కవిలెకట్ట-నోట్లు, సిగరెట్లు, సినిమాలు, చీట్లు, కాఫీ-నాత్మ సప్తవ్యసనము' లని కవి చాల చమత్కారముగా నుడివినాడు. 'Uneasy lies the head that wears the crown,' 'A crowned head vainly longing for a toilor's sleep' అనునట్లు 'తిరిపెమెత్తి జీవించెడి దేజెరున్న' యాత్మసంతుష్టి కలదె ధనాఢ్యునకును అను ఈ గ్రంథమందలినీతి హృదయంగమముగా నున్నది. ఈచిన్నిపొత్తము ప్రాథమిక పాఠశాల బాలుర కత్యంతావశ్యకము.

'జగన్నాథం.'

---

## ముద్దు చెల్లెలు

గ్రంథకర్త: దేశిరాజురామదాసుగారు

క్రౌనుసైజు, ౧౬ పుటలు, వెలలేనిది.

ఇందు గ్రంథకర్త తనసోదరియగు శ్రీమతి గురుజాడ వెంకటరమణమ్మగారి యకాలమరణంబునకు వగచుచు, వందురుచు వ్రాసిన అరువది పద్యంబులు కలవు. ఇదిసోదరీరత్నముయొక్క యకాలమరణము కనికుమారుని కల్పనాచతురమగు మనమునందు చెఱుగరాని శాశ్వత చింతాచిహ్నము. గంజాంజిల్లా శ్రీకాకుళపుర శ్రీరామకృష్ణాముద్రణాలయములో ముద్రితము.

గ. స.

---

## మూగతల్లి

క్రౌనుసైజు, 3౪ పుటలు, (అమూల్యము).

ఇది ఏలూరు గోరక్షణసమితి కావ్యప్రచురణములలో ,నారవది. శిశుపోషణసమర్థ మగునట్టియు, క్షయ, శ్వాస, ఉబ్బసము మొదలగురోగముల నివారించునట్టియు క్షీరము నొసంగు గోవులను, భూమిని భేదించి,

పంటలను పండించి ప్రజాభివృద్ధిని, సంపద్వృద్ధినిచేయు వృషభములను, ఉపయోగకరములైనన్నాళ్లు తిండిపెట్టి పోషించి, తదనంతరము డొక్కమాడ్చి కృశింపజేసి కసాయివారి కమ్ముట అవివేకుల కఠినచర్యలకు విలపించుచు, వాటిని రక్షించుటకు గోరక్షణసమితు లేర్పరచవలసిన ఆవశ్యకతను సూచించుచు పలువు రధునాతనకవులు వ్రాసిన పద్యరత్నంబులెల్ల నిందు కూర్పబడినవి. ఏలూరు గోరక్షణసమితివారు వీనిని ప్రచురించినందుకు ప్రశంసార్హులు. ఈపుస్తకమును పల్లీపట్టణముల ప్రజల కుచితముగ పంచిపెట్టి తమధర్మనిర్వహణపరాయణతను చాటుదురుగాక!

గ. స.

---

దర్పదళనము-సూక్తిరత్నావళి

గ్రంథకర్త: శ్రీయుత గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు.

క్రౌనుసైజు, ౧౬౮ పుటలు, వెల రు. ౦-౧౨-౦.

చిత్తూరు విద్యావినోదినీ గ్రంథమాలవారిచే ప్రకటితము.

"దర్పదళన"మను క్షేమేంద్రవిరచితకావ్యమున కాంధ్రీకరణము. దర్పహేతువులగు కుల, ధన, విద్యా, రూప, శౌర్య, దాన, తపములను ఏడు అంశములను గూర్చి ఇందు సహేతుకముగ చర్చింపబడినది. వానిని గూర్చి దర్పము నొందరాదనియు, అట్లొందినచో అవి నాశహేతువు లగుననియు సోదాహరణముగ తెలుపబడినది. శైలి విషయోచితమయ్యు ప్రయత్నపూర్వకముగ నున్నదని చెప్పవలసియున్నది. ఉన్నతతరగతులకు పఠనీయముగ నుండుటకై అట్లు వ్రాసితిమని గ్రంథకర్త నుడువుచున్నారు. ప్రాచీనగ్రంథములలో నున్నపుడు నిఘంటువుల సాయమున అర్థము చేసుకొనవలసినవియు, అధునాతనవచనగ్రంథములలో నెన్నడు నుపయోగింపనావశ్యకములేనివియు నగు 'ఇల్లడు', 'ఉక్కరము', 'కంటు', 'కయిలాటము', 'తిగప్రోలుదాయ', 'పుయిలోడు', 'బ్రుసి' మొదలగుపదము లచ్చటచ్చట గలవు. విషయము గంభీరమైనది. ఇంతకంటె సులభములగు పదములు ప్రయోగించినను ఆగాంభీర్యము చెడదు. పాండిత్యప్రాగల్భ్య ప్రాచుర్యము కొరకు వ్యాసములను వ్రాయమి శైలియొక్క యొక ప్రధానలక్షణమని మాతలంపు. ఈపదముల యొక్క అర్థములను విద్యార్థులకు దెలుపుటకు వేఱువిధములగు అవకాశములు దొరకకపోవు.

శైలి యీవత్కఠినమయ్యు ధారాళమై, ఉత్సాహజనకమై, పాఠకుల మనంబును జూఱగొనుచుండుట గ్రంథకర్తయొక్క అనూనరచనాచాతుర్యమును, విశేషభాషాపరిశ్రమను చాటును. పాఠశాలలో పఠించు కౌమారవయస్సునందు ఇట్టి నీతివిషయములు పాఠ్యగ్రంథములద్వారా బోధింపబడునేని, యువకులు పెద్దవారగులోపలనే యోగ్యులై తరువాత సజ్జనసంస్తవనీయమగు జీవనమును గడపగలుగుదు రనుట కాటంకము లేదు. గ్రంథకర్త ఇట్టిగ్రంథము లింకను వ్రాసి దేశీయ యువకుల నీతిప్రవర్తనకు దోహదము చేయుదురుగాక.

సూక్తిరత్నావళిలో భర్తృహరి, అనంతామాత్యుడు, పెద్దన, వేంకమాంబ, కుమారధూర్జటి, శంకరకవి మొదలగు పదిమంది పూర్వకవుల గ్రంథములనుండి ప్రశస్తములగు ఘట్టము లేర్చి కూర్పబడినవి. పూర్వకవులతోను, వారిరచనలతోను విద్యార్థులకు ప్రథమపరిచయముగొల్పి, ఆంధ్రభాషయొక్క తేటదనమునందాదరము పురిగొల్పుట కివి యెంతయు అనుకూలించును. ఈ గ్రంథమును పదిసారులు సత్పరిశ్రమతో చదివినవారికి నర్గళరచనాసామర్థ్యము, నిర్దుష్టపదప్రయోగము సిద్ధించునని చెప్పవచ్చును. పాఠ్యగ్రంథనిర్ణయశాఖవారి యాదరణము నీగ్రంథము బడయదగినది.

గ. స.

---

శ్రీ విజయలక్ష్మీవిలాసము

క్రౌనుసైజు, ౨౦౭ పుటలు, వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త: కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

ఇది జయపురము సంస్థానమునకు ప్రస్తుతము ప్రభువుగానున్న శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారి జీవితమును, విద్యావివేకములను, గుణగణ

ములను, వదాన్యతను, కవితావినోదములను, ప్రజాపరిపాలనా చాతుర్యమును విశదీకరించు ఆరు ఉల్లాసములుగల పద్యప్రబంధము. జయపురప్రభువుల వంశప్రారంభము, సంస్థానసంప్రదాయముల చరిత్రము, రాజ్యవిస్తీర్ణము, విభజనము మొదలగు చరిత్రాత్మక ప్రదేశాత్మక విషయములెల్ల చక్కగా నిందు వివరింపబడినవి. కవిగారిందులో కవిత్వమునేకాక భావికాలపు చరిత్రపరిశోధకుల కుపకరించు విషయముల నెన్నింటినో సమకూర్చిరి. సంస్థానములోని కొండలు, నదులు, జంతువులు, జలపాతములు, గనులు, క్షేత్రములు, తోటలు, వనములు మొదలగువానిని మనము పఠించునప్పుడు ఆసంస్థాన భూగోళమును చదువుచున్నట్లుండును. ఇట్టిసామాన్యవిషయములపైకూడ తమ కవితారసమును చిల్కి ఆమందానందదాయకములుగా నొనరించుట కవిగారి అసంశిత కవితాసామర్థ్యమును చాటును.

ఇట్టికృతిపతియొక్క పుట్టువు, బాల్యము, విద్యాపరిశ్రమ, పండితపరిచయము, శేముషీవిశేషము, కార్యాచరణదక్షత మొదలయినవానికి సంబంధించిన భాగము లొకవ్యాసములో చదివినయెడల మనకు సామాన్యముగ తోచునవే యైనను, కవియొక్క రసవల్లేఖిని తగిలినమాత్రముననే వాని కొక యమర్త్యసౌందర్యము లభించినది.

అన్వర్థకవిసార్వభౌమ బిరుదాంకితులును, సంపూర్ణ భారతానువాదన సమర్థులును, కవిగండపెండేర కలితులును నగు కవిగారి నిరర్గళధారనుగూర్చి వ్రాయుట అనావశ్యకము. క్యాలికోబైండు. జయపూరు మహారాజుగారి చిత్రపటము గ్రంథాదిని గలదు. గ. స.

---

## శ్రీ వేమభూపాల విజయము

గ్రంథకర్త: రావాడ వెంకటరామశాస్త్రిగారు.

క్రౌను సైజు, ౮౦ పుటలు, వెల రు. ౦-౬-౦.

క్రీ. శ. ౧౪౦౦ మొదలు దాదాపు ౧౪౪౦ వరకు పాలించిన పెదకోమటి వేమభూపాలుడు "అద్దంకి" ని రాజధానిగా చేసికొని కొండవీడుదుర్గమును పాలించిన ప్రోలయ వేమభూపాలుని యన్నయగు మాచమహీపాలుని పౌత్రుడు. ఇతనిదిగ్విజయయాత్ర యీగ్రంథమునం దభివర్ణితము. ఇతనికి "వీరనారాయణ", "రూపనారాయణ", "జగనొబ్బగండ" ఇత్యాది బిరుదము లుండెను. ఇతనియాస్థానమున శృంగారనైషధకృతి భర్తయగు మామిడ సింగనమంత్రి ప్రధానామాత్యుడుగను, శ్రీనాథుడు విద్యాధికారిగను, అభినవభట్టబాణబిరుదాంకితుడగు వామనభట్టు ప్రధానపండితుడుగను నుండిరని తెలియవచ్చుచున్నది. ఇతడు మంచిశూరుడును, పండితుడును అని ప్రఖ్యాతి వడసెను.

వామనభట్టు ఇతనిదిగ్విజయ యాత్రను సంస్కృతమున "వేమభూపాల" చరితమను పేర గద్యకావ్యముగ వ్రాసెను. శైలిలో ఇది కాదంబరిని పోలుటచేత ఇతనికి వామనభట్టబాణుడని కీర్తి కలిగెను. శ్రీమాన్ ఆర్. వి. కృష్ణమాచార్యులుగారు దీనిని సులభమగు గద్యములోనికి మార్చిరి. ఈచరిత్రము నాధారముగ చేసుకొని కవిగారు దీనిని మూడుఉల్లాసముల పద్యప్రబంధముగా రచించిరి. కవిగారి విద్యాగురువగు శంకరభట్టుశాస్త్రిగారి కీ గ్రంథ మంకితము.

మొదటిఉల్లాసములో కృతినాయకుని వంశమునకు మూలపురుషుడగు ప్రోలయభూపాలుని వివాహముయొక్క అద్భుతసందర్భము సుందరముగ వర్ణింపబడినది. రెండవఉల్లాసములో కృతినాయకునివరకు గలిగిన వంశవిస్తృతియు కృతినాయకుడు కళింగ, అంగ, వంగ, రాజ్యాధిపతులను, ఇతరప్రాచ్యభూపతులనోడించుటయు కాంచీపురమును సందర్శించుటయు, పాండ్యకేరళప్రభువులను గెలుచుటయు వర్ణించబడినవి. ఇంతటితో అతని దిగ్విజయాభిలాష తీరక పశ్చిమదిశకుపోయి గూర్జరులను, సౌరాష్ట్రులను, యవనులను, సింధుదేశాధీశుని, కాంభోజదేశాధీశుని గెలిచి, కాశ్మీరమున కొన్నినాళ్లు విడిసి, గ్రీష్మంబున హిమవన్నగరమునకేగి, అక్కడ పర్వతజాతులనోడించి వారివద్ద కానుకలుగొని, వింధ్యప్రాంతములకు వచ్చి దక్షారామభీమేశ్వరుని దర్శించి, తన రాజధాని

కరుదెంచి, ఎవరిరాజ్యమును వారి కొప్పగించి సార్వభౌముడై, తన విజయయాత్రముచ్చటలను మిత్రులకుచెప్పుచు కవిగాయకదీనబంధుజన పోషణుడై ధర్మముగా రాజ్యముచేయుచుండిన చరిత్రము తృతీయోల్లాసములో వర్ణింపబడినది.

శైలి సులభపదకలితమై తేనెసోనవలె తీయగ ప్రవహించుచున్నది. కథాబాహుళ్యము లేక చర్యవెనుక చర్య సుందరముగ కూర్పబడినది. ఒకపద్యమున కొక పద్య మీడుతీయకుండుటచేత ఏపద్యమునుకాని శైలి కొర కుదాహరణముగ నెత్తివ్రాయజాలము. చమత్కారము, రసపోషణము, తెంపెఱుగనిధార, సులభపదముల కూర్పు అన్నియు కలసి పాఠకుల చిత్తముల జూఱగొనును. బళ్లారి "కృష్ణదేవరాయ గ్రంథమాల" వారిచే అయిదవపుష్పముగ ప్రకటితము. వలయువారు "మేనేజరు, భారతీభవనము, కౌలుబజారు, బళ్లారి" కి వ్రాసి తెప్పించుకొనవచ్చును. గ. స.

---

## సూతపురాణము - ద్వితీయ తృతీయాశ్వాసములు

(రెండు సంపుటములు)

డెమ్మీ ౧/౮ సైజు, ౨౪, ౯౪ పుటలు. వెల చెరి యొక రూపాయి.

గ్రంథకర్త: కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు.

ఇది బూతుపురాణము కాని ప్రాత పురాణము కాని కాదనియు, పూతపురాణమనియు కవిగారి అభిప్రాయము. ఏపురాణకారుడుగాని తనగ్రంథమును వేఱొకవిధముగా భావింపడని అందఱకు తెలిసిన విషయమే. ఈ పురాణముయొక్క ఉద్దేశ్యము, తక్కిన పురాణము లెల్ల తప్పులతడుకలనియు, పక్షపాతబుద్ధులగు బ్రాహ్మణమ్మన్యుల ఉత్సాహముచే ఆర్య నాగరికతా విజృంభణముకొఱకును, ద్రవిడసభ్యతాసంహారము కొఱకును వ్రాయబడినవనియు బుజువుపరచుటయే యని తోచెడిని. తరచుగా పురాణములేవో పుక్కిటిగాథలై యుండును. వాటిని చరిత్రములని విశ్వసించువారు లేరు. ఈశ్వరునియందు భక్తి, కర్మకాండయందు నిష్ఠ, సత్యశౌచాదిసుగుణములయందు గౌరవము పురికొల్పవలెనని వాటియుద్దేశ్యము. జనులను మూర్ఖులుగాకాని, క్రూరులుగాకాని, స్వార్థపరులుగాకాని చేయవలెనని వాటి ఉద్దేశ్యము కాదు. వాటి అర్థమును తెలుసుకొనలేక మనతత్వములకొలది మనము మూర్ఖులుగానో, భోగలాలసులుగానో మాఱితిమేని వానిని దూషించిన ప్రయోజనము లేదు. ఎటువంటిగ్రంథము లిచ్చినను మన మట్లే తయారగుదుము.

పెక్కుఱు మహనీయుల తలంపుప్రకారము పురాణములు ధర్మాధర్మ సంఘర్షణములు, కలహములు మొదలగు వానినిగూర్చి తెలుపును. దానినే కవీంద్రులు చిలవలుపలవలుగా చేసి అలంకారనిమిత్తమును, విశదీకరణము నిమిత్తమును మనుష్యులుగాను, జాతులుగాను, సౌఖ్యములుగాను, దుఃఖములుగాను, నరకముగాను, స్వర్గముగాను వర్ణించుకొనిపోయిరి. ఇంతకును పురాణముల వంటి ఉద్గ్రంథములు వ్రాయునప్పుడు కవివరుల డెందములలో ఎట్టి సంచలనములు జరుగుచుండునో చూడగలవా రెవ్వరు? చౌదరిగారుకూడ సుప్రశస్తకవియు, పురాణరచనాకుతూహలశాలియు నగుటచేత వ్యాసవాల్మీకాదుల డెందములలో జరుగుచుండెడిసందడి నించుక యూహించుటకష్టముకాదు. పుణ్యాసిద్ధికొఱకును మోక్షలబ్ధికొఱకును పురాణములను వ్రాసితిమని చెప్పుకొనుచున్న కవిపుంగవులు, సర్వభూతసమత్వబుద్ధియొక్క ఉత్కృష్టతను లోకమునకు చాటదలచుకొన్న గ్రంథములను వ్రాయునప్పుడు జాతిద్వేషము, విషయవాంఛాపరాయణత మొదలగు క్షుద్రభావముల ప్రోద్బలమునకు లోబడినవారని యూహించుట యెంతవరకు సముచితమో ఊహింపరాకున్నది.

ధర్మాధర్మయుద్ధములో ధర్మపక్షమువా రందఱును ధర్మమును బాగా తెలిసిన సుజ్ఞానులనికాని, నిర్వ

హించగల సమర్థులనికాని నిర్ణయింపలేము. అధర్మపక్షమవలంబించినవారుకూడ శుద్ధపాపులనికాని, వారి జీవితములో సద్భావముకాని సత్కార్యముకాని గలిగియుండరని చేసియుండరనికాని చెప్ప వీలులేదు. మొదటిపక్షములో ప్రమాదముగలవారును, పతితులునుకూడ ఉండవచ్చును. మొత్తముమీద మూలకృతి తీసుకొనబడి పక్షములు చేయబడినది. అంతరమునగల వివరములుకూడ ఉచితగౌరవముతోను, ఈసడముతోను పురాణములలో ఉదాహరింపబడినవే కాని అన్యాయము చేయబడలేదు. ఇందుచేతనే పురాణములలోని దేవతలు అన్నివిధములను మనఅభిమానమునకు గాని, రాక్షసులు మనసంపూర్ణ దూషణములకుకాని పాత్రులు కాకున్నారు. మొదటి తెగలో మనము దూషింపతగినవారును, రెండవతెగలో మనము ప్రశంసింపతగినవారునుకూడ గలరు.

ఇట్టిప్రాచీనగ్రంథములను పట్టుకొని వానిలో ఆర్యద్రావిడజాతుల పోరాట మంతర్గతముగ వర్ణింపబడినదనికాని, వీరిలో కొందరు విదేశీయులు కొందరు స్వదేశీయులనికాని, మనదేశములోని జాతులలో కొన్ని యొకతెగనుండి మఱికొన్ని మఱియొకతెగనుండి దిగినవనికాని, అమెరికా-ఆఫ్రికాలలో తెల్లనల్లజాతుల సంఘర్షణలో జరుగుచున్న అన్యాయములు, క్రౌర్యములే పూర్వ మార్యావర్తమున జరిగి అవే యీపురాణములలో వర్ణించబడినవనికాని ఊహించుకొనేవా రూహించుకొనవచ్చును. పాశ్చాత్యచరిత్రకారుల వ్రాతలు వారి కాధారముగాకూడ దొరకగలవు. కాని పురాణగ్రంథములను పఠించునప్పుడువానిలో నవీనచారిత్రకసంభవములయొక్క ప్రతిబింబము లున్నవని యూహించుట విమర్శకుల ప్రధానప్రమాదములలో నొక్కటైయున్నదనిమాత్రము చెప్పగలము.

మన అభిరుచులకు, ఆశయములకు సరిపడని విషయము లనేకములు పురాణములలో నుండవచ్చును. పూర్వగ్రంథములలోను ఆచారములలోను ఉండవచ్చును. అవి ఆకాలమువారి అనుచరణముకొఱకు వ్రాయబడినవి, వారామోదించినవి, మూర్ఖులో మూఢులో ఇప్పటికిని పెక్కు రాదరించి అనుసరింప గోరుచున్నవి. ఇంతమాత్రమున అవి శాశ్వతసత్యములనియు, మార్చరానివనియు మనము తలచ నక్కరలేదు. అవి దేశకాలభేదములనుబట్టి మారుచునుఉన్నవి, మార్చనువచ్చును. విగతజీవులై కీర్తిశేషులైన శ్రుతిస్మృతిపురాణకారులపై జండాయెత్తి దూషించకుండానే ఆపని చేయవచ్చును. మార్చవలె నని మనము కోరునవెల్ల మంచిమార్పులు కాకపోవచ్చును. మార్చుటకు సాధ్యము కాకపోవచ్చును. అట్టితతని మన మెందఱిని ఎన్ని తిట్టినను అసలు ప్రయోజన ముండదు. ఇట్టిపురాణము లెన్ని వ్రాసినను అసలు ప్రయోజన ముండదు. ఇట్టిపురాణము లెన్ని వ్రాసినను పూర్వపుపురాణములపైని వానిలోని కల్పనలపైని ఉండెడి గౌరవము తగ్గిపోవునని ఊహించుటకు వీలులేదు.

సీతాదేవి తాను రావణునికి దొరికి లంకకు గొంపోబడి, ఇడుములు గుడిచి, రాక్షసుల (ద్రావిడుల)ను రామునిచేత బరిమార్పించవలెనను కోరికతోనే రామునితో కలిసి పన్నినకుట్ర ప్రకారమే రాముని తెలిసి తెలిసి మాయలేడి వెనుక పంపించెననుటయు, ప్రహ్లాదుడు తనతండ్రిని చంపించు ఉద్దేశ్యముతో ఆర్యుల (దేవతల) కుట్రలో చేరి భక్తినటించి తన తండ్రిని సింహముచే చంపించెననుటయు మొదలయిన ఆరోపణలు ఎంతవఱకు ఆనందింపదగినవో పాఠకులకే విడిచిపెట్టుచున్నాము. ఇట్లే కవిగారు ద్రావిడ పక్షపాతపరవశులై అశ్లాఘ్యములగు వ్రాతల ననేకములను వ్రాసిరి. ఇది వారిగ్రంథములోని విషయమునుగూర్చి.

ఆసంగతిని విడచి, కవిత్వము, ధార, శైలి, గమనిక, వడుపు మొదలగు తొడవులను గూర్చి ఆలోచించిన ఎంతయు సమ్మోదకరముగ నుండును. పరిశుద్ధములగు పదములు, నిర్నిరోధమగుధార, ముద్దారుశైలి, సులభమగు నడక, అచ్చతెలుగులును అతిపరిచిత సంస్కృత పదములును కలిసి అల్లిబిల్లిగ అల్లుకొనిన చెల్వము గ్రంథము నామూలాగ్ర సుందరము జేయుచున్నది. పురాతన కవితారీతులను నవీనభావప్రకటనముకొఱకు చక్కగా ఉపయోగించినవారిలో వీరిని మొదటివారుగ నెన్న



రాధ అలంకరణము

[జయపుర చిత్రము : దివాన్ బహాదుర్ గోవిందదాసు చతుర్భుజదాసుగారి యనుమతిని.]

ఎచ్చును. వీరిశైలి పురాణరచనముకొరకెంతయు తగియున్నది. ఇట్టి కవితాసంపద వేఱురీతిగా ఉపయోగింపవలెనని మేము కోరెదముకాని, వీరికి వర్ణవివక్షత, పురాణచోదితార్థము మొదలగువానియందుగల విరోధభావపరంపరయే వీరి కవితావేశమునకు మూలకారణమై యుండవచ్చుననియు, అది లేకున్నచో ఇట్టి కావ్యము వ్రాయుటయే పొసగదేమో అనియు భావించి కవిత్వపక్షపాతము కలవారము గనుక అతని భావ ప్రభావముల జోలికి పోక, ఈ ఆవేగములో వారుండుకొన్న సందర్భములోనే తక్కిన ఆశ్వాసములనుగూడ పూరించి వారి కవితాప్రజ్ఞయొక్క సౌరభమును ఆంధ్రదేశమునందు విరజల్లవలెనని కోరుచున్నాము.　　　గ. స.

---

## సువర్ణకోశము

గ్రంథకర్త: శే. వేం. రాఘవయ్యంగారు.

క్రౌను $\frac{1}{8}$ సైజు, ౧౧౦ పుటలు.

ప్రాచ్య పాశ్చాత్య సభ్యతల తీరులకెల్ల ఎట్టిభేదమున్నదో కవితాకల్పనలకుకూడ అట్టిభేద మున్నది. కవితాకల్పనలకు ఆధ్యాత్మికచింతలలో నెట్టిస్థానమున్నదో భౌతికచింతలయందును అట్టియవకాశ మున్నది. కవితాశక్తిద్వారా ఆధ్యాత్మికసూక్ష్మములను పాశ్చాత్యులు ఎంతచక్కగా చూపజాలరో, ప్రాచ్యులును తత్సాహాయ్యమున నాధిభౌతికవిషయములందంతయుత్సాహమును పురికొల్పలేరనుట ఆశ్చర్యముకాదు. అయినను ప్రాచ్యపాశ్చాత్యనాగరికతలపరస్పరసమ్మేళనమున కవ్విళులూరుచుండు భావవైదగ్ధ్యవాంఛారతులగు మన దేశమువారికి పాశ్చాత్యకవిత్వపు తీరుల గ్రహింపవలెనని కోరుట మిగుల సమంజసము. ఇది కవితానిపుణులగువారు పాశ్చాత్యసుప్రసిద్ధ కవిప్రవరుల యుల్లేఖనముల నాంధ్రీకరించుటవలన తప్ప వేరువిధమున సాధ్యము కాదు. ఇట్టిపనికి పూనుకొని చాలవరకు సఫలీకృతమనోరథులైనవారిలో ఈకవిగారొకరు.

పైయంశమును గ్రంథకర్తగారి 'నిద్దుర', 'వలపుసారము', 'ఇంద్రధనుస్సు', 'జీవగీతి', 'శాబ్దికస్మృతి' మొదలగుగీతములను పఠించినవారు సులభముగ గ్రహించగలరు. పాశ్చాత్యకవిత్వమును పాశ్చాత్యభాషల నభ్యసించినవారు పొగడుటలో ఆశ్చర్యము లేదు. ఆభావములను, ఆరీతులను అనువదింపబడిన ఆంధ్రభాషలో చదివి, కేవలాంధ్రభాషావిశారదులుకూడ కొనియాడవలెనని కవిగారి యుద్దేశ్యము. ఆంగ్లభాషరాని ఆంధ్రకవులు వీనిని చదివి తమ అభిప్రాయములను బ్రకటించినచో ఆంగ్లకవిత్వము మనదేశస్థుల భావములలో నెట్టియభిప్రాయములను కలుగచేయగలదో తెలుసుకొనవచ్చును. భాషాంతరీకరణము చాలసరసముగను, ధారాళముగను, సాధ్యమైనంతవఱకాంగ్లమూలమునకు దగ్గరగను నుండునట్లు వ్రాయనయినది. భాషాంతరీకరణముతో పూంచీలేకుండా కవియొక్క భావములు, రచనాసౌకుమార్యము, ధార యెట్టివో యెఱుగగోరువారు 'కవిత్రయము', 'స్మృతిగీతి' అను పద్యములను పఠించి యెఱుగవగును. కవితాపరిశ్రమ చేయగోరువారును, విమర్శనలు వ్రాయగోరువారును, సాహిత్య సేవాపరాయణులును దీనిని పఠింపదగుగారు.

గ. స.

---

## పాండవాంకురము

గ్రంథకర్త: అచ్యుతుని వెంకటాచలపతి రావుగారు. డెమ్మీ సైజు, ౧౩౭ పుటలు, వెల రు. ౧-౦-౦.

దుర్యోధనుడు చంపబడి శమంతపంచకంబులో త్రోయబడినదాది పరీక్షిజ్జననమువరకుగల వృత్తాంతమును కవిగారు ఎనిమిది అంకములుగా పెంచి వ్రాసినారు. అపాండవము చేయించవలెనను దుర్యోధనుని వాంఛ, అశ్వత్థామప్రతిజ్ఞ, తపము, వరము, ఘోరచర్య, ప్రతీకారము, ద్రౌపద్యాదులదుఃఖము, కృష్ణుని ఉపశమనము, వంశాంకురవాంఛ, పరీక్షిజ్జననములతో కూడిన భారతములోని రసవంతమగుపట్టుల నేంచి గ్రంథకర్త మంచిచికిలిపెట్టెనని చెప్పవచ్చును. పాటలు, పద్యములతోకూడ నాటకము కలకలలాడుచున్నది. చరిత్రమును, పాత్రలును ఇతిహాస ప్రసిద్ధములు. గ్రంథము వలయున్నవారు

గ్రంథకర్తగారికి బెజవాడకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

గ. స.

---

## ఆంధ్రరఘువంశము

గ్రంథకర్త: కీ. శే. మండలేముల సీతారామశాస్త్రిలవారు.

డెమ్మీసైజు, ౨౧౨ పుటలు, వెల రు. ౧-౦-౦.

కవిగారు శ్రీ బొబ్బిలి సంస్థానాధీశ్వరుల ఆస్థానకవి; విద్వద్వతంసులు; అనేక రాజసమ్మానములను విద్వద్గౌరవములను అందిరి; సహజసచ్ఛీలశోభితులు. అట్టివారికవిత్వము ఎంతప్రశస్తముగ నుండగలదని మన మూహింపవచ్చునో, అంత ప్రశంసనీయముగ నున్నదని యీ గ్రంథము నొకసారి పఠించినవారికి తోపగలదని నమ్మదగియున్నది. మూలము కాళిదాసుదేయయ్యు భాషాంతరీకరణము కవిదయ్యుస్వతంత్రమయి, మూలాపేక్ష లేకుండనే వ్రాయబడెనా యన్నట్లు స్వతస్సిద్ధమై యున్నది. పెక్కనువాదములలోని సందేహములు మూలమును చూచి తీర్చుకొనవలసి వచ్చును. కాని దీని కట్టిబాధలు లేవు. కాళిదాసురఘువంశమునందుగల సౌలభ్యము, సౌకుమార్యము, మాధుర్యము, కోమలత్వము మొదలగు సల్లక్షణములెల్ల ఇందలరారుచు "ఆంధ్రరఘువంశ"మను నామమున కిది యెంతయు నమరియున్నది. "మండలేముల వెంకటదక్షిణామూర్తి, c/o మండలేముల వెంకటశాస్త్రిగారు, డిప్యూటి ఇనస్పెక్టరు ఆఫ్ స్కూల్సు, ఇచ్ఛాపురం" అని వ్రాసి పుస్తకము తెప్పించుకొనవచ్చును.

గ. స.

---

## శ్రీమదరుణాచలక్షేత్ర మాహాత్మ్యము

అనువాదకులు: వి. గోపాలుడు.

క్రౌనుసైజు, ౯౬ పుటలు, వెల రు. ౦-౮-౦.

ఉత్తరార్కాడుజిల్లాలోని తిరువణ్ణామలై అను పుణ్యక్షేత్రముయొక్క చరిత్ర మిందు భక్తజనహ్లాదకముగ సులభమగు గ్రాంథికశైలిలో వ్రాయబడినది. శ్రీమదీశ్వర యతీంద్రులవారు ద్రవిడభాషలో వ్రాసిన గ్రంథమున కిది ఆంధ్రానువాదము. ఇందనేకాధ్యాత్మికరహస్యములు వివరింపబడినవి.

అరుణాచలయోగి స్తోత్రము, విభూతి రుద్రాక్షమహిమ, జీవసృష్టి, జీవునియవస్థ, తత్త్వత్రయనిర్ణయము, జీవన్ముక్తలక్షణము, స్థలమహిమ, ఈ దేవుని కొలిచి ముక్తిపొందినవారి చరిత్రలు, గిరిప్రదక్షిణమహిమ, కార్తికదీపము, అపీతకుచనాయకియగు పార్వతిమాహాత్మ్యము, ఆమె తపస్సు, అరుణగిరినాథుల చరిత్రము మొదలగువిషయములతో కూడి గ్రంథము మిగుల మనోరంజకమై యున్నది. తీర్థయాత్రాపరులకును, చరిత్రపఠనకుతూహలము గలవారికిని గూడ మిగుల ఆవశ్యకము. అందందు ఆంధ్రతాత్పర్యయుక్తములగు సంస్కృతశ్లోకములును, గ్రంథాంతమున నాంధ్రపద్యస్తోత్రములును కూడ నున్నవి. వలయువారు "శ్రీ రమణీయ పుస్తకాలయము, N. A. తిరువణ్ణామలై" కు వ్రాసి బడయగలరు.

గ. స.

---

## సంధ్య

గ్రంథకర్త: శ్రీ యలమంచిలి శ్రీరాములుగారు.

ఈగ్రంథమునకు పీఠికనువ్రాసిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "సంధ్యలో తమ స్వానరించిన చోట్లు రెండు. అందొకటి తల్లికొడుకు, రెండవది ప్రేయసిని గూర్చి, రచయిత హృదయము విదారించుకొన్నవి. ఈకావ్యమున కివి బీజము. ఈతమస్సునుండియే యీకావ్యలత చివురాకు దొడిగి యాత్మలీలాభాసమానప్రసూనరాశిని బూచినది.........శ్రీరాములుగారు విపరీతకవి. భావకవు లెల్లరు నిట్టిరే. ఈయన వైపరీత్యమేకమైన సత్పదార్థమును స్త్రీపుంస్వరూపముగా ధ్యానించుటలో గలదు.........భగవంతుడు భక్తునియుపాసనానుసారముగ సగుణరూపము దాల్చును.

ఇది భక్తహృదయలీల.......ఈకావ్యప్రతిపాదితమైన వస్తువేమి? దీనికి నాయకు డెవరు? నాయిక యెవర్తుక? రస మెద్ది? అని లాక్షణికులు పరియరాకుడు! ......ఇది కవిప్రాణవిలసనము......శ్రీరామలుగారి భావవిహ్వలత్వమున గూడ సుపరిష్కృత జ్ఞానరేఖ విద్యుల్లతంబోలి ప్రతిభాసించుచున్న దనుట నిస్సంశయము" అని నుడివిరి.

ఈకవి తనజీవనమున సంధ్యవేళయందు మనఃక్లేశమును, భవభారమును దుర్భరములు కాగా, నిజమనోవీథియందు సంచరించిన భావములను కూర్చి ఏమని పిలిచి నను పలుకు ఏకనాథుడను పరమాత్మని సంబోధించి ధ్యాన మనన రూపమున రచియించిన కావ్యమిది. రచనము ఇంపుసొంపులు గలదై పవిత్రభావభరితమై రసవంతముగ నున్నది......కాని ఈరచనము సొంతముగ (Original) తోచినది గాక, కావ్యనిధి క్షితీంద్రనాథ ఠాకూరు ప్రభృతులు చూపిన తెరువు ననుసరించినదై యున్నది. (ఈసంగతిని గ్రంథకర్తయే స్వీకరించి యున్నారు.)

క్రౌను సైజు, ౧౧౦ పుటలు, మంచికాగితములు, చక్కనిఆర్టుపేపరు అట్ట. వెల వివరింపబడలేదు. కృష్ణాజిల్లా అంగలూరులోని శ్రీ చైతన్యనిలయము మానేజరు గారికి వ్రాసినచో పుస్తకము ప్రతులు దొరకును.

జ. బ్ర.

---

## తంజాపురాంధ్రనాయక చరిత్రము

గ్రంథకర్త: శ్రీకురుగంటి సీతారామయ్యగారు, ఎమ్. ఏ.

[ఆంధ్ర గ్రంథమాల పదునేడవ కుసుమముగ ప్రకటితము.] వెల రు ౨ లు. (ఆంధ్రపత్రికా ముద్రాలయము, ౭. తంబుసెట్టివీథి, మదరాసు.)

ఆంధ్రుల దక్షిణాశాభిగమనచారిత్రమున తంజావూరి ఆంధ్రనాయకరాజప్రకరణ మొక సంస్మరణీయమగు ఘట్టము. క్రీస్తుశకము ఎనిమిదవశతాబ్ది ఆరంభమున నుండి కాంచీపురరాజ్యాధిపతులైన పల్లవ భూపతుల యాస్థానములం దాదరాశ్రయములను వెదకికొనుచు వేదవేదాంగపారగులయిన యాంధ్రబ్రాహ్మణులు చాలమంది దక్షిణమునకు వలసపోవుచువచ్చిరి. పల్లవమల్ల నందివర్మమహారాజు తామ్రశాసనములం దొకానొకదాని యందు పేర్కొనబడిన ప్రతిగ్రహీతలవిః చెప్పబడిన నివాసగ్రామములలో చాలభాగ మిప్పటి కృష్ణా, గుంటూరుమండలములందలివిగ దెలియవచ్చుటయే పూర్వోక్తవిషయమును ధ్రువపరుచుచున్నది. అటుతరువాత క్రీస్తుశకము పండ్రెండవ, పదుమూడవ శతాబ్దులయందలి తెలుగు చోడులయొక్కయు, కాకతీయులయొక్కయు దక్షిణ దిగ్విజయయాత్రలవలన ఆంధ్రుల దక్షిణాశాభిగమనమున కొకింత ప్రోత్సాహము కలిగెనను విజయనగర సామ్రాజ్యమును బరిపాలించిన సాళువ, తుళువ, ఆరవీటివంశ రాజశేఖరుల కాలమునగాని దక్షిణాదిని ద్రవిడదేశమున ఆంధ్రులవలస లేర్పడలేదు. ముఖ్యముగ కృష్ణదేవరాయ, అచ్యుతరాయ, సదాశివరాయాదులకాలమునను, ఆరవీటి భూపతులకాలమునను తెలుగువారు మంత్రులయి, దణ్నాయకులయి, కార్యకర్తలయి, రాయసములయి విజయనగరరాజ్యరమావిహారమునకు సముద్రత్రయముద్రిత మయిన దక్షిణభూమిని రాజమార్గము లేర్పఱచిరి. అంతియకాక ఆంధ్రుల సమరాశ్వములు సముద్రమునుగూడ లంఘించి పూర్వము యాళ్పాణమని, నేపాళమని పేరు వహించిన జాఫ్నాతోగూడిన సింహళమున సయితము వీరవిహారము సలిపినవి. విజయనగర చక్రవర్తులకు సామంతులయి తెలుగునాయకులు తిగుళభూముల నేలి దక్షిణాది నాంధ్రనాగరకతకు, సంస్కృతికి, కళలకు పాదులు కట్టి ఆంధ్రవిజ్ఞానవల్లరిని ప్రోదిసేసిరి. ఇట్టి సామంత రాజన్యులలో తంజావూరు, మధుర నాయకులు కాలక్రమమున ప్రబలులయి, విజయనగర సామ్రాజ్యము రక్కసతంగిడిరణరంగమున మణగిపోయినను తెలుగుకన్నెకు దక్షిణాదిని ప్రాపును ప్రోపును అయి తెలుగుబావుటా తంజావూరు, మధుర దుర్గములపయి రెపరెప లాడించిరి.

స్మరణీయమయిన తంజావూరి ఆంధ్రరాజచరిత్రమును పెక్కు సంస్కృతాంధ్రకావ్యములును, శాసనము

లును, ఆంగ్లగ్రంథములును బరిశోధించి మిక్కిలి శ్రమ
పడి శ్రీ సీతారామయ్యగారీ గ్రంథమును విరచించి
ఆంధ్రులకృతజ్ఞతకు పాత్రులయిరి. ఇంతవఱకీవిషయ
మును దెలిసికొనుటకున్న దెల్ల బ్రహ్మశ్రీ వేటూరి ప్రభా
కరశాస్త్రిగారిచేత ప్రకటింపబడిన 'తంజావూరి ఆంధ్ర
రాజులచరిత్ర' యొక్కటియే. ప్రధానముగ నిది మెకంజీచేత
సంపాదితమయిన కైఫీయతు. చక్కని కడువిపులమయిన
పీఠిక చేర్చి శ్రీశాస్త్రిగారు దానిని పైనిచెప్పిన పేర నొక
పొత్తముగ ప్రకటించిరి. ఆంగ్లభాషయందయినను ఈచారి
త్రమును దెలుపు ప్రత్యేకపుస్తక మేదియు లేదు. అట్లగుట
ఆంధ్రుల కిది అవశ్యాదరణీయము.

మొదట కృష్ణదేవరాయల సైన్యాధిపతులలో
నొకడుగ నుండి, పిదప అతనియనంతరమున విజయనగర
రాజ్యభారమును వహించిన అచ్యుతదేవరాయల క్రింద
చోళదేశమునకు రాజప్రతినిధియయి తంజాపురాంధ్ర
నాయకరాజవంశమును స్థాపించిన తిమ్మానాయక,
బయ్యాంబికల ద్వితీయపుత్రుడు చినచెవ్వప్ప నాయకుడు
తంజావూరు రాజధానిగ ద్రవిడమండలమును బరిపాలిం
చెను. సంగీతసాహిత్యచతురుడును, సంస్కృతాంధ్ర
కవితావిశారదుడును అయిన గోవిందదీక్షితులవారు చిన
చెవ్వప్పనాయకునికిని, అతనికొమారుడును తంజావూరి
రెండవనాయకప్రభువును అయిన అచ్యుతప్పనాయకుని
కిని ప్రధానియు దళకర్తయు నై ప్రసిద్ధివహించిరి. నా
యకప్రభువులలో పరాక్రమమునకు, సంగీతసాహిత్యము
లకు పేరుగన్నవాడు అచ్యుతప్పనాయని కొమారుడు
రఘునాథనాయకుడు. ఈ కవిరాజు స్వయముగ
పెక్కుగ్రంథములు రచియించెను. ఈనాయకవంశమున
కడపటివాడు రఘునాథతనయుడయిన విజయరాఘవ
నాయకుడు రఘునాథాభ్యుదయనాటకమును రచియిం
చెను. పెక్కురుకవయిత్రులీతని యాస్థానము నలంకరిం
చిరి. ఈతనికాలమున తంజావూరు, మధుర, విజయనగర
ముల అంతఃకలహములు, ఆత్మలాభపరాయణములయిన
మధుర తంజావూరుల యాహ్వానప్రోత్సాహమున దక్షిణ
మున కెత్తివచ్చిన మహమ్మదీయుల దండయాత్రలు,
ఇతరమతముల ననాదరించి ప్రత్యేకము విజయరాఘవ
నాయకుడు వైష్ణవము నెడ చూపిన విశేషాదరాభిమాన
ములు ఆతనికాలమున దేనికదియే తంజావూరినాయక
రాజాధికారమును క్షీణింపజేయుటకు తోడ్పడినవి.
తుదకు మధురనాయక ప్రభువయిన చొక్కనాథ
నాయనయ్యయొక్క దళవాయియయిన వేంకటకృష్ణప్ప
నాయకుడు వేసిన తంజావూరి ముట్టడియందు విజయ
రాఘవనాయకుడును, అతని కుమారుడు మన్నారు
దేవుడును వీరశయనము నలంకరించుటతో తంజా
వూరి నాయకరాజపరిపాలనము క్రీ. శ. ౧౬౭౩ లో
సమాప్తమయినది. తంజావూరి పతనమునకు బిదప
మధుర చొక్కనాథనాయకనియుక్తుడయిన అళగిరి
నాయకుడు మొదట కొంతకాలము మధుర సామంతు
డుగ రాజ్యమేలినను పిదప నాయధికారమును ధిక్క
రించి స్వాతంత్ర్యపతాక నిలిపెను. కాని తంజావూరి
ముట్టడిసమయమున శత్రువులకు చిక్కకుండ పాఱి
పోయిన మన్నారుదేవతనయు డనబడు చెంగమలదాసు
స్వపితృసింహాసన సంపాదనమునకు సాయపడవలసినదని
చేసికొన్న విన్నపముమీద విజాపురపు సుల్తాను తన
మహారాష్ట్రసేనాపతియైన ఏకోజీ నాతనికి సాయముగ
బంప, నావాహినీసహుడు, సంగ్రామమున అళగిరినాయని
నోడించి చెంగమలదాసును తంజావూరి సింహాసనమున
బ్రతిష్ఠించెను కాని రాజ్యకాంక్షాతత్పరుడయి యాతడు
వీలు చూచుకొని తంజాపురసింహాసనము నాక్రమించుకొని
౧౬౭౬ లో తంజాపురమహారాష్ట్రరాజ్యమును స్థాపిం
చెను. ఈవిధమున తంజాపురాంధ్రనాయక ప్రకరణము
ముగిసినది.

ఈచారిత్రమును గ్రంథకర్తగారు ఆంధ్రవిశ్వ
విద్యాలయము పక్షమున విశాఖపట్టణము ఏ. వి. యన్.
హాలునందు ౧౯౩౧-వ డిసెంబరులో చేసిన ఆఱు ఉప
న్యాసములలో వెల్లడించిరి. ఈగ్రంథమును రచించినం
దుకు గ్రంథకర్తగారి నభినందింపవలసియున్నను సవ
రింపవలసిన విషయములు చాల కలవని చెప్పవలసివచ్చి
నందుకు చింతించెదము. కొన్ని చారిత్రక విషయముల
సందర్భమునను, తేదులవిషయమునను స్పష్టముగ కాన
బడు తప్పులు కొన్ని దొర్లినవి. మధుర, తంజా

వూరు నాయకరాజులను గుఱించిన 'వృత్తాంతము'లను ప్రమాణములుగ దీసికొనుట విచారకరము. ఈవృత్తాంతములు చాల ఇటీవలికాలమున రచియింపబడినట్లు కన్పట్టును. గ్రంథమునందు పలుతావుల చర్చ యావశ్యకమైనను శాసనములను జక్కగ పరిశీలించినచో చాలచోట్ల నిట్టిచర్చ కవకాశ ముండెడిది కాదు. అదియునుగాక కాలనిర్ణయమునకు గాని మఱియెట్టి విషయమునకు గాని సంబంధించిన చర్చయంతయు 'పుట్టునోట్ల'లోనికి లాగియుండిన అసలు చరిత్ర విషయము ఆదరపఠనయోగ్యమయిన కథవలె నడచియుండును. ఇప్పుడు వ్రాసినపక్కి ననుసరించి యది పాఠకుని హృదయమును పెక్కుచర్చలతో కలవరపఱచి అసలు విషయము సుబోధము కాకుండజేయుచున్నది. కావేరీప్రాంతము సారవంతమయినది; ఫలవంతమయినది అనువాడుకగ సత్యమని తెలిసిన స్వల్పవిషయాదులకు సయితము సంస్కృతాంధ్రగ్రంథములనుండి ఉదాహరణములను, ఆకరములను ఇచ్చుటవలన అనావశ్యకముగ గ్రంథము బహుళమయినది. ఆంగ్లగ్రంథోదాహృత భాగములకు తెలుగుసేతయు, తెలుగు అనువాదభాగములకు ఆంగ్లమూలమునుగూడ చేర్పబడినది. సంస్కృత గ్రంథములనుండియు పెక్కు వర్ణనశ్లోకము లుదాహృతము లైనవి. ఇది యనవసరము. కొన్ని కొన్ని సిద్ధాంతములపట్ల గ్రంథకర్తగారు సుప్రసిద్ధ పరిశోధక గ్రంథము లనుకొనబడువాని నాధారముగ గొనక మూలాధారములనే పరిశీలించి వానిమీదనే ఆధారపడియుండిన నెంతో బాగుండెడిది. ఆకాలపు చారిత్రక పురుషుల చేతలను తర్కించి, వారి నెదురుగ నుండినట్లు సంబోధించుట (౧౬౧, ౧౬౪, ౧౬౭, ౨౨౦, ౨౭౩, ౨౮౩, ౨౮౭, ౩౦౯, ౩౨౭, ౩౨౮ పుటలు చూడదగును), వారిశీలవృత్తాదులను గుఱించి తెగడుట పొగడుట, జగ్గరాయరాక్షస, మహమ్మదీయవ్యాఘ్రాది పదముల నుపయోగించుట—ఇత్యాదులు బహుళపరిశోధనమున రచియింపబడు నిట్టి గ్రంథములయం దుచితములు కావు. వానివలన నొకవిధముగ పుస్తకముగౌరవము తగ్గును.

స్పష్టముగ గనబడు కొన్ని ప్రమాదము లిట సుధాహృతములు గ్రంథకర్తగారు వ్రాసినట్లు (౧) వీరచోళుని కొడుకు కాడు కులోత్తుంగుడు. అతడు రాజరాజనరేంద్రుని కొమారుడు. (౨) బృహదీశ్వరాలయమును గట్టించినది వీరచోళుడు కాడు : రాజరాజు. కావుననే దానికి రాజరాజేశ్వర, రాజేశ్వర నామములుకలవు. (౩) మలిక్ కాఫర తప్పకుండ మధుర రాజధానిగ జేసికొని అచ్చట నివసించి దక్షిణదేశము నేలియుండలేదు. ఇచ్చిన ఆకరము ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా తప్పు. అది ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ అని యుండదగును. అందయినను మలిక్ కాఫరు మధురయందు నివసించి దక్షిణదేశము నేలెనని చెప్పియుండలేదు. (౪) సాళువ నరసింహుడు పలాయితుని గావించిన 'గణపతి' ఎవరు? గజపతియని యుండదగునా? (౫) కూతుండ్రుతక్క పుత్రులు కృష్ణదేవరాయలకు లేరనుట తప్పు. మగపిల్లలు పుట్టిరి కాని గతించిరి. (౬) తంజావూరి రాజ్యస్థాపనమునకంటె మధురరాజ్యస్థాపనమే ముందనుట సరికాదు. చాల ఇటీవలివయిన మధుర, తంజావూరు వృత్తాంతముల ననుసరించి ఈవిషయమును నిర్ధారణము చేయజూచుట ప్రయోజనరహితము. ఈ వృత్తాంతములవలన దెలియవచ్చు విషయములు శాసనములవలన దెలియవచ్చువానికి విరుద్ధములు. 'డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగారు, సత్యనాథఅయ్యరు ప్రభృతులుకూడ నిట్లే వ్రాసిరి; సిద్ధాంతీకరించిరి' అన్నది యొక ప్రమాణము కాజాలదు. (౭) సాళువసుండ నరసింహరాయల పరిపాలనము క్రీ. శ. ౧౪౯౭ తోనే ముగిసినప్పు డాతనికి నాగమనాయకుడు క్రీ. శ. ౧౫౦౫లో దండనాయకుడుగ నుండుట యెట్లు పొసగును? ఈ సందర్భమున నీయబడిన ప్రమాణము లన్నియు తప్పులే. ౧౯౧౯-వ సంవత్సరపు ౩౧౮-వ శాసనమువలన దెలియవచ్చు సంవత్సరము శకము ౧౪౦౬ లేక క్రీ. శ. ౧౪౮౪. అంతే కాని క్రీ. శ. ౧౫౦౫ కాదు. ఫాదరిహేరాసుగారి ఆరవీటివంశగ్రంథమునందలి పుటలకిచ్చిన యాకరములలో ఏపుటయందును నాగమనాయని పేరే కనబడదు. (౮) చెవ్వప్పనాయని రాజ్యారంభసంవత్సరమును నిర్ణ

యించుట కష్టము కాని శాసనములవలన అతడు క్రీ. శ. ౧౫౬౧ వఱకు కాక క్రీ. శ. ౧౫౮౦ వఱకు పాలించినట్లు తెలియుచున్నది. (౯) జెసూటు మిషనరీల ఉత్తరములవలనను, శాసనములవలనను అచ్యుతప్పనాయకుని రాజ్యకాలము క్రీ. శ. ౧౫౬౧ నుండి ౧౫౯౯ వఱకు (ఒకటి రెండు సంవత్సరములింకను లోపునవేమో) అని తెలియదగియున్నది. (౧౦) వల్లప్రాకారముయుద్ధమున అచ్యుతప్పనాయకుడు వీరప్పనాయకునికి సాయముగ వెళ్లినాడుకాని వేంకటపతిరాయలపక్షమునగాదు. ఈయుద్ధమున అచ్యుతప్పనాయకుని సైన్యము లోడిపోయినవి. ఈయుద్ధాధారమున గ్రంథకర్తగారు చేసినయూహలు, కట్టుకొనివచ్చిన సిద్ధాంతములు సవరింపదగినవి. (౧౧) అచ్యుతప్పనాయకుని పరిపాలనము ౧౫౯౯ వఱకే కావున అతని పరిపాలనకాల చరిత్రమున చోళగ, జగ్గరాయవిద్రోహవృత్తాంతాగులను జేర్ప నవకాశము లేదు.

ఎన్నిచర్చలు చేసినను, ఎంతవ్రాసినను సామాన్యపాఠకునికి కావలసినవి ఆయారాజవంశముల కప్పు దున్న పరస్పరసంబంధము కాని, ఎవరితరువాత నెవరు రాజమునకు వచ్చిరన్న విషయము కాని, ఏయేయుద్ధములు జరగినవని కాని కాదు; తంజావూరి ఆంధ్రనాయకరాజులు దాక్షిణాత్య సంస్కృతి, నాగరకతల కెట్లు తోడ్పడిరి? ఏమి చేసిరి? తరువాతి తరములవారికి వారు విడిచిపెట్టి వెళ్లిన వారసత్వ మేది? ఆంధ్రతాముద్ర నెంతవరకు నిలుపగలిగిరి? ఇట్టి విషయములు ప్రధానములు. అందువలన ఆయారాజుల చరిత్రమును వర్ణించునప్పు డేమి చెప్పినను ఏవి చెప్పకపోయినను గ్రంథకర్తగారు వీని నుపసంహారమున గాక యొక ప్రత్యేకప్రకరణమున వ్రాసిన నెంతయో బాగుండెడిది. ఎట్లయినను ఆంధ్రచరిత్రమునందలి యొక ప్రత్యేకప్రకరణమును త్రవ్వి బయలుపఱిచి యీ రీతిని ఆంధ్రలోకమునకు సమర్పించినందులకు ఆంధ్రులు గ్రంథకర్తగారి యెడల కృతజ్ఞులై యుండగలరు.

గ్రంథము కడుసుందరముగ ముద్రిత మయినది. చాలబొమ్మలు కలవు.

మ. సో. శ.



అడవి బ్రదుకు

శ్రీ సి. జె. జగన్నాథదాసుగారి ఛాయాచిత్రము.



మకరతోరణము

('ఐసు హౌసు' వద్ద 'విజోస్ హోము' — మద్రాసు)

శ్రీ యమ్. కె. రంగస్వామయ్యంగారి ఛాయాచిత్రము.

# స్వీ కా ర ము

## (గ్రం థ ము లు)

### ఆంధ్ర హితోపదేశచంపువు

గ్రంథకర్త, మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు. ప్రకాశకుడు, వేదము వేంకటరాయన్, ౮ మల్లికేశ్వరవీధి, జి. టి. మదరాసు, ౧౯౩౨. క్రౌనుసైజున ౨౬౫ పుటలు, అనుబంధము ౫ పుటలు. వెల తెలియదు.

---

### మైత్రేయి

(ఒకానొక వైదిక కథ.) పండిత శ్రీ సీతానాథ దత్తాత్త్వభూషణులవారి ఆంగ్లగ్రంథమునకు జ్ఞానాంబ గారి ఆంధ్రానువాదము.

---

### జంబీర చికిత్స (నిమ్మపండు వైద్యము)

ప్రకృతీగ్రంథమాల–౪౭. గ్రంథకర్త, దువ్వూరి రామకృష్ణరావు, బి. ఏ., వీరభద్రపురము, రాజమహేంద్ర వరము. ప్రకాశకులు, ప్రకృతీకార్యాలయము, బెజవాడ. వెల ౦–౩–౦. చందాదారులకు ౦–౨–౦. క్రౌనుసైజు ౧౫ పుటలు. ఈ పుస్తకము వాలెంటేను నాగ్సు అను నాంగ్లదేశీయుడు వ్రాసిన గ్రంథము ననుసరించి వ్రాయ బడినది.

---

### భక్తకథావళి (మొదటి భాగము)

శ్రీమాన్ వంగీపురం రంగస్వామి అయ్యంగారు వారిచే వ్రాయబడినది. చిత్తూరు జిల్లా పాకాల బోర్డు మిడిల్ స్కూల్ లోనున్న గ్రంథకర్తకుగాని చిత్తూరు విక్టోరియా జూబిలీ ప్రెస్ కు గాని వ్రాసినచో పుస్తకములు దొరకును. క్రౌనుసైజు ౪౭ పుటలు. వెల ౦–౪–౦.

నందనారు, జంబుదాసు, కణ్ణప్పనాయనారు, నారదుడు, త్యాగరాజు, బమ్మెరపోతరాజు, రామరాజు, రుక్మాంగదుడు, ఆంజనేయుడు, రామదాసు, లగూర్చిన కథ లిందు గలవు.

### విరజోపాఖ్యానము

గ్రంథకర్త, చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి, తెలుగుపండితులు, శ్రీరామ హైస్కూలు, మచిలీపట్ట ణము, కృష్ణాజిల్లా. క్రౌనుసైజు ౧౧౩ పుటలు, వెల ౦–౧౨–౦.

---

### A Handbook of English Grammar

### ఆంగ్లవ్యాకరణము (తెలుగున)

గ్రంథకర్త, కె. యస్. మణియన్, ఉపాధ్యా యులు, జమ్మలమడుగు. క్రౌను సైజు ౯౦ పుటలు; వెల ౦–౫–౦.

---

### ఆంధ్ర కుందమాల (నాటకము)

రాజమహేంద్రవరమునం దాంధ్రపండితులగు కవి శేఖర వడ్డాది సుబ్బారాయ విరచితము. డెమ్మీ సైజు ౫౩ పుటలు, వెల ౦–౧౨–౦.

---

### భగవద్విషయము

శఠకోపమహర్షి సూక్తమగు ద్రావిడామ్నాయము, సభాష్యము. ఇది ఉ. వే. శ్రీమాన్ కొండూరు కృష్ణ మాచార్యులచే సాంధ్ర టీకా తాత్పర్య భాష్యముగ నొనర్పబడెను. క్రౌను సైజు ౧౨౫ పుటలు. వెల ౧–౦–౦. నెల్లూరుజిల్లాలోని గూడూరు బోర్డు హై స్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులగు గ్రంథకర్త గారి వద్ద పుస్తకములు దొరకును.

---

### విచారసంగ్రహము

సాధు ధ్యానానందులచే ఆంధ్రీకృతము. క్రౌను సైజు ౩౭ పుటలు. వెల ౦–౪–౦. శ్రీ శాంతిశిక్షాశ్ర మము, ఘంటశాలపాలెయము, చల్లపల్లిపోస్టు, కృష్ణా జిల్లాకు వ్రాసినచో పుస్తకములు దొరకును.

## ౧. కిశోరవీరులు (Wolf Cubs)

### ౨. కిశోరవీరుల తరిబీతు విధానము

### (Methods of Cub Training)

చెన్నపురి రాష్ట్రీయ బాలవీరుల సంఘమువారి ఆమోదము నందినవి.

గ్రంథకర్త, పరిగె వెంకటరమణరావు గారు, బి.ఏ., బి. ఇ డి. ('ది సౌత్ ఇండియా బాయ్‌స్కౌట్. తెలుగు అనుబంధపు సంపాదకుడు.)

ఇందు మొదటిది క్రౌను సైజు ౮౬ పుటలు. పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులోని శ్రీరామ స్కౌట్ గ్రూప్‌మాస్టరుగారికిగాని, కడపజిల్లా రాయచోటిలోని శ్రీ కృష్ణస్కౌట్ గ్రూప్ మాస్టరుగారికిగాని నాలుగు అణాలను పంపినచో ఈ పుస్తకము ప్రతి ఒకటి పంపబడును.

రెండవది క్రౌనుసైజు ౯౬ పుటలు. ఏలూరులో శ్రీరామకృష్ణ స్కౌట్‌గ్రూప్‌లో రోవర్ లీడర్‌లగు జ్యోస్యుల వెంకటరావుగారికిగాని, తెనాలిలో కొత్తపేటలో ఉండే పరిగె వెంకటరమణరావుగారికి గాని నాలుగు అణాలు పంపితే యీ పుస్తకంకాపీ ఒకటి పంపబడును.

---

## దస్తావేజుల మతలబులు

గ్రంథకర్త, శ్రీ కర్లపాలెం కృష్ణరావుగారు' పబ్లిషరు, పులిపాటి రంగయ్యగారు, చీరాల. డెమ్మీ సైజు ౭౯ పుటలు, ౦-౧౨-౦.

---

## సూర్యనారాయణ శతకము

గ్రంథకర్త, డాక్టర్ జటావల్లభుల వెంకటేశ్వర్లు గారు, A. V. A. C. అచ్చంపేట, కాకినాడ పోస్టు. డెమ్మీసైజు ౧౬ పుటలు. వెల ౦-౧-౬.

## సత్యార్థప్రకాశము (తెలుగు)

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులగు శ్రీ మద్దయానంద సరస్వతీస్వాములవారిచే వేదాది వివిధ సచ్ఛాస్త్ర ప్రమాణ సమన్వితముగ నార్యభాషయందు వ్రాయబడినదాని ఆంధ్రానువాద సంశోధకులు ధూ॰ రాజరత్నాచార్యులుగారు. ప్రకాశకులు, దక్షిణహైదరాబాద్ ఆర్య సమాజ్, రెసిడెన్సి, హైదరాబాద్, దక్కన్. ౧౯౩౨. రెండవకూర్పు. పెద్దసైజు ౫౬౮ పుటలు. వెల ౨-౦-౦.

---

## ౧. గీతాబోధ (భగవద్గీతాభాష్యము)

గ్రంథకర్త, మహాత్మ గాంధి. అనువాదకుడు, ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, హిందీ ఉపాధ్యాయుడు.

ఆంధ్రగ్రంథమాల: ౧౫ వ కుసుమము. క్రౌను సైజున ౬౮ పుటలు. వెల ౦-౮-౧.

### ౨. సబర్మతీ ఆశ్రమ నియమములు

గ్రంథకర్త, మహాత్మగాంధి. అనువాదకుడు: ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు, హిందీ ఉపాధ్యాయుడు.

ఆంధ్రగ్రంథమాల: ౧౯ వ కుసుమము. క్రౌను సైజున ౬౨ పుటలు. వెల ౦-౮-౦.

వలయువారు, ఆంధ్రపత్రికా కార్యాలయము, పోస్టుబాక్సు ౨౧౨, మద్రాసు అని వ్రాయవచ్చును.

---

## పి ర దౌ సి

గ్రంథకర్త, జి. జాషువకవి, తెనుగుపండితుడు, వినుకొండ, గుంటూరుజిల్లా. ఈ చరిత్రాత్మకమైన పద్య కావ్యము క్రౌనుసైజున ౭౫ పుటలుగలది. వెల౦-౫-౦.

## శ్రీమదభినవాంధ్ర వ్యాకరణ సర్వస్వము

గ్రంథకర్త, ఉభయభాషాప్రవీణ, గూడ సత్యనారాయణశాస్త్రిగారు, బోర్డు మిడిల్ స్కూల్ తెలుగు పండితుడు, దాచేపల్లి. వలయువారు వ్రాయదగు విలాసము:—రామకృష్ణగ్రంథమాల, భరతాశ్రమము, ఆదిపూడి, పర్చూరుపోస్టు. క్రౌను సైజున ౯౨ పుటలు. వెల౦-౬-౦.

---

## శంకరశతకము

(నీతి భక్తి సమన్వితము.) శార్దూలవిక్రీడితవృత్తములు. సంగం జాగర్లమూడి వాస్తవ్యులు, కొత్త భావయ్యగారిచే రచింపబడినది. ౧౯౩౨. క్రౌను ౧౯ పుటలు. వెల ౦-౨-౦.

---

## సిద్ధార్థశతకము

(శ్రీ బుద్ధభగవానుని బోధ) నీతి భక్తి సమన్వితము. గ్రంథకర్త: కొత్త శివలింగయ్యగారి కుమారుడు సంగయ్య, సంగం జాగర్లమూడి. ౧౯౩౨. క్రౌను ౧౮ పుటలు. వెల ౦-౨-౦.

---

## వేణీసంహారమ్

శ్రీభట్టనారాయణప్రణీతమ్; వేణీసంహారనాటకమ్ శ్రీ లక్ష్మణసూరివిరచితయా చూడామణ్యాఖ్యయావ్యాఖ్యయాసమేతమ్. చెన్నపుర్యామ్: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ఇత్యేతైః ప్రకటితమ్, ౧౯౩౨. సంస్కృతనాటకము, తెలుగు లిపి. డెమ్మీ సైజున ౨౨౮ పుటలు, వెల ౧-౮-౦.

---

## శ్రీ శరణాగతి (తమిళ గేయములు)

డిమ్మి ౧/౧౬ సైజు, పు ౧౨౦. వెల రు.౦-౬-౦. బెంగాలీ మూలగ్రంథమునకు కర్త: నిత్యలీలాప్రవిష్ట ఠాకూర్ భక్తివినోద. తమిళ అనువాదమునకు కర్త: పి. యన్. శంకరనారాయణ అయ్యర్, బి. ఏ., బి. యల్. ప్రకాశకులు: శ్రీ గౌడీయమఠమువారు, నార్త్ గోపాలపురము, కథీడ్రలుపోస్టు, మదరాసు.

---

### ౧. మాధవి

డిమ్మి ౧/౧౬ సైజు, పుటలు ౬౮, వెల రు. ౦-౯-౦.

### ౨. గాసిప్ ఈవిల్ (Gossip Evil)

డిమ్మి ౧/౧౬ సైజు, పుటలు ౧౨౦, వెల రు. ౦-౧౮-౦.

పై రెండు తమిళ నాటకములకు రచయిత: యస్. కె. పార్థసారథిగారు, బి. ఏ., బి. యల్., జిల్లా మునసబు, మన్నారుగుడి. ఈ గ్రంథములు గ్రంథకర్త యొద్ద దొరకును.

---

## లాయర్స్ డైరీ - ౧౯౩౩

ఫూల్ స్కేపు పొడుగుపాటి సైజు. వెల రు ౧.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్., ౨౯౨, ఎస్ప్లనేడ్, మదరాసు, ప్రచురించినది.

పుటకు రెండుదినములు. చివరను మెమోరాండము కాగితములు. ౧౯౩౪ సం. నకు మార్చి నెలాఖరువరకు పుటకు 3 విభాగములక్రింద దైనికచర్యనిమిత్తము ఏర్పాటు.

---

## శ్రీముఖనామ సంవత్సర పఞ్చాఙ్గమ్

బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్య సిద్ధాంతినః పుత్రైః కల్యాణ వీరభద్ర, సుబ్రహ్మణ్య, కృష్ణమూర్తి, శేషాచల, కామేశ్వర, శాస్త్రిభిర్విరచితమ్.

---

## (ప త్రి క లు)

### ఆ ం ధ్ర ప్ర కా శి క

ప్రతి ఆదివారము ప్రకటింపబడు ప్రజాపత్రిక. తెనుగు. ప్రకాశకులు-సంపాదకులు: డి. యస్. రావు గారు, చాకలిపేట, మదరాసు. సం. చందా ౨-౬-౦. ౬ నెలలకు ౧-౮-౦. విడిసంచిక అర్ధణా. ౮ పుటలు. సంపుటం ౧. సంచికలు ౧, ౨, ౩. డిసెంబరు ౪, ౧౧, ౨౫ తేదీలను ప్రచురితములు.

---

### India Tomorrow

ఆంగ్లపక్షపత్రిక. సంపు. ౩, సంచిక ౪, డిసెంబరు ౫ తేదీని చేరినది. సంపాదకుడు, అమరేంద్రనాథ రాయ్. కార్యాలయము, జి. ౨౧, కాలేజి స్ట్రీటు మార్కెట్, కలకత్తా. విడిసంచిక ౨ అణాలు. క్రౌను ౨౮ పుటలు.

---

### The Indian Nation:

**A high class English Monthly.**

స్పెషల్ నంబర్. సంపు ౧, సంచిక ౧. డిసెంబరు ౧౯౩౨. క్రౌనుసైజున ౩౮ పుటలు. వెల ౨ అణాలు.

ఇంగ్లీషు. సచిత్రము. ప్రధానసంపాదకుడు: శ్రీ లాల్‌గుడి సుబ్రహ్మణ్యము గారు. సహాయసంపాదకుడు, శ్రీ టి. యస్. సదాశివన్‌గారు. కార్యదర్శి, శ్రీ టి. యస్. శంకర్‌గారు. ముద్రాపకులు: బి. యన్. ప్రెస్. కార్యాలయము:— "లక్ష్మీవిలాస్", ౩౩౦ ట్రిప్లికేన్ హయిరోడ్డు, మదరాసు.

---

### సు బో ధ

కన్నడము. సచిత్రమాసపత్రిక. సంపుటం ౮, సంచిక ౨, డిసెంబరు ౧౯౩౨. సంపాదకుడు, యం. రామరావుగారు, సుబోధప్రకటనాలయము, బెంగళూరు నగరము. క్రౌను ౪౮ పుటలు. సం. చందా ౨-౦-౦. విడి సంచిక ౦-౫-౦.

---

### వి నో ది ని

డిసెంబరు ౧౯౩౨. ప్రథమసంచిక. క్రౌను 1/8 సైజు. పుటలు ౩౦. మదరాసు ఎగ్మూరులోని లోగ్రస ముద్రణాలయమున అచ్చొత్తింపబడి జార్జిటవును గోవిందప్పనాయకవీధిలోని ౨౩౪ నెంబరు గృహమునుండి శ్రీ పి. గోపాలస్వామినాయుడుగారి సంపాదకత్వమున ప్రచురింపబడుచున్న క్రొత్త తెలుగు మాసపత్రిక. శ్రీ బి. టి. నరసింహాచార్యులు, డా॥ ఎస్. శేషగిరిరావు గార్ల సంతకములతోడి వ్యాసములును, ఇతర విషయములును ఇందు గలవు. 'నవ్వుల సచిత్ర మాసపత్రిక.' యట యిది. సం. చందా ౧-౦-౦. విడిప్రతి ౦-౨-౦.

---

## కుతుబ్ మినార్

ఇది మొగల్ దివానమా,
ప్రళయశివ మహాస్మశానమా?
* * * *
ఇది విజయస్తంభమా,
చలవిద్యుచ్చంద్రచూడదంభమా?
* * * *

ఇవి జీర్ణసమాధులా,
ప్రమథగణ నివాస వీథులా?
* * * *
ఇది యవనవికాసమా,
నటేశ తాండవ విలాసమా?
* * * *

బసవరాజు అప్పారావు.

**11-11-1932.** కుతుబ్ మినారువద్ద.

---

# నక్షత్ర మండలము

(పుష్యమాసము)

గొబ్బూరి వేంకటానంద రాఘవరావు గారు




[ఇందు ↑ ఇట్టి అలుగు గురుతు (arrow-head) గల భాగమునకు సరిగా పైన భాద్రపద నక్షత్రము లున్నవి. ఆ నక్షత్రములకు ప్రోష్ఠపదా నక్షత్రములనియు, ప్రోష్ఠపదానక్షత్రము లనియు వేదవాఙ్మయమున పేళ్లగపడుచున్నవి. దక్షిణధ్రువము పటమధ్యమున చుక్క—సిగ్మా ఆక్టెన్సు (Sigma Octans).]

ఈ మాసమునందు రాత్రి తొలిజామున ఉత్తర ధ్రువప్రాంతములందును, ఆకాశమధ్యమునందును కనబడు నక్షత్రసమూహములు ఇంచుమించుగా మార్గశిరమాసమునందు కనపడునవియే అయినందున ఈ మాసమునందు ప్రత్యేకముగా ఆప్రాంతముల నక్షత్ర పటము వ్రాయలేదు. దక్షిణధ్రువప్రాంతనక్షత్రములు మనకు చాలవఱకు కనబడవు. అయినను వానినిగూడ తెలిసికొనవలసియున్నది కనుక ఆనక్షత్రములను గూర్చి ఇపు డీపటము రచింపబడినది.

నేటి దక్షిణధ్రువము పాశ్చాత్యులచే ఆక్టెన్సు (Octans) అనియును మన పురాణకర్తలచే ప్రోష్ఠపద్యష్టక మనియును వ్యవహరింపబడుచున్న చుక్కల గుంపులో సిగ్మా (σ) గుర్తుగలచుక్క. అది యీపటమునకు మధ్యమున నున్నది. దానిచుట్టును ఒక పచ్చగన్నేరుపువ్వు లేక గంట యాకారపు సరిహద్దులుగల (Bell-shaped) చుక్క లున్నవి. ఆచుక్కలే ప్రోష్ఠపద్యష్టకమండలము (Octans). ఈ మండలము మన పురాణకర్తయగు వేదవ్యాసుని తల్లియగు సత్యవతీదేవికి సంబంధించినట్లు కనబడుచున్నది. ఆమెనుగూర్చి మత్స్యపురాణము ౧౪-వ అధ్యాయమున విచిత్రమైన కథ గలదు.

...వర్తన్తే దేవపితరో యాన్దేవా భావయన్త్యలమ్,
...అచ్ఛోదానామ తేషాంతు మానసీ కన్యకాసరిత్.

అచ్ఛోదం నామచ సరః పితృభి ర్నిర్మితం పురా,
అథ తత్ర తపశ్చక్రే దివ్యం వర్ష సహస్రకమ్.

ఆజగ్ముః పితరస్తుష్టాః కిల దాస్యామ తే వరమ్,
దివ్యరూపధరా స్సర్వే దివ్యమాల్యానులేపనాః.

తన్మధ్యే మావసుంనామ పితరం వీక్ష్య సాఙ్గనా,
వవ్రే వరార్థినీ సఙ్గం కుసుమాయుధపీడితా.

యోగభ్రష్టాతు సా తేన వ్యభిచారేణ భామినీ,
ధరా మస్పృశతీ పూర్వం పపా తాథ భువస్థలే.

తథాచ మావసు ర్యస్మా దిచ్ఛాంచక్రే న తాంప్రతి,
ధైర్యేణ తస్య సాలోకే అమావాస్యేతి విశ్రుతా,
పితౄణాం వల్లభా తస్మా ద్దత్తస్యాక్షయకారకా.

అచ్ఛోదాఽధోముఖీ దీనా లజ్జితా తపసః క్షయాత్,
సా పితౄ న్ప్రార్థయామాస పున రాత్మసమృద్ధయే.

...................మీనయోనిజా......
పరాశ రస్య వీర్యేణ సుత మేక మవాప్స్యసి.

...................సముద్రాంశస్య శన్తనోః,
విచిత్రవీర్య తనయ స్తదా చిత్రాఙ్గదో నృపః.

ఇమా వుత్పాద్య తనయౌ క్షత్రియా వస్య ధీమతః,
ప్రోష్ఠపద్యష్టకా రూపా పితృలోకే భవిష్యసి,
నామ్నా సత్యవతీ లోకే పితృలోకే తథాష్టకా....

భవిష్యసి పరే లోకే నదీత్వం చ గమిష్యసి,
పుణ్యతోయా సరిచ్ఛ్రేష్ఠా లోకే ష్వచ్ఛోదసంజ్ఞితా.

పితృదేవతలకు అచ్ఛోదయను మానసకన్యక పుట్టి ఆపేరుగల సరోవరతీరమున తపముచేసి పితరుల మెప్పించిన, వారలు దివ్యాలంకారభూషితులై పొడసూపిరి. వారిలో మావసు డనువాని నామె పతిగా నభిలషించెను. ఈవ్యభిచార దోషమున నామె యోగభ్రష్టయై పడి భూమి నంటక మధ్యమున నిలిచెను. మావసుని మనము చలింపకుండుటచే ఆకార్యము ప్రవర్తిల్లిన దినము అమావసి, అమావాస్య యనబరగెను. ఇది పితృసంబంధమగునది కావున నాదినము పితరులకు ముఖ్యము. అమావాస్యను వారలకు చేయుడు స్వల్పక్రియలైనను అక్షయములుగా భావించి వారు తృప్తినొందెదరు......ద్వాపరమున నామె మీనయోనిం బుట్టి సత్యవతి యనబరగి తొలుత పరాశరు వీర్యమున వేదవ్యాసుని గని, పిమ్మట సముద్రాంశమున పుట్టిన శంతనునికి భార్యయై విచిత్రవీర్య చిత్రాంగదులను గొడుకులం గని యంత్యమున పితృలోకమున ప్రోష్ఠపద్యష్టక రూపమున అచ్ఛోదయను పుణ్యనది యైనది.

ఈ ప్రోష్ఠపద్యష్టకమండలము నంటి అచ్ఛోద నదీతీరమున పర్వతసాను వున్నది. దీనినే పాశ్చాత్యులు మెన్సా (Mensa) అనగా బల్లవంటిచదియగల పర్వతమండల (Table Mountain) మనుచున్నారు. అదే సానుమండలముగా పటమున చూపబడినది. దానినంటి అద్రికమండలమును, ఆప్రక్కనే వలమండలమును గలవు.

ఇవి పాశ్చాత్యులచే క్రమముగా డోరాడో, రెటిక్యులమ్ (Dorado, Reticulum) అని చెప్పబడుచున్నవి. ఉపరిచరవసువీర్యబిందుగ్రహణముచే ఈ అద్రిక గర్భము ధరించుటయు, సమీపముననున్న వలలో చిక్కుటయు, మానుషప్రసవమై మత్స్యరాజును (Hydrus) సత్యవతిని కనుటయు ఆదిపర్వము 3. 30 — 38 లో వర్ణింపబడినవిధము క్రిందటి భారతిలో చూచినాము.

ఐదువేల సంవత్సరముల క్రిందట ఉత్తరధ్రువము డ్రేకో (Draco) అనగా నరకాసురునిలోనుండుట ఆశ్వయుజమాస భారతిలో చూచినాము. అప్పుడీయద్రికా ప్రాంతము దక్షిణధ్రువమై యుండెను. కాలక్రమమున ధ్రువస్థానము మారి నేడు సిగ్మా ఆక్టెన్సు దక్షిణ ధ్రువముననున్నది. ఈధ్రువస్థానమునందలి మార్పులే సత్యవత్యుపాఖ్యానమున వర్ణింపబడినట్లు తోచుచున్నది. పౌష్ఠపదాష్టకమనగా విశ్వమునకుపృష్ఠమందు వెనుకభాగమునందున్న అష్టకరూపము (?) అని చెప్పవచ్చును. లేదా పౌష్ఠపదానక్షత్రము లనబడు పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములతో సంబంధము గల అష్టకము కావచ్చును. ఇందలి నక్షత్రపటములో ↑ గుర్తుచే చూపబడినభాగము భాద్రపదానక్షత్రముల సూచించును. మన నెలలో అమావాస్య మిక్కిలి యంధకారబంధురమైనదిన మైనట్లే ఖగోళమునం దీదక్షిణధ్రువప్రాంతములు అంధకార బంధురములై పితృలోకమని వర్ణింపబడినవి. దక్షిణసముద్రముపై సంచారముచేసినగాని యివి గోచరింపవు.

మత్స్యరాజమండలముదిగువను 'శరాలి' మండలమున్నది. ఇది యొకజాతి గృధ్రరూపము. దీర్ఘమును క్రూరమునైన చంచువుగల గృధ్రమునకు శరాలియని పేరు గలదు. పాశ్చాత్యులు దీనిని టూకన్ (Toucan) అందురు. It is a species of South American Picarian birds with immense beak అని ఛేంబర్సు నిఘంటువు. దీని కెదురుగా క్రౌంచమండలము గలదు. ఈపక్షులు పురాణప్రసిద్ధులగు విశ్వామిత్ర వశిష్ఠ ఋషు లన్యోన్యశాపముచే బొందిన రూపవిశేషములు.

"...హరిశ్చంద్రో విశ్వామిత్ర వసిష్ఠయోః,
యన్నిమిత్త మభూ ద్యుద్ధం పక్షిణో ర్బహువార్షికమ్."
(భాగ. నవమస్కంధము, సప్తమాధ్యాయము, 2 శ్లో.)

దీనికి వ్యాఖ్యానము వ్రాయుచు శ్రీధరాచార్యులవారు "విశ్వామిత్రో రాజసూయదక్షిణాచ్ఛలేన హరిశ్చంద్రం సర్వస్వ మపహృత్య యాతయామాస-తచ్ఛ్రుత్వా కుపితో వసిష్ఠోపి విశ్వామిత్రం త్వం భాసో భవేతి శశాప. సచ త్వం బకో భవేతి వసిష్ఠంశశాప. తయోశ్చ యుద్ధ మభూ దితి ప్రసిద్ధం."

విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని సర్వస్వ మపహరించుట విని 'నీవు గృధ్రమవగు'మని విశ్వామిత్రునికి వసిష్ఠుడు శాపమియ్యగా 'నీవు కొంగవగు' మని యతడు వసిష్ఠునికి ప్రతిశాప మిచ్చెను. ఈ యిద్దరును పక్షిరూపులై బహుకాలము పోరిరి. క్రౌంచమండలమును పాశ్చాత్యులు Apus అందురు. అనగా స్వర్గపక్షి (Bird of Paradise) యందురు. కనుకనే అది క్రౌంచమండల మనబడుచున్నది. క్రౌంచమండలమునకు ప్రక్కనే మయూరమండల మున్నది. దీనిని పాశ్చాత్యులు Pavo అందురు. ఉత్తర సప్తఋషి మండలమునకు అమరమున చిత్రశిఖండిమండలము అనుపేరు కనబడుచున్నది. అనగా నెమలి మండలమనుమాట. త్రిశంకుని నిమిత్తము విశ్వామిత్రుడు దక్షిణమున నొక సప్తర్షి మండలము సృజించునో యను ప్రశంస రామాయణమునందు గలదు. ఇదే దక్షిణనెమలి మండలము లేక మయూరమండలము. ఆదిగువనే బాణాసురుడు గలడు. అతడు మయూరధ్వజుడగుటయు, శ్రీకృష్ణునిచే పరాభూతుడగుటయు భాగవతప్రసిద్ధములు. పాశ్చాత్యు లీమండలమును Indus అనగా Indian మండల మనిరి.

క్రౌంచమునకు ప్రక్కనే దక్షిణ త్రికోణమండలమని (Triangulam) పాశ్చాత్యులనెడి యయాతిమండలమున్నది. పుణ్యము క్షీణించుటచే యయాతి పదభ్రష్టుడు కాగా అంతరిక్షమున తన దౌహిత్రులగు అష్టక, ప్రతర్దన, వసుమనప్రముఖులతో వెలుగుచున్నాడు.

వీరిప్రక్కనే మక్షికమండలము (Musca) కలదు. ఈమండలముప్రక్కనే ఋగ్వేదమునందు 'దైవీమ్ నావమ్' అని వర్ణింపబడినట్టియు, పాశ్చాత్యపండితులచే ఆర్గోనేవిస్ (Argo Navis) అనియు పిలువబడు నౌకామండలముయొక్క పృష్ఠభాగము (Keel) ఉన్నది. ఆప్రక్కనే వేదములనెత్తికొనిపోయి పరుగులెత్తిన సోమకాసురుడు గలడు. ఈచుక్కలగుంపునే పాశ్చాత్యులు వొలన్సు (Volans) అనగా ఎగిరెడి చేప (Flying fish) యందురు.

వీటికి దిగువను, పౌష్ఠిష్ఠక సమీపమున నృగుడున్నాడు. ఈనృగమహారాజు మొదట నొక బ్రాహ్మణునికి ఒక గోవును దానము చేసెను. ఆ గోవు ఆబ్రాహ్మణుని విడిచి యామహారాజుగోశాలను మరల చేరెను. అది తెలియక ఆగోవు నారాజు మరియొక బ్రాహ్మణునికి దానము చేసెను. 'నిలుకడ లేనివాడవు, ఊసరవెల్లివి కమ్మ'ని యాబ్రాహ్మణుడీ రాజును శపించెను. అందువలన నతడు నృగుడై నక్షత్రపథము జేరినాడు. ఇవి దక్షిణధ్రువప్రాంతమున గల చుక్కలగుంపులు.



మంగళగిరి, నృసింహస్వామివారి ఆలయపు తూర్పువైపు గాలిగోపురము

ఛాయాచిత్రకారుడు : అందే వీరాస్వామిగారు.

# ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్ట్

పి. ఆర్. రామచంద్రరావు గారు



ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టు

ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్ ఎలీనార్ రూజ్వెల్ట్ని—పెళ్లికి పూర్వంకూడా రూజ్వెల్టే ఆవిడ—ఎలీనార్ని పెళ్లి చేసుకున్నప్పుడు థియొడర్ రూజ్వెల్ట్ వధూవరులని ఆశీర్వదించడానికి వెళ్లేట్ట. ఓమారు దంపతులకేసి చూచి, "చాలా సంతోషించేనోయ్. నా మంచిపని చేశేవు. పేరు నిలువబెట్టేవు ఎలాగయితేనూ" అన్నాట్ట, ప్రెసిడెంటు థియొడర్. పేరుమట్టుకే కాదు, ప్రతిష్ఠన్నికూడా నిలువబెట్టేడు ఫ్రాంక్లిన్. ఆ "రూజ్వెల్ట్"లో మాహాత్మ్యం ఉంది. ఓమంత్రం.

ఫ్రాంక్లిన్ జీవితంలో విశేషాంశా లేవీ కనిపించవు. మామూలుగానే ౧౮౮౨ జనవరి ౩౦ని పుట్టేడు, న్యూయార్కులో. హార్వర్డులో బి. ఏ. పుచ్చుకున్నాడు, ౧౯౦౭ న. కొలంబియాలో ఎల్ ఎల్. బి. అయ్యేడు, తర్వాత. ప్రాక్టీస్ ఆరంభించేడు, ౧౯౦౭ కి. ౧౯౧౦ మొదలుకుని ౧౯౧౩ దాకా న్యూయార్కు సెనేటులో ఉన్నాడు. కాని ౧౯౧౩ ని సెనేటరుకి రాజీనామా ఇచ్చేడు, సహాయనౌకామంత్రిత్వం అంగీకరించేటందుకు. ౧౯౨౧ని పక్షవాతంవచ్చి అంగవైకల్యం సంభవించింది, రూజ్వెల్ట్ కి. ఆదెబ్బని ౧౯౨౮ దాకా జీవితం ఛిన్నమైపోయింది. ౧౯౨౮ ని న్యూయార్కు గవర్నరుగా నియమించేరు ఇతణ్ణి.

పుట్టుక—పెళ్లి—పక్షవాతం; ఇవ్వే కనిపిస్తోన్నయి ముఖ్యంగా. రూజ్వెల్ట్ ప్రెసిడెంటు అయ్యేడంటే హూవరు ప్రెసిడెంటు కాకపోవడంమూలాన్ని అయ్యేడు. అంతే. పరిస్థితులే రూజ్వెల్ట్ గెలుపుకి కారణం. ఓ ప్రెసిడెంటు ప్రభుత్వంలో ౧౦,౦౦౦,౦౦౦ గురు నిరుద్యోగులై ఉంటో ధాన్యంగోనెడు ౧౦ సెంట్లకి లోపుగా వెలుతోంటే మళ్లీ ప్రెసిడెంటు ఎలా అవుతాడా ప్రెసిడెంటు? ఏ మొహం పెట్టుకొని? అల్లానే అన్నారు అమెరికాలో అందరూ. "నీమూలాన్ని దేశంలో ధనం తరిగిపోతోంది. మా శేనా, ఎందరు పనిపాట్లేక ఏడుస్తోన్నారో. అంతకీ నువ్వే కారణం" అన్నారు హూవరు కేసి. అటువైపుని కొలంబస్‌లో నుంచుని ఆగస్టు, ౨౦ని రూజ్వెల్ట్ అన్నాడు: "నిజం చెప్పేరు. అంతకీ హూవరే కారణం. కాకపోతే మన దేశంలో ఎప్పుడూ లేని ఈఆర్థికసమస్యేవిటి? పైపెట్టు 'దీని కంతా ఇతర దేశాలే కారణం. మన మేం చెయ్యగలం? ప్రపంచవ్యాపారం స్తంభించిపోతోంది' అంటోన్నాడు హూవరు, తప్పు తనలో పెట్టుకుని. ఛీఛీ. ఇలారండి. మరోమాట. ఈమద్యపాననిషేధం ఏవిటి? ఎన్నాళ్లుండగలం ఇలా నోళ్లు కట్టుకుని" అంటో. ఆక్రందనధ్వనులతోటి వెళ్లిపొయ్యారు జనులంతా రూజ్వెల్ట్ పక్షం. రూజ్వెల్ట్ కి ౭,౦౦౦,౦౦౦ల మెజారిటీ వచ్చింది. బిక్కమొహం వేసుకుని హూవరు

అన్నాడు: 'అభినందనాలోయ్. నా సాహాయ్యం మట్టుకు ఇస్తోంటాను అభ్యంతరం లేకుండా' అని.

౧౮౫౬ అయ్యాక మూడవ డెమొక్రాటిక్ ప్రెసిడెంటు రూజ్వెల్ట్. Civil War తోటి అమెరికాలో డెమొక్రాటిక్ పార్టీకి ఓఉద్దేశ్యం, ఓసూత్రం, ఓనీతీ అంటూ లేకపోయింది. కేవలం అధికారంలోకి రావలెనని కుతూహలపడే ఓసంఘంగా పరిణమించింది. అంచేతే గడచిన ౧౨ ఏళ్లూకూడా ఓ డెమొక్రాటిక్ ప్రెసిడెంటు అయినా లేడు.

ఈ ఎలెక్షన్ ఫలితాన్ని రూజ్వెల్ట్ కి Electoral College లో ౫౩౧ వోట్లకీ ౪౭౦ వోట్లూ, Senate లో ౧౦, House of Representatives లో ౧౦౦, మెజార్టీ వచ్చేయి. రూజ్వెల్ట్ గెలుపు అన్నివిధాలా మంచిదే. Congress ఎల్లాగూ డెమొక్రాటిక్ గా ఉంటోన్నప్పుడు, దాంతోటి ఏకీభవించే ప్రెసిడెంటు ఉండడమే అమెరికారాజ్యాంగవిధానంకి శ్రేయం. కాని రూజ్వెల్ట్ ఎల్లాగ పరిపాలనా విధానాన్ని సాధించగలడు?— ఈప్రశ్నపైనే ఆధారపడిఉంది, అమెరికా భావిజీవితం, దాంతోటి ప్రపంచసౌఖ్యమూ.

రూజ్వెల్ట్ చేయపూనుకున్నదీ, ముఖ్యంగా కనపడుతోందీ మద్యపాననిషేధసవరణ చట్టమే. దీంతోటి గవర్న్మెంటుకి ౭,౦౦౦,౦౦౦ పౌన్లు నెల ఆదాయం వస్తుందిట, ప్రతిపైంటు బీర్ కీ ౧౩ పెన్నీల పన్ను వేస్తే. అందుకోసమై "మత్తు కలుగజేసే పదార్థాల" అన్వయం సవరించి, బీరూ, light వైనూ, అల్లాంటివి కావని తేలుస్తారు! అందుమూలాన్ని ఆర్థికసమస్యనీ, మద్యపానసమస్యనీకూడా తేల్చినవారవుతారు. ఓప్రభుత్వం ఓదేశాన్ని త్రాగించి, ఆత్రాగుడుపైని పన్నుతో కాలక్షేపం చెయ్యడం సవ్యం గాదూ మరి?

ఎలెక్షన్లలో రూజ్వెల్ట్ ఢంకా వాయించిన 'Nine-point Program' అంతాకూడా అమెరికా ఆర్థికపరిస్థితులని బాగుచేసేటందుకే. రైతులకీ, నిరుద్యోగులకీ పనులు—కట్టడాలు, అల్లాంటివి—కల్పించి, వాళ్లని పోషించటం, బ్యాంకుల్ని ఇంకా బాగా తనిఖీచెయ్యడం, మారకాన్ని ఎల్లాగో బాగు పరచటం, Speculationని తగ్గించడం, తక్కినవి. కాని బడ్జెటుని బాగుపరచటానికీ, నిరుద్యోగులకి గవర్న్మెంటు పనులు కల్పించటానికీ పొందిక కనిపించదు. కాకపోతే పన్నుల్ని హెచ్చించాలి. ప్రస్తుతస్థితిలో అమెరికా హెచ్చుపన్నుల్ని సహిస్తుందని తోచదు.

హూవరుప్రభుత్వం ఎప్పుడూ League తోటి సహకారసూత్రాన్నే అవలంబించేది. కాని అమెరికా ఎప్పటికీ ఇటూ అటూ కూడా కాక League ప్రాంగణంలో ఓ ఆడుసింగమల్లే పచారు చేస్తోంది. ఈ త్రిశంకుత్వం అన్నిపార్టీలకీ చిక్కే—ముఖ్యంగా ఈ చీనా-జపాన్ సంఘర్షణలో. పైపెట్టు Congress ఆమోదిస్తేనే గానీ ప్రెసిడెంటు ఏం చెయ్యడానికీ అసమర్థుడే. పూర్వం ౧౯౧౯ ని Versailles ఒడంబడికలో విల్సన్ చేసిన సంతకం అధికప్రసంగం అంది Congress. "విల్సన్ మా ఏజంటుమట్టుకే. హద్దుమీరి ప్రవర్తించే" డంటూ. అంచేతే రూజ్వెల్టు భావిప్రవర్తన్ని నిర్ణయించటం కష్టం. కాని ౧౯౩౨ ని "శాంతిసాధనాల్లో మహత్తరమయింది League" అని రూజ్వెల్టు అనడాన్ని కొంత ధైర్యం హెచ్చుతోంది.

ప్రస్తుత వాణిజ్యస్తంభనకి కారణం బంగారం అంతా అమెరికా భాండాగారాల్లోకి వెళ్లిపోవడమే అన్న విషయం విదితమే అందరికీ. ఆర్థిక పునరుజ్జీవనానికి అమెరికా చెయ్యగల ఉపకారం తన tariff ని తగ్గించి పరస్పరవ్యాపారాన్ని ప్రోత్సహించడం. ఇందుమూలాన్ని అంతర్జాతీయ వ్యవహారం బాగుపడుతుంది కాస్త. కాని, ముఖ్యంగా అమెరికా ప్రపంచానికి చెయ్యగల సహాయం మళ్లీ వెండిని చలామణి చెయ్యడం. అంటే వెండికి ఆర్థికస్థితి నివ్వడం.

ఏం చేస్తాడో రూజ్వెల్టు?

మరోమాట. ఎలీనార్ రూజ్వెల్టుకి సరదాలు చాలా ఉన్నాయిట. ఆవిడకి చక్కగా అయిదుగురు బిడ్డలూ, వాళ్లకి మరి ముగ్గురూను. ఓ Furniture ఫ్యాక్టరీ ఉంచుతోందిట. ఓ పిల్లలపత్రికకి సంపాదకురాలు కూడా. వారానికి రెండురోజులు ఓ న్యూయార్కుస్కూల్లో కాస్త ఇంగ్లీషూ, చరిత్రా చెబుతుందిట.



## గురజాడ అప్పారావుపంతులు

అప్పారావు మహాకవి. అతని గ్రంథాలు శతాధికాలు కావు గాని అన్నీ సానలు తీరిన జాతిరత్నాలు.

అప్పారావుభావుకత్వాన్ని గ్రహణశక్తి కలవారిలో కొంతమందే యెరుగుదురు. చాలామంది యెరక్కపోవడానికి కారణం మిక్కిలి చిన్నదే; అయితే చాలా బలమయింది.

అప్పారావు కన్యాశుల్కం సరికొత్త సరుకు. వీరేశలింగంపంతులు నవీనవాఙ్మయ నిర్మాతయే; గాని అతని వాఙ్మయం పాఠకలోకానికి కన్యాశుల్కాన్ని చక్కగా పరిచయపరపజాలేటంతటిది కాలేకపోయింది. పైగా—

అప్పారావుపేరు మొదట కవిగాకంటె వ్యావహారికభాషావాదిగా ప్రఖ్యాతి పొందింది. పండితులు చేసిన ప్రతివాదాలూ, పత్రికలు చేసిన విమర్శనలూ అక్షరాస్యుల కందరికీ అతన్ని పరిచయపరిచాయి. తరవాత కన్యాశుల్కమూ, ఖండకావ్యాలూ, చిన్నకథలూ, మాటామంతీ వ్యాసపరంపరా రసికుల హృదయాలమీద అతని పేరు అచ్చుగుద్దేశాయి.

అప్పారావు పోరాచమహారాజుకి ప్రయివేటు సెక్రటరీగా కాక స్వతంత్రుడై వుంటే యింకా యెన్ని మహాగ్రంథాలు రచించివుండునో. ఆంధ్రవాఙ్మయానికీ, ఆమూలాన్ని ఆంధ్రసంఘానికీ యింకా యెంత వికాసం కలిగించి వుండునో.

అప్పారావుమృతివల్ల అతని జీవలేఖిని గళితమై పోవడమే కాదు; అనేకమంది నవకవులకు కావలసిన మంచి వరవడి అసంపూర్ణమై పోయింది.

అప్పారావురచనల్లో పెద్దదీ, ప్రధానమూ అయిన కన్యాశుల్కం నాటకమా ప్రహసనమా? ఇది అనవసరప్రశ్న. ఏమంటే? ఆగ్రంథాన్ని గురించి యోచించతగ్గ ప్రధాన విషయం యిది కాదు. అందులో కవిత్వం వుందా లేదా, వాఙ్మయపిపాసువు లాస్వాదించడాని కందులో రసం వుందా లేదా?

అప్పారావురచనలు చేతబట్టి శబ్దరూపాలు మాత్రమే పరిశీలించేవాడు రసికుడు కాడు; పండితుడూ కాడూ; చివరికి వాఙ్మయం అంటే అభిరుచి కలవాడుకూడా కాడు.

అప్పారావు వాస్తవంగా ఆంధ్రవాఙ్మయాకాశం మీద ధ్రువతార. అది అనశ్వరంమాత్రమే కాదు; మార్గదర్శకం కూడాను.

నేడు కుమారకవిసింహాల్లో అప్పారావుని అనుకరించేవా రనేకు లున్నారు. అప్పారావు రచనల మాధుర్యా న్ననుభవించే రసికులుకూడా చాలామందే వున్నారు. కాని ఆమహాకవిని గౌరవించడానికి ఒక శిలావిగ్రహప్రతిష్ఠాపనం లేదు; వొకతైలచిత్ర ప్రదర్శనమేనా లేదు; చివరికి, నలుగురూ వొకచోట కూచుని అతని భావుకత్వాన్ని స్మరించుకోడమేనా లేదు.

మొన్నమొన్న కళాసమితివారు మాత్రం చిన్నయెత్తుమీద రాజమహేంద్రవరంలో వొక స్మృతిసభ జరిపారు.

మొత్తానికి మనలో అకార్యకరణమే గాని కర్తవ్యనిష్ఠ తక్కువ; ఉద్రేకమే గాని ఉత్తేజనము తక్కువ; అనుకరణమే గాని స్వయంనిర్ణయం తక్కువ.

గురజాడ అప్పారావుపంతులు ఆంధ్రవాఙ్మయంలో కొత్తపోకడలు చూపిన ధీశాలి. అతన్ని మనం మరిచిపోతే అది చాలా దౌర్జన్యంలో చేరిపోతుంది.

—శాస్త్రి.

---

# నా ప్రియురాలి నవ్వు

బొడ్డు బాపిరాజు గారు

ఆది మధురాధరాధరతటాంచలమందు సుధాప్రవాహంబులో
నుదయమునొంది తొల్దొలుత, నుబ్బి కపోలము లాక్రమించి నె
మ్మది గల నూతనప్రణయమాధురి జూపు కటాక్షపంక్తి సం
పదలు వెలార్చి వెన్నెలలు ఫాలమునం జెలరేగ నర్తిలున్.

ఆవిమలప్రఫుల్ల దరహాస విలాసములన్ మనోజ్ఞ సం
భావన లేవినిల్చినవొ! మాటికిమాటికి నాయెడంద గ్రోం
దీవల లేతవేకువల దేలిన పూవుల తేనె గ్రోలి మో
దావశమైనయట్టి సరసాళివిధంబున జొక్కిపోయెడిన్.

నాసతి భాసమానవదనమ్మున జిప్పిలు నిష్కళంక రా
గాసవ మాను మత్తహృదయం బాకరవ్వయు దృష్టి లేక పే
రాస సదాసఖీమధురహాససుధారసవీచికా సము
ద్భాసితడోలికాళి సుపథంబును ముట్టుచు నూగగోరెడిన్.

సకలమ్ము నానందసరసిలోఁ దేలించు పండువెన్నెలతేట నిండుచలువ;
తొలిసంజవేళ రేకులు విప్పి తేనెలు గ్రుమ్మరించెడి పూల కమ్మదనము;
ఒకదానివెనుక వేఱొకటిగా బయనించు సెలయేటి తరగల జెలగుసొగసు;
'జలజల' మంచు వెన్నెలరేల గురిసెడి మంచుముత్యాలలో మించుమురువు;
తావు గొన్నవొ ఆకావిమోవితుదల! - రమణి దరహాసరేఖావిలాసములను
గాంచి ముగ్ధుండనై యంతకన్న జగము - వేఱ లేదని నన్ను నే విస్మరింతు.

వెలదిమధురాధరాధర బింబమందు - జెలువ మొలికించు వెలదివెన్నెలల తళుకు
నవ్వులను దాటి సొగసుల నివ్వటించు - పల్కుదురుమల్లికాహారభంగి నెసగు.

కలముల నీను సోయగపుగన్నుల దొల్కుమనోజ్ఞహాసరో
చులు, విచలించులోలకుల చొక్కపుదీప్తులు మేళవింప గ్రోం
దళుకులు చిమ్ము నెమ్మొగము నాహృదయాంతరవీథి నెల్లవే
ళల నెడబాయకుండు మధురప్రణయస్మృతు లెన్నొ రేపుచున్.

పువ్వు లనేకవృంతముల బుట్టుచునున్నవి నేడు; తావులన్
నివ్వటిలన్ జగమ్ములను నించుచునున్నవి; రేపు కంటికిన్
దవ్వయి రాలిపోవు వసుధాస్థలి నాప్రియురాలి దళ్కులే
నవ్వులపువ్వులో వికసనమ్ముల నిత్యమనఃప్రియంబులౌ.

---




సంక్రాంతి భిక్ష






శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావుగారు (ఛత్రపురం)

తాము రచియించిన 'ఖిల్జీ రాజ్యపతనము' అను నాటకమున ఖిల్జీ రాజకుమారుని పాత్రమున.







శ్రీ డి. వి. వరహాలు శెట్టిగారు

ఆంధ్ర విశ్వవిద్యాలయమున యం. బి., బి. యస్. అను వైద్యపట్టమును సంపాదించిన వైశ్యవర్యులు.






శ్రీమతి రెడ్డి లక్ష్మమ్మగారు

ఈ పత్తికొండతాలూకా పెంచికల్లు గ్రామవాస్తవ్యులు. కర్నూలు జిల్లాబోర్డు సభ్యురాలుగా నెన్నుకొనబడిరి. మరియు 4 సంవత్సరములనుండి బీదబాలురకొరకొకాలయ మొకటి విద్యార్థివేతనములు సహా యిచ్చి పోషించుచున్నారు. నవీనపద్ధతుల ననుసరించి సంఘసేవయు చేయుచున్నారు.



శ్రీమతి యస్. ఈ. జే. జకరయ కన్యగారు,

బి. ఏ., యల్. టి.

'ఉపకంటు', స్త్రీల ట్రెయినింగు పాఠశాల, మంగళూరు.




## కరవు కాలపు కళాశాల

రానున్న ౧౯౩౨-౩౩-వ సంవత్సరమున విద్యార్థులు పలువురు ధనవ్యయమును భరింపజాలక ప్రకృతపు కళాశాలలలో చదువును సాగించుకొన జాలకుందురు. అట్లే సమర్థులగు నుపాధ్యాయులును పలువురు నిరుద్యోగులు కాగలరు. కావున పరస్పరాశ్రయలాభమున సఫలతను గాంచగల యీయుభయబృందములలో కొందరు తాత్కాలికముగ నీకళాశాలయందు జతపరుపబడుదురు.

ఈ కళాశాలను నెలకొలుపుటకు, ఆస్తి, విరాళములు మొదలగున వేవియు లేవు. ఒక సంవత్సర కాలము చదువునకు, భోజన నివాసములకు ఒక్కొక్క విద్యార్థి యీయవలసిన ౨౫౦ డాలరులధనముతో నిది నిర్వహింపబడును. ఇందుపాధ్యాయులకు జీతము లేదు. భోజన—నివాసములకు మాత్రము సౌకర్యములు కలిగింపబడును. విద్యార్థుల గదులకు అద్దె నెలకు ఏబది సెంట్లుండును.

విద్యార్థుల కిడు భోజనమునకు సైనికుల పద్ధతి ననుసరించి దినమునకు ఏబది సెంట్లకు మించిన వ్యయము కాజాలదు. విద్యార్థులే తమగదులను జాగ్రత్తపరుచుకొనవలెను. వడ్డన, పాత్రలు కడుగుట మొదలగు పనులు వంతుల ప్రకారము తామే చేసికొనవలయును. ఇట్లయిన ప్రకృతము కళాశాలలలో నయ్యెడు వ్యయమున మూడవవంతు మాత్రమే కాగలదు.

మంచి అనుభవము, సామర్థ్యము గల యుపాధ్యాయులొక యిరువది మంది దరఖాస్తుల నపుడే అంపుకొనియున్నారు. ఈ కళాశాల కొరకు వాషింగ్టను (D. C.) నగరమునకు డెబ్బదిమైళ్ల దూరమున, పోర్టు రాయల్ (వర్జినియా) నందు 'రప్పహాన్నకు' నదియొడ్డున నొక ప్రశాంత సుందర ప్రదేశము సంపాదింపబడెను. సముచితమగు గ్రంథాలయ మొకటి కళాశాలకు లభింపనున్నది. విద్యాభివృద్ధికాములుగను, ప్రజాహితైషులుగను మిక్కిలి పేరునకెక్కిన నాయకులు పలువురీనూతనోద్యమమును లెస్సయామోదించిరి.

ఏబండ్ర మొదలు నూర్గురవరకు విద్యార్థులు ఏడాది చదువునకు ౨౫౦ డాలరులకు తక్కువకాని ధనమును వ్యయింప సంసిద్ధులుగ నున్నవారు లభించిన వెంటనే యీ కళాశాల ప్రారంభము కాగలదు.

*　　*　　*　　*

ప్రపంచము దారిద్ర్య భూయిష్ఠమయి యున్న యీకాలమున మామూలు కళాశాలలయందు చదువుటకు చాలినసొమ్ము లేని వారికొరకయి ఈక్రొత్తమాదిరి కళాశాలను స్థాపింప 'న్యూ రిపబ్లిక్' అను పత్రికయందొకలేకరి పైసూచనలు చేసెను. ఈ పద్ధతి చాల బాగుగ నున్నది. విద్యాభివృద్ధికి చాలినంత అవకాశములేని భారతదేశమున నిట్టి అల్పవ్యయమున సాగింపగల కళాశాలల కెన్నింటికే నావశ్యకత కలదు.

---



౧. ఇంట మగవారు లేనిసమయమున ఆడువారు చేయుపనులను, చెప్పుమాటలను, గమనాగమనములను సరిగా గుర్తించి యట్టులటులే వివరించు విద్యుద్యంత్రము.



౨. ఆడువారి గమనాగమనముల గుర్తించునది యీ సాధనమే.

G. S. A.

## మేకలను తిను రామచిలుకలు




### నైషధప్రయోగ విమర్శనము

శ్లో. రవైర్గుణాస్ఫాలభవైః స్మరస్య
స్వర్గాధకర్ణౌ బధిరావభూతాం,
సుగోత్రశ్శృణోతు స్మరమోహనిద్రా
ప్రబోధ దక్షాణి కిమక్షరాణి.

సం. నైషధము, 8. ౬౮.

మన్మథుఁడు తన ధనుష్టంకారముచేత దమయంతి పై మోహము గల యింద్రునిఁ జెవిటివానిఁగాఁ జేసెను. ఇటుపైని బృహస్పతి కాముకికారములకు లోను గాఁగూడదని బోధించెడి నీతిశాస్త్రములు మహేంద్రుఁ డెట్లు విను నని భావము.

దీనికి ప్రకృతము ముద్రింపఁబడిన ప్రతిలో ఆంధ్రీకరణము ఇట్లున్నది.—

పుష్పధనుర్లతా మధుప
  పుంజగుణక్వణనం బొనర్చి వా
స్తోష్పతి కర్ణముల్ మనసి
  జుండు చెవుష్పడఁజేసె నక్కటా
గీష్పతి యేమి చెప్ప నిట
  గ్రింద బలారికిఁ గామవిక్రియా
దుష్పథవృత్తికిన్ మనసు
  దూర్పమికై బహు నీతిశాస్త్రముల్.
    శృంగారనైషధము, 4. అ.

ఈపాఠములో అర్థము సరిగాఁ గుదురకపోవుట చేత శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారు మూఁడవ పాదములో, "గీష్పతి యేమి చెప్పె నిటఁ గ్రింద" అని దిద్ది, "ఇటన్ = ఈ స్త్రీలోలత విషయములో, క్రిందన్ = ఇంతకు పూర్వము, బలారికిన్ = ఇంద్రునికి, కామవిక్రియా దుష్పథవృత్తికిన్ = కామవికార మనెడి చెడుమార్గమందు వర్తించుటకు, మనసు దూర్పమికై = మనస్సును ప్రవేశపెట్టకుండుటకై, బహు నీతిశాస్త్రముల్, ఏమి చెప్పెన్,—నీతులు ఎన్ని యేనియుఁ జెప్పి నాఁడు కాని అవి సమయమునకు అక్కఱకు రాలేదు" అని టీక వ్రాసిరి. వీరి టీకలో పూర్వమందు బృహస్పతి యింద్రునకు బహునీతులు చెప్పినట్లును అవి యిప్పు డుపయోగింపనియట్లును కనఁబడుచున్నది. చెవుడు లేనియప్పుడు వినిననీతులు చెవుడు పట్టినతరువాత మఱపు నకువచ్చునను టలోకవిరుద్ధము. మఱచుట మఱవకుండుట యనునవి మనోధర్మములు గాని శ్రోత్రధర్మములు కావు గదా. మూలములో బృహస్పతి చెప్పుచున్నను ఆ వాక్యములు చెవుడుపట్టిన ఇంద్రునకు వినఁబడుటలేదని సరసముగాఁ జెప్పఁబడియున్నది. పూర్వము చెప్పుటయు చెప్పకపోవుటయు ప్రస్తుతవిషయములు కావు. బధిరత్వము గలిగినపిమ్మట జరిగినవిషయమే యిచ్చటఁ బ్రతిపాదింపఁబడవలయును. అభిప్రాయములోనైనను వీరి పాఠాంతరమును టీకయును గూడ మూలమున కనుగుణముగాఁగాని యుక్తియుక్తముగాఁగాని యున్నట్లు గోచరింపదు. మఱియుఁగొన్ని వ్రాతప్రతులుచూడఁగా ననేక విధములుగాఁ బాఠాంతరము లున్నవి. కాని అవియుఁ గూడ నిట్టివే యైయున్నవి. ఇవియన్నియును మూలాభిప్రాయమునకు దూరములును అనన్వితములును అగుటచేత నాకు సంశయముకలిగి సవిమర్శముగా నాలోచింపఁగా, "గీష్పతి యేమి చెప్ప నిటక్రింద" అనుపాఠ ముండియుండ వచ్చునని తోఁచెడిని. ఇందుఁగల గుణము రసజ్ఞులు గ్రహింపెదరుగాక.

ఇటక్రిందన్=ఇటుపిమ్మట, ఇతఃపరము, బృహస్పతి యింద్రునకు బహునీతిశాస్త్రము లేమిచెప్పును— అని యర్థము. అనఁగా ఇంద్రుఁడు బధిరుఁడై యుండఁగా అతనికి ఎంతచెప్పినను చెవిటివానికడ శంఖ మూఁదినట్లు నిష్ఫల మగుటంజేసి బృహస్పతి చెప్పఁ జాలఁడని భావము. మూలములో, ఇంద్రుఁడు బధిరుఁడైనాఁడు కావున బృహస్పతి చెప్పెడి నీతివాక్యములు ఎట్లు వినఁగలఁడు—అని యున్నది. ఆంధ్రీకరణములో, ఇంద్రుఁడు బధిరుఁడై యున్నాఁడు కావున వానికి బృహస్పతి నీతివాక్యము లెట్లు చెప్పఁగలఁడు—అని యున్నది. ఇందు వాక్యభేదమే కాని అభిప్రాయభేదము లేదు. బృహస్పతి చెప్పలేకుండుట గాని ఇంద్రుఁడు వినలేకుండుట గాని ఇంద్రునకు బాధిర్యము కలిగిన తరువాతనే జరిగినవి. ఆంధ్రీకరణమూలములలో చెప్పిన పైరెండువిషయములు మాత్రమే బధిరునియెడ కనఁబడియెడిని. అవి రెండును ఇరువురచేతను గ్రహింపఁబడినవి. శ్రీనాథుఁడు మూలములో నున్న పదముల చొప్పుననే పోవక, వేఱుమార్గమునఁ బదము లుపయోగించి మూలములో బధిరునకుఁ జెప్పఁబడిన "శ్రవణాశక్తత"ను విడిచి బధిరునకు "ఇతరులు చెప్పఁజాలకుండుట" యను మఱియొకరీతి గూడ కలదని లోకమునకుఁ దన లోకానుభవమును బహునిపుణముగా వెల్లడించుచు మూలాభిప్రాయముతో నేకీభవించినాఁడు. ఇంక క్రిందుశబ్దమునకు—పైపంక్తి, క్రిందిపంక్తి—ఆక్రిందిపంక్తి—మొదలగులోకవ్యవహారములవలన ఆనంతర్యార్థము సిద్ధించియే యున్నది. కావున ఈపాఠము యుక్త మనియును విశేషము లున్నయెడలఁ బ్రాజ్ఞులు తెలిపెదరనియును విశ్వసించుచున్నాఁడను.

పి. చిదంబరశాస్త్రి.

కీ. శే. సర్ బయ్యా నరసింహ శర్మగారు





భద్రాద్రి స్నానముల రేవు

శ్రీ దమ్మేటి గోపాలరావుగారు తీసిన ఆకస్మిక ఛాయాచిత్రము.

 ది. వేం. అవధాని గారు

## ౩. బ స వే శ్వ రు డు

(బసవేశ్వరుడు బిజ్జలునిమంత్రి; శుద్ధవీరశైవుడు. రాజాజ్ఞలేకయే ఖజానాలోని సొమ్మంతయు నొక మిండజంగమదేవరకు దాన మొనరించినాడు. తంత్రము పన్ని మిగిలిన మంత్రులు రాజుతో ఈసంగతి చెప్పినారు.)

మంత్రులు—

స్వామి, చెప్పిన కొండెమౌను మఱి చెప్పంజూడకున్న న్నిజ
స్వామి ద్రోహ కఠోరపాతకము సంప్రాప్తించు నాసర్వథా
సామీచీన్యవినాకృతమ్ము బసవస్వాతంత్ర్య మోర్వంగ లే
మేమంచు న్వశదీకరింతుము తదీయోష్టానుకృత్కర్మముల్.

మేము వచించుసంగతులమేలు దలంపదు మిండజంగమ
స్వామి యొకండు నే డడుగవచ్చిన కోశధనమ్ము సర్వమున్
ప్రేమము మీఱ దాన మొనరించె యథేచ్ఛగ నింక భూప్రజా
క్షేమము నేవిధాన బరికింపగలార మొ భూభృదగ్రణీ!

బసవనిగూడి రాజ్యపరిపాలనము న్నవరించు టెన్నడుం
బొసగదు, చేతగాక సచివుల్ మసిచేసిరి రాజ్యమన్న వె
క్కసమగునింద కేము గుఱిగా బనియేమి? మఱొండుకొల్వునన్
మసల దలంతు మోయధిప, మా కటుచేయ ననుజ్ఞనీయవే.

బి జ్జ లు డు—

మించిన వేడ్క నొక్కమిడిమేలపు మిండనికై వసమ్ముగా
వించితివంట కోశగతవిత్తము సర్వము మాయనుజ్ఞ ప్రా
పించకమున్నె రాజ్యము విభిన్నము చేయదలంచితే మమున్
వంచన చేసి, నీదుసచివత్వము చాలును జాలు మా కికన్.

గడుసరి మంత్రినై ప్రజలకష్టసుఖమ్ము లెఱింగి రాజ్యము
న్నడపెడి ధీవిశారదుని నన్నవనీపతి శిక్ష సేయనో

పడుగద యంచు నీమనసువచ్చినతీరున గోశమంతయున్
వడివడి గుల్ల చేసి నను నాశ మొనర్ప దలంప బాడియే.

బసవనిబాసయండ్రు పరభాగ్యము లొల్లమి చాలు జాలు నీ
పస దెలిసెం ద్వదీయుల కపారధనాకరమైన నాదు బొ
క్కసమును స్వార్థముంబలె నఖండముదంబున బంచిపెట్టి పై
శస మొనరింప నెంచితివి సజ్జను లిట్టితెఱంగు మెత్తురే.

గౌరవపాత్రమైన యధికారమునం గయిసేసి రాజ్యపుం
భారము నీపయి న్విడిచి వైచినయందుకు మంచిమేలు చే
కూరిచినాడ వింత యనుకో బనియేమి మదీయవిత్తభం
డారము నింపి నీమనసు నచ్చినచోటికి బొమ్ము వేగమే.

బసవడు—(తనలో)

ఈశ్వర, పాలితనాకా-ధీశ్వర, తుహినావనీధరేశ్వరతనయా
త్మేశ్వర, పరితోషితమా-నీశ్వర, నను భక్తు గరుణ నీక్షింప గదే.

నేమము మీర నీచరణనీరజముల్ భజియించు జంగమ
స్వామి యొకండు నన్నడుగవచ్చిన లేదనలేక ధారుణీ
స్వామి యనుజ్ఞ పొందకయె సర్వధనమ్మును ధారవోసితిన్
భూమివిభుండు కోపసరిపూరితు డయ్యెడి నేమి సేయుదున్.

నాకడ నొక్కపైసయయినం గనుపట్టదు, భూవిభుండు నా
పైకము దెమ్మటంచు బలవంతము చేసెడి, నీయకున్నచో
జేకురు గౌరవాత్యయము శీతమయూఖకళావతంస! నీ
వే కరుణింప కేవిధి నుపేక్షయొనర్చిన దిక్కు గల్గునే.

పంచినవేడ్క నీచరణపద్మములే గతియంచు నమ్మినా
డం బరమేశ, నీదగు కటాక్షసుధారస మింత చిల్క గా
లం బరుదెంచె నేసిలిగులం బడకుండగ నన్ను గాచు భా
రం బది నీదకాదె గిరిరాజసుతాహృదయేశ్వరా, ప్రభూ!

శర్వ! ధనమ్ముసర్వము నొసంగితి నగ్గడ తేర్ప భక్తసా
పర్ణశాఖి వీవె గలవంచు ధరేశ్వరుకోశమున్ యథా

పూర్వముగా ననంతధనపూరితముం బొనరించి దృగ్ద్వయీ
పర్వము జేసి భక్తపరిపాలనదక్షతచూపు మో ప్రభూ!

(అమలమనీష దానె గతియం చెదనమ్మి నుతించు భక్తస
త్తముని మొ ఱాలకించి దయదాల్చి మహేశ్వరు డార్తరక్షణ
క్షము డవనీవిభుండు బరివిస్మితసభ్యులు జూచుచుండ గా
నమితధనమ్ములం గురిసె నద్భుతభంగి నమాత్యుముందటన్.)

బ స వ డు—

కరుణాపూర్ణుడు భక్తవత్సలు డనంగధ్వంసకస్వామి నన్
బరిరక్షించుచునుండ నేకొఱత సంప్రాప్తించు భండారపున్
సొరుగు ల్నింపుకొనంగ జూడు మిదిగో సొమ్మంతయుం దెచ్చితిన్
ధరణీవల్లభ, నన్ను నీఋణపరిత్యక్తాత్ము గావింపవే.

బి జ్జ లు డు—

కలుషస్వాంతులు మంత్రు లీర్ష్య నెదియో కాపట్య మూహించి ని
శ్చలభక్తిప్రథితు న్నినుం దెగడి మత్స్వాంతమ్ము నత్యాగ్రహా
విలముం జేయుట గ్రిందుమీ దరయ కే బీడించితిన్ నిన్ను నా
వలనం గల్గిన నేరము న్సయిచి సంభావించు మంత్రీశ్వరా!

అనఘ మదీయదోషముల నన్నిటి సైరణ జేసి మంత్రివై
మునుపటిపోలె ధర్మగతిపొంకము దప్పకయుండ రాజ్యర
క్షణ మొనరించుచుం బ్రజ లఖండరమావిభవోజ్జ్వలాంగులై
ఘనసుఖమందుచు న్మనెడునట్లుగ జేసి యనుగ్రహింపవే.

---




కాలమానమునందు పుష్యమాసము మనోహరమై సకలసౌకర్యములకును నాకరముగ నున్నది. ప్రకృతిసిద్ధమైన పుష్యమాస సౌకర్యములకు క్రిస్టుమసు పండుగలు జతపడి ప్రజాప్రవృత్తియందు నూతనోత్సాహమును గలుగ జేయుచున్నవి. దేశమునందంతటను వేడుకలు, వినోదములు, సభలు, ప్రదర్శనములు ప్రజాహృదయము నాకర్షించుచున్నవి. సుందర శాంతి భావభరితము లైన నూతన సంవత్సరాభినందనపత్రములు సర్వత్ర ప్రత్యక్షము లగుచు ధర్మసంస్మరణమును జేయుచున్నవి. ఈపర్వసమయమునందును శ్రీమంతుల యానందముతోపాటు దరిద్ర నారాయణుల దుఃఖమును ప్రత్యక్ష మగుచున్నది.

ఆదినుండియును జిజ్ఞాసువులు, తత్త్వజ్ఞులు, శాస్త్రజ్ఞులు, కళాకోవిదులు, కవులు, రాజ్యాధికారులు, మతాచార్యులు, ధీరులు, వీరులు మొదలగు మహాపురుషులు దుఃఖనివృత్తికిని, సుఖప్రాప్తికిని జేసిన ప్రయత్నములును, ధర్మ నిర్ణయములును నీమహాసమస్యను ఎంతవరకు సాధించినదియును ఎప్పటి కప్పుడు విచిత్రవేదముగను గనుపడు చుండును. ప్రపంచావృతము లైన సిద్ధాంతము లన్నియును ఎప్పటికప్పుడు తరణోపాయములుగను గనుపడినను దేశకాలావరణములందు పరివర్తనమును బొందుచు కాలతరంగములందు నిర్వీర్యము లగుచున్నవి.

ప్రకృతి స్వరూపములవలెను ప్రకృతి శక్తియును ననుక్షణమును రూపభావపరిణామమును బొందుట సహజధర్మము. సహజధర్మసిద్ధమైన రూపపరిణామమును భావపరిణామమును భయవిభ్రాంతులను గలుగజేయుచు ప్రపంచమునందు సంక్షోభమును గలుగజేయుచున్నవి. సంజాతమైన మృత్తునకు మృత్యువును, మృతమైన మృత్తునకు పునర్భవమును రూపపరిణామములు. భావరూపపరిణామమయమైన జగత్తునందహంకారము గలుగజేసెడి పరివేదన దుఃఖమునకు మూలమగుచున్నది.

భావరూపాధిష్ఠితమైన తత్త్వమును బోధించుట కేర్పడిన వేదములు, మతములు, ధర్మములు, శాస్త్రములు, సాహిత్యములు, కళలు రూపారాధనపరాయణములై స్వార్థసమర్థనమునకును, పరాక్రమణమునకును వినియో

గపడుచు సంక్షోభమును గలుగజేయుచున్నవి. ప్రపంచవ్యాప్తమైన మహాసంక్షోభము మహాప్రళయరూపమునను పరిణమించుచున్నవిధమును రాజ్యాంగ పరివర్తనములు, సాంఘిక కలహములు, మతవిద్వేషములు, ఆర్థికసంరంభములు, ధర్మవిప్లవములు ప్రత్యక్షము చేయుచున్నవి. తత్త్వజ్ఞులును, శాంతిప్రియులును జేసెడి సత్యధర్మహితోపదేశములు సనాతనాధునాతనాచారాభిమానులకు జిజ్ఞాసకుబదులు కోపావేశములకు మూలము లగుచున్నవి. నిజము నిష్ఠురములకు మూలము. స్వభావము, స్వధర్మము, స్వార్థము నిత్యసత్యాశ్రయములు గాకను అనిత్యములైన దేశకాలపాత్రాశ్రయములై ప్రజ్ఞావాదపరమైన స్వాభిమానాశ్రయము లగుచున్నవి. స్వాభిమానాశ్రయము నిత్యమైన శాంతశివసుందరజీవనమున కభిమానావరణములను గల్పించుచు విశ్వజీవనశక్తుల నవరోధించుచున్నది. అభిమాన మజ్ఞానావృతమై జ్ఞానమయమైన పూర్ణజీవనమునకు ప్రతిబంధకముగ నున్నది. జ్ఞానసంపన్ను లభిమానావరణములను జ్ఞానాగ్నిమూలముననుదగ్ధము చేయుటకై చేసెడిప్రయత్నములను పండితులును, పామరులును ధర్మవ్యాజమునను ప్రతిఘటించుట యాచారమైనది. అధికారులు ప్రజలను, అగ్రజు లంత్యజులను, గురువులు శిష్యులను, ధనవంతులు నిర్ధనులను, పండితులు పామరులను, బలవంతులు దుర్బలులను, వృద్ధులు యువకులను స్వార్థమునకై వినియోగించుట ధర్మమైనది. ఈ యాచారధర్మప్రతిఘటనము విచిత్రాభిప్రాయములకు మూలమగుచున్న విధమునకు జిడ్డు కృష్ణమూర్తిగారు, గాంధిమహాత్ముడు, సోవీటునాయకులు, కార్మికులు, అవర్ణులు పొందుచున్న నిందాస్తోత్రములు పరమప్రమాణములు.

*  *  *  *

**బ్రహ్మజ్ఞానసమాజము-కృష్ణమూర్తిగారు**

బ్రహ్మజ్ఞానసమాజము భౌతికవిభూతివ్యామోహబద్ధమైన వర్తమానయుగమునందు ముఖ్యముగాను హిందూస్థానమునం దాంగ్లవిద్యావంతుల లక్ష్యమును హిందూమతోన్ముఖము చేయుటకు వినియోగపడినది. ప్రభుత్వోద్యోగులైన విద్యావంతుల లక్ష్యము హిందూమతమునకు మరలినది. పాశ్చాత్యసంస్కారముగల గురువుల లక్ష్యమును సహజముగను భౌతికవిభూతు లాకర్షించినటు లాధ్యాత్మికప్రయోజనము లాకర్షించలేదు. కర్నలు ఆల్కాటు బ్లావిటుస్కీగార లుపక్రమించిన గురుసంప్రదాయపరంపరలు లెడుబీటరు వసంతమ్మగారలకు సంక్రమించినవి. వీరి గురుత్వము నందు బ్రహ్మజ్ఞానమును దివ్యవిభూతులును, మహత్తులును నావరించినవి. సమాజబృందమునందు ప్రసాదస్వీకారము మహత్తులు ప్రబలినవి. ఆంతరంగికబృందమునకును సామాన్యసమాజమునకును గురుశిష్యభావములును సమాన సంస్కారలక్ష్యములును దుర్లభములైనవి. పీఠాధిపతులైన గురువులకును, జిజ్ఞాసువులైన శిష్యులకును భావభేదము లుదయించినవి. ప్రాచ్యతారకసంఘమునకు

గురువైన కృష్ణమూర్తిగారికి మహాత్ములు, పూజాపురస్కారములు, రహస్యములు దుస్సహములైనవి. కృష్ణమూర్తి గారు తారక పీఠాధిపత్యమును పరిత్యజించి గురుపీఠాధిపత్యమును నిరాకరణ చేసిరి. ప్రాచ్యబ్రాహ్మణ సంస్కారము, పాశ్చాత్య విద్యా సంస్కారము కృష్ణమూర్తిగారియందు నవీనరూపమును దాల్చినవి. శ్వేతగురువులకు శిష్యులైన వృద్ధహిందువుల కాత్మ విశ్వాసము లేకను మహిమలు, మంత్రములు, రహస్యదీక్షలు శరణ్యములైనవి.

జ్ఞాన భాస్కరుని సమక్షమున నజ్ఞానమూలమైన రహస్యాచారముల కవకాశములు గలుగజాలవు. కృష్ణమూర్తిగారి జ్ఞానసందేశమాచారాభిమానాధికార బద్ధమైన వర్తమాన హిందూహృదయమునకు భయభ్రాంతులను గలుగజేసినను, తత్త్వజ్ఞుల కాదరణీయముగ నున్నది. కృష్ణమూర్తిగారు వారిబోధలందు శిష్యుల సంతాపహరణమును జేయుటకు సమకట్టినను అజ్ఞానాభిమానపరాయణులైన సనాతన ధర్మసంస్కారుల కభిరుచి గలుగకున్నది. శ్రీకృష్ణుడు గీతాశాస్త్రమునందు బోధించిన "ఉద్ధరే దాత్మనాత్మానం" అని ఆత్మోద్ధరణ భావమునే కృష్ణమూర్తిగా రరమరలను విడిచి బోధించినను ఆదరణమును బడయకున్నది. పూర్ణయోగానందము ననుభవించుటకు గ్రంథములు, తంత్రములు, గురువులు, ఆచారములు, విశ్వాసములు, రహస్యములు సాధనములు గావనియును, ఆత్మోపలబ్ధియే సాధనమనియును కృష్ణమూర్తిగా రాత్మశంఖారావమును పూరించి విశ్వశ్రుతిని మేళగించి చేయుచున్న దివ్యబోధలు జిజ్ఞాసువుల కాదరణయోగ్యములు గాకున్నను విచారయోగ్యములుగనైననున్నవి.

*　　*　　*　　*

గాంధిమహాత్ముడు - సనాతనధర్మము

వైదికమత పరిణామము హిందూమత ప్రవాహమున కపూర్వమైన శోభనువలెను కళంకమును గలుగజేసినది. పూర్వమీమాంస పోయి ఉత్తరమీమాంస మతప్రవృత్తియందు వ్యాపకమునందున్నను మృతప్రాయములైన పూర్వ మీమాంసాపరములైన యాచారవ్యవహారములు జీవప్రవాహమును స్తంభింపజేసినవి. కర్మస్థానమును జ్ఞానము, జ్ఞానస్థానమును భక్తియును నాక్రమించి, భాగవతభక్తి దేశమునందంతటను వ్యాపకమునందున్నను నిర్జీవమైన కర్మకాండను హిందూమతమున కాధారముగను నిర్ణయింపగోరుట నిరుపయోగము. కర్మకాండను జైనబౌద్ధమతములును, ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతములును, మహమ్మదీయ క్రైస్తవమతములును, పరప్రభుత్వములును కాలక్రమమునను నిరుపయోగము చేసినవి. బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతలు జ్ఞానమును కర్మస్థానమునను ప్రతిష్ఠించినవి. భాగవతభక్తి భక్తిని జ్ఞానస్థానమునను ప్రతిష్ఠించినది. హిందూమత వాహినియందు కర్మ జ్ఞాన భక్తి వైరాగ్యయోగవాహినులు సంగమించి హిందూమతము కూలం

కపముగను ప్రవహించుచున్నను పంకకలంకి తమై జీవరక్షణ ప్రయోజనములకు నిరుప యోగమే కాకను హానికరముగ నున్నది.

దురదృష్టవంతు లెల్లపుడును దురదృష్టవం తులుగను, పాపులాజన్మాంతము పాపులుగను, దరిద్రులు దరిద్రులుగను,అజ్ఞాను లజ్ఞానులుగను నుండవలయునని శాసించెడి సనాతనవర్ణాశ్రమ ధర్మములు మానవజీవిత ప్రయోజనములకు నిరర్థకములు. అస్పృశ్యతానివారణము నిత్య మైన ధర్మమునకు విరుద్ధము కాదనియును, ఒకవేళ ధర్మవిరుద్ధమైనను నివారించుటకు మతాచార్యులు ప్రయత్నించిరా రనియును, వెనుక ప్రయత్నింపకపోయినను నిపుడు ప్రయ త్నించుట ధర్మవిరుద్ధము గాదనియును ప్రాజ్ఞు లంగీకరింపగలరు. సజీవమైన ప్రజాజీవనమును స్తంభింపజేసి నిర్జీవమైన యాచారాభిమాన ముల నారాధించుట మరణసాధనము గాని జీవన సాధనము గాదు.

వర్తమాన స్వాతంత్ర్య యుగమునందు వ్యక్తి స్వాతంత్ర్యమును నిరోధించుట మానవ ధర్మ సంస్థాపనమునకు ప్రతికూలము. స్వాతం త్ర్యము నభిలషించెడి సవర్ణు లవర్ణులకు స్వా తంత్ర్యమును నిరోధించుట యధర్మము. సకల ప్రజాసంస్థలయందును అవర్ణులకు ప్రవేశమును గల్పించుట సవర్ణుల కలంఘనీయమైనధర్మము. దేవాలయాదిప్రవేశమునకును శాసననిర్మాణ మును చేయుట ధర్మవిహితము గాని ధర్మవిరు ద్ధము గాదు. ధర్మశాస్త్రములందు దేవాలయ ప్రవేశము ప్రతిషేధింపబడలేదని పండితాభి ప్రాయమును ప్రబలుచున్నది. అఖండమైన హిందూసంస్కారము దేశకాలపాత్రల కను రూపముగను మారినవిధము హిందూధర్మ శాస్త్రములు, పురాణేతిహాసములు విశదము చేయుచున్నవి.

పూర్వము మహర్షు లవలంబించిన ధర్మ మార్గమును వర్తమాన కాలమునందును సవర్ణు లవలంబించుట ధర్మము, వివేకము. జీవములేని సంఘమునందు జీవప్రతిష్ఠాపన మును జేయుటకు నిర్జీవములైన యాచార వ్యవహారముల నతిక్రమించి సజీవమైన యా చార వ్యవహారముల నవలంబించుట ప్రయో జనకరము. ప్రాజ్ఞులు ధర్మాధర్మవిచారణ చేసి ధర్మారాధనమును జేయుటకు బూనుకొనుట వివేకము. కాని నిందలకును దూషణలకును బూనుకొనుట వివేకము గాదు. స్వభావసిద్ధ మైన ధర్మమునకు స్వార్థారోపణమును జేయు ట, భ్రష్టత్వము నాపాదించుట యసం గతము.

అస్పృశ్యతా నివారణమునకును రాజ కీయసంస్కరణములకును సంబంధము లేదు. ఇది నూతనము గాదు. స్వామి దయానందుడు, వివేకానందుడు, రామకృష్ణుడు మొదలగు హిందూమతసంస్కర్త లీ ధర్మారాధనమున కిదివరకే పూనుకొని యుండిరి. ఒకవేళను రాజకీయమునకు సంబంధ మున్నను నింద్యము గాదు.వర్తమానయుగము రాజకీయ యుగము.

రాజకీయ సంబంధములేని ప్రజాజీవనము వర్తమానకాలమునందు దుర్లభము. ఆర్థిక నైతికసాంఘికవైజ్ఞానికాదివిషయములందు రాజకీయసంబంధ మలంఘనీయముగ నున్నది. మతమునకును, రాజకీయమునకును సంబంధము కొన్నిదేశములం దప్రతిహతముగ నున్నది. చేష్టారహితమైన పారతంత్ర్యభాగ్యము ననుభవించుచున్న హిందూస్థానమునందు మతఘోష సందర్భాసందర్భములు లేకను బయలుదేరుట యాచారమైనది. దైవభక్తిపరాయణుడును త్యాగమూర్తియునునైన గాంధిమహాత్ముడు హిందూమత విప్లవమునకు పూనుకొనినటు లారోపణచేయుట యన్యాయ్యము. ఆచారాభిమానావృతమైన హృదయమునందు స్వాతంత్ర్యపరమైన జ్ఞానకాంతులు ప్రసరింపజాలవు. హిందూమతాభిమానులందరును మతాచార్యులు పూర్వమే ప్రసరింపజేసిన జ్ఞానకాంతులను ప్రసరింపజేసి హిందూ సంఘమును, హిందూ మతమును, మానవధర్మమును, గాంధిమహాత్ముని సంకల్పమును, దేశసౌభాగ్యమును గాపాడుట పరమధర్మము.

* * *

రాజ్యాంగసంస్కరణములు -

రౌండుటేబిలు సమావేశము

మూడవ రౌండుటేబిలు సమావేశము తలచినటులు పరిణమించినది. సమావేశమునకు హాజరైన ప్రముఖులు నిరాశను జెంది స్వదేశోన్ముఖులై వచ్చుచున్నారు. ఈసమావేశసందర్భములందు సర్ సామ్యుయెల్ హోరు గారికిని వారిమిత్రులకు నాశాకాంతులు వెల్లడియైనను మితవాదనాయకులకైనను నంధకారము గనుపడినటు లాశాకాంతులు గనుపడుట లేదు. ఫెడరేషనువిషయమునను, కేంద్రాధికారవిషయమునను, ఆర్థికస్వాతంత్ర సందర్భమునను, సైన్యాధికారనిర్వహణమునను రిజర్వుబ్యాంకుసందర్భమునను, ప్రయోజన రక్షణమునను హిందూదేశమున కేవిధమైన ప్రయోజనమును గలుగలేదని వ్యవహారములు విశదము చేసినవి. హోరుగారి యంత్యోపన్యాసము సద్భావభరితముగ నున్నను క్రియాశూన్యముగ నున్నవిధము నాంగ్లప్రముఖులు సయితమంగీకరించుచున్నారు. "మావీలును బట్టి మాకు వీలైన సంస్కరణములను వీలైనపుడు సమకూర్చెదము" అని హోరుగారు తెలిపిరి కాని "మీ సంప్రతింపుతో మీకవసరమైన సంస్కరణములను సమకూర్చెదము" అని హోరుగారు తెలుపలేదు. హోరుగారవలంబించిన మార్గమును స్వాతంత్రకార్మిక పక్షమును, కాంగ్రెసుపక్షమును నిరాకరించినవి.

నిర్బంధమార్గమునను పాలించుట యసాధ్యమని ప్రాజ్ఞు లంగీకరించినను ప్రబలమైనబ్రిటీషు జాతీయప్రభుత్వమునకు నిర్బంధవిధానము శరణ్యముగ నున్నది. ప్రజామోదమును బడయని రాజ్యాంగసంస్కరణములు ప్రయోగయోగ్యములు కావని తెలిసియున్నను దురభిమానము మతసాంఘికవిషయములందువలెను రాజ్యాంగ విషయములందును దురారాధ్యముగ నున్నది.

పరాక్రమణమే మూలమైన సామ్రాజ్యనీతికి ధర్మముతో నిమిత్తము గలుగదుగదా! ఇప్పుడైనను గాంధిమహాత్ముని నితర నిర్బంధితులను నిర్బంధవిముక్తులను జేసి వారి యాదరణసహాయమునను రాజ్యాంగవిధానమును నిర్మింపవలసిన యవసరమును గ్రహింపకుండుట దురదృష్టము. కాంగ్రెసుప్రముఖులను, గాంధిమహాత్ముని నిర్బంధమునం దుంచుటవలనను శాంతిస్థాపనము దూరస్థమై సంస్కరణముల ప్రయోజనము సంకుచితమగుచున్నది. సంకుచితమైన సంస్కరణవిధానమైనను నిర్బంధశాసనావరణమునందు ప్రయోగయోగ్యము గాకున్నది. కార్మికనాయకులు లాన్సుబరి వెడ్జివుడుబెన్నుగారును పంపిన నూతన సంవత్సర సందేశములును, ఇండియాలీగువారి యభిప్రాయములును దేశావృతమైన స్వాతంత్ర్యాభిలాషను, ప్రతిఘటనసంకల్పమును చెప్పక చెప్పుచున్నవి. ఇట్టి విషమ పరిస్థితులందైనను హోరువర్గమువారికి దండనభేదనోపాయములందు గల విశ్వాసము సామదానోపాయములందు గలుగకున్నది. మతసాంఘిక వ్యవస్థలందువలెనే రాజకీయవ్యవస్థలందును ఆచారాభిమానములకు గల ప్రాబల్యము స్వాతంత్ర్యాభిప్రాయములకు గలుగకున్నది. మతసాంఘిక రంగములందువలెను రాజకీయరంగమునందును సనాతన శృంఖలములను శిథిలము చేసి స్వాతంత్ర్యావరణములను నిర్మింపవలసిన భారము ప్రజాధీనమునం దున్న విధమును ప్రపంచవ్యవహారములు తెలుపుచున్నవి.

* * *

ప్రజాశక్తి

ప్రజాశక్తిప్రభావ మంతరాయములు సంప్రాప్తమైనను నప్రతిహతముగ నున్నది. నూతన సంవత్సరారంభమునందు మహాపురుషులు పంపిన సందేశములు ప్రజల కర్తవ్యమును వ్యక్తము చేయుచున్నవి. జర్మనురాజ్యాధిపతి హిండెన్బర్గుగారు యువజనులకు జేసిన యుద్బోధము సకల జనులకును సంబంధించినది. "సంయోగమే బలము......అభయము, ఓరిమి, దేశభక్తి విజయమును సమకూర్చ గలవు." రుష్యాదేశమునకు ప్రధాన ప్రజాప్రతికయును నుత్సాహపూరితమైన సందేశము నిటులు పంపుచున్నది: "మిత్రులారా, విజయధ్వజములను బూనుడు. పురోగమనము చేయుడు."

భారతభాగ్యవిధాత యైన గాంధిమహాత్ముడును నిట్టి సందేశమునె భారతీయులకు యరవాడా మందిరమునుండి పంపుచున్నాడు. ప్రపంచకల్యాణమునకు మత సాంఘిక రాజకీయ రంగములందు సకలదేశములందును ఆచారాభిమానావరణములను భేదించి స్వాతంత్ర్యజ్ఞానావరణమును జేరవలసిన శుభసమయము సంప్రాప్తమైనది. ఈ శుభసమయమునం దాంధ్రయువజనులు నవజీవనశక్తిపరాయణులై ఆత్మోపలబ్ధికి పాటుపడి కృతార్థు లగుదురు గాత!

Printed and Published by C. Seshagiri Rao, B. A. at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras
Editor; G. Subbaramayya.

# కవిత్వము - రు. 1500 లు

ఒక ఖండకావ్యము గలదు. కృతిపతి శ్రీ తిరుపతి వేంకటేశ్వరుడు. కథ రామాయణము లోనిది. మొదటినుండి తుదవఱకు రామనామ ప్రబోధమే. ప్రతిపద్యము గులాబిజామగుటచే పోషకులౌకరు — స్త్రీగాని పురుషుడుగాని కావలెను. వారు చదువువచ్చినవారై యుండ నవసరము లేదు. మొదటికూర్పువఱకే వారిపోషకత్వము. వారి ఆదరణముచేత కావ్యము అచ్చువేయింపబడును. అందులో వారి జీవితచరిత్రము, ఫోటోగ్రాఫు నుండును. పుస్తకభాండాగారములలో దేశములోని నలుమూలల, కావ్యము వ్యాపించి ఈ మొదటికూర్పు పుస్తకములు (1000) 20 సం॥ లైనను నిలిచియుండును. అందుచే వారిపేరు జ్ఞప్తిజేసికొనబడుచుండును. పుస్తక మచ్చుకాగానే పోషకులను గౌరవించుకొఱకు పండితకవులుగల ఒక మహాసభ 2, 3 దినములు జరుగును పోషకులు ఆసభలో పొందుగౌరవములు వివిధములు. తుదకు పట్టణమందంతట గొప్ప ఊరేగింపు జరుగును. తఱువాత కవి కావ్యము వినిపించుటకు ఆంధ్రదేశములోని 12 పట్టణములకు బోవును. వారితో పోషకులుగూడపోయి తమకావ్యపోషకత్వమునకు దగిన మెప్పు బొందవలసి యుండును. ఈ కావ్యముగూర్చి ఒక 'కవిరాజు' అభిప్రాయము—

"కావ్యము మిక్కిలి మనోహరము. ఇది సామాన్యపుమాటగా భావింపరాదు. తొల్లి ఆంధ్రీకృత రామాయణములలో నీఘట్టములో జదువునపు డెట్టి యానందము ననుభవించుచుంటినో యిపు డంతకు దక్కువసంతోషము బొందలేదు. భావములు గొన్ని నూతనములు. అయినను ఆర్యసంప్రదాయవిరుద్ధములు మాత్రము కావు. రీతి రసపోషకముగా నున్నది. మీ తెనుగు జుంటితేనె.........మొదలగు నెన్నోపద్యములు నా హృదయమును ద్రుల్లింత లాడించినవి. తమ కావ్యము పలుసార్లు చదువదగినది." దేవాలయము గట్టించుటవలె కావ్యపోషణము సప్తసంతానములలో ఒకటి. కవిత్వశైలి దెలిసికొనుటకు 2 అణాల బిళ్ల లంపుడు.

విలాసము:— **పంగనామముల రామచంద్రరావు,** బ్రాడీపేట, గుంటూరు.

---




అమృతాంజనం డిపో.,
బొంబాయి — మద్రాసు.
కలకత్తా.

మద్రాసురాజధానిఏజంట్లు:—
ప్యాం అండు కంపెని,
6, బందరువీధి, మద్రాసు.